ప్రాచీన

# తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

1981-82 సంవత్సరంలో

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు పొందిన గ్రంథం


డా॥ పాపిరెడ్డి నరసింహారెడ్డి, పి హెచ్ డి

తెలుగు అధ్యయనశాఖ

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి



శ్రీనివాస మురళీ పబ్లికేషన్స్

తిరుపతి

1984

ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

శ్రీనివాస మురళి పబ్లికేషన్స్—2

సర్వస్వామ్య సంకలితం

ప్రథమ ముద్రణ—1984

1100 ప్రతులు

వెల : రూ॥ 30/—

ప్రతులకు :

శ్రీమతి పి. ప్రభావతమ్మ

6—134 (1) ఎస్వీనగర్

తిరుపతి — 517 502

ముఖపత్రచిత్రణ : పేటశ్రీ

ముద్రణ :

వెరైటీ ప్రింటర్స్

ఏలూరు.

# అంకితం

ఎవరి ఋణమైనా తీర్చుకోవచ్చు
అమ్మ ఋణం తీర్చుకోలేనిది
నవమాసాలూ మోస్తుంది
మరోజన్మలాంటి ప్రసవవేదన భరిస్తుంది
రోతా పతా సహించి
శిశువు రోగం రొష్టూ తనదిగా స్పందించి
బిడ్డ చిరంజీవం కావాలని
వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటుంది
కొడుకు తన్ను సరిగా చూడకపోయినా
అతని శుభాన్నే ఆకాంక్షిస్తుంది
అందుకే అమ్మ ఋణం తీర్చుకోలేనిది
నా సాహితీ వ్యవసాయంలో
కుసుమించిన ఓ గుడ్డిపూవును
మాఅమ్మ లక్ష్మమ్మకు
అంకితం ఇస్తున్నా......

# కైమోడ్పు

నా నిత్యజీవితంలోను, సాహిత్య జీవితంలోనూ ఆదర్శప్రాయులై నన్ను నడిపించే దివ్యశక్తి, వ్యక్తి ఆచార్య జి యస్ రెడ్డిగారు దేశంలో స్థలనామపరిశోధనకు బీజా వాపన చేసినవారు రెడ్డిగారు తమలైబ్రరీలోని ఎన్నో ప్రాచీన కావ్యాలను వారే వెతికిచ్చారు నాకోసం వారు శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్ అయిన తర్వాత నేను భయం భయంగానే వెళ్ళి ఈ గ్రంథానికి పీరిక వ్రాసే సమయం మీకుందా ? అని అభ్యర్థించాను, తమకున్న సవాలక్ష కార్యనిర్వహణ ఇబ్బందులలో కూడా నా అభ్యర్థనను తోసివేయకుండా అంగీకరించారు పీరిక వ్రాసియిచ్చారు వారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు

నా శ్రేయస్సును నిరంతరం కాంక్షించి వెన్నుతట్టేవారు ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారు నా బి ఎ డిగ్రీకాలంలో గురువులుగా, తర్వాత ఆప్తులుగా వ్యవహరిస్తున్నవారు శ్రీ కె నాగిరెడ్డిగారు తమవద్దనున్న కావ్యాలనందించి ప్రోత్సహించినవారు డా॥ జి నాగయ్యగారు అన్నమాచార్యుల సాహిత్యంలోని విషయసేకరణకు తోడ్పడిన వారు డా॥ కె సర్వోత్తమన్ గారు

అన్నమాచార్యులు సంకీర్తనా సముద్రంనుంచి స్థలనామ రత్నాల్ని వెలికితీసి యిచ్చింది డా॥ కె వాణిగారు స్థలనామచర్చలో తోడ్పడినవారు మిత్రుడు డా॥ డి సి రెడ్డి

కోరినంతనే సార్థకమైన తెలుగునాడు ముఖచిత్రం వేసి యిచ్చిన చిత్రకారుడు వర్ధిష్ణవు పేట శ్రీనివాసులురెడ్డి ముఖచిత్ర నిర్ణయంలో కళాత్మక సూచనలిచ్చిన మిత్రుడు డా॥ ఎస్టిటి చంద్రశేఖర్-

"ప్రాచీన తెలుగు కావ్యాలలో తెలుగునాడు" పోటీ అంశంగా నిర్ణయించింది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నా వ్రాతప్రతిని ఉత్తమంగా ఎన్నుకొన్న న్యాయనిర్ణేతలు ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థికసహాయం చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ - అనతికాలంలో ముద్రించి యిచ్చిన వెరైటీప్రింటర్స్ ఏలూరు

— వీరందరికీ నా కైమోడ్పు

డా॥ పి నరసింహారెడ్డి.

ఆచార్య జి. యన్ రెడ్డి
ఎం ఏ, ఎం లిట్, పిహెచ్ డి,
వైస్ ఛాన్సలర్
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి - 517502.

# అభినందన

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ చేపట్టిన సార్థక కార్యక్రమాల్లో ప్రతి సంవత్సరం నిర్వహించే ఉత్తమ గ్రంథ రచనపోటీ ప్రశంసార్హం ఈ పోటీవల్ల మూడు లాభాలు కల్గుతున్నాయి ఒకటి, రచనాసక్తిగల మంచి తెలుగు రచయితల్ని వెలుగులోకి తీసుకరావడం, రెండు సరికొత్త విషయాల్ని ఎంపిక చేసి పోటీ గ్రంథాల్ని రచింపచేయడం, మూడు వర్ధిష్ణువులైన యువరచయితలకు ప్రోత్సాహాన్ని, సాహిత్యలోకంలో గుర్తింపును కల్గించడం ఈ గ్రంథ రచన పోటీ కారణంగా ఇంత వరకు ఉత్తమ విమర్శ గ్రంథాలు అనేకం వెలువడ్డాయి అనేక రచయితలు లబ్ధ ప్రతిష్ఠులైనారు అట్టి రచయితల్లో రెండు మార్లు గ్రంథ రచనపోటీలో పాల్గొని, తన రెండు గ్రంథాలకు అకాడెమి అవార్డును పొంది పేరు ప్రతిష్ఠల్ని సాధించుకొన్న యువరచయిత డా॥ పి నరసింహారెడ్డి, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖకు కూడా పేరుతెచ్చిన అధ్యాపకుడు

అకాడెమీ గ్రంథ రచన పోటీలో డా॥ నరసింహారెడ్డికి మొదటి అవార్డును 1980లో తెచ్చిపెట్టిన గ్రంథం 'తెలుగు సామెతలు–జన జీవనం' ఇది 1982లో ముద్రితం రెండవది 1983లో అకాడెమీ బహుమతిని పొంది ప్రస్తుతం ప్రకటితమైన 'ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు' అనే ఈ గ్రంథం రెండు మార్లు పోటీలో పాల్గొని, రెండు మార్లూ అకాడెమీ అవార్డుల్ని అందుకొన్న డా॥ నరసింహారెడ్డి అందరికీ అభినందనీయుడు

ప్రాచీనాంధ్ర భౌగోళిక విశేషాల్ని తెలుగు సాహిత్య గ్రంథ ప్రమాణాలతో విపులంగా వివరించే గ్రంథం లేనందువల్ల, అట్టి గ్రంథాన్ని వ్రాయించే సత్సంకల్ప ముతో 'ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు' అన్న అంశాన్ని పోటీకి ఎన్నిక చేసిన అకాడెమీ కార్యవర్గాన్ని కూడా మనం ప్రశంసించాలి ఆంధ్ర ప్రభుత్వం అందించే 'అల్పార్థంతో అనవ్యాక్షరసేవ' చేస్తున్న ఉత్తమ సంస్థ మన సాహిత్య అకాడెమీ.

•

ప్రాచీన కావ్యాల్లో వర్ణితమైన తెలుగునాడును వస్తువుగా స్వీకరించి గ్రంథం వ్రాయడం అనుకొన్నంత సులభంకాదు అనేకులు ప్రయత్నించే రచనకూడాకాదు వస్తువు విస్తృతం, పరిధి అతి విస్తృతం. విశ్లేషణకు కష్టాశ్లేషం ప్రాచీన గ్రంథాలతో ప్రత్యక్ష పరిచయాన్ని స్థాపించుకొని, వస్తు విశ్లేషణలో శాస్త్రీయమూ, సక్రమమూ అయిన ఒకానొక రచనా ప్రణాళికను రూపొందించుకొని, వస్తుసామగ్రిని బహు గ్రంథాలనుండి సేకరించుకొని గ్రంథ విస్తరభీతి మనసులో మెదులుతుంటే పాఠకు లకు ఆసక్తికరంగా ఇట్టి ప్రామాణిక విమర్శ గ్రంథాన్ని పోటీకని వ్రాయడం సామాన్యమైన విషయంకాదు పైగా ఇట్టి గ్రంథాన్ని వ్రాయడానికి ఓపిక, పట్టుదల, చిత్తశుద్ధి పరిశోధనాదృష్టి, నిరంతర కృషి, పూర్వాపరపునఃపరిశీలన ఎంతో అవసరం. ఈగుణాలన్నీ డా॥ నరసింహారెడ్డికి ఉన్నాయని చాటడానికి ఈ గ్రంథమొక ప్రబల నిదర్శనం విషయ ప్రాధాన్యాన్ని బట్టిగాక రచనా శైలిని బట్టికూడా ఇదొక ఉత్తమ గ్రంథం తెలుగు భాషా సాహిత్యాన్ని, సంస్కృతిని, చరిత్రను అభిమానించే సహృదయ పాఠకుల్ని మెప్పించే గ్రంథమిది.

గ్రంథ శీర్షికలో 'తెలుగునాడు' అన్న మాట ఉన్నా ప్రాచీన తెలుగు సాహిత్యంలో ఈ పదబంధం మృగ్యం కావడం ఒక విశేషం ముద్రితమైన ప్రాచీన సాహిత్య గ్రంథాలలో ఏ గ్రంథాన్ని వదలకుండా గ్రహించిన ప్రతి గ్రంథాన్ని సమగ్రంగా, క్షుణ్ణంగా పరిశీలించి, తెలుగనాడుకు చెందిన, భౌగోళిక స్వరూపాన్ని ప్రాంతాలు, నాడులు, గ్రామాలు, పట్టణాలు, స్థానాలు, క్షేత్రాలు, నదులు మొదలైన వాటిని-వాస్తవిక దృష్టితో ఈగ్రంథం విరచితమై వుండడం గమనార్హం ఉటంకించిన ప్రతి అంశానికి ఆధారాల్ని సూచించడం వల్ల గ్రంథానికి ప్రామాణికత సిద్ధించింది ఈపద్ధతి ఉత్తరోత్తర జరిగె పరిశోధనకు మార్గదర్శికూడా గ్రంథాంతంలో రచయిత ఇచ్చిన సూచిక నిజానికి గ్రంథ విషయాధిక్యతకు ఒక సూచిక. ఇట్టి ఉత్తమ గ్రంథాన్ని వ్రాసి ప్రచురించిన డా॥ నరసింహారెడ్డిని అభినందిస్తున్నాను తెలుగు ప్రజలు అభిమానించదగ్గ ఒక సరికొత్త విషయాన్ని చక్కగా ప్రదర్శించే ఈ గ్రంథాన్ని తెలుగుదేశం ఆదరిస్తుందనీ ఆశిస్తున్నాను

—జి. యస్. రెడ్డి

# విషయ సూచిక

# ఉపోద్ఘాతం

0 1 ఆంధ్రజాతి ఆంధ్రులు ఒక జాతిగా 'ఐతరేయ బ్రాహ్మణం' లోనే [క్రీ పూ 600] పేర్కొనబడినాయి భరతశాస్త్రంలోను [క్రీ శ మొదటి శతాబ్దం] వాయుపురాణంలోను, సంస్కృత భాగవతంలోను ఆంధ్రజాతి ప్రస్తావన ఉంది. చంద్రగుప్త మౌర్యుని ఆస్థానం దర్శించిన గ్రీకు రాయబారి మెగస్తనీసు [క్రీ పూ 400] మౌర్యుల తర్వాత ఆంధ్రులు ఎన్నదగిన చతురంగబలం కలిగి ఉన్నారని పేర్కొన్నాడు అశోకుని శాసనాలలోను ఆంధ్రుల ప్రసక్తి ఉంది.

సంస్కృత వాఙ్మయంలో వ్యాస భారతంలోను, భాగవత, మత్స్యపురాణాల లోను ఆంధ్రజాతి ప్రశంస ఉంది

తమిళ సంగం వాఙ్మయంలో 'వడుగర్' అనేపేర్తో ఆంధ్రజాతి పేర్కొనబడింది

0 2 ఆంధ్రదేశం ఆంధ్రదేశ ప్రసక్తి ఎప్పటినుంచి ఉంది? వాల్మీకి రామాయణంలో, మహాభారతంలో, భాగవతపురాణంలో ఆంధ్రరాజ్య ప్రస్తావనఉంది బౌద్ధవాఙ్మయంలో అంధరట్ట [ఆంధ్రరాష్ట్ర] అనే పదం ఆంధ్రదేశాన్ని సూచించేదే మల్లిదేవనందివర్మ దాన శాసనంలో [క్రీ శ 340] "ఆంధ్రమండలే ద్వాదశ సహస్రగ్రామ సంపాదిత సప్తార్ధలక్ష విషయాధిపతేః" అన్న వాక్యంలో కూడా ఆంధ్రదేశం దేశ వాచకంగా వాడబడింది అంటే క్రీస్తుకు పూర్వమే ఆంధ్రదేశం వునికి ఋజువైంది

0 3 తెలుగుదేశం|త్రిలింగదేశం తెలుగు, తెనుగు, త్రిలింగ అనే శబ్దాలు దేశవాచకాలుగా ఉన్న సంగతి యదార్థమె వాయుపురాణంలో 'తిలింగా' అనె పదం ఒక జనపదానికి పేరుగా పేర్కొనబడింది కాకతీయ ప్రతాపరుద్రుని ఆస్థానంలోని విద్యానాథుడు [క్రీ శ 13 వ శతాబ్దం] శ్రీశైల, దాక్షారామ, కాళేశ్వరాలలోని శివలింగాల వలన తెలుగుదేశానికి 'త్రిలింగ' మనేపేరు ఏర్పడిందని ప్రతాప రుద్రీయంలో పేర్కొన్నాడు విన్నకోట పెద్దన [14 వ శ] ఆంధ్రదేశానికి త్రిలింగ దేశమనే పేరు కావ్యాలలో ప్రయుక్తమైనట్లు, తెలుగు త్రిలింగ శబ్దభవమైనట్లు కావ్యాలంకార చూడామణిలో తెల్పినాడు త్రిలింగ పదం దేశవాచకంగా బ్రహ్మాండ, స్కాంధ పురాణాలలో గ్రంథస్థమై ఉన్నట్లు చిలుకూరు నారాయణ రావుగారు ఆంధ్రుల చరిత్ర ప్రథమ భాగంలో పేర్కొన్నారు రాజశేఖరుని విద్ధసాలభంజికలో [క్రీ శ 10వ శతాబ్ది) "జయతు జయతు త్రిలింగాధిపాదేవః" అని ఒక ప్రయోగం ఉంది తెలుగు త్రిలింగ శబ్దభవం కాదని, తెలుగుయొక్క సంస్కృతీకృత రూపం 'త్రిలింగ'

అని కొమర్రాజు లక్ష్మణరావుగారు నిరూపించినారు [లక్ష్మణరాయ వ్యాసావళి, పు 122-26] ఇంతవరకూ పేర్కొన్న విషయాలు ఆచార్య జి. యస్ రెడ్డిగారి ఆంధ్రం, తెనుగు అనే వ్యాసం – నుండి గ్రహింపబడినాయి ఈ వ్యాసం 'తెలుగు భాషా చరిత్రలో' ఉంది

0 4 తెలుగునాడు 'తెలుగునాడు' అనే రూపం కావ్యాలలో ఎక్కడా కనిపించదు తెలుగు దేశంలో చాలా నాడులుండేవి ఉదా॥ పాకనాడు, వెలనాడు, కమ్మనాడు, ములికినాడు మొ॥ నవి

తెలుగుదేశం స్వరూపం సంపూర్ణంగా తెలుసుకోవాలంటే సంస్కృత సాహిత్యం, ప్రాకృత సాహిత్యం, తమిళ కన్నడ సాహిత్యాలు తెలుగులోనే శాసనాలు, జానపద సాహిత్యం – ఇవన్నీ పరిశీలించాల్సిఉంది ఉదాహరణకి శాలివాహన సప్తశతి-ప్రాకృతభాషలో – గోదావరి ప్రసక్తి ఉంది తమిళ వాఙ్మయంలో ఆళ్వార్ల పాశురాల్లో తిరుమల, అహోబిలం క్షేత్రాల ప్రస్తావన ఉంది కన్నడ సాహిత్యం – దాస వాఙ్మయంలో తిరుపతి/శేషగిరిల ప్రసక్తి కనిపిస్తుంది

0 5 "ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు" – గ్రంథం ఏడు ప్రకరణాలుగా విభజింపబడింది 1 నన్నయ యుగం 2 శివకవి యుగం 3 తిక్కన యుగం 4 ఎఱ్ఱన యుగం 5 శ్రీనాథ యుగం 6 శ్రీకృష్ణదేవరాయల యుగం 7 దక్షిణాంధ్ర యుగం అంటే 11వ శతాబ్ది ఉత్తరార్ధం నుంచి 18వ శతాబ్దం మూడో పాదం వరకు ఉండే 725 సంవత్సరాల తెలుగు కావ్యాలను – వీలైనన్ని ఎక్కువగా – పరిశీలించి నాకుతోచిన విధంగా వింగడించినాను

0 6 ఆంధ్రసాహిత్యం ఒక సముద్రం అందులో నేను చేసిన కృషి సముద్రానికి ఏతం ఎత్తడం మాత్రమే అయితే ఒక విషయాన్ని నేను సవినయంగా చెప్పగలను పరిశీలించిన కావ్యాలన్నీ క్షుణ్ణంగా చదివి విషయ సేకరణ చేసిన ఒక్కోసారి కావ్యం అంతా మొత్తం వెదికితే ఒకటి అరా తెలుగు ప్రదేశాలు కనిపించేవి ఒక్కోసారి అదిలేదు కాలవ్యవధి తక్కువైనందువల్ల ముఖ్యమైన కావ్యాలు సమయానికి దొరక్కపోయినవి కూడా లేకపోలేదు

ఏది ఏమైనా ఈ ప్రయత్నం 'తెలుగు ప్రజలు' వంద్యదుకో నూలు పోగు వంటిది మాత్రమే

— —

# నన్నయ యుగ సాహిత్యంలో తెలుగునాడు

1 0 తెలుగులో ఆదికవి నన్నయ ఆయన యుగంలో మనకు కనిపించే కావ్య సాహిత్యం తక్కువే నన్నయ ఆంధ్ర మహాభారతంలోని ఆది, సభాపర్వాలు అరణ్యపర్వంలో కొంతభాగం – వేములవాడ భీమకవి చాటువులు – పావులూరి మల్లన గణితం

1 1 యావద్భారత దేశంలో పంచమ వేదంగా ప్రచార ప్రాభవాల్ని సంతరించుకొన్న మహోన్నత కావ్యం మహాభారతం

నన్నయ ఆంధ్రీకృత భారతంలో ఆంధ్రదేశ ప్రశంస ఎలా ఉందో పరిశీలిద్దాం

1 1 1 నన్నయ భారతం రాజరాజుకు అంకితం కవి రాజరాజనరేంద్రుని "రాజకులైక భూషణుఁడు.. రాజమహేంద్రుఁడు" (ఆది 1–3) ".. ఉత్తమ చాళుక్యుఁడు" (ఆది 1–4) ...పరమండలంబుల ధరణిపతుల నదిమి చప్పుడుల ముదముతోఁ గొనుచును, బలిమి నియమి భూమి వలయపతుల నుక్కడగించుచు, దిక్కులఁ దనయాజ వెలుగించుచును . మనుమార్గుఁడగు విష్ణువర్ధనుండు... (ఆది 1–7) అఖిల జలధివేలాయిత వసుమతీ వనితా భూషణంబైన వెంగీదేశంబునకు నాయక రత్నంబు నుంబోని రాజమహేంద్ర పురంబునందు మహేంద్ర మహిమతోఁ బరమానందంబున, ననవరత మహామహీరాజ్య సుఖంబు లనుభవించుచు" (ఆది 1–8) ఉండినాడని నన్నయ వాక్కులు

1.1.2 వెంగి చాళుక్యులు లేదా తూర్పు చాళుక్యుల చరిత్ర ఆరు శతాబ్దాల ఆంధ్ర దేశ చరిత్ర ఆంధ్ర దేశాన్ని వెంగి మండలం, వేంగి మహి, వెంగి మహారాజ్యంగా తూర్పు చాళుక్యుల శాసనాలు పేర్కొంటాయి

1 1 3 సముద్రగుప్తుని అలహాబాదు శిలాశాసనంలో ప్రప్రథమంగా వేంగి' పేర్కొనబడింది సముద్రగుప్తుడు దక్షిణ దేశంలో జయించిన దేశాల్లో వెంగి ఒకటి వెంగిపురం ఇప్పటి పడమటి గోదావరి జిల్లాలో ఏలూరు పట్టణానికి ఎనిమిది మైళ్ల దూరంలో ఉంది ఇప్పుడు ఆ శిధిల ప్రదేశంలో పెదవేగి, చినవేగి అనే రెండు చిన్న పల్లెలు మాత్రం మిగిలినాయి[1] శాలంకాయనులు, విష్ణుకుండినులు పూర్వచాళుక్యులు, చాళుక్యచోడులు వరుసగా వేంగి రాజ్యాన్ని ఏలిన రాజవంశాలు.

వేంగిరాజ్యానికి వేంగి, విష్ణుపురం, బెజవాడ, రాజమహేంద్రవరం వరుసగా రాజధానులైనాయి

1.1.4 వెంగి విషయానికి రాజమహేంద్ర బిరుదాంకితులైన మొదటి అమ్మరాజు (క్రీ శ 918–925) లేక రెండవ అమ్మరాజు కాలంలో రాజమహెంద్రవరం రాజధాని యైనట్లు చరిత్ర పరిశోధకుల నిర్ణయం 2

1.1.5 నన్నయ వేంగి దెశాన్ని భూదెవికి భూషణంగా, ఆ భూషణంలోని నాయక రత్నంగా రాజమహెంద్రపురాన్ని వర్ణించినాడు ఎంత చక్కటి చిత్రణ !

నన్నయ భట్టారకుడు ఆశ్వాసాది పద్యాలలో రాజరాజును వెంగీ విషయాధీశ ( ఆది 2–1 , వెంగీనాథ ) ఆది 5–1 ), వెంగీ భూవల్లభ ( ఆది 8–1 ) అని ప్రస్తుతించినాడు

1.1.6 రాజరాజ నరేంద్రుడు రాజమహేంద్రవరంలోని కవీంద్రులకు కల్పతరువట "రాజమహెంద్ర కవీంద్ర సమాజ సురక్ష్మాజ రాజమార్తాండ..... రాజరాజనరేంద్రా" ( ఆది 5–1 ) అని నన్నయ పలుకులు

1.1.7 నన్నయ తన జన్మభూమిమీద మక్కువతోనే సంస్కృత భారతంలో లేని తెలుగు నాడులోని పుణ్యస్థలాల్ని అర్జున తీర్థయాత్రావర్ణనలో చొప్పించినాడు వ్రతభంగమయిందని ప్రాయశ్చిత్తంగా అర్జునుడు తీర్థయాత్రకు బయలుదేరతాడు. గంగానదిని సేవిస్తాడు హిమపర్వత పార్శ్వంలో అగస్త్యవటాన్ని సందర్శిస్తాడు నైమిశారణ్యంలో జగన్నాధుని సేవిస్తాడు అలా అలా ముందుకు పయనించి కళింగ విషయం ప్రవెశిస్తాడు తొడి బ్రాహ్మలు కొందరు కళింగ ద్వారమున తిరిగి ఉత్తర కురు దేశాలకు వెళ్తారు

అతి కొద్దిమంది విప్రులతో పార్థుడు ప్రయాణం చేసి పూర్వసముద్ర తీరంలో వెలసి ఉన్న "పురుషోత్తమ దెవరకు నమస్కరించి, మహేంద్ర పర్వతంబు"ను (ఆది 8–139) చూస్తాడు

తన జన్మ భూమిని, తన పోషకుని విభవాన్ని, దానవిభవాన్ని–అడుగడుగునా అగ్రహారాల్తో, అధ్వరాల పుణ్యసమృద్ధితొ నిండి ఉన్న వెంగీదేశ విభవాన్ని, దక్షిణ గంగ అయిన గోదావరిని, జగత్తు ఆదినుంచి ఉండే భీమెశ్వరుని నివాసమైన దక్షా

రామాన్ని అందమైన శ్రీపర్వతాన్ని, ఇంత దూరమూ వచ్చిన అయ్యుడు వీక్షించ నిదే వీలు లేదనుకున్నాడు ఆదికవి వ్యాసభారతంలోని యాత్రా మార్గాన్ని కొంచెం మార్చి "మాయింటికి విందవు కావయ్యా పార్థా" అన్నాడు. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అన్న నిత్య సత్యాన్ని చాటే నన్నయ పద్యాన్ని చిత్తగించండి

"సీ. దక్షిణగంగ నా(దగ్దయి నొప్పిన గోదావరియు వాగదాడి యైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీపర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్టమై ధరణీసురోత్తమా ధ్వరనిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేంగీదేశ విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి

తే. ణాంబురాశితీరంబున కరిగి దురిత హారియైన కావేరీ మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమతార్థదానం బొనరించి కృతార్థుఁడగుచు"

(ఆది 8-139)

118 ధర్మరాజు రాజసూయ యాగం చేసేముందు తమ్ములు నలుగుర్ని నలుదిక్కులకూ దిగ్విజయ యాత్రకు పంపిస్తాడు. ఆ సందర్భంలో తాళాంధ్ర పాండ్య కేరళ రాజులను సహదేవుడు జయించినట్లు వ్యాసభారతంలో 'ఆంధ్రాస్తాళవనాంశ్చైవ' (భండార్కర్ 2-28-48) అని ఉంది. నన్నయ భారతం వాల ప్రతుల్లో "తాళవన పాండ్య కేరళ" (సభా 1-262) అని, కొన్ని ప్రతుల్లో "తాళధర పాండ్య కేరళ "అని ఉంది. ఆంధ్రదేశం ఏమైనట్లు? ఆంధ్ర రాజుల్ని సహదేవుని చేత ఓడించడం నన్నయకు ఇష్టం లేదా?

అలా అయితే సహదేవాను శాసనం విన ధర్మజు రాజసూయానికి వచ్చిన రాజుల్లో 'వాన వాస్యాంధ్రకాస్తథా' అని మూలంలో (భం 2-31-11) ఉండే విషయాన్ని యథాతథంగా " గౌడాంధ్ర సింహళ కేరళ కుంతల ద్రవిడమరు యవన పతులును .." (సభా 1-284) అని నన్నయ పేర్కొన్నాడే!

ఎలాగైతేనేం, సంస్కృత మూలంలో రెండు చోట్ల ఆంధ్ర పాలకుల ప్రస్తావన ఉండగా తెలుగులో ఒక చోట మాత్రమే కనిపిస్తున్నది. 'తాళాంధ్ర పాండ్యకేరళ' అని పూర్వ పాఠమై యుండవచ్చు అని ఆంధ్రమహాభారతం-సంశోధితముద్రణ సంపాదకులు తెలుపుతున్నారు

ఇలా నన్నయ ఆంధ్ర మహాభారతంలో వెంగి దేశం, గోదావరి, భీమేశ్వరం, శ్రీపర్వతాల ప్రసక్తి కనిపిస్తున్నది

119 నన్నయ సమకాలికులుగా అథర్వణాచార్యులు, వేములవాడ భీమకవి, పావులూరి మల్లన చెప్పబడినారు ఆ యుగం చివర్లోని వాడు పావులూరి మల్లన అథర్వణాచార్యుడు నన్నెచోడుని తర్వాతి వాడని నిరూపింపబడినది

120 వేములవాడ భీమకవి 'రాఘవ పాండవీయాన్ని' రచించినట్లు అప్పకవి, పింగళి సూరన సాక్ష్యం చెపుతున్నారు. భీమన రాఘవ పాండవీయాన్ని నన్నయ రూపు మాపినాడని, బదులుకు బదులుగా నన్నయ రచించిన ఆంధ్ర శబ్ద చింతామణిని, భీమన సంగ్రహించుకొని పోయి గోదావరిలో కలిపేసినాడని, రాజమహేంద్రుని పుత్రుడు సారంగధరుడు సిద్ధుడైన తర్వాత ఆ గ్రంథాన్ని మళ్లీ లోకంలో వెలయించినాడని ఒక తలా తోక లేని కథను అల్లినాడు అప్పకవి సారంగధరుని కథ మాళవ దేశంలో జరిగింది కాని ఆంధ్ర దేశంలో కాదని చరిత్రకారుల నిర్ణయం చేమకూరకవి కూడా అలాగే చెప్పినాడు కాబట్టి అప్పకవి కథ గగన కుసుమం అనే చెప్పవచ్చు

121 కవి జనాశ్రయాన్ని రేచనపేర్తో భీమన రచించినాడని కొందరు అంటారు అది అసమంజసంగా నిరూపించబడింది

"వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణఁగల్గు భీమసుకవి నేఁ
గోమటి రేచన మీఁదను
నీ మహిఁగవుతెన్న ఛందమెలమి రచింతున్ (అవతారిక – 2 వ పద్యం)

వేములవాడ కరీంనగర్ జిల్లా, సిరిసిల్ల తాలూకాలో ఉండే సుప్రసిద్ధ చారిత్రాత్మక స్థలం[4]

122 భీమన పేరుతో మనకు కొన్ని చాటువులు మాత్రం మిగిలినాయి వాటిలో ఉండే తెలుగు దేశ స్థలాల ప్రసక్తి పరిశీలిద్దాం

భీమకవి సంస్కృతంలో రచించిన ఒక జ్యోతిశ్శాస్త్రాన్ని తాను తెనిగిస్తున్నట్లు చెప్పుకున్న ఒక కవి రచించిన ...

" శ్రీకరంబై ధరఁజెలువు గాంచిన యట్టి
భీమపురంబునఁ బ్రేమమీర "

అనే సీస పద్యంలో భీమన జన్మవృత్తాంతము చెప్పబడింది పై పద్యం ఆధారంగా భీమన దక్షారామంలో పుట్టినట్లు, భీమకవి నివాసం గోదావరి జిల్లాలోని 'వేములవాడ' అని చాగంటి శేషయ్య[5]

భీమకవి కళింగ గంగుపై చెప్పిన చాటువులలో వేములవాడ ప్రసక్తి ఉంది "వెములవాడ భీమకవి వేగమె చూచి కళింగ గంగు తా సామము మాని కోపమున సందడిఁదీఱిన రమ్ము పొమ్మనెన్[6]" కవిరాజు అలక్ష్యాన్ని సహించలేక రాజ్యభ్రష్టుడయ్యేట్లు శపించడం, రాజు కవిని శరణుపేడి మళ్ళీ రాజ్యం పొందడం – తర్వాతి కథాంశాలు

చొక్కనృపాలునిపై భీమన చెప్పిన మూడు చాటువులలో ఒకటి

"ఆనీతాఖ్యపదాన శృంఖల పదాభ్యాలంవిత స్తంభమా ·
నేనే వేములవాడ భీమకవినేనిం జిత్రకూటంబులో
ఘానవ్యాపిత పల్లవోద్భవ మహాపుష్పోపగుచ్ఛంబులన్
నానాపక్వఫల ప్రదాయి వగుమా నాకల్పవృక్షాకృతిన్ " 7

తాను కాలానించి ఉన్న స్తంభాన్ని పద్యంచెప్పి వృక్షంచెయ్యి · అన్నాడు రాజు కవి పై పద్యం చెప్పినాడు రాజు కాలు చెట్లో చిక్కుకుపోయింది కవి మళ్ళీ ఇంకొక పద్యం చెప్పి చెట్టును స్తంభంగా చేసినాడు

పై చాటువులో 'శృంఖల' అన్న వ్యక్తి, రెండవ చాటువులోని చొక్కనృపాలుడు ఒకడెనని, ఈ రెండూ కళింగరాజు పేర్లని, కళింగపట్నానికి 'శృంఖలా' అన్న పేరుందని గురజాడ శ్రీరామమూర్తిగారు చెప్పారని, భీమకవి రచించిన ఈ పద్యమే అందుకు సాక్షి అని చాగంటి శేషయ్య అంటున్నారు

"సీ యోజనద్వయ విశాలోన్నతిఁజెలువొంది పట్టణం బమరు శోభావిభూతి
హాటకరత్నకవాటానుమోదమై సాటి మించును గంచుకోట మహిమ
నూటొక్కగుళ్లచెన్నుగ శివానందమై నిత్యోత్సవక్రీడ నెమ్మిఁదనరు
వంశధారానదీ వారాశిసంయుత సాగరగంభవింస్రభ మమరఁ

తే గడిది రాజకళింగ భూకాంతునకును దనరు నవలక్షకాళింగ మనగ నొప్పి
శృంఖళ ద్వీపమనఁగ బ్రసిద్ధిమించు గణనకెక్కుఁగళింగపట్టణము ధాత్రి"8

పై పద్యంలో కళింగ పట్టణానికి, నవలక్ష కాళింగమని, శృంఖల ద్వీపమని పేరున్నట్లు తెలుస్తుంది రెండామడ విస్తీర్ణంతో, కంచుకోటలో, నూటొక్క శివాలయాలతో, వంశ ధారానదీ వారాశి సంయుత ...విస్రంభంతో గణనకెక్కుతుండినదట

ముఖలింగమె కళింగ నగరమని గిడుగురామమూర్తి పంతులుగారన్నట్లు సుందూరి ఈశ్వరదత్తు చెప్తున్నారు[9].

ఇందులో 'నవలక్షకాళింగము' అన్నది సముచితంగాలేదు కళింగం సపాద లక్షమండలంగా పండితారాధ్య చరిత్ర చెప్తున్నది

భీమకవి 'నృసింహ పురాణం' లోఁదని చాటు పద్యమణిమంజరిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ క్రింది పద్యాన్ని ఇచ్చినాడని ఆంధ్రకవితరంగిణికారుడు[10]

'ఈక్షితికి వచ్చి ముందుఁగ దాక్షారామమున వారతరుణుల నృత్యం బీక్షించి . . ... .. ' అని పద్యం ఇందులో దాక్షారామం ప్రసక్తి ఉంది

మైలమ భీముడు లేక ఏరువ భీముడు మరణించినపుడు భీమన విచారిస్తూ చెప్పినవి 14 పద్యాలు దొరికినట్లు ఆరుద్రగారు చెప్తున్నారు ఆ పద్యాలు ఆయన గ్రంథంలో ఇచ్చినారు కూడా అందులో ఒక పద్యం

"పన్నె తురంగమంబునకుఁ బక్కెర వేట్టిన వార్త హోరిచే
విన్న భయంబునంగలఁగి వీసరనాడును చక్రగోట్టమున్
మన్నెయపట్టణంబులును మక్కెన వెంగి కళింగి లాదిగా
నిన్నియు నొక్క పెట్టెగనె నేరువ భీమనృపాల ధాటికిన్ "[11].

బస్తరు రాజ్యంలోని రాజపురానికి ఎనిమిది మైళ్ళ దూరంలో ఉండే చిత్రకోట మనే గ్రామమె చక్రకోట్టము వీసరనాడు, మన్నెయ పట్టణంబుల (రె రా 106) ప్రసక్తి ఇంకా పరిశీలించాల్సి ఉంది ఏరువనాడు ఇప్పటి నెల్లూరు జిల్లాలోని పొదిలి, దర్శి తాలూకాలలో కొంత భాగం, కర్నూలు జిల్లాలోని మార్కాపురం తాలూకా ప్రాంతం, కడప జిల్లాలోని బద్వేలు, సిద్ధవటం తాలూకాలలో కొంత భాగం చేరిన దేశం ఏరువనాడు[12]

భీమన అశ్వాన్ని పోతురాజు అపహరించాడు అతన్ని నిందిస్తూ చెప్పిన చాటువులో దాను రాముడుగా పోతరాజు రావణుడుగా సహ్యాజ వారధిగా, గుడిమెట్ట లంకగా పోల్చి అతన్ని చావదిట్టినాడు

'.. సహ్యజ వారిధి . గుడిమెట్టలంక' 13

గుడిమెట్ట గ్రామం కృష్ణా జిల్లాలో నందిగామకు నైరుతి దిశలో నాలుగు క్రోశాల దూరంలో ఉంది అని చాగంటి శేషయ్యగారు.

1 3 పావులూరి మల్లన పదకొండవ శతాబ్ది చివర, పన్నెండవ శతాబ్ది మొదట్లో పావులూరి మల్లన ఉండి, వీరాచార్యుని సంస్కృత సారసంగ్రహగణితాన్ని అదే పేరుతో తెనిగించినాడు అతడు కమ్మనాటిలో పావులూరికి కరణంగా ఉండినవాడు

'ఇలఁ గమ్మనాటిలోపల విలసిల్లిన పావులూరి విభుఁడవు'

అని కవి పలుకులు కమ్మనాడు వెంగిరాజ్యంలోనిది కమ్మనాడు శ్రీశైలానికి తూర్పుభాగాన నరసారావుపేట తాలూకా, వెలనాటికి దక్షిణ ప్రాంతంలోని బాపట్ల తాలూకా, పాకనాటికి ఉత్తరంగా ఒంగోలు తాలూకాలోని కొంతభాగం, పడమట గుండ్లకమ్మ నది, కర్నూలు జిల్లాలోని మార్కాపురం తాలూకా గలిగిన భూభాగం 14 పావులూరు చీరాల సబ్ తాలూకా గుంటూరు జిల్లాలో ఉంది 15

1 3 1 కవి మల్లన తాతపేరు కూడా మల్లనే ఆయనకు రాజరాజ నరేంద్రుడు పిఠాపురం ప్రక్కన ఉండే 'నవఖండ వాడ' అనే అగ్రహారాన్ని బహూకరించినాడని క్రింది పద్యం తెలుపుతుంది

'శ్రీలలనేశుఁ డంధ్ర నృపశేఖరుఁడై చను రాజరాజభూ
పాలకుచేతఁ బిఠపుర పార్శ్వమునన్నవఖండవాడ యన్
ప్రోలు విభూతితోఁబడసె . ...
.. .. శివ్వన పుత్రుఁడు మల్లఁడున్నతిన్"

పీఠపురం లేక పిఠాపురం అనే పట్టణం తూర్పు గోదావరి జిల్లాలో ఉంది నవఖండ వాడ పిఠాపురం తాలూకాలోనే ఉండే గ్రామం 16 .

ఈ విధంగా 'పావులూరి గణితం' లో కమ్మనాడు, పావులూరు, పీఠపురం, నవఖండవాడ అనే ప్రదేశ నామాలు ప్రసక్తిలో ఉన్నాయి

నన్నయ, భీమకవి, పావులూరి మల్లనల సాహిత్యంలో తెలుగునాడు, అంతర్వాహినిగానే కనిపిస్తున్నది తర్వాతి 'శివకవియుగం' లో తెలుగునాడు విశ్వరూపాన్ని ప్రదర్శించింది మనం దర్శించి ఆనందిద్దాం

## సూచికలు:

1 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 301
2 ,, ,, పు 304
3 ఈ అవతారికలో ఉండే ఆరు పద్యాలు జ— అనే ప్రతిలోమాత్రమే ఉన్నాయి. వేమనవాడయని మాతృక — కవిజనాశ్రయము, పీఠిక, పు 1
4 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 310
5 కవి తరంగిణి — మొదటి సంపుటము, పు 211
6 ,, ,, పు 247
7 ,, ,, పు 241
8 ,, ,, పు 242
9 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 75
10 ఆంధ్రకవి తరంగిణి — మొదటి సంపుటము, పు. 218
11 సమగ్రాంధ్ర సాహిత్యం, సంపుటం — 1, పు. 215
12 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 39
13 ఆంధ్రకవి తరంగిణి, మొదటి సంపుటము పు 262 — 263
14 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 68
15 ఆంధ్ర చరిత్ర — భూగోళసర్వస్వము, ముఖద్వారము పు 274
16 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 236

2

# శివకవి యుగ సాహిత్యంలో తెలుగునాడు

2. 0 ఆంధ్ర సాహిత్యచరిత్ర క్రీ శ 12వ శతాబ్దాన్ని, 13వ శతాబ్దపు మొదటి పాదాన్ని (క్రీ శ 1200 - 1325) శివకవి యుగంగా పేర్కొంటున్నది. ఆ యుగంలో ముఖ్యమైన ముగ్గురు కవులు నన్నెచోడుడు, పండితారాధ్యుడు, పాల్కురికి సోమన వీరు ముగ్గురూ శైవమత ప్రచారానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాటుబడినవారే అందుకే వారిని శివకవు లనడం జరిగింది వీరు తమ సాహిత్యంలో తెలుగు దేశాన్ని ఎంత విస్తృతంగా అభివర్ణించినారో తెలపడం ఈ ప్రకరణ లక్ష్యం

2 1. నన్నెచోడుడు . నన్నెచోడుని 'కుమార సంభవ' కావ్యం శైవ మత కావ్యం కాదుగాని శివ నాయకమైన గ్రంథమె ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు పెక్కు ఆధారాలతో ఇతని కాలాన్ని 12వ శతాబ్ది పూర్వభాగంగా నిరూపించినారు[1]

నన్నెచోడుని కావ్యంలో ప్రస్తావనకు వచ్చిన తెలుగునాడులోని స్థలాలు ఒరయూరు, కుముద్వతి నది, చెంకణం, పాకనాడు, శ్రీనగం అనేవి

2 1 1 పాకనాడు ' కవి కృత్యవతారికలో తన తల్లిదండ్రుల ప్రసక్తి తెచ్చిన సందర్భంలో తన తండ్రి చోడబల్లి పాకనాటిలోని 21 వేయి గ్రామాల కధీశుడని చెప్పుకున్నాడు

> అరినరపాలమౌళి దళితాంఘ్రియుగుండయి మేటి పాకనా
> డిరువదియొక్క వేయిటి కధీశ్వరుడు నాఁజను చోడబల్లికిం
> .. . .. శ్రీ సతికిం దనూజుఁడన్ (1 - 53)

పాకనాడు లేక పాకినాడు నెల్లూరు మండలాంతర్గత విషయాలలో ఒకటి తూర్పున సముద్రతీరం, ఉత్తరం కందుకూరు తాలూకా, దక్షిణం నెల్లూరు, వెంకటగిరి తాలూకాలు, పడమర ఉదయగిరి తాలూకా, వీటి మధ్యభూమి పాకనాడు. పాకనాడు 21 వేల గ్రామాల ఆంధ్రదేశ భాగమని ఉప్పుగుండూరు, పెదచెఱుకూరు శాసనాలు, కేయూరబాహు చరిత్ర సాక్ష్యాలు[2]

2 1 2 ఒరయూరు - పెంకణం కవి తాను ఒరయూరి కధిపతినని పెంకణాదిత్యుడనని చెప్పుకొన్నాడు ఈ పద్యంలో —

" కలువొన్న విరులఁబెరుగం
గలుకోడి రవంబు దిశలఁగలయఁగఁజెలఁగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘు పరాక్రముఁడ పెంకణాదిత్యుండన్ " (1-54)

క్రీ శ 991 నాటి దొంగలసాని (సిద్ధవటం తాలూకా, కడప జిల్లా) శాసనంలో ' ... శ్రీ వెంకయాచొది మహారాజు తెంకణాదిత్యుఙు ' అని ఉంది[3] నెల్లూరు చుట్టుపట్ల ప్రాంతమె తెంకణరాజ్యం అని బూదరాజు రాధాకృష్ణ[4]

ఈ శాసనమె కాక మరి మూడు శాసనాలు ఆధారంగా కన్నాటికి దక్షిణంగా, పాకనాటికి పడమరగా, ములికినాటికి ఉత్తరంగా ఇప్పటి అనంతపుర మండలంలోని తాడిపత్రి తాలూకా ప్రాంతమే తెంకణమై ఉంటుందని కుందూరి ఈశ్వరదత్తు[5]

నన్నెచోడుడు పెంకణరాజ్యానికి రాజు. ఒరయూరికి అధిపతి

క్రీ శ 1000 నాటి భైరాంగర్ (బస్తర్, మధ్యప్రదేశ్) శాసనంలో "రవి కులాన్వయు.. ...ఒఱయూర' పురవరేశ్వర [చోడ] వంశోద్భవ అమ్మగామ పురవరేశ్వరులైన శ్రీమన్మహా మణ్డలేశ్వ [ర] చంద్రాదిత్య రాజులు ......"అని ఉంది[6]

ఒరయూరికధిపతి, పెంకణాదిత్యుడు-ఇవి వంశపారంపర్యంగా చెల్లివచ్చే బిరుదులు తత్కారణంగా నన్నెచోడుడు ఒరయూరును, పెంకణాన్ని పాలించెనని తలచుట సరికాదు పాకనాటి యందిరువది యొక్క వేయిటికధీశు డనుట కూడ వంశక్రమాగత సామాన్య బిరుదే కావచ్చును[7]

2 1 3 శ్రీశైలం · కుమార సంభవకావ్యం జంగమ మల్లికార్జునునికి అంకితం శ్రీశైల మల్లికార్జునునికి, తన గురువు మల్లికార్జునునికి అభేదం చెప్పినాడు. కవి ఇద్దరూ శ్రీశైలవాసులే ఒకరు స్థిరలింగం మరొకరు జంగమలింగం

"పావనం బరమశ్రీనగోత్తుంగ మణి శ్రీసంగత మల్లికార్జునదేవతాకింబై జంగమలం ప్రత్యక్షంబై ప్రవర్తిల్లుట జంగమ మల్లికార్జున దేవుండై..."(1-58)
అని ఆ పద్య భాగం.

2 1 4 కుముద్వతి : ఇంద్రుడు కుమార స్వామిని చూసి భీతి చెందుతాడు సూర్యునితీవ్ర కిరణాలకు ముడుచుకునే తెల్లకలువ తీగ (కుముద్వతి) అవుతాడు కుముద్వతి అనేనది కడప జిల్లాలో ఉంది కవి సాభిప్రాయంగానో, అనుకోకుండానో ఈ పదం వాడడం మాత్రం జరిగింది

. . . . ఉరు భాస్కర తీవ్రకర ప్రభాతిఁగన్నులికి

రయంబున న్మొగిడి యున్నకుముద్వతి వోలె భీతితోన్ (10-61) ఈ విధంగా నన్నెచోడుని కావ్యంలో తెలుగునాడు ప్రసక్తి అత్యల్పంగా ఉందని చెప్ప వచ్చు

2 2 మల్లికార్జున పండితారాధ్యుడు మల్లికార్జున పండితుడు ఆంధ్ర దేశంలో ఆరాధ్య సంప్రదాయ స్థాపకుడు ఇతని జీవితచరిత్ర పాల్కురికి సోమన రచించిన 'పండితారాధ్యచరిత్ర' అక్షరాంకగద్య, శివతత్త్వసారం, స్తుతిశ్లోకపంచకం, శివశరణపదం పండితుని రచనలు అన్నీ శైవమత బోధకాలే.

2 2 1 అక్షరాంకగద్య : దీన్నే 'మల్లికేశ్వరగద్య' అని కూడా అంటారు ఆంధ్ర భాషకు ఉండే ఏభైవర్ణాలను పాదాదిన ఉంచి శ్రీపర్వత లింగాన్ని స్తుతించిన రచన ఇది ఈ గద్యంలో రెండు పాదాల్లో శ్రీపర్వత ప్రస్తావన ఉంది

"వరద శైల విహార
అక్షరాంక స్తోత్ర
శ్రీపర్వత లింగ నమస్తే నమస్తే నమః'9 "

2 2 2 స్తుతి శ్లోకపంచకం ఐదు సంస్కృత శ్లోకాలు శ్రీశైల మల్లికార్జున స్తుతి 1,2,3,5 శ్లోకాలు నాల్గు పాదాలు నాల్గోది రెండుపాదాలు కుధరం, శ్రీకుధరం అని శ్రీశైలానికి రెండు రూపాంతరాలుగా ప్రయోగించినాడు కవి ప్రతిశ్లోకంలో చివర పాదం శ్రీశైల వల్లభునికి నమస్సులర్పించే మకుటం

తస్మైనమోస్తు కుధర వల్లభాయ - 1
తస్మై నమశ్శ్రీకుధర ఖేలనాయ - 2
తస్మై నమశ్శ్రీ కుధరమందిరాయ - 3
తస్మై నమశ్శ్రీకుధర వల్లభాయ - 4
తస్మై నమశ్శ్రీకుధర వందితాయ - 5 అనేవి

2 2 3 శివ తత్త్వసారం .

పండితుని శివతత్త్వ సారంలో కొందరు భక్తుల కథ సూక్ష్మంగా చెప్పబడింది ఆ భక్తుల్లో శ్రీపతి పండితుడు, కదిరి రేమణాచార్యుడు తెలుగు దేశానికి సంబంధించిన వారు

శ్రీపతి పండితుడు తెలుగస కవి బెజవాడ యుద్ధమల్లుని శాసనరచయిత. శివుడొక్కడే దేవుడని నిరూపించడానికి నిప్పులను వస్త్రంలో ముడిచినాడు విజయ వాడలో

"ఒక్కండ దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పుల చీరన్
ప్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మిశివా" (406 పద్యం)

విజయవాడ లేక బెజవాడ కృష్ణానదీ తీరంలో ఉన్న ప్రసిద్ధ నగరం క్రీ శ 6 వ శతాబ్దినుండి దీనికి గొప్ప చరిత్ర ఉంది బెజవాడ, వెచ్చవాడ, విజయవాటి, విజయవాటికా అనేవి శాసనాల్లో కనిపించె రూపాంతరాలు తొమ్మిదో శతాబ్దిలో వేంగి పాలకుడు విష్ణువర్ధనుని చెరువు మాధవరం శాసనంలో 'విజయవాటీపురం' అని చెప్పబడింది[10]

కవి ఇంకో పద్యంలో కదిరి రేమణార్యుని ప్రశంసించినాడు రేమణ భక్తికి మెచ్చి శివుడు ఏడునాళ్ల పీనుగకు ప్రాణమిచ్చినాడు

" పూని వడి నేడు నాళుల
పీనుఁగునకు వీరభక్తిఁ బ్రబితాత్ముఁడవై
ప్రాణం బొసఁగితిఁగాదె ద
యానిరతిం గదిరి రేమణార్యునకు శివా" (429 పద్యం)

కదిరి అనంతపురం జిల్లాలో ఒక తాలూకా కేంద్రం దీనిని పూర్వం 'ఖదిరి' లేక ఖద్రి అనేవారు ఖ అంటే విష్ణుపాదం అద్రిఅంటే కొండ ఖద్రి అంటే విష్ణు పాదమున్న కొండ అని అర్థం ఇక్కడ 'ఖదిర' వృక్షాలు అపారంగా ఉన్నాయి కాబట్టి 'ఖదిరి' అయిందని కూడా చెపుతారు[11]

" ఆయత త్రిపురాంతక దే
వా యని పిలచుటయుఁగటక మంతయు వినఁగాఁ
బాయక కిన్నెర బ్రహ్మయ
కో యని యెలుగిచె తొల్లి యురగాభరణా . "

అనే పద్యంలో కిన్నెర బ్రహ్మయ కథ ఉంది త్రిపురాంతకం కర్నూలు జిల్లాలో ఉంది ఇది శ్రీశైలానికి తూర్పుద్వారం త్రిపురాంతకం వద్ద కుమారగిరిపై వెలసిన త్రిపురాంతకేశ్వరుడు[13] కిన్నెర బ్రహ్మయ పిలుస్తూనే పట్టణమంతా వినిపించేట్లు పలికినాడట

పండితుని శతకం అలభ్యం లభించిన ఒకపద్యంలో
.. ..పరమేశ్వర శ్రీగిరి మల్లికార్జునా![14]" అనే మకుటం ఉంది.

2 2 4 శివశరణపదం పండితుని చివరి రచన లింగైక్యం చెందె సమయంలో చెప్పింది ఇందులో తొమ్మిది పదాలున్నాయి ఒక్కొక్కటి నాలుగు పాదాలు. చివరి రెండు పాదాలు మకుటం "చారసీవె నన్ను సీవురి యగుచున్న సిరిగిరి నుండెడ శివశరణు" అని మొదటి పదంలో "ఉంతంగఁగొరెద నో పర్వతేశ, ఖండేందు మౌళి నీ గర్భంబులోన" అని శ్రీగిరి ప్రసక్తి ఉంది అలా తొమ్మిది శివశరణ పదాలు "కన్నడ గౌళ రాగంలో పాడిన పండితు దృఙ్మనఃపరిపూర్ణుఁడై యఖండిత పర్వతాకార లింగంబు నిర్భర కారుణ్యనికట కటాక్ష గర్భార్భకుని నాత్మగర్భస్థుఁ జేసి"ందట

ఈవిధంగా పండితుని రచనలలో శ్రీశైలం, విజయవాడ, కదిరి, త్రిపురాంతకం దర్శనమిస్తున్నాయి

2 3 పాల్కురికి సోమన పాల్కురికి సోమన తన రచనలన్నింటినీ శైవ మత ప్రచారానికే వినియోగించుకొన్నాడు సాహిత్యం ద్వారా మతవ్యాప్తికోసం కంకణం కట్టుకొని, శైవేతరులదర్శన స్పర్శనాలను కూడా సహించని, హింస ద్వారానైనా పరమత నాశనం చేయాలనే వీరశైవమత ప్రచారకుడు సోమన సోమన తెలుగులోనేకాదు సంస్కృత, కర్ణాటభాషల్లోనూ రచనలు సాగించినాడు తెలుగులో అసంఖ్యాకంగా రచనలు చేసినా ఆంధ్రవాఙ్మయ చరిత్రలో నిలబడేవి మూడు రచనలే-బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, వృషాధిపశతకం అనెవి

2 3 1 సోమన తన రచనల్లో తనపేరును వివిధ విధాలుగా చెప్పుకున్నాడు అవి . 1) పాలకుఱికి సోమనాధుడు ( అను సార 24 ) పాలకుఱికి సోమెసుఁడు ( చెన్న సీస 32 ), 2) పాల్కుఱికి సోమనాధుండు ( అను సార 243 ), 3 పాల కురికి సోమనాథుండు ( వృషా శత ) ( పండితా 3 4,5 ప్రతి ), 4) పాల్కుఱికి సోమనార్యుఁడు, 5) పాల్కుఱికి సోమనార్యుఁడు (పండిత ప్రక 1), 6) పాల్కుఱికి సోమనాథుఁడు ( పండిత ప్రక 2 ), 7) పాల్కుఱికి సోమనాథసుకవి ( పండి ప్రక 1 )

పై ఉటంకిపుల్ని బట్టి చూస్తే పాలకుఱికి/ పాల్కుఱికి/ పాలకురికి/ పాల్కుఱికి/ పాల్కుర్కి/ పాలుకురికి/ అనే పదాలు సోమన ఇంటి పేరుగా కనిపిస్తాయి

కవి పాలకురికి వాస్తవ్యుడు నేటి తెలంగాణాలోని నల్గొండ జిల్లాలో జనగామ తాలూకాలోని వరంగల్లుకు 12 కోసుల దూరంలో పాలకురికి ఉంది ఇది ఒక పుణ్య క్షేత్రం స్వయంభువు అయిన సోమేశ్వరస్వామి గుడి, సోమన అనంతరం అతని ఆశ్రమ స్థలిమీద శిష్యులు ప్రతిష్టించిన సోమనాథ లింగం నేడు శైవులకు యాత్రా స్థలాలు దాని ఇప్పటి పేరు పాలకుర్తి[14] .

సోమన 'అనుభవసారం' 242 పద్యాల కావ్యం గోడగి త్రిపురారికి అంకితం వీరశైవ మత వివరణ గ్రంథం పాలకుఱికి, పాల్కుఱికి అని కవి ఇంటిపేరు తప్ప మరో స్థలనామం ఈ కావ్యంలో కనిపించదు

'చెన్నమల్లు సీసములు' ముప్పైరెండు బసవేశ్వరుని మెనల్లుడు చెన్నబసవని స్తుతించే పద్యాలు ఇందులోనూ పాలకురికి, పాలకుఱికి అని కవి యింటి పేరు తప్ప మరో స్థలనామం లేదు.

2 3 2 'వృషాధిపశతకం' సోమన మరో రచన ఇందులో త్రిపురాంతకం, పాలకురికి, శ్రీగిరి స్థలాల ప్రసక్తి ఉంది బసవని స్తుతిగా రచించిన శతకమిది సకలేశ్వరమాదిరాజు ఆరునూరేండ్లు శ్రీగిరిపై బ్రతికి ఉండినట్లు ఈ పద్యం తెలుపుతుంది

" ఏడులు నూఱటంచు శ్రుతులెన్నఁగ శ్రీగిరిమీద నాఱునూ
ఱెడులు సంచరించు సకలేశ్వర మాదిరాజు నా . —.. "

(83–పద్యం)

కిన్నెర బ్రహ్మయ్య బాసతప్పి అపరాధి అయిన ఒకణ్ణి నరుకుతాడు చంపబడినవాడు అపరాధి అని నిరూపించేందుకు త్రిపురాంతకస్వామిని సాక్షిగా చెప్పి త్రిపురాంతకుని చేతనే పలికిస్తాడు బసవని ప్రాణమిత్రుడు కిన్నెర బ్రహ్మయ్య[15] అతని కథ 'సూక్ష్మంలో మోక్షంగా' ఈ పద్యంలో చెప్పినాడు సోమన

" సూత్రము దప్పి గొత్తి గుడిఁజొచ్చిన మిండని జంపి సాక్షిఁగా
నో త్రిపురాంతకా యనుచు నోయని పిల్చిన యల్ల సద్యశః
పాత్రుఁడు కిన్నెరయ్యకును బ్రాణసఖుండగు నిన్నుఁగొల్తు దే
వా త్రిజగత్పవిత్ర బసవా బసవా బసవా వృషాధిపా. " (84 పద్యం)

పాలకురికి సోమనాథుడు ఈ శతక మర్పణచేసె' అనే 109 వ పద్యంతో శతకం ముగుస్తుంది

2 3 4 బసవ పురాణము పాల్కురికి సోమన 'బసవ పురాణము ఏడాశ్వాసాల ద్విపద కావ్యం వీరశైవ మత ప్రవక్త బసవేశ్వరుని కథ ప్రధానమైనా ఆనుషంగికంగా ప్రాచీన, ఆధునిక శివభక్తుల కథ లెన్నింటినో ఈ కావ్యంలో తనివి తీరా వర్ణించినాడు సోమన

2 3 4 1 సోమన బసవ పురాణంలో చాలాచోట్ల 'శ్రీగిరి' ని శ్రీపర్వతం, శ్రీశైలం, సిరిగిరి అని నోరారా భజించినాడు.

2 3 4 2 శ్రీశైలాన్నే గాక అలంపురి, కపిలేశ్వరం, హేమాద్రి, క్షీరారామం చేగొండ, త్రిపురాంతకం, దక్షారామం, నందిమండలం, పుష్పగిరి, శ్రీకాళహస్తి వంటి ప్రసిద్ధమైన స్థలాలు, మొగలేరు వంటి శైవ తీర్థం బసవ పురాణంలో భక్తులచేత సందర్శింప చేస్తాడు కవి – ఆయా కథా సందర్భాల్లో

2 3 4 3 బసవ చరిత్ర చెప్పబొౕతూ శ్రీశైలాన్ని, శ్రీశైల తూర్పుద్వారమైన త్రిపురాంతకాన్ని ఇలా ప్రస్తుతిస్తాడు సోమన

" శ్రీ మన్మహాదేవు సింహాసనంబు
హైమవతీవిహార స్థలంబు
హరుని భక్తులకు నేకాంతవాసంబు
పరమ యోగులకు హృత్పద్మదావహంబు

నరులకుఁగర్మసంహరణైక హేతు
వరయంగ సురలకు నాశ్రమభూమి
సకల తీర్థములకు జనయిత్రి యగుచుఁ
బ్రకటింప నొప్పు శ్రీపర్వతేంద్రంబు
ఉర్వీధరత్పర్వత సార్వభౌమునకుఁ
బూర్వవక్త్రాంకవిస్ఫురణఁదొల్కాడ
నొలపె కుమారశైలోత్తంసలీలఁ
దిలకించి వెలపారుఁద్రిపురాంతకంబు"

(ప్రథమ 31–42)

శిలాదుని తపోస్థానం శ్రీపర్వత నైరృతిభాగం తనకు, నందీశ్వరునికి అభేదమని, తను భక్తైకతనుడనని చెప్తూ, శివుడు ఉమతో నందికేశ్వరుని జన్మవృత్తాంతాన్ని వినిపిస్తాడు "శిలాదుఁడనంగఁ దాపసముఖ్యుండు దపమొనరించె శ్రీపర్వతంబు నైరృత్య భాగమున" ( ప్రథమ 330–331 ) అని శివుని వాక్కులు శిలాదునికి శివుని వరంతో నందికేశ్వరుడు జన్మిస్తాడు నందికేశ్వరుని పవిత్రజన్మస్థలం "శ్రీగిరి నైరృత్యభాగంబు పుణ్యభాగమాపుణ్యక్షేత్రంబు పరమపావనము" ( ప్రథమ 487–488 ) అని వివరిస్తాడు మహేశ్వరుడు "లోకహితార్థంబు, సకల భక్త హితార్థంబు" బసవనిగా పుట్టుమని నందికేశ్వరుని పరమశివుడు ఆజ్ఞాపిస్తాడు అతడు పుట్టేది కర్ణాటదేశంలో 'హింగుళేశ్వర భాగవాటి' అనే అగ్రహారంలో ఈసందర్భంలోనూ కవి శ్రీశైలాన్ని స్మరిస్తాడు

" గురుతరంబైన శ్రీగిరి పశ్చిమమున
సరనుతంబగుచుఁగర్ణాట దేశమనఁ
గడునొప్పునందుఁ బ్రఖ్యాత సద్భక్తి
నడినన్న హింగుళేశ్వర భాగవాటి
యను నగ్రహారంబునందు......"

( ప్రథమ. 581–585 )

మండెగమాదిరాజుకు, మాదాంబకు జన్మిస్తాడు బసవడై నందికేశ్వరుడు

సిద్ధరాముడు సొన్నలి పురంలో ఉంటాడు అతనితో శివభక్తులు "సిద్ధుడా! నీ ఊరినే అభినవ శ్రీగిరిగా జేసి, ఆ పర్వతము మల్లికార్జున దేవుని ఇక్కడికి తెచ్చి నిలిపి పూజించి, ప్రథమలోకానికి వెళ్ళివస్తుంటాము" అంటారు ఆ సందర్భంలో –

" సిద్ధుండ! లోక ప్రసిద్ధంబుగాగ
నభినవ శ్రీగిరి యనఁగ నిప్పురము
నభినవ లీల సొంపార రచించి
యాపర్వతము మల్లికార్జున దేవు
నేపార గొనివచ్చి యిచ్చట నిలిపి " (ద్వి 1075–78)

అని ఆ కథాంశాన్ని సోమన వర్ణిస్తాడు

ముగ్ధసంగయ్య ఒక వేశ్య యింటికి వెళ్తాడు – బసవని అనుమతి తీసుకుని. "నివెందుకు భూతిపూయవు? రుద్రాక్షముల్ దాల్చవేమి? జడలేల దాల్చవు?" ఇలా ప్రశ్నిస్తాడు అమాయకంగా ఆమె చమత్కారంగా సమాధానాలిస్తుంది మీ గురు సంప్రదాయమేది? అని అడుగుతాడు సంగయ్య ఆమె సమాధానం

" తలప మా గురు సంప్రదాయంబు వారు
గలరు శ్రీగిరి యాదిగా నెల్లయెడల నధిప" అని
(తృ 343–4)

తెల్లవారి తిరిగి వస్తాడు సంగయ్య ఆమె విషయం, తన లంజెరికం విషయాలు తనివి తీరా వర్ణిస్తాడు. బంటారి బసవనితో తను కైలాసంలో శ్రీగిరిలో నున్నాడని, శ్రీశైలంలో వేనవేలుగా 'మహాగణము' లున్నా, వారి కన్నా వింతగా ఉంటుంది ఆ వనిత అంటాడు

" బంటారి నియూన పసిబిడ్డనాట
నుండియు శ్రీగిరి నుండుదు నచట
ననుపమ కదళీవనాంతర పల్వ వనముల
వనముల నేకాంతవాసంబు నందు
. .. ...మహాగణములు గలవు "

శ్రీశైల పర్వతం మీద కదళీ వనాల్లో, బిల్వవనాల్లో శివయోగులు కవికాలంనాడు అసంఖ్యాకంగా ఉండేవారని పై ద్విపదలు తెలుపుతాయి

శ్రీపర్వతానికి, శివరాత్రికి వివిధదేశాల నుండి అసంఖ్యాకంగా 'పరసలు (భక్త సమూహాలు) వస్తుంటాయి ఆ పరసల సందడికి తట్టుకోలేక సిరిగిరి నుండి వచ్చేశావా • స్వామీ • అని చన్నప్ప ప్రశ్నిస్తున్నాడు ముగ్ధస్వభావంతో సిద్ధనారణ్యంలో ఒంటిగా కనిపించిన శివలింగాన్ని

పరసల త్రొక్కునఁబడఁజాల కీవు
సిరిగిరి నుండక సురిగి వచ్చితివొ

(తృ 1289-90)

'తెలుగు జొమ్మయ్య కథ'లో శివానందుని ప్రసక్తి ఉంది అతడు శ్రీశైలంలో సమాధిస్థుడై ఉన్నాడు

" శ్రీశైలమున సమంచిత సిద్ధర ప్ర
దేశంబునను సమాధిస్థుడై యుండ " (పం 1285-6)

సిద్ధరామయ్య తన "సొన్నలిక పురానికి" స్వామిని రప్పించుకో లేకపోతాడు శ్రీగిరికేగి మల్లికార్జునుని ప్రార్థించి కూడా షొడ్డలదేవు బాచయ్య మాత్రం "సౌరాష్ట్ర నాథుఁడు సోమేశ్వరుని" పిలిపించుకొన్నాడు ఆ విషయం ఈ క్రింది ద్విపదల్లో-

" సిద్ధరామయ్యఁదా శ్రీగిరి కేగి
శుద్ధాత్మ మల్లికార్జునుని బ్రార్థించి
కొంచు నా సొన్నలి కను పురంబునకుఁ
దానెట్లు రప్పింపగా నేరఁడయ్యె "

( ష 1343 - 6 )

రాను ప్రతాప నారాయణపురిలో గోవింద ప్రతిమను ప్రతిష్ఠించిన సమయంలో షొడ్డలదేవు బాచయ్య రాజేవ? బిజ్జలుడు ఆగ్రహిస్తాడు బసవన "శివ భక్తులు... అన్యదైవంబుల యిండ్లవొత్తురె భక్తుల సూతురే విం(బె" (ష. 1387-8) అంటాడు బిజ్జలునితో శివునికితర దైవములు సాటిరారని చెప్తూ "సిరి మహదేవుఁడొ సిరిగిరి పతికి సిరి వాసుదేవాది సురలు సమంబె" (ష 1381-2) అంటాడు ఎంతో సాధి కాంకింగా ఈ సందర్భంలోనే శ్రీశైల ప్రసక్తి వచ్చింది

తమకు వంశపారంపర్యంగా వస్తున్న 'మడికూటి వృత్తి' ( ప్రసాదంకొనే వ్యాపారం ) ఇప్పుడు బసవని శిష్యులకు వదలము అని బిజ్జలునివద్ద బసవన్నతో తగవు లాడే సందర్భంలో బోయలు తమకు ఈ వృత్తి ముఖ్య శైవస్థలాల్లో చెల్లుతున్నది అంటారు అలాంటి ప్రసిద్ధ శైవక్షేత్రాల్లో శ్రీగిరి ఒకటి

"వారాణసి గయగేదారంబు నందు
సౌరాష్ట్రమునను దక్షారామమునను
శ్రీగిరి యందును.. .. .. " ( స 1131-3 )

బోయవారి యందు తన మాట నెగ్గించుకొనేందుకు బసవన స్వామికి విషం ప్రసాదంగా సమర్పించి, తానూ ఆ ప్రసాదాన్నే ఆరగిస్తాడు ఆ సందర్భంలో శ్రీగిరి నాథ, నీవు కడుపునిండా భోంచెయ్యి అంటాడు "చిక్కంగనిపుమా శ్రీగిరినాథ" (స 1312) అని బసవని వాక్కులు

ఇలా వీలున్న చోటల్లా శివున్ని, అందునా శ్రీగిరి మల్లికార్జునున్ని బసవ పురాణంలో సంభజిస్తాడు సోమన

శ్రీగిరి మీద ఉండే బిల్వవనం, శ్రీశైల పర్వతంలోని వివిధ శిఖరాలు, తరులు, తీర్థాలు బసవ పురాణంలో చక్కగా చోటు చేసుకొన్నాయి

మల్లరసనే మండలేశ్వరుడు "శ్రీగిరికేగి నిశ్చింత సమాధి నా గిరి బిల్వవనాం తరమున నున్నవారు " ( తృ 1905-7 ) అని శివభక్తగణములచే విని మాది రాజయ్యగారు "శ్రీగిరి కరుదెంచిరి" ( తృ 1911 )

మాదిరాజయ్యగారు ఆ గిరి శృంగాలను దర్శిస్తూ "ఏకాంత వేళల లింగాంగ పూజనలుచేస్తూ "అనుపమ బిల్వవన సమీపంబున భస్మగిరులు, భస్మతరులు, భస్మగనులు, భస్మనదులు" చూస్తారు ఆ సందర్భంలో బిల్వవనం వద్ద మాది రాజయ్యగారు సందర్శించిన వింతలు కవి తనివితీరా (తృ. 1927-2162) భక్తి పారవశ్యంతో ద్విపదల్లో పాడినాడు సోమన మచ్చుకు కొన్ని ద్విపదలు –

" రుద్రాక్షశైలముల్ రుద్రాక్ష తరులు
రుద్రాక్ష గనులును రుద్రాక్ష నదులు ( తృ. 1929-30 )

జంగమ శైలముల్ జంగమ తరులు
జంగమ గుల్మముల్ జంగమ లతలు (తృ 1935-36)

అరుదగు శ్రీగిరి గిరులన గిరులు ( తృ 2016 )
అరుదగు శ్రీగిరి తరులనఁ దరులు" (తృ 2020)

ఇలా ఎన్నెన్నో కవి శివ భక్తిాకరై, వరదలై భక్తలోకాన్ని ముంచెత్తుతున్నది ఈ ద్విపద ప్రవాలవెంట అక్కడి గిరుటు తరులు గంగాశైలాలు - గంగా వృక్షాలు.

"సంగతంబుగ నెక్కి జనులఁబాలాళ
గింగ నాడించు గింగాశైలములను
సంగతంబుగ నెక్కి జనులఁ దాతాళ
గంగనాడించు గంగా వృక్షములును" (తృ 2021-25)

శ్రీశైల క్షేత్రాన్నేగాకుండా ఆంధ్ర దేశంలోని చాలా శైవ క్షేత్రాలను బసవ పురాణంలో వర్ణించినాడు సోమన వాటి విషయం కొంత పరామర్శిద్దాం

2 3 4 4 అలంపురి మహబూబ్‌నగర్ జిల్లాలో ఉండే ప్రసిద్ధ శైవస్థలం బాల్రబ్రహ్మేశ్వరుడు ఆ క్షేత్రదైవం ఆ క్షేత్రాన్ని "భాస్కరక్షేత్రం" "పరశురామ క్షేత్రం" "బాలబ్రహ్మేశ్వర క్షేత్రం" అని వాదా అంటారు. స్కాందపురాణం పండితారాధ్య చరిత్రల్లో ఈ క్షేత్ర మాహాత్మ్యం విపులంగా వర్ణితమైంది ఇది శ్రీశైలానికి పశ్చిమద్వారం16. అలంపుర ప్రసక్తి "బ్రహ్మ యలంపూర భక్తితో నిల్పి, బ్రహ్మేశ్వరునిగాదె పాయక కొల్చె" (ష 1871-72) అనే పాదాల్లో ఉంది

కపిలేశ్వరం : తూర్పు గోదావరిజిల్లా రామచంద్రాపురం తాలూకాలో కపిలేశ్వరం ఉంది "త్రిపురారిగుడి తూర్పుదెస నేఱునేల, గపిలేశ్వరంబందు దపసి యొక్కరుఁడు, ఆలింగమునకు నిత్యము నాలుపుట్ల పాల మజ్జన మార్చ" (ద్వి 1037-8) కాలువలు గట్టి పిపి పీఘల రొంపి అయింది ఒక గొల్లెత కాలుజారి పడపోయింది కల్యాణ కటకంలో బిజ్జలుని వద్ద ఉండే బసవడు "ఓడకోడకు" అంటూ కడవ పట్టినట్లు చేతులు చాపులాడు

త్రిపురాంతకం కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాలో ఉంది శ్రీశైల క్షేత్రానికి తూర్పుద్వారం ఇక్కడ కుమారాద్రి మీద త్రిపురాంతకేశ్వరుడు నెలకొని ఉన్నాడు17 త్రిపురాంతక క్షేత్రంలోనే కరస్థలి సోమనాథయ్య, రెంటాల మల్లినాథుడు, దోచమాంబ ప్రసాదావధాని, గోడగి త్రిపురారి ఇంకా సకల భక్తానీకమూ ఉండాపు రెంటాల మల్లినాథుడు కుమారాద్రికి తూర్పువైపు సోపానముల్ దీర్చిన వాడు పై రెండు విషయాల్ని తెలిపేవి క్రింది ద్విపదలు

".. ప్రకటింప నొప్పు శ్రీపర్వతేంద్రంబు
ఉర్వి దత్పర్వత సార్వభౌమునకుఁ
బూర్వవక్త్రాంక విస్ఫురణఁ దొల్కాఁడ
నొలసి కుమార శైలోత్తంస లీల
దిలకించి పెంపారుఁ ద్రిపురాంతకంబు
తత్త్రిపురాంతక స్థానవాస్తవ్యుఁ
డై త్రిపురాంతకుం డభినుతిఁజేస్తు" (ప్ర 38-44)
".. నోలిమై గ్రామసీమాలంఘన ప్ర
తాలంకృతిని వేర్చి యాచారలీల
యసలారఁగా గుమారాద్రికిఁ దూర్పు
దెసను సోపానముల్ దీర్చి పొల్పార
మహిత సద్భక్తి సమంచిత వృత్తి
"మహిఁ జను రెంటాల మల్లినాథుఁడును" (ప్ర 69-74)

క్షీరారామం పాలకొల్లుకు సంస్కృత రూపం సరసాపురం తాలూకా, పశ్చిమగోదావరి జిల్లాలో ఉంది పంచారామాల్లో ఒకటి[18] క్షీరారామంలో విష్ణుడు రామేశ్వరుని కొలిచినాడు "ఆది క్షీరారామమందు విష్ణుండు గాదె రామేశ్వరుఁగడునర్థి కొలిచె" (ష 1867-8) అని బసవని వాక్కులు

దక్షారామం దక్షిణ కాశిగా ప్రసిద్ధి చెందిన శివక్షేత్రం ద్వాదశ జ్యోతిర్లింగాల్లో భీమేశ్వర లింగం ఒకటి. తూర్పుగోదావరి జిల్లా రామచంద్రాపురం తాలూకాలో ఉంది దక్షుడిక్కడ మహాక్రతువు వేయబట్టి దక్షపురి, దక్షవాటిక అయింది [19]

ముగ్ధసంగయ్యతో వేశ్య తమ గురు సంప్రదాయం వారు దక్షారామంలో సాక్షాజ్జగదంబాసమానలు కలరంటుంది చమత్కారంగా "అఖిల సాక్షాజ్జగదంబా సమాన లధికంబు గలరు దక్షారామమునను" (త్ర 345-6) అని ఆమె పలుకులు

"పీర వాడవ్వ దాక్షారామమునను" ఉంటుంది దాసితో పులగం పంపిస్తుంది భీమేశుడు గ్రహించి, ఆరగించి పాత్రను క్రిందికి శబ్దం వచ్చేటట్లు, అందరూ చూడగా గుడి వెలికి విసిరేస్తాడు (పం 1239-49)

దాయలు తమకు మడిగూటి వృత్తి అనేక శివస్థలాలలో కులవృత్తిగా ఉంది అంటాడు బసవనితో ఆ శివక్షేత్రాలలో దాక్షారామంకూడా ఉంది

వారణాసి గయఁ గేదారంబునందు
సౌరాష్ట్రమునను దక్షారామమునను
శ్రీగిరియందును ....... . (స 1131-33)

అన్నవి బోయల మాటలు

2 3 4 5 పరమ శివుని వాహనమయిన నందీశ్వరుని పవిత్ర్యాన్ని కర్నూలు మండలంలో అనేక గ్రామాలు చాటుతున్నాయి నందిపాడు (కోయిలకుంట్ల తాలూకా), నందికొట్కూరు, నందికుంట (నందికొట్కూరు తాలూకా), నంద్యాల నందిపల్లె, మహానంది (నంద్యాల తాలూకా), నందివర్గం (బనగానపల్లి తాలూకా 20 లాంటివి నందీశ్వరుడు తపంచేసిన పావనస్థలంకాబట్టి శ్రీగిరి నైఋతిభాగానికి నందిమండలం అనే పేరు వచ్చింది

" యేచిన భీతివోఁ జూచిన యట్లు
శ్రీగిరి నైర్ఋత్యభాగంబు పుణ్య
భాగమా క్షేత్రంబు పరమపావనము
నందికేశ్వరుని పుణ్యతపంబుచేత
'నందిమండల' మను నామంబు దాల్చె " (ప 486-90)

2 3 4 6 పుష్పగిరి శ్రీశైల క్షేత్రానికి నైరుతి ద్వారం కడపజిల్లా సిద్ధవటం తాలూకాలో పెన్నానదీ తీరాన ఉంది "ప్రసూనాకర" మని దీనికి మరో పేరు[21] ఇక్కడ ఇంద్రుడు ఇంద్రేశ్వరస్వామిని ప్రతిష్ఠించి సదా కొలుస్తుంటాడు "ఇంద్రుఁడు పుష్పగిరీంద్రంబు మీద నింద్రేశునిఁడి కాదె యెప్పుడుఁగొలుచు" (ష 1873-74)

2 3 4 7 శ్రీకాళహస్తి 'దక్షిణ కైలాసం' గా శివ భక్తుల పూజలందు కుంటున్నది భారతదేశంలో ఉండే పంచభూత లింగాలలో కాళహస్తీశ్వర లింగం 'వాయులింగం'[22]

శ్రీకాళహస్తి అడవిలో ఉడుమూరి కన్నప్పడు ఉండేవాడు అతడు తన ముగ్ధ భక్తితో శివున్ని ఎలా ప్రసన్నం చేసుకొన్నదీ రమణీయంగా వివరించే ఉడుమూరి కన్నప్ప కథ బసవపురాణంలో తృతీయాశ్వాసంలో 1245 నుండి 1786 పాదాలదాకా మనోరంజకంగా వర్ణితమైంది ఈ కథలో శ్రీకాళహస్తి ప్రశంస, మొగిలేరు ప్రసక్తి ఉంది

" శ్రీకాళహస్తిగిరి ప్రదేశమున శ్రీపంచ భక్తుండు.. ..
ఉడుమూరి కన్నప్పఁడు.... . అడవికి వేట " వెళ్తాడు

అతనికి శివలింగం కన్పిస్తుంది "స్వామీ ! ఒంటిగా అడవిలో ఎందుకుంటావ్ నాతో పాటు రా ! మా పల్లెకు వస్తే సకల సౌకర్యాలు కల్పిస్తాం అని బ్రతిమాలాడతాడు. మృగాలను వధించి కఱకుట్లు తెస్తాడు ఆ మృగాలు పూర్వజన్మలో రాక్షసులు శివునికి ఆహారమయేందుకు ఆ మహాదేవునే కోరి మృగాలైనారు శ్రీకంఠుడు వారితో "ధరఁ గాళహస్తి భూధర సమీపమున మృగములై పుట్టుఁడు ...మిమ్మారగించెదను" అని వరమిస్తాడు (తృ 1361-66)

శ్రీకాళహస్తికి పడమట, ఆగ్నేయదిశల్లో కాళహస్తీశ్వరుని ఆలయం ప్రక్కనే ప్రవహిస్తుంది స్వర్ణముఖి పూర్వం ఈ నదికి ఇరువైపులా మొగలి పొదలు దట్టంగా ఉండటం చేతనే మొగలేఱు అని పేరు వచ్చి ఉంటుంది 23

కన్నప్పడు ఆ ఏటి నిర్మలోదకాన్ని రెండు పుక్కిళ్ళబట్టి తెచ్చి శివునికి మజ్జనం చేయిస్తాడు

చక్కని మొగలేటి నదములోదకము
లక్కజంబైన రెండు పుక్కిళ్లబట్టి
.........

పుక్కిట నీట పూనుగా శివునకు మజ్జనం బార్చి (తృ 1380-96)

పూర్వం ఏనుగు ఒకటి "మొగలేటి నిర్మలాంబువుల నభిషేకమార్చి కలువల నచ్చ చామరల నిచ్చలు బూన్చుచు.. త్రికాలంబు" పాటల లోచూని కొలుస్తుండేది

( తృ 1141-46 )

బసవయ్య చెన్నబసవయ్యతో కన్నప్ప నేటికీ స్వామిని ఎదుటే ఉండి పూజిస్తున్నాడు "అన్యోన్య వీక్షణానంద కలితాత్ములై తిరుకాళత్తిపురిని కన్నప్పదేవుఁడు గౌరీశ్వరుండు సన్నిరీక్షణ లీలనున్నవారిపుడు" అని చెపుతాడు. స్వామి, భక్తుల సంబంధం చిరంజీవంగదా మరి శ్రీకాళహస్తికి తిరుకాళత్తి తమిళనామమై ఉండవచ్చు

2 3 4 8 సంగమేశ్వరం శ్రీశైలక్షేత్రానికి వాయవ్య ద్వారం ఏడు నదులు కలుస్తున్నందున ఇది సంగమ క్షేత్రం అయింది బసవడు జన్మిస్తూనే శివుడు ఒక తపసిలా వచ్చి చూచి మాదాంబతో తానెవరయిందీ ఇలా చెపుతాడు

" ఇల్లకప్పడి సంగమేశ్వరంబందు
వెల్లప్పుడును నున్కి యెట్టులంటేని
యేను కూడలి సంగమేశ్వరు పేర
కాన యా గుడిలోనఁ గదలకుండుదును " (ప్ర 779-782)

... ... ...

కూడలి త్రిపురాంతకుని కొల్వువారు (ద్వి 144)

... ... ...

కూడలి సంగయకొలువు వర్తకులు (ద్వి 250)

బసవని తోడ వచ్చినారు

సంగమేశ్వరంలోని శివలింగానికి కప్పడి సంగమేశ్వరుడని వ్యవహారం. కప్పడి అంటే జీర్ణవస్త్రాలు ధరించే పరివ్రాజకుడని అర్థం.

2 3 1 9 గొబ్బూరు కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాలో ఉంది. గొబ్బూరివిభుడు సంగనామాత్యుడు పరమ శివాచారపథవర్తనుడు సోమన రచించే బసవ పురాణానికి శ్రోత గొబ్బూరి విభుడు (ప్ర ఆ), గొబ్బూరి సంగ (ద్వి ఆ) గొబ్బూరి మాదన్న కూరిమి శిష్య గొబ్బూరి సంగసద్గుణసముత్తుంగ (స ఆ) అని ప్రశంసింపబడినాడు

2 3 4 10 రెంటాల మల్లినాథుడు కుమారాద్రికి తూర్పువైపు సోపానాలు తీర్చిన భక్తుడు ఈ భక్తుని ఇంటి పేరైన రెంటాల గ్రామం గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో ఉంది ఇక్కడ పార్వతీ భీమేశ్వర స్వామి ఆలయం ఉంది

2 3 5 పండితారాధ్య చరిత్ర పాల్కురికి సోమన రచించిన ఐదు ప్రకరణాల బృహద్గ్రంథం అందులోని 'పర్వత ప్రకరణం' పూర్తిగా శ్రీశైలాన్ని సూక్ష్మ సందర్శనాంశాలతో వర్ణించేది

2 3 5 1 శ్రీగిరీంద్రం దక్షిణ కైలాసం అనుపమప్రమథగణస్థానం మునుల, ముముక్షుల మూలబండరువు కవి శ్రీశైల పావిత్ర్యాన్ని, మహిమను, స్తుతించిన విధం కమనీయం పవిత్ర సుందరం ఈ ద్విపదల్ని విత్తగించండి.

" కరమొప్పు దక్షిణ కైలాసమనఁగఁ
జను సర్వపర్వత సార్వభౌమాద్య

తను చేప్పు శ్రీగిరీంద్రంబు దానదియు
ననుపమ ప్రమథగణాస్థానవేది
మునుల ముముక్షుల మూలబండపుప్పు
బాగొందఁ బర్వతు పండిన తపము
ప్రోగైన మూర్తి, శంభుని యశోరాశి
గరువు గట్టిన మహాకారంబు, ప్రతుల
శిరము, ఘనీభవించిన పరంజ్యోతి
పెంపుఁగని పుణ్యంబు.. ...
. .... భక్తవరుల యిల్వేల్పు
సలనంబు లేని విజ్ఞానాబ్ధి కడలు
భృతి ముద్దగించిన దివ్యామృతంబు
లతగరి గొన్న మూలస్తంభమనఁగఁ
జెలువారునట్టి యా శ్రీశైల శిఖర
కలిత త్రిలోక విఖ్యాత యశః ప్ర
పూర్తియౌ శ్రీస్వయంభూలింగ చక్ర
వర్తి, యసమకీర్తి వారిత నతజ
నార్తి, శ్రీమల్లికార్జున లింగ
మూర్తి యొప్పారు సమున్నత మహిమ" (దీక్షా పు 8-9)

శ్రీమల్లికార్జున భక్తి పట్టభద్రులును, శ్రీపర్వత క్షేత్రవాసులు, యహమ్మ కైలాస చూడా విభాసిత కీర్తి విభ్రాజిత మణులు.. " ( దీక్షా పు 9-10 ) అయిన "మాసితాసంఖ్యాత మహేశ్వరులు . ...శ్రీమల్లికార్జున దేవు పరు మంటప స్థలి నొడ్డోలగమున శివభక్తి తత్త్వగోష్ఠీ ప్రసంగమునడపెలి" నవారు ( దీక్షా పు 10 ) "పినులారంగ గురుమల్లికార్జున పండితారాధ్యుల పవిత్ర వృత్తం వర్ణింపు" ( దీక్షా పు 12 ) మని పాల్కురికి సోమనతో సెలవిస్తారు

భీమన పండితుడు శ్రీగిరిమల్లికార్జునుని సన్నిధి కొంత పురశ్చరణ గావింపు చున్నవాడు పండితుడు అతనికి ఉపింబిస్తాడు ( దీక్షా పు 28 ) "శ్రీశైల మల్లికార్జునదేవు మహనీయ నామముగుటఁబండిత మల్లికార్జున" డైనాడు (దీక్షా పు 28)

'కళియంబ' అనే గణనాధుడుండేవాడు అతడు జంగమార్చన చేసే సమయంలో అతని బానిస కొడుకు పాదాలు నాచినాడు కళియంబ వాని పాదాలు కడిగి

నాడు మన బానిసకొడుకు మల్లదే ఓడు సీకేమైనా వెఱ్ఱా విని కాళ్ల కడగడానికి అంటుందా భక్తుని భార్య "మల్లఁడే శ్రీగిరి మల్లండుగాక" అని బాడితతో ఆమె చేతులు మణికట్టుదాకా తెగనరికినాడు ( పురా 276-285 )

ఓహిళుడు వృద్ధుడయ్యేంతవరకు తుంగభద్రోదకములతో వులిగర సోమేశ్వరుని అభిషేకిస్తూ సద్భక్తితో అర్చిస్తుంటాడు. తొంభైఏండ్ల వృద్ధుడై కూడా నీరు తెస్తూ కాలువ దాటగా ఓపు విరిగింది ప్రాణముండగా వ్రతం మానలేనని కదలనుంకించినాడు "వెసఁజెంతల లోన విహరింపవచ్చి మసలిన శ్రీగిరి మల్లికార్జునుఁడో" అన్నట్లు స్వామి ప్రత్యక్షమైనాడు ( పురా పు 371 )

" శ్రీగిరి వీరశంకరుడు మండెడు పెనముపై నుండి కొలుచును.. " అయినా కూడా "ఆత్మకమల సౌరభము కమరలేదు" (పురా పు 399)

విష్ణువు శ్రీశైలంలో ఉండే ఆవాహన తీర్థానికి వస్తూ పోతుండేవాడు "మును నృసింహావతారమున సదమల ప్రీతి శ్రీశైలంబుఁ బొందఁదివురు నావాహన తీర్థంబునందు" (వాద పు 640) అని పండితుని పలుకులు

పండితుని శిష్యులు బౌద్ధుని చంపినారు పండితుడు తానే వెలనాటి చోడడు వేసిన దండనను స్వీకరిస్తాడు గోర్గొండితో కన్నులు పెరికి పళ్లెంలో పెట్టి ఇస్తాడు శ్రీగిరి స్వామి మహిమచే కండ్లు వస్తాయి ఇదే కాదు ఇంకో దానకూడా చేస్తాను శ్రీగిరిని "నయనాద్రి" అంటారు మల్లికార్జునుడు నయనాద్రి దేవుడు కన్నులు అర్పిస్తే తిరిగి కన్నులిస్తాడు ఒకకన్ను పెరికి ఇంకొకన్ను పెరికేలోగానే మొదటి కన్ను వస్తుంది చూడండి "నా ప్రతిజ్ఞ" అంటాడు పండితుడు గొల్లవాడు చేతి దుడ్డులా పారవైచి స్వామికి నేత్రాలిచ్చి, మళ్ళీ పొంది గొర్రెల కాయడానికి తిరిగి వెళ్తుంటాడు ఇతరుల విషయం చెప్పేదెల ? వీక్షించండి ఈ ద్విపదల్లో

" శ్రీ గిరిపంతంట శ్రీగిరి యంట
యోగమోక్షంబు ప్రత్యక్షంబు చూడ
నయనాద్రి యది మల్లినాథ దేవుండు
నయనాద్రి నాధుండు నా సర్వజనులు
దడయక నేత్రముల్ ద్రవ్వి తండములు
వడయుట యిచ్చుట ప్రఖ్యాతి గాదె
యిల గొల్లఁడైన గొఱ్ఱెల( గాచి కాచి

యలరుచుఁ జెతి దుడ్డటు వాలువైచి
యరిగి నేత్రములిచ్చి యప్పుడ పడసి
యరుగు గొత్తెల గాిన నంతవాఁడనీస
నితరుల ( జెప్పంగనేల శ్రీశైల
పతి మహాదానసంపద యెట్లు సెప్ప (మహిమ పు 39–40)

గంగళదేవయ్య అనే భక్తుడు "పరుసతోఁదాను శ్రీపర్వతంపేగి కన్నులు వుచ్చిత్రికంటఁ బూజించి, కన్నులు వడసి " ఆ క్షణమే తన ఊరికి తిరిగి వచ్చినాడు అబద్ధమన్నాడు కొందరు. ఒక పిల్లిని తెప్పించి సభామధ్యంలో దాని కండ్లు తీయించి శివునితో తెప్పించినాడు మళ్లీ ఆ దేవణ్ణ (మహిమ. పు 116–7).

పండితయ్య బసవని దర్శనార్థం కన్నడ దేశం వెళ్లాడు అతని నిర్యాణం దార్లోనే విని, తిరిగి వస్తూ శ్రీశైలం చూస్తాడు ఈ అంశం పర్వత ప్రకరణం అనిలోనే ఉంది ఈ సందర్భంలో సోమన శ్రీనగాన్ని సముద్రంలో పోల్చి రూపకాలంకార సమన్వితంగా వర్ణించిన తీరు అతిలోకం అనన్య సాధ్యం

" కడ లెని నిర్మల గాఢమహత్త్వ
జడతాపహార విస్తారోదకముల
నంగీకృతాయతోత్తుంగ శృంగౌఘ
మంగళరంగత్తరంగ సంఘముల
స్థిరగిరి పార్శ్వనదీ ప్రవాహ ప్ర
సర తదియ్యద్వీప చారు మార్గములఁ
బరమ నైష్ఠికశైవ పాశుపతాది
చిరతపోధన మహాపురుష రత్నముల

. ... .. ...

వెలమిఁ ద్రింశద్యోజనేతరభూమిఁ
జెలియలికట్టయన్ సమాస్థలమున
మానింతపై యిట్లు శ్రీనగాంభోధి
గానంగనొప్పె ముంగలన్ ... . " (పర్వత 228–9)

భక్తునికి దైవం పెక్కు రూపాలలో గోచరించినట్లు పండితునికి శ్రీశైలం నీల

మేఘంగాకూడా దృగ్గోచరమైంది "అసురారు శ్రీనగంబను నీలమేఘమసమానమై యొప్పెను" (పర్వత 229-31)

అంతేకాదు-శ్రీశైలం పరమ శివుని మూర్తిగా ఆ భక్తుని ఎదుట రూపుగట్టిన విధం కవి మనోహర భావనావైచిత్ర్య దృశ్యం

" పృథుతరంబై యొప్పు పృథ్వి పీఠముగఁ
ప్రథితాంబరము దివ్య ఫల్యలింగముగఁ
గ్రన్న దిక్చయము మెఖలముగా దిశలు,
ప్రన్నని దివ్యాంబరంబులు గాఁగఁ
బొలువారు నక్షత్రములు పుష్పములుగ
నలరు సూర్యేందు లుద్యద్దీపములుగ
వెలయఁదత్త్వాతీత నిత్య చిన్మూర్తిఁ
గొలులు జటాజూట కోటీరములుగను
నరుదగు సూక్ష్మ తత్త్వాకారుఁడైన
వాడగనంబున నున్న హాలాహలంబు
నీలిమం దోచిన లిలఁబర్వతుని
నీల వర్ణాకృతి నేత్ర పర్వముగ"

దరి నమిచ్చింది పండితునికి.

వింధ్యాద్రి, మందర నగం, కైలాస శైలం, మేరువు, మైనాకం, మాల్యవంతర్వ, హిమవన్నగం, ఉదయాద్రి, అస్తాద్రి, మలయాద్రి, మానసోత్తరగిరి, ఇంద్రకీలం, రోహణనగం, గంధమాదనం, కలపర్వతాలు, పదటికొండలు - వీటికేదో ఒక లోపం ఉంది. శ్రీశైలానికి ఏనాడూ, వీలోపమూ లేదు "నాడు నేడనకెల్ల నాడు నేనాడుఁ వాదిగా భంగంబు పొందని యట్టి పొగడిక నెగడు శ్రీనగసాల్యబౌము ఁబొగడరే వ్రతపతుల్" అని ప్రబోధిస్తాడు పండితుడు ( పర్వత పు 232-234 )

కామ్యార్థసిద్ధి, భోగ మోక్ష సుఖాభివృద్ధి "శ్రీనగ స్పర్శవలన, శ్రీశైల భాస్వర సురతరువు వలన, శ్రీపర్వత వరకామదుఘము వలన" పొందండి అంటాడు పండితుడు పర్వత పు 234-5 )

శ్రీనగం కామధేనువు ఎలా ? కవి సమర్థనాబహుముఖ ప్రజ్ఞావైశారద్యం ఈ క్రింది ద్విపదల్లో చిత్తగించండి.

" . .. ...... . .. అవారిత భక్తి
భ్రాజిల్లు పర్వతు పటు తపఃఫలముఁ
దేజోమహత్త్వంబు దివ్యాంగ మనఁగ

సురుచిర మల్లికార్జున సముత్తుంగ
వరమహాస్థానం ఎ వదనాబ్జ మనఁగ
ఘనతర ధర్మార్థకామమోక్షములు
డనరు శ్రీపాద పద్మంబు లనంగ

జెన్నగు శృంగముప్ శృంగం...లనఁగ

దగు శ్రుతి స్మృతులు శ్రోత్రంబు లనంగ
వరచతుర్ద్వార నివాసలింగములు
సరసతనౌప్పారు చన్నులనంగఁ
దొరఁగు పుణ్యం...లందుల దుగ్ధమనఁగ
వరపరిషత్కోటి వత్సంబులనఁగ

నందితంబైన శ్రీనగ కామధేను
వందకాకెవ్వి యిష్టార్థముర్ ?" (పర్వత పు 235-6)

శ్రీనగం కల్పవృక్షం ఎలా ? కవి వాక్కులు

" పర్వతు పూర్వపుణ్యదేహంబు ఘనతరంబైన చూకటి వేరు.. .. పర్వతు నగాన్విత రూపతరువు . మొదలిదుంప కదిసిన కొంచలు కవటలు అశ్వమేధాద్రి ముఖ్యగిరులు శాఖోపశాఖలు పాలాళగంగాదినదులు . .. వెల్లిత బహువల్లరులు ... మరకతశిలలు ... .. హరిత్పత్రంబులు .. .. ప్రవాళాబ్జరాగములు చివురులు మౌక్తిక చంద్రకాంత వజ్రములు ..విరిగుత్తులు సాధకులు తేటితండములు శ్రీ స్వయంభూలింగ సిద్ధలింగములు. దివ్యఫలములు మునులు, తాపసోత్తములు శుక ప్రకరములు. నందితంబైన శ్రీనగ కల్పతరువు నంద కాకెవ్వి యిష్టార్థముల్" (పర్వత పు 236-7 ) వృక్షాంగాలన్నింటికీ పర్వతాంగాలు ఉపమానాలుగా చూపడం కవి ఊహాచాతుర్యానికి పతాక

"శ్రీపర్వత స్పర్శవేది" వలననే వాంచితార్థములు తీరతాయి (పర్వత 237-8)

సిరిగిరిని ఒక గిరి అనడానికి వీలులేదు సిరిగిరి "లింగమూర్తుల ప్రోవు మంగళత్వములెల్ల, మహిమలకెల్ల .. ప్రమథులవెది .. సురతరువులగుంపు, సురభుల సొంపు. ప్రత్యక్షకాశి . దమితేంద్రియులసీమ .. స్వర్గంబుగరసు, మోక్షంబుల వెరసు, శివయోగుల యిరవు, సిద్ధుల వెరవు . తీర్థంబుల వెల్లి ముక్తిమంతుల త్రోవ... భవసాగరము నావ. శివభక్తి శిఖరంబు శ్రీనగేంద్రంబు వరికింపనిట్టి శ్రీపర్వతంబునకు ధరణీధరములొండు దత్తుల్యమగునె ?" (పర్వత 238-40) కావు గాక కావు - పండితాది శివభక్తుల దృష్టిలో

శ్రీశైల "ఉత్తర ద్వార విభుఁడు (ఉమామహేశ్వరం - తెలంగాణ లోని మహాదేవుడు) ప్రమథులఁబంచి లోకములేర్చినాడు" ఈగిరి "తూర్పు వాకిటిజెడు (త్రిపురాంతకం లోని త్రిపురాంతకేశ్వరుడు) త్రిపురముల్ గాల్చినవాఁడు" శ్రీనగం దక్షిణ ద్వార విభుఁడు (జ్యోతియై స్నిద్ధవటం - సిద్ధవటంలోని సిద్ధవటేశ్వరుడు) పరంజ్యోతియై యెసఁగినవాఁడు" శ్రీగిరి పశ్చిమ ద్వార విభుఁడు (అలంపురంలోని బాలబ్రహ్మేశ్వరుడు) బ్రహ్మల బుట్టించినవాడు "శ్రీశైలంలోని మల్లికార్జునుఁడు వర లింగముల చక్రవర్తి యైనాఁడు" (పర్వత 242-3).

శివుని సద్యోజాత వదనం "బ్రహ్మేశ్వర" మనే పేర్తో పడమట దిక్కున, వామదేవవదనం "మహేశ్వర" మనే పేర్తో ఉత్తరాన, అఘోర వక్త్రం "జ్యోతిస్సిద్ధ వటునాధుఁ"డనే పేర్తో దక్షిణాన, తత్పురుషవక్త్రం "త్రిపురాంతకం" అనే పేర్తో తూర్పున, ఈశానవక్త్రం "మల్లికార్జునం" అనే పేర్తో ఊర్ధ్వదిక్కున సముద్భవమైనాయి (పర్వత పు 283)

"సారమేయ మార్జాల. క్రిమి, కీట, కాక, భుజంగ ముఖ్యాలు శ్రీగిరి నొండె గాదెనిఁగైలాసమున నొండెఁగాని వర్తింపవు" "శ్రీగిరి మహిమావలంబనము వనజజునకునైన వర్ణింప" వశముగాదు "భువి ధరించిన యట్టి భూధరేంద్రములు శివు ధరించినయట్టి సిరిగిరి"కి సరి కావు (పర్వత పు 244)

"పండితయ్య చూడ్కులను . శ్రీశైల మంతయు దివ్యలింగ స్వరూపమై లీల" వెలిగినది (పర్వత పు 244) "సిద్ధరామయ్యకు శ్రీగిరీశ్వరుడు పద్దలింగాకృతి" శోభిల్లినాడు (పర్వత పు 245)

"శ్రీలింగమూర్తియై శివుండు పర్వతు విశాల శిరస్థలి సంధిల్లునట్లు" భావించిన పండితయ్య "శ్రీనగము సాక్షాల్లింగమనుచు అభిరమ్య లీలనొప్పారు శ్రీగిరికి" అభిముఖుడై కనుల పండువుగా దర్శిస్తూ, దోనమరాజును "శ్రీగిరి మల్లికార్జునదేవు చరణాంబుజములు భజింపు, శివరాత్రి యప్పురిఁబెల్లింపు నియతి.. ప్రదక్షిణముగా నీ పర్వతంబు వలగొని మహావ్రత సమాప్తంబు గావింపు"మని నియోగిస్తాడు దోనమరాజు శ్రీపర్వతం పుట్టుపూర్వోత్తరాలను తెలుపమన్నాడు (పర్వత పు 246 9)

పండితయ్య "శ్రీగిరి మహిమఁదా శేషునకైన, వాగీశ్వరునకైన, వాణికినైన.. శ్రీ పర్వతుఁగన్న శిలాదునకు" అయిన చెప్పశక్యంగాదు - ఆ సిలగళునికి తప్ప "నాసేర్చు భంగి శ్రీనగ మహత్త్వంబు వర్ణింతును" అని ఇలా చెప్తాడు (పర్వత 253-4)

శిలాదుడు ముక్కంటిని మెప్పించి ముగ్గురు కొడుకులను పొందినాడు వారిలో నందికేశ్వరుడు ప్రమథేశ్వరుడైనాడు మహాతపోనిధి పర్వతుని కన్నాడు పర్వతుడు పరమశివుని "మన్మస్తకదివ్యపీఠమున శ్రీ స్వయంభూలింగరూపమవధరించుటకు... వేడితి స్వామి నిఖిలధారుణిఁ గలుగు తీర్థంబులు, నదులు, మూర్తిమంతంబులై మెనసి నామీద వర్తింపుచుండెడు వరమిమ్ము" అని వరం వేడినాడు అతడు "పర్వతాకారు"డైనాడు శివుడు "తత్పర్వతోత్తుంగ శృంగోత్తమాంగ ప్రసిద్ధ పీఠమున శ్రీస్వయంభూ లింగమూర్తిగా" అవతరించినాడు ( పర్వత 254-67 )

ఆ స్వయంభూ దివ్యలింగం "శ్రీశైల భర్మవార్యాగ్ర ఖచిత మాణిక్యోరు కలశవిభూతి సప్పర్వతాగ్ర శృంగైక మధ్యమున" ఒప్పినది ( పర్వత పు 268) శ్రీగిరి "ప్రత్యక్షకైలాస" మని శ్రీరుద్రగణాధిపు లలరినారు ( పర్వత పు 269)

కేదారక్షేత్రంలో అతిక్లేశంతో మంచినీరు తాగితేనే ముక్తి వారణాసిలో చస్తేనే ముక్తి "అఖిల మానవుల కెల్లైన శ్రీశైల శిఖర దర్శనమాత్ర సిద్ధించు ముక్తి". వారణాసిలో లక్షమందికి, గయలో రెండు లక్షల మందికి, కేదారంలో మూడులక్షల మందికి, మిగతా తీర్థాల్లో ఒక్కొక్క కోటి మందికి బ్రాహ్మణులకు అన్నదానం చేస్తే వచ్చేఫలం "శ్రీగిరి యందొక్క జమ్మియాకు పట్టెడునంత యన్నము యొక్కనికి దానంబు" చేస్తేనే వస్తుంది (పర్వత 279-80)

శ్రీశైలానికి వచ్చే వివిధదేశాల వరుస జనులు "గిరిదర్శనము ముక్తికిని హేతు" వని "గిరి సమస్తంబును హరమూర్తి" అని స్తుతిస్తుంటారు

"శ్రీపర్వతా వాసు .. శ్రీమల్లికార్జున దేవు దర్శించి హర్షించి" శ్రీగిరీశ్వరు నకు మ్రొక్కి "శ్రీనగోత్తుంగ నిలయపుత్రుడని" దర్శించి "మల్లయ్య రక్షించు మాపర్వతంబు మల్లుమీరుచును మగుడెడివాడ "ను ఉన్నాడ

పరిమళ ప్రభలు "శ్రీపర్వతు ముంప" గా . . "శ్రీపర్వతునకు నివాళింప దీపవృక్షంబు లేతెంచు భావమునఁగ్రాలుచు నోలుచు గతినాడు వారు" (పర్వత పు 409) ఉన్నారు

"శివలింగమయమగు శ్రీగిరి యెక్కుట అవినీతి" యని, ఎక్కిన అంఘ్రులు నోకు ననుకున్నాడు పండితుడు సంసారమనే ఇంద్రజాలం నేను భరించలేను "శ్రీశైల వల్లభ బసవనయు నీ గర్భవాసంబుఁజొచ్చె దేవా పర్వతేంద్ర! నా నుదుట నీ పద పద్మాలు ధరించి" ఉంటాను "ని గర్భంబులోనఁ జొరనీవె నన్ను నీపురి యగుచున్న సిరిగిరి నుండెడ శివశరణు" అంటూ స్వామిని ప్రార్థించినాడు పండితయ్య పండితుని సతీసుత సమేతంగా లింగోదరంలో లీనం చేసుకున్నాడు ఆ శ్రీగిరి నివాసుడు (పర్వత 543 – 549)

శ్రీగిరి మల్లికార్జునుని "పర్వత నాథు" డుగా సంబోధించడం ఉంది నాటి ప్రజల వ్యవహారంలో "ప్రబ్బతనాథుడు" అనే ప్రయోగం ఉన్నట్లు పండితారాధ్య చరిత్రలో రెండు చోట్లు మనకు సాక్ష్యమిస్తాయి

ఉదయాత్పూర్వ సమయాన్ని 'ప్రబ్బతనాథ! ప్రబ్బతనాథ! యనుచు నుచ్చి నీర్కోళ్లు గూయుచుఁగక యున్న" అని కవి వర్ణిస్తాడు (పురా పు 262)

కొంతమంది మాటలు విని మెండిచెతుల "మల్లలింగం" జంగం వేషంలో వచ్చి, దసరయ్యను పరీక్షించి పశ్చాత్తప్తుడై, "ఓ దసరయగారు! యోదసరయలింగ! నన్ను నీవెఱుఁగవె మొండి మల్లలింగంబంద్రడు మహినట్లు గాక నచ్చిన ప్రబ్బత నాథుని కొడుక" అని దసరయ్యకు శరణు వెడ్తాడు (పురా పు 300)

శ్రీశైలపురాన్ని పాల్కురికి సోమన వర్ణించిన తీరు భక్తజన హృదయంగమం పవిత్ర సుందరం

శ్రీశైలపురం శ్రీగిరి ఉత్తుంగ శిఖరాలతో, దేవభవనాలతో, మెతల గుంపులతో, సందిచివ్వాం ఉండే జెండాలతో, మణి తోరణాలతో, జంగమ లింగాలతో, గణభవ నాలతో, వాద్య ఘోషాలతో, సారంగేశ్వరము, హాటకేశ్వరము, పాపవినాశనము,

కిన్నరేశ్వరము, వారాహేశ్వరము, సిద్ధేశ్వరము, మొదలైన ఈశ్వర స్థానాలముందు తీర్చిన ముగ్గులతో సొంపుగా ఉంది (పర్వత పు 427)

"ప్రమథమందిరము సద్భక్తి భాస్వరము. భంగురేతరము శ్రీపర్వతపురము అభినవకైలాస మాపురవరము శ్రీశైలవిభు సదా విహరణ పరము అనదగు శ్రీమల్లికార్జునపురము శ్రీకరంబై జగత్సేవ్యమై" ఉండగా చూచి పరుసజనులు జేజేలుపలికినారు (పర్వత 393-5)

వివిధ దేశాల పరుసలు శివరాత్రి వెళ్లించడానికి వివిధ దేశాలనుండి శ్రీశైలానికి ప్రజలు వస్తున్నారు ఆంధ్ర, కర్ణాటక, తమిళ, మహారాష్ట్ర, ఇత్యాది దేశాలనుండి వస్తున్న జంగముల నడకలు, శీలవంతుల నడకలు, శివయోగుల నడకలు, అభ్యాస యోగుల నడకలు, పుణ్యాంగనల నడకలు, భోగుల నడకలు, పిచ్చుకుంటుల నడకలు, చెంమధర్మాత్ముల నడకలు విపులాతి విపులంగా పాల్కురికి సోమన వర్ణించినాడు (పర్వత పు 306-389)

"శ్రీశైలంబు మీద సరసర దీర్ఘముగ సరియించునట్లు" వృద్ధతపోధనులు నడిచినారట కొందరు అడుగడుగుదండాలవారు "శ్రీశైలయాత్రాఫలంబునకుం దనువులే భువి మానదండంబులుగను ..సాష్టాంగ దండప్రమాణములు సేయుచు" వచ్చినారట

ముందుకు సాగగా హృదయభంగపర్వతం, కనక పర్వతం, నక్షత్రపర్వతం గవ్య పర్వతావళులు దర్శనమిచ్చినాయి వాటి నడుమ చంద్రవతి శివునికి సమర్పించిన మల్లికా మాల వలె కనిపించే (పాతాళ) గంగను సందర్శించినారు పరుసజనాలు

"గిరి తుట్టతుద నుండి క్రిందు చూడంగ నరుగ లోకముగాడి యునికికి బెగడి వందల హృదయముల్ భంగము'' నొందుతాయట అందులకె అది "హృద్భంగశైల'' మయింది ఆ కొండెక్కి దిగినారు

తర్వాతది నక్షత్ర పర్వతం ఆకాశాన్నంటే శిఖరాలతో ఉంది నిట్టనిలువుగా ఉండే మెట్లెక్కలేక "స్వామీ మమ్మల్ని పైకి చేదుకో'' అని ప్రార్థిస్తూ పైకెక్కినారు "చేదుకో, చేదుకో, శ్రీగిరినాథ, చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచుఁ జేదుకో చేదుకో శ్రీశైల నిలయ " అని భక్తులు ఆర్తితో కేకలు వేసినారు హరుకృపలేకపోతే "నక్షత్ర పర్వతము నావంత' అయినా ఎక్కలేము అనుకున్నారు "నక్షత్ర

పర్వతము ఏట్టుగలగ సిరిగిరిఁబాడుచు'' అఖిల దేశముల పరుస ఆనందంగా ముందుకు సాగింది ( పర్వత పు 368 ).

"సిరిగిరి మల్లన్న శరణన్నఁగాలు" అని ఆంధ్రదేశపు పరుస ( పర్వత 374) "సిరిగిరి ఋదునిమ్మ సిరిగిరల్లయ్య'' అని కన్నడదేశపు పరుస (పర్వత 376) "చిరిగిరి నిలయనే చివనె యాణ్డవనె" అని అరవ దేశ పరుస (పర్వత ౨88), "సిరి గిరి మల్లయ్య చరమది యంత.. మఖరచె సిరిగిరి మల్లయ్యరాణ" అని ఆరెదేశపు పరుస జనులు ( పర్వత పు 381 ), "పథకర శ్రీశైల చూడాకరాయ" అని గీర్వాణభాషలోను ( పర్వత పు 389 ), మాళవ కాశ్మీర మాగధ సింధు గౌళ తురుష్క కొంకణ సౌరసేన బంగాళ కాంభోజ పాండ్య ఘూర్జర, కళింగ బర్బర సింహళ కరహాట ప్రశస్త దేశములవారు సహజ భాషలను యొండొరులలో మాట లాడుచును "శ్రీగిరిఁబ్రణుతిసేయుచును" శ్రీశైల పర్వతాన్ని అధిరోహించినారు ( పర్వత పు 391 )

"ముల్లోకములలో సమున్నతి కెక్కు సచరాచరములు శ్రీశైలంబు ఏది సచరాచరాదుల చాడ్పునఁగొలువ .. మల్లికార్జున దేవు నాస్థానము" విలసిల్లింది. శివ రాత్రి పర్వం చెల్లింది వారి 'శివరాత్రులు' లెల్లవారినట్లు భక్తుల తెల్లవారింది పరుసజనాలు 'పాతాళ గంగ' లో స్నానమాడను వెళ్ళినారు కొంతమంది "శిఖ రేశ్వరానికి" వెళ్ళినారు కొంతమంది స్వస్థలాలకు వెళ్ళిపోయినారు మరికొంత మంది "పంచరాత్రంబుల్కి సాలునొప్ప శ్రీగిరినంచు" ఉండిపోయినారు

శ్రీశైలంలో ఉండే తీర్థాలను పాల్కురికి సోమన విస్తృతంగా వర్ణించినాడు వాటి విషయం కొంత

పాతాళ గంగ శ్రీ మల్లికార్జున ఆలయానికి మూడుమైళ్ళ దూరంలో ఉండే పాతాళ గంగ అతి పవిత్రమైంది రొమ్మిదివందల మెట్లుదిగి ఈ గంగలో స్నాన మాడి, భక్తులు అభిషేక జలం లెచ్చుకుంటారు ఈ మార్గంలో ఉండే శ్రీకృష్ణదేవ రాయలు కట్టించిన మంటపాల నుండి వీక్షిస్తే బ్రహ్మ రుద్ర విష్ణు గిరుల మధ్యనుంచి ప్రవహించే కృష్ణవేణీ నది మనోహరంగా అగుపిస్తుంది24

ఆంధ్ర దేశం పరుస జనులు ముందుకు సాగుతూ 'సిరిగిరి మల్లన్న శరణు అంటేనే "పాతాళగంగా" ప్రవాహాన్ని చూడగలుగుతాం అనుకుంటారు.

శివుని శ్రీచరణాన పుట్టి పాతాళంలో భోగవతి అయింది స్వామి పూసిన బూదిలో పుట్టి మర్త్యలోకంలో భాగీరథి అయింది. శివుని జటలో పుట్టి స్వర్గ లోకంలో మందాకిని అయింది "ధర స్వర్గ మర్త్య పాతాళగంగా ప్రవర సంగమంబు శ్రీశైల చూడమునఁ బ్రకటితంబగు చున్కిఁబాతాళగంగ సకల తీర్థఫల ప్రసాదిత మహిమఁ దా వెలుంగుచు" ఉంది "స్మృతి దర్శన స్పర్శనావగాహన పూరణాదులవలన సాలోక్య, సామీప్య, సారూప్య ముక్తులో లిఁకాలి"నది (పర్వత పు 410) "భాగీరథి గంగాది నదులు పాతాళ గంగానుబంధమై" కొలుస్తున్నవి శివరాత్రి చెల్లించిన భక్తులు ఎల్ల వారింతర్వాత "పాతాళగంగాడఁ బాతెడు" వారైనారు

తనమీద నెలకొని ఉండే అసంఖ్యాక తీర్థకుండాలవల్ల అతిలోక పావిత్ర్యాన్ని సంతరించుకొంది శ్రీశైలం మల్లికార్జునుని దేవాలయం చుట్టూ ఉండే తీర్థాలు అమృత కుండం, మనోహర కుండం, ఘంటాతీర్థం, మల్లికాకుండం, శంఖకుండం అనేవి

అమృతకుండం గుడికి దక్షిణంవైపున ఉంది ఆ కుండం లోని తీర్థంతోనే మల్లికార్జున లింగాన్ని అభిషేకం చేస్తారు.

అమృత కుండం పక్కనే ఉండే మనోహర తీర్థం గంగా జలాన్ని కలిగి ఉందట

ఘంటాతీర్థం గుడికి వాయవ్యమూలను ఉంది మల్లికాకుండం స్వామి ఆలయానికి ఉత్తరంగా ఉంది, లింగాన్ని అభిషేకించిన నీరు ఈ కుండంలోకి ప్రవహిస్తుంది

శంఖతీర్థం గుడికి నైరుతి మూలగా ఉంది[25] శిలాదుని మనుమడు, నందికేశ్వరుని పుత్రుడు ఐన పర్వతుడు తన శిరసునే దివ్యపీఠంగా చేసుకొని నివసించమని శివుని వరం వేడతాడు

2352 గంగ, భాగీరథి ఇత్యాది ధారుణిఁగలుగు తీర్థాలు, నదులు సమస్తం మూర్తిమంతాలై తన మీద వర్తిస్తుండాలి అని కూడా కోరతాడు శివుని స్వామి అంగీకరించినాడు పర్వతుడు పలికిన నదులు, తీర్థాలు కలిసి ద్వీపపద్ల జలజలా ప్రవహిస్తాయి. భక్తుల మనోమాలిన్యాల్ని ప్రక్షాళనం చేస్తాయి

" గంగ భాగీరథి గంగ పాతాళ
గంగ భీమరథి సౌగంధిక విరజ

. ... దుంగభద్ర..... ...
..... వేత్రావతి . .. .. ,
వేగవతి .. ... ... సంద్ర
భాగ .. .. ... .
..... వేత్రవతియు . . ...
... . . పెదవతియు పక్షప్రభాస
వేణి పుష్కర కృష్ణవేణి మలాప
హరి గోదావరి యాదిగా నిఖిల
ధారుణిం గలుగు తీర్థంబులు నదులు
మూర్తిమంతంబులై మొనసి నా మీద
వర్తింపుచుండెడు వరము ఇమ్ము'' (పర్వత 266-7)

అన్నది పర్వతుని అభ్యర్థన పై ద్విపదల్లో కొన్ని ఆంధ్రదేశంలో ప్రవహించే నదులు

వెగవతి "వేగావతి" అనే పేర్తో సాలూరు తాలూకా, శ్రీకాకుళం జిల్లాలో పారుతున్న నది కావచ్చు[26] "చంద్రవంక" అనే ఇంకొక పేరు కలిగిన చంద్రభాగా నది పల్నాటి సీమలో ముఖ్యమైన నది కృష్ణానదికి ఉపనది[27] భీమరథి, తుంగభద్ర కృష్ణలో కలిసే ఉపనదులు[28] మలాపహారి నేటి గన్నవరం బెజవాడ గుడివాడ తాలూకాల్లో పారే పుల్లేరు కావచ్చు[29] వేత్రవతి తెలుగుదేశంలో నదె[30] ఎక్కడ ప్రవహిస్తున్నదీ ఇంకా పరిశీలించాల్సి ఉంది

" .. .. .. హరు ... ణమున
గండ తీర్థము సంగమంబున నొప్పు
.. .. .. . ఉత్తరంబునను
మల్లికాకుంద నామమున లోకములు
వల్లభర్వముసం పావనము సేయుచును' (పర్వత 281)

గుడి ప్రాకారానికి వెలుపల కొంచమీద ఉండే తీర్థాలలో కపాలకుండం, సారంగతీర్థం, వరాహతీర్థం, సూర్యకుండం, చంద్రకుండం, పాపనాశనం, సమాధి తీర్థం, కాలహ్రదం, దెమ్మూల్పం, గణేశతీర్థం, గరుడతీర్థం, కన్యాసిద్ధేశ్వరం, శిఖరే

శ్వరం, హాటకేశ్వరం, శక్తి గణపతి తీర్థం, సారంగతీర్థం, ఇలా అసంఖ్యాక తీర్థాలున్నాయి[31]

పై పేర్కొన్న తీర్థాల్లో కొన్ని తీర్థాలను ఇముడ్చుకొని ఈ ద్విపదలు పునీరాలయినాయి.

"దివ్యాష్టలింగ స్వరూపములు వీక్షించు జనులకు మోక్షమిచ్చుచును మోక్షేశ్వరంబన ముందఱ వెలసె హాటకేశ్వరమన నలరె యామ్యమునను, బాపవినాశన ప్రతిభ నొప్పారి వరాహేశ్వరముం గిన్నరేశ్వరమును సారంగేశ్వరమును ఘంటసిద్ధేశ్వరంబును నాఁ జెలువారి జనుల సద్దులఁ గావించుచును" (పర్వత పు 282)

"పరుస జనాలు పర్వతమెక్కి భూరి పాతక కోట్లఁ బొలియించు రుద్రధారంబువుల గృతస్నానులై, శ్రీకుబేరేశ్వర సిద్ధేశ్వరాద్యనేక లింగములు, మహేశ్వర బిలముఁ గనుగొనుచు" ముందుకు సాగినారు (పర్వత 297-299)

"పాపవినాశన ప్రతిభనొప్పారి
.. ... లింగోపకంఠమున
మల్లికాకుండ యామ్యజకుండ సలిల పల్లవి
శివుమౌళి మల్లికామాల" (పర్వత 393)

"యొక్కొక్క కోటికి నొక్కొక్కఁడులుగు నక్కజంబైన కర్మారీశ్వరమున" కోటికొక్కడు కర్మారీశ్వరంలో దుముకుతాడు విలుకాడు ఆకాశవీథిన బాణాలు పుంఖాను పుంఖాలుగా ప్రయోగిస్తే ఎడం లేకుండా ఉన్నట్లు "ఆద్యంత మధ్య బాణాసనంబట్లు.. .. పడియెడు దేహంబుఁ బడిన దేహంబు నడిమి దేహంబు లెన్నంగఁ బెక్కొడుచుండె నద్దినముల నుడుగక"

"శ్రీరుద్రపాదాభివందనము గరమర్థిఁజేసి యాకర్మారి సులుకు ననఘుల భవపరిత్యక్త మానసులఁగనుగొంచు సంభ్రమాక్రాంతాత్ములగుచు నటిమిటి నవలి కర్మారీశ్వరమున నుబుసుఁ బుణ్యులఁ జూచి యొగి నుతింపుచును" పరుసజనులు ముందుకు సాగినారు ( పర్వత 411-412 )

"కర్మహారేశ్వరం" అనే పర్వతశృంగం పైన ఒక పాము చచ్చి, కుళ్ళిపోయింది పురుగులు పడిన ఆ పాముదేహాన్ని గద్ద ఎత్తుకపోతుండగా రెండు పురు

గులు "కర్మహరీశ్వర తీర్థం"లో పది బల్లహునివంశంలో సతిపతులుగా జన్మించినాయి పూర్వజన్మ నెఱిగిన బల్లహుడు భార్యతోపాటు "శ్రీగిరికేతెంచి, మల్లికార్జునుని దర్శించి ప్రాసాదము, మండపము, బానసము, మఠము, తదంతిక మఠముగా నొక్క మఠము గల్పించి . తనయింటి బండరు ధనము తానును నతివయుఁ దక్క.. తన దేహమంతయును ఈశ్వరార్పణము గావించి. దుష్కర్మపాశబంధములు గోయవే దేవ శ్రీకంధరాధివాస యెల్లఁగాలము నిట్టి లిరువుర పడలు సెల్లింపుకోవయ్య సిరిగిరి నాథ నాయిచ్చ సలుపుమో జియ్య శ్రీశైలవల్లభుఁడ" అని ప్రార్థించి, కర్మహరేశ్వరంబందుఁ బడియు గౌరీప గర్భమునందు సొచ్చె" నని కర్మహరేశ్వర తీర్థమాహాత్మ్యన్ని ప్రతిపాదించినాడు పాల్కురికి సోమన (పర్వత 472-7)

భక్తులు "కన్యాసిద్ధనాధు సర్చింతురు (ముని కన్యకలు) దికాలంబు కన్యాసిద్ధనాధు వ్రతరూపమెసఁగ నివాళింతురు అది యాదిగాఁగఁగన్యాబిలంబయ్యె" ఇదే కన్యాసిద్ధేశ్వర తీర్థం (పర్వత 302-303)

పాలూట్ల అనే మరొక పావన సుతీర్థ ప్రసక్తి కావ్యంలో ఉంది బల్లహుడు శివుని భజించెసమయంలో అతనిభార్య "శివునభిషేకంబు సేసిన యన్నిపాల్ప్రహదంబు లోపల నూట వెడల బాలూట్ల యనభువెఁబరగె" (పర్వత 477) నట అక్కడ వెలసిన పాలూట్ల మల్లికార్జును సిత్యం "ముప్పందుం పాలు, నెయ్యి, పెర్వులల జలకంబు సేసి . .. మూలపంచాక్షరి మూడు సెసి వెలు జపంబు" చెస్తే మూడుదినాలకు దివ్యదృష్టి ప్రసాదిస్తాడు (పర్వత 479)

కరపీరేశ్వరం ఇంకొక పవిత్ర తీర్థం కరపిపడనె రాక్షస విభుడు శ్రీగిరిపై "కరపిరేశ్వర లింగాన్ని" ప్రతిష్ఠించి తపం వేసినాడు ని సర్వాంగాలు, ధాతువులు, పిపిఫి సూ్కు, స్థూల వృక్షాలుగ్నాజెను, ఆ చెట్లకు పుట్టే పూలలో నాకు ప్రియమౌన్నావు' అని వరమిచ్చినాడు శివుడు అందువల్ల అక్కడ "కరపిర వసం" ఒప్పిదంగా వెలసింది " కరపిరేశ్వర తీర్థం సుర దీర్ఘికాంశము . భాగీరథి పాయ .. భోగావతిసిట్ట . గోదావరి త్రోవ . మల్లికా కుండ సరణి" ఆ కొలపులోని పద్మాలతో ఈశుని పూజించి దేవకి కృష్ణుని కొడుకుగా గన్నది విమలగప్పుడు ఆ సరసిలో ఉన్న ఒక కమలంలోనే ఉద్భవించినాడు (పర్వత పు. 489-92).

## ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

ఒక తాటిచెట్టు (సూర్యతాళం) సూర్యునితోబాటు పుట్టి, పెరిగి, కుంకుతుంటుంది శ్రీగిరియందు మర్త్యుల బ్రదికింప దలచి "సూర్యవనంబును, సూర్యనగంబు, సూర్యకుండంబును, సూర్యేశ్వరంబు, సూర్యతాళమున్ గావించినాడు సూర్యకుండంబాడి, సూర్యేశు గొలువ, సూర్యపదంబగు సూర్యాత్మునగరుణ" (పర్వత 503-6) అని కథాగత వ్రాతనోట కవి పలికించిన వాక్కులు

నరసింహ బిలం విష్ణువు నృసింహావతారంలో "శ్రీశైలంబునందు అవాహన తీర్థంబునందు, భువి సరస్వతి యనగొలుచు నాకాశ జాహ్నవీ దిప్పికాసంగమంబునకు వచ్చుచు ... నరసింహ బిలమున విరచించి . నరసింహేశ శరభేశ దేవదేవు నావాహన తీర్థవాసుగా భావించి .. భజియించుమండినాడు" (వాద 640-1)

చతుర్ముఖ బసవపురం "శివుడు శ్రీవృషాధీశు జూచి చనుము . . శ్రీశిఖరోత్తర శృంగంబునను సదెకాంతమున వసియింపు" అని అనతి యిచ్చినాడు నందికేశ్వరుడు సహస్రధనుః ప్రమాణమునను గ్రిందట నొక్క పురంబు గల్పించి భువినా వృషభపురమునను జతుర్ముఖవృషభేశ్వరుని నిల్పి కాంక్ష గొల్చుచు "ఉండినాడు. భక్తులు "ఎల్లపర్వతంబందు శ్రీచతుర్ముఖవృషభేశు ..... పాతాళ వృషభ పురాధిప శ్రీభూధరావాసుని" అర్చిస్తుంటారు (పర్వత 300)

శ్రీశైల క్షేత్రం త్రింశద్యోజనముల (ముప్పై ఆమడ) విస్తీర్ణమై భువిని వెలసి ఉంది (పర్వత పు 541) సువిశాలమైన శ్రీగిరి క్షేత్రానికి నాలుగు దిక్కుల్లో నాల్గు ద్వారాలు. నాలుగు మూలలా నాల్గు ఉపద్వారాలు ఒక్కొక్క ద్వారం మొదట ఉపద్వారం మొదట ఒక్కో ప్రసిద్ధ శైవక్షేత్రం ఉంది

గుంటూరు మార్గంలోని త్రిపురాంతకం మొదటిది తూర్పుద్వారం కడప జిల్లాలోని సిద్ధవటం దక్షిణ ద్వారం రెండవది మహబూబ్‌నగర్ జిల్లాలోని అలంపురం పశ్చిమద్వారం మూడవది. తెలంగాణంలోని ఉమామహేశ్వరం ఉత్తరద్వారం నాల్గవది శ్రీశైలానికి ఏలేశ్వరం ఈశాన్యద్వారం సోమేశ్వరాలయం ఉండే సోమశిల ఆగ్నేయ ద్వారం స్కంధ సోమేశ్వరం అని దీనికి నామాంతరం ఏడు నదులు కలుస్తున్నందువల్ల మహాసముద్రంలా కనిపించే సంగమేశ్వరం వాయవ్య ద్వారం 32

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

2 3 5 3 శ్రీశైల క్షేత్రం వర్ణన స్వయం సంపూర్ణంగా ఉండటానికి పాల్కురికి సోమన యీ అష్టదిక్కుల్లో ఉండే క్షేత్రాలను కూడా నోరారా అభివర్ణించినాడు.

ఉమామహేశ్వరం మహేశ్వరుని గూర్చి హిమవంతుని పుత్రిక ఉమాదేవి ప్రచండమైన తపస్సు చేయగా, మహాదేవుడు సప్తర్షుల సన్నిధానంలో ఇక్కడే ఆమెను వివాహం చేసుకొన్నాడు ఉమామహేశ్వరం పర్వతం అర్ధచంద్రాకారంలో ఉంటుంది

ఉమామహేశ్వర క్షేత్రంలోని ఏకాదశతీర్థాల ప్రసక్తి క్రింది ద్విపదల్లో వర్ణితమైంది.

" మాహితంబగు గుప్తమాహేశ్వరంబుఁ
జయకేశ్వరంబును, సంధ్యా సమాధి
గయదేశ్వరంబును, గాంచహరిదేశ్వ
రంబుఁ బాపవినాశంబు గణేశ్వ
రంబు, దేవహరిదేశ్వరంబు, సిద్ధేశ్వ
రంబును, నీలహ్రదయంబును నాఁగఁ
బంచి యేకాదశభవ్యతీర్థములు'' (పర్వత 528)

ఏలేశ్వరక్షేత్రంలోని శివుడు ఏలేశ్వరుడు సిద్ధనాగార్జునుని తపస్సిద్ధి పవిత్రస్థానమైన ఈ క్షేత్రంలో కాత్యాయని పీఠం ఉంది[34] ఆ క్షేత్రంలో వెలసిన పవిత్ర లింగాల, పుణ్యకుండాల, పావన పర్వతాల ప్రసక్తిని వేనోళ్ళ చెప్పేవి ఈ ద్విపదలు

" అవల నేలేశ్వరం బనఁగఁ దూర్పునను
భువి లింగములు గుండములు నగంబులును
వివిధ రత్నచ్ఛాయ వెలుగు లింగములు
మహి నొప్పు తీర్థముల్ మఱియును గలవు
గ మితస్వర్గమోక్షప్రదోత్తములు
రామేశ్వరంబు సుమామహేశ్వరము
సంగమేశ్వరమును జరమేశ్వరంబు
సాంగమూలస్థాన మచలేశ్వరముఁది

తేశ్వర సిద్ధముక్తీశ్వర గౌత
మేశ్వరాదులఁజూడు మిల శిలాచయమున
పెదపర్వతమును శ్వేతాద్రి నీల
మేదినీధర మశ్వమేధ శిరోచ్చ
యంబును లింగశృంగంబుఁ గన్యా వ
నంబు సుమాగిరి గనకనగంబుఁ
గుంతశిఖరి రామకుండంబు భీమ
కుండంబును ప్రయాగ కుండంబు వేపి
కుండంబుగుం దిలకుండంబు నీల
కుండంబును పిశాచ కుండంబు గౌరి
కుండంబు మఱి రసకుండంబులును న
ఖండిత లీల నొక్కటఁ జూడు మింక
నాలయ గంగా ప్రవాహోభయపార్శ్వ
మొలుప దొమ్మిది సేసి పుణ్యతీర్థములు
దాని తూర్పునను మాతంగేశ్వరంబు
నా నొప్పు సకల జనస్తుత్య మగుచు
శతకోటి యను మహాస్థానంబుఁ జూడుఁ
దత్తీర్థరాజి .. ..... " (పర్వత 529-30)

త్రిపురాంతకం సమీపంలోని "కుమారగిరి" పైన త్రిపురాంతకేశ్వరుడు వెలసి ఉన్నాడు ఆయన దేవేరి "చిదగ్నికుండ సంభూత" త్రిపుర సుందరీదేవి ముక్కంటి త్రిపురాసురులను ఖండించింది ఈ క్షేత్రంలోనే[35]

త్రిపురాంతక క్షేత్ర మహిమ, కుమారగిరి ప్రదక్షిణ మహిమ, త్రిపురాంతకేశ్వరుని దర్శన స్పర్శన అభ్యర్చనంబుల మహిమ భక్త మనోరంజకంగా కవి వర్ణించినందుకు ఈ ద్విపదలే అక్షర సాక్షులు

" ఉదాత్తమహిమఁ ద్రిపురాంతక మొప్పు
నా క్షేత్రమహిమ దా నదె యెట్టిదనిన
నీక్షితి సంత్యజు లియవురు గూడి
యఖిముఖిఁ బాపకర్మ మాచరింపంగ

నెఱిఁగి కుమార గిరీంద్రంబు చుట్టు
దొడుగులఁ బఱువఁ దోడ్తోన ప్రాణంబు
విడిచి యా బల్లహాకడుపునఁ బుట్టి
జాతి స్మరత్వంబు సంధిల్ల నప్పు
డేతెంచి వృత్తాంత మెఱిఁగించి తమ్ముఁ
బట్టవచ్చినఁ బాఱి పాఱి మున్ దాచి
నట్టికత్తుల నూపి యచ్చెరువుగను
నా సకలము జూడ నంతంత క్షేత్ర
వాసులై రాజ్యసన్న్యాసంబు జేసె
జగదభినుత బజ్జు జగదేవు లనఁగ
నెగడి యకల్పిత నిజపూర్వ కర్మ
లలితకుమార శైల ప్రదక్షిణ వి
పుల ఫల మహిమ శంభుని గూడి రట్టి
పృధుల కుమార భూభృత్సార్వభౌము
ప్రధిత మాహాత్మ్యమెబ్బంగి వర్ణింప ?
ధరఁ "బురారిధ్వజ దర్శనం" బనఁగఁ
ద్వరితాగత ధ్వజ దర్శన ఫలము
నంకింప నరుఁదన్న నాకుమారాచ
లాంకిత శ్రీత్రిపురాంతకదర్శ
న స్పర్శనాభ్యర్చనంబుల మహిమ
విస్పష్టముగఁదెల్ప విధికైనఁదరమె
యందుల భజన మహత్త్వంబునకును
గుండెలు నెలుకయు గుడి సాక్షిగాఁగ
గంధవతిని దీర్ఘికాతీరవాస
బంధురాభీష్టద ప్రఖ్యాత మహిమ
భువి నొప్పు శ్రీస్వయంభూలింగమూర్తు
లవియ మూలస్థాన మగు త్రిపురాంత
కంబును గౌరేశ్వరంబు సోమేశ్వర
రంబుఁగేదారేశ్వరంబు ఖడ్గేశ్వర

రంబుఁబాపవినాశనంబు గౌరీశ్వ
రంబును గపిలేశ్వరం బుత్తరేశ్వ
రము నావిముక్తేశ్వరము మల్లికార్జు
నమును గన్యాసిద్ధనాథలింగంబు
ననఁగ ద్వాదశసముద్యన్మహాస్థాన
ఘనలింగమహిమ యక్కజమదె చూడు" (పర్వ 530-32)

సిద్ధవట క్షేత్రం పురాణ ప్రసిద్ధి గొన్న జ్యోతిస్సిద్ధవటం ఇక్కడ వెలసిన స్వామి "సిద్ధవటేశ్వరుడు". ఉత్తానపాదుడు ఈ క్షేత్రంలో తపస్సు చేసినాడు మృకండ, మార్కండేయమునులు ఇక్కడి అడవుల్లోనే తపమాచరించినారు ఇక్కడ అనేక తీర్థాలు, ఆలయాలు, సిద్ధుల సమాధులు ఉన్నాయి[36]

జ్యోతిస్సిద్ధవట క్షేత్రంలో వెలసిన అసంఖ్యాక శివలింగాలను, తీర్థాలను కవి కీర్తించి ద్విపదలలో క్రోడీకరించినాడు

" సిద్ధవటాధ్వప్రసిద్ధ పార్శ్వముల
వృద్ధగిరియు రససిద్ధేశ్వరంబు
గోశృంగమును రుద్రకోటియుఁబశ్చి
మాశాముఖంబును నమృతేశ్వరముఁ బ్ర
థమ మల్లికార్జునోదాత్తలింగంబు
భ్రమరేశ్వరంబును బాపవినాశ
నంబును సురభీశ్వరంబు ముక్తీశ్వ
రంబును ధర్మేశ్వరంబు సింద్రేశ్వ
రంబును బ్రహ్మేశ్వరంబుఁ గాలేశ్వ
రంబును భీమేశ్వరంబును బటహ
కర్ణేశ్వరంబు నేకశిలయుఁ గుంభ
కర్ణేశ్వరముఁ గనకగిరియును జాను
సర్వలింగము భూతి పర్వతలింగ
పర్వత రుద్రాక్ష పర్వతావలులు
ఘనతరంబగు కర్ణికారవనంబు
నను ఘటికాసిద్ధనాథ లింగంబుఁ

కమలేశ్వరంబు త్రి స్కాండసోమేశ్వ
రమును పాలంకేశ్వరమ్మును మత్స్యే
కుండ విభీషణ కుండ కుమార
కుంత రావణకుండ గుప్తకుండములు
ఘుమేశ్వరమును విభీషణేశ్వరము
రామేశ్వరమ్ముమ రావణేశ్వరము
పాలంక మత్స్యకేశ్వరముఁ జూడు
మోలి న య్యామ్యోదయోర్వీధరమున
సురుచిర సముదిత జ్యోతిర్మయాంగ
ధరునిఁ దచ్ఛ్రీనగ దక్షిణ ద్వార
వరుని జ్యోతిస్సిద్ధవట సాధు భక్త
వరదుఁ బెన్నానదీ వరతటావాసు
శాశ్వత పుణ్య దర్శనముక్తి నలరు
విశ్వైక నుతు దైవవేశ్యాభుజంగు
దేవశిఖామణి దేవదేవు
భావించి చూడు మెర్పడ వటేశ్వరుని
నందిత వటమూలమందిరుఁ జూడు
మంద మూలస్థాన మైన సిద్ధేశ్వ
రంబును వరుణేశ్వరంబు యమేశ్వ
రంబు నాయుదయేశ్వరంబు సిద్ధేశ్వ
రం శిష్టసిద్ధేశ్వరంబు బ్రహ్మేశ్వ
రం బిష్టకామేశ్వరంబుఁ జూడు" (పర్వత 533-55)

పుష్పగిరిలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఆలయాలున్నాయి దీనికి ప్రసూనాకరం అని మరో పేరు ఆదికేశ్వరస్వామి, సంతాన సాంబ మల్లేశ్వరులు, పుష్పగిరీశ్వరుల దేవాలయాలు ఈ క్షేత్రంలో ఆరాధ్య స్థలాలు ఇది ఆదిశంకరాచార్యుల ఉప పీఠం[37]

పుష్పగిరిలో ఉండే శివలింగాల ప్రశస్తి ఈ ద్విపదల్లో చోటు చేసుకొంది

"చంద్రప్రభావృఁబుష్పగిరి వాస్తవ్యు
నింద్రేశ్వరుఁ జూడు మింద్రపూజితుఁ
వందిత సురసత్రవాతు రామేశ
నంచ చూడుము త్రిపురాంతక దేవుఁ
బరశురామేశ్వరు బాలకర్ణేశ
హరుఁ శంకరు మల్లికార్జునుఁ జూడు,
చండీప్రభుని జూడు కుంభకేశ్వరుని
వెండి బ్రహ్మేశ్వర విమలేశ్వరముల
సగము నరుండును సగము మృగంబు
నగు నృసింహుఁడు హిరణ్యాక్షు వధింపఁ
గా వెండి శ్రీనీలగళుఁ బ్రతిష్ఠించి
యావాహనము సేయనది యాదిగాఁగ
బూని సంతతమును బూజించునట్టి
యానరసింహేశ్వరాదిసిద్ధేశ
దానవేశాదులఁదఱి దఱి జూడు" (పర్వత పు ౫౩౭)

అలంపురం "కోటి లింగక్షేత్రం"గా ఖ్యాత ప్రసిద్ధమైన క్షేత్రం అక్కడి శివలింగాలను వర్ణించిన కవి పాత్ర ముఖంగా "ఇట్లు సూపంగ వచనని చూపితిఁగాని యాపురి లింగ సహస్రార్బుదములఁజూపఁ జెప్పంగ శేషునకు నక్కజము" అంటాడు. అతడు చెప్పిన కొన్ని శివలింగాల, తీర్థకుండాల ప్రసక్తి ఈ ద్విపదల్లో ఉంది

"పశ్చిమ ద్వార ప్రభావంబుఁ జూడు
తుంగి భద్రాంకితోత్తుంగ భద్రా త
రంగిణీ చారు తీరమున మోక్ష ప్ర
దంబు దేవద్రోణి తత్ప్రేమమునఁ
బంచ శ్రీ వారాహ బ్రహ్మేశ్వరములు
పేరినాదావతీ వృత్తమధ్య ప్ర
వాదిత స్థాన విభ్రమపంక్తి లోన
నమరు తీర్థాది ఛాయా మల్లికార్జు
నును గణికాసిద్ధ నాడ మోక్షేశ్వ

రమును భుజంగేశ్వరము నారదేశ్వ
రమును బ్రహ్మేశ్వర రాజరాజేశ్వ
రంబు నగ్నీశ్వర రమ్య భోగీశ్వ
రంబును సోమేశ్వరంబును గల క
లేశ్వరంబును నాఁగ నెన్నంగఁ జను న
నశ్వరైకాదశ నవ్య తీర్థంబు
లాది శ్రీరుద్రపాదాది తీర్థముల
కాది మూలస్థానమైన బ్రహ్మేశ్వ
రము బలభద్రేశ్వరముఁ గమలేశ్వ
రమును బాపవినాశనమును యాగేశ్వ
రమును నగస్త్యేశ్వరమును నాగేశ్వ
రము సప్తకోటీశ్వరముఁ గుక్కుటేశ్వ
రము నశ్వమేధేశ్వరము లకులేశ్వ
రమును శ్రీరామేశ్వరము లక్ష్మణేశ్వర
రంబును ధవలేశ్వరంబు ధర్మేశ్వ
రంబును విమలేశ్వరంబు నింద్రేశ్వ
రంబును గర్ణేశ్వరంబు వ్యాసేశ్వ
రంబును వరుణేశ్వరంబు మలక్ష
యేశ్వరంబును నుత్తరేశ్వరము నన
లేశ్వర మెలేశ్వ రేశ్వర పంచ
లింగావలులు సప్తలింగము లుభయ
సంగమేశ్వరములు సకలేశ్వరంబు
గనకేశ్వరంబు స్వర్గద్వారసీమఁ
దనరు బ్రహ్మేశ సీతా త్రిపురాంత
కాదులు నిజమల్లికార్జునంబును ని
పాదితభస్మేశ పరశురామేశ్వ
రంబులు హోమకుండంబు సిద్ధేశ్వ
రంబు మలక్షయ రసకుండయుగము
ఖ్యాపిత లీల నొక్కటఁజూడు మిట్లు
సూపంగవలెనని చూపితిఁగాని

యా పురిలింగ సహస్రాబ్దములఁ
జూపఁజెప్పంగ శేషునకు నక్కజము"

" అది లింగ పర్వతం బది లింగనగర
మది లింగ మందిరం బది లింగవార్ధి
యది లింగమంజరి యది లింగరాశి
యది లింగసురభూజ మది లింగసురభిఁ
గూడ నిట్లొప్పు శ్రీకంధర పశ్చిమము
నీడిత ద్వార మహిష్ఠతీర్థ ప్ర
కరము ... ... ... " (పర్వత 537-540)

సంగమేశ్వరానికి కూడలి సంగమేశ్వరం అనే పేరు వచ్చిన విధం, ఆ క్షేత్రంలో ఉండే సంగమేశ్వరుడు, యజ్ఞేశ్వరుడు, సిద్ధనాథుడు, ఈ ద్విపదలలో మనకు సాక్షాత్కరిస్తారు

" .. ... జగత్ ఖ్యాపితలీల
నరి ఁనొప్పుఁగూడలి సంగమేశ్వరము
దన రారు తుంగభద్రయుఁ గృష్ణవేణి
యును గూడఁ గూడలి యన నొప్పుఁజూడ
దాని తూర్పున సముద్యన్మహామహిమఁ
దానొప్పు దివ్యతీర్థంబు నివృత్తి
మంగళతర తీర్థమహితవాస్తవ్యు
సంగమేశ్వరుఁజూడు జననాపహరణు
నిటఁదూర్పువలన యజ్ఞేశ్వరుఁజూడు
పటు దక్షయజ్ఞప్రభంజన స్థలిని
నమరేశ నప్పర్వతాగ్ర దేశమున
నమితేశ శ్రీసిద్ధనాథునిఁ జూడు " (పర్వత. 540)

ఉమాఘరజీధరం అనే నామాంతరం ఉండే సోమశిల అక్కడి సోమేశ్వర స్వామి అగస్త్యేశ్వర స్వామి క్రింది ద్విపదలలో వర్ణింపబడినారు

" ఉరుతర తత్ ప్రవాహోత్తరాశా వి
హరణు నక్కడఁజూడు మయ్యగస్త్యేశు
నయ్యగస్త్యేశున కమరేంద్రు దెస మ
హియ్య సంప్రీతి సోమేశ్వరుఁ జూడు,
తలపోసి నయ్యుమాధరణీధరంబు
సెలువారు నదె సోమశిలఁజూడు " మనుచు (పర్వత 541)

2 3 5 4 శ్రీశైల క్షేత్రం, ఆ క్షేత్ర అష్ట ద్వారాలగురించే కాకుండా పాల్కురికి సోమన ఆంధ్రదేశంలోని మరికొన్ని శైవక్షేత్రాలు-అక్కడి ఉత్సవాలకు వెళ్ళే అసంఖ్యాకమైన జనవర్ణన కావ్యంలొ పెర్చినాడు ఈసందర్భంలో ప్రసక్తమైన స్థ రాలు దక్షారామం, గుడిపూడి, పెనుమెట్ట, పులిగూరు, గోదావరి

" వరభక్తియుక్తి శ్రీవారణాసికిని
గరమద్దిఁ జను సాతకరణిఁ జూచితిమి
ప్రీతి దాక్షారామ భీమేశు పెండ్లి
కేతెంచు పరుస నాదేము సూచితిమి
గుడిపూడి సోమేశు కూర్మి పెండ్లికిని
నడతెంచు పరుసల నాడు సూచితిమి
పెనుమెట్ట పులియూర పెండ్లిండ్ల కర్థిఁ
జనుదెంచి దర్శించు సాతుఁజూచితిమి
స్థిర భక్తి యుక్తిమై నుద్ధవటంబు
తిరునాళ్ల కెతెంచు పరుసఁ జూచితిమి
చూచు సింహ బృహస్పతి పరుస
గోదావరికి గూడు కొలదిఁ జూచితిమి
మహిని వ్యతిపి రవిగ్రహణాదులందు
బహుళంబుగాఁ గూడు పరుసఁ జూచితిమి
సరి గార్తికంబు పున్నమి నాటి పరుస
కరిమియుఁ త్రిపురాంతకమునఁ జూచితిమి
ఇట్టి సందడి గాంతుమె యెందునైన " (పర్వత 423-4)

అని శ్రీశైల యాత్రికులు ఆశ్చర్యపోయినారు అసంఖ్యాకమైన పవన జనులను జూచి

గుణపూడి భీమవరమే గుణపూడి సోముని చేత ప్రతిష్ఠితమైంది కాబట్టి సోమ లింగమని ఇక్కడి శివలింగానికి పేరు. గుణపూడినే సోమారామం అంటారు పంచా రామాల్లో ఇదొకటి 33 సంగమేశ్వరంలో ఉండే స్వామిని నివృత్తి సంగమేశ్వరుడని కూడా పిలుస్తారు. కాబట్టి కూడలి సంగమేశ్వరం మరోపేరు నివృత్తి సంగమేశ్వరం అని చెప్పవచ్చు పెనుమెట్ట, పులియూరుల విషయం ఇంకా పరిశీలించి తెల్పవలసి ఉంది వెర్వేరు సందర్భాలలో దక్షారామం, అమరారామం, క్షీరారామం ప్రసక్తిలోకి వచ్చినాయి

వేంగి మహోర్వీస్థలమున ననమానరీల దక్షారామమెప్పు, నప్పురంబున ~~సమాద్యక్షమహామహిమ~~ నొప్పు శ్రీ భీమేశ్వరు లింగంబు" ఆదేవుని పురోహిత శ్రేష్టుడు భీమన పండితుడు అతడే పండితారాధ్యుని తండ్రి పండితుడు దక్షా రామమునకు జని కోటిపల్లి ఆరాధ్యుల వారిచే శివదీక్షను పొందినాడు.

(దక్షా 27-28)

గురుభక్తాండారి ఒక శివభక్తుడు ఒక వేశ్యపై మనసుకొని వెళ్ళినాడు ఆమె ఒప్పుకోలేదు "ఇంతుల లోనదాలిమిగల భక్తురాలవేనియును . మారారిఁ గనయుఁ గౌరెదేఁబోదము దక్షారామమునకు" అంటాడు (పురా 338)

అమరావతి గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో ఉన్న సుప్రసిద్ధ క్షేత్రం పూర్వం ప్రసిద్ధ బౌద్ధారామం ఇక్కడ అమరేశ్వరలింగం ఉంది. అమరేశ్వరుని (దేవేంద్రుడు) చేత ప్రతిష్ఠితమైనందువల్ల అమరారామం అనే పేరుకూడా వచ్చింది పంచారామాలలో ఇదొకటి39.

పండితుడు "అమరారామ పురనివాసు శ్రీయమరేశుని అమరేశ్వరాష్టకంబందు" కీర్తించినాడు "వెడలితి మటుగాన వెలనాటి సీమఁ బడయుదు నింక సంబకము వీక్షణము" అని తలంచినాడు అమరేశ్వరుని మహిమవె పండితునికి యథాపూర్వంగా కండ్లు వచ్చినాయి

పశ్చిమగోదావరి జిల్లా నరసాపురం తాలూకాలో ఉండే పాలకొల్లే క్షీరారామం ఇది పంచారామాలలో ఒకటి ఇక్కడి శివలింగం శ్రీరామునిచేత ప్రతిష్ఠితమై రామ

లింగం అనే పేరుతో ప్రసిద్ధి పొందింది[40] పండితుడు పాంచరాత్రివాద నిరసనంలో విష్ణువుకన్న శివుడు గొప్పవాడని వాదిస్తూ విష్ణువు "క్షీరారామమునను మదనారి నిల్చి సమ్మతిఁగొల్చిన విధము" సాక్షి అంటాడు (వాద పు 584)

పండితారాధ్య చరిత్రలో సందర్భానుసారంగా ఇంద్రకీలపర్వతం, కానుకొల్లు వెలిగొండ అనే స్థలాలు కూడా ప్రస్తావనకు వచ్చినాయి

ఇంద్రకీల పర్వతాన్ని కనకదుర్గకొండ అనికూడా అంటారు ఈ కొండపైనే అర్జునుడు తపస్సుచేసి శివుని వద్దనుండి పాశుపతాస్త్రాన్ని పొందినాడని పురాణగాథ ఈ కొండపైనే మల్లేశ్వరాలయం ఉంది[41]

ఓహిళుని కథలో సౌరాష్ట్ర సోమనాథుడు చెంచురూపంలో ప్రత్యక్షమవుతాడు అతడు అర్జునుని పరీక్షింపను వినోదంగా కిరాతున్గా విచ్చేసిన శివుడా' అన్నట్లున్నా డట "నలి సింద్రకీలంబునకు వినోదార్థమలనాడు వచ్చిన యాకిరాతుండో" అన్న ద్విపదే పై విషయానికి సాక్షి

కానుకొల్లు కైకలూరు తాలూకా, కృష్ణాజిల్లాలో ఉంది 13 వ శతాబ్దిలో కృష్ణాజిల్లా వెలనాటి చోడుల పాలనలో ఉండేది రాజగురువైన బౌద్ధుడు పండితుని వాదంలో ఓడించ లేక పోయినాడు అతడు "కాకొలని శ్రీచెన్నమల్లికార్జున దీపమాల గంబంబు వ్రచ్చి తెప్పించినవాఁడు" అలాంటి శివద్రోహానికి ఆగ్రహోదగ్రులైన పండితుని శిష్యులు "చెచ్చెర నా ద్రోహి శివుదీపమాల వ్రచ్చినగతి వాని వలి పొట్ట వ్రచ్చి" చంపినారు (మహిమ 11)

వెలిగొండ కొండలు కర్నూలు జిల్లా కంభం తాలూకాలో వ్యాపించి ఉన్నాయి మార్కాపురం పట్టణానికి తూర్పుగా పదిమైళ్ళ వరకు ఈ కొండలు ఉన్నాయి[42]

వెలికొండ-వెల్లగొండ పై మహాదేవుడున్నాడు (?) ఆ స్వామి పేరే భక్తుడు పెట్టుకున్నాడు పండితారాధ్య చరిత్రలో వెలిగొండ, వెల్లగొండ మహాదేవుడనే భక్తుని చరిత్ర ఉంది

తెల్లవారక ముందే లేచి "వెల్లగొండ మహాదేవుండు... పుష్పములు గోసి కోసి మన్ననంత కాళ్ళి నిర్బోపకరణము నేర్చి"గానే కాళ్ళ రెండూ నరికేసు కున్నాడు పండితుడు" ఒపత్తైలంబ యౌషధము" గా పూసి, కాళ్ళ అతికి, "భక్త హస్తార్పిత మాతిఁబూసె పైఁ జల్లినాడు" కాళ్ళొచ్చినాయి ఆ భక్తునికి (పురా

266-76) సద్భక్తిమతి వెల్లగొండ మహాదేవ రరుండు మహాంబోంబియున్ను "సదచి నాడు అట వెలికొండ మహాదేవుండవంబె బ్రాలిష్టై యుండి ఫస్తలందపను" (పురా 498-9)

టంగుటూరు పేరలో ఒంగోలు జిల్లాలో ఒకటి, కడప జిల్లాలో రెండు గ్రామాలున్నాయి43

టంగుటూరి మాచయ్య అనే వర్తని ప్రసక్తి" వారక మును టంగుటూరి మాచయ్యగారి ముఖ్వర బాస గడనొప్పెనాడు" (బసా పు 255, అనే పద్యంలో ఉంది

పండితారాధ్యుని వెలనాటి చోడడు దండించిన ఇతివృత్తంలో కొన్ని స్థల నామాలు కన్పిస్తున్నాయి అవి అబ్బలూరు, కొప్పూరు, పొట్లచెరువు వెలనాడు, సనదవోలు, సముద్రాంతరం అనేవి

నేటి తెనాలి, రేపల్లె తాలూకాల ప్రాంతం, గుంటూరు తాలూకాలో కొంత ప్రదేశం కలిసి నాటి వెలనాటి రాజ్యంగా ఉండేది కృష్ణానది దక్షిణతీరంలో సుప్రసిద్ధమైన ప్రాచీన నాడుల్లో వెలనాడు ఒకటి ఇది అనుమెల గ్రామ పరిసరిగల ప్రదేశం వెలనాటి చోడ రాజులకు రేపల్లె తాలూకాలోని చందవోలు రాజధాని దీనికే సనదవోలు, ధనదుపురం అని నామాంతరాలు44

" పండితారాధ్యుల దఖండిత చర్త సనదవోలను మహానప్పురి మహిమం దనరార వర్తింప మాతంజాలక సమ్యాభావమున నరపతియగు వెలనాటి చోడనికి గురుండగు బౌద్ధుండు గుటిలుండు.. వెలనాటి చోడని ఏలువంగ బంచి "పండితుని వాదానికి పిలిపించమన్నాడు పండితునితో బాటు "వెల్లగొండ మహదయ్యగారు పొరండ్ల సూరసానమ్మగారు మొదలైన భక్తులు కూడా వచ్చినారు జైనులను వాదంలో ఓడించినాడు పండితయ్య

దేవదాసయ్య "పొట్ల చెరువులో పసదు లేజ్ఞారును ప్రవర్చి చైపించి" నవాడు కోపూరి బ్రహ్మయ్య "కొప్పూరిలోపల గల యట్టి వసములన్నియు ప్రవర్చి చైపించి" నవాడు ఏకాంత రామయ్య "అబ్బలూరను పసదినాడా దిగా నిర్భికప్పుడు వది యొడ మని శాపమిచ్చి" నపుడు పై వలెక్కవికి చెప్పినారు? అని పండితుడు హాలంతరించినాడు

వాదంలో ఏమీ చెయలేక బౌద్ధుడు పండితుని నిందించినాడు పండితుని నిందించడం సహించలేని శిష్యులు ఆ బౌద్ధుడు సముద్రాంతరమందుల వసదిలో ప్రార్థింవను బొగా పొట్టచీల్చి చంపినారు శిష్యుల నెరాన్ని తనమీద వేసుకొన్నాడు పండితుడు రాజువేసిన దండస ప్రకారం కండ్లు గొర్గొండితో తానే పెరుకు కొన్నాడు శివుడు పండ్లిచ్చాడు పండితునికి రాజు కోపంపట్టలేక తలాయత్తో పండితుని కండ్లు పీకించి, జిల్లేళ్ళపాలు పొయిస్తాడు

ఈపురంలో నాకింక కండ్లివ్వకు స్వామీ! అని చెప్పి వెలనాటి చోడని రాజ్యనాశనం అవుతుంది అని శాపమిస్తాడు పండితుడు "చోడఁడీ దేశంబు సొద గొన్నఁ జొచ్చెఁ జోడండు నెఱుఁపగఁ జూచె నిప్పరము .. వెలనాడు .. పాలించు భూమియుఁ దాడుగానోపు" ( మహిమ 62 ) అని శాపాక్షరాలు పలుకుతూ శివుని స్తుతిస్తాడు "అమరారామమునను విస్మయంబని బౌద్ధపితతి గీర్తింప . మాకొప్పఁ బడయ నేత్రములు" ( మహిమ 51 ) అని స్వామిని వేడుకొని, "పుత్రమిత్ర కళత్ర సహితము . అమరారామమునకు" వె పోతాడు

అక్కడ అమరేశ్వరస్వామి మహిమతొ పోయినకండ్లు తిరిగి వస్తాయి పండితుడు వెల్లటూరిలో ఉండి దోనమరాజును శ్రీపర్వతానికి పంపిస్తాడు ఆ శిష్యుడు తిరిగి వస్తూ "తద్గిరి డిగ్గి వెలటూరి కేతెంచి గురుదేవు దర్శించి దన ప్రయాణవిశేషాలన్నీ చెపుతాడు ( పర్వత పు 543 )

కొప్పూరు అనే పేర్తొ కొప్పూరు తాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా నర్సీపట్నం తాలూకా, విశాఖపట్నం జిల్లాలోను గ్రామాలున్నాయి అబ్బలూరు, పొట్లచెరువు ఎక్కడున్నాయో పరి లించాలి ఉంది

పండితారాధ్య చరిత్రలో ఎన్నించిన వస్తులలో కోటిపల్లి ఆరాధ్యులు, ఇవటూరి సోమనాథయ్య ఉన్నారు కొటిపల్లి, ఇవటూరు గ్రామనామాలే

కోటిపల్లి రామచంద్రాపురం తాలూకా, తూర్పుగోదావరి జిల్లాలో ఉంది పండితునికి శివదీక్ష నిచ్చినవాడు "ఆరూఢ కీర్తినడగు కోటిపల్లి యారాధ్యులే" (దీక్షా 24, 29, 30)

" ఇవటూరి సోమనాథయ్య విశ్రుత పరభక్తి " అని కవి వాక్కులు (వాద 501)

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

ఆంధ్ర దేశం, కళింగ, తెలుంగు అనే స్థలనామాలు కూడా పండితారాధ్య చరిత్రలో కనిపిస్తాయి "సిరిగిరి బాడుచు.... అఖిల దేశముల పరుసయు నానంద భరితప్తై నడువ నరుదొందఁగా నందు నాంధ్రదేశంబు బరుస బంతులు గట్టి పాడు" తున్నారు (పర్వత పు 371) ఈ సందర్భంలోనే ఆయాదేశాల జనసంఖ్య చెప్పినాడు పాల్కురికి సోమన

"లక్షింపఁగ సపాద లక్ష గళింగ నవలక్ష తెలుంగు" అని (పర్వత 415) తెలుగు కావ్యాల్లో పండితారాధ్య చరిత్ర శ్రీశైల పర్వతాన్ని అణువణువునా వర్ణించి చూపిందంటే అతిశయోక్తి కాదు భక్త జనులకు శ్రీశైల వృత్తాంతం ఒక చలన చిత్రంలా తోచకపోదు

2 4 చక్రపాణి రంగన పాల్కురికి సోమన సమకాలికుడు చక్రపాణి రంగన రగడ వంపస్సును ప్రచారంలోకి తీసుక వచ్చిన వాడియనే ఇతనివి 1 శివభక్తి దీపిక – నయనరగడ 2 నమశ్శివాయ రగడ అనే రెండు రగడలు లభించినాయి [ఉదాహరణ వాఙ్మయ చరిత్రలో ఉన్నంత మట్టుకు తప్ప రగడల సంపూర్ణ స్వరూపం నేను చూడలేక పోయినాను ]

2 4 1 దారిలో ఉన్న శ్రీశైలం దర్శించకుండా, శ్రీరంగానికి వెళ్ళిన దోషంవల్ల ఇతనికి కనుచూపు పోయింది శివుని దర్శించకపోవడమె తన అంధత్వానికి కారణం అని శ్రీరంగనాథస్వామి చెప్పగా తెలుసుకొని నయనరగడను శ్రీగిరి మల్లికార్జునుని పైన చెప్పినాడు పోయిన కనుచూపు వచ్చింది

నయనరగడ 342 చరణాలుంది "కంటి" అనే అంత్యానుప్రాసతో ప్రతి పాదం ముగుస్తుంది మొదటి నాలుగు పాదాలు ఇవి

"శ్రీశైల వల్లభుని శిఖరంబుఁ బొడగంటి
కాశీపురాధిప గౌరిఁ బొడగంటి
సర్వలోకేశ్వరు సర్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబుఁ బొడగంటి"45

ఈ రగడలో చివరి ఐదు పాదాలు

" దవిన శ్రీరంగి కవి దాతయని పొడగంటి
భువిలోపల ప్రసిద్ధ పుణ్యుఁడనఁగాఁగంటి

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

శివభక్తి దీపికా శీతాంశు వని కంటి
శ్రీగిరీశునకు నర్పింతునని పొడగంటి
శ్రీగిరీశ్వరుని కృప చెన్నలర నే కంటి

నమశ్శివాయ రగడ ప్రతి పాదం చివర "నమశ్శివాయ" అని మకుటం ఉంటుంది 108 పాదాల రచన ఈ రగడలో మొదటి రెండు పాదాలు –

" శ్రీగిరీశ వశ్యమంత్ర శేఖరము నమశ్శివాయ
ఆగమోపదిష్ట విధి మహాఖరము నమశ్శివాయ"46

రంగన రచించిన ఈ రెండు 'రగడల్లో' శ్రీశైల ప్రసక్తి మాత్రమే ఉంది శ్రీశైల వల్లభుని, శ్రీగిరిశునకు, శ్రీగిరీశ్వరునకు, శ్రీగిరిశ అని మల్లికార్జున స్వామికి పర్యాయంగా ప్రయోగించినాడు క్షేత్రమాహాత్మ్యమే ప్రధానం కాబట్టి స్వామిని ఆ క్షేత్ర నాథునిగానే ప్రతిపాదించటం జరిగింది

2 5 క్రీ శ 1200 నుండి క్రీ శ 1325 దాకా తాలోత్తాలంగా విజృంభించిన శైవమతానికి దర్పణం పట్టేవి ఆ యుగంలోని కవుల కావ్యాలు

నన్నెచోడుడు పరమత ద్వేషంలేని శైవధర్మాన్ని పరోక్షంగా తన 'కుమార సంభవ' కావ్యంలో ప్రతిపాదించినాడు పండితుడు ఇతర మతాల పైన ద్వేషం చూపినా, కులాన్ని విచ్ఛిన్నం చేయని ఆరాధ్య సంప్రదాయానికి ప్రవర్తకుడైనాడు పాల్కురికి సోమన అవధులులేని వీర శైవ వాది చవిజన దర్శన స్పర్శన దూరగుడు కులభేదాల అడ్డుకట్టలు విచ్ఛేదించినవాడు అతడు బ్రాహ్మణపుటక పుట్టినా, ఉపనయనాన్ని వ్యతిరేకించి, ఆకులాన్ని "త్రాటిమాలలు, త్రాటికుక్కలు" అని నిందించినాడు

శైవసాహిత్యంలో గోచరించే తెలుగునాడును పరామర్శిస్తే నన్నెచోడునిలో, పండితునిలో అత్యల్పంగాను, పాల్కురికిసోమనలో అపారాన్నంతెట్లుగాను గోచరిస్తుంది అసలు సోమన ఇతివృత్తాల సమకాలీన, లేదా ఒక శతాబ్దముందరి చారిత్రకవ్యక్తుల జీవిత చరిత్రలు బసవన కన్నడ దేశస్థుడు పండితుడు ఆంధ్రదేశనివాసి కథానాయకుల ఇద్దరి చరిత్రమూ శ్రీశైలంతో ముడివడి వుంది ఎందుకంటే నాటికీ నేటికీ దక్షిణ భారతదేశంలో శ్రీశైలానికి మించిన పవిత్ర శైవ క్షేత్రంలేదు కాబట్టి పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణం సంపూర్ణంగా శ్రీశైలాన్ని అనుభవమువునా సూక్ష్మదర్శి

నిలో పెట్టి చూపించేదిగా ఉంది ఆ కవి శైవ దీక్ష ఎంత గాఢమైందంటే శ్రీశైలానికి ఉండే అష్టద్వారాల్లోని క్షేత్రాలనుకూడా విపులంగా వర్ణించేటంతటిది.

పాల్కురికి సోమన "పండితారాధ్య చరిత్ర" లో నాటి ఆంధ్రదేశంలో ఉండే సమస్తశైవ స్థలాల్ని చేర్చినాడని ఘంటాపథంగా చెప్పుకోవచ్చు అతని ఆంధ్ర దేశాభిమానం ఎంత గొప్పదంటే భారతదేశంలోని ఇతర శైవక్షేత్రాలేవీ శ్రీశైలాన్ని పోలవు అని చెప్పగలంతటిది.

తర్వాతి యుగం కవిత్రయంలో ద్వితీయుడైనా అద్వితీయుడుగా వెలుగొందిన తిక్కన యుగం తిక్కన యుగం శైవ, వైష్ణవ మత సమన్వయ యుగం. ఆ యుగ సాహిత్యంలో "తెలుగునాడు" ప్రతిఫలించే తీరు తర్వాతి ప్రకరణంలో పరిశీలిద్దాం

## సూచికలు :


1 ఆంధ్ర సాహిత్య చరిత్ర, పింగళి లక్ష్మీకాంతం (పు 73-80)
2 ప్రాచీన చారిత్రక భూగోళము (పు 207-212)
3 ప్రాచీన తెలుగు శాసనాలు, బూదరాజు రాధాకృష్ణ (పు 337)
4 ప్రాచీన చారిత్రక భూగోళము (పు 154)
5 ప్రాచీన తెలుగు శాసనాలు, బూదరాజు రాధాకృష్ణ (పు 114)
6 కుమార సంభవము, పీఠిక
7 ఆంధ్రదేశ చరిత్ర - భూగోళ సర్వస్వము, 'ముఖద్వారము' (పు 87)
8 శివతత్త్వ సార పీఠిక (పు 36-38)
9 ప్రాచీన చారిత్రక భూగోళము (పు 238-240)
10 దేవాలయ చరిత్రము (మొదటి భాగము) జొన్నలగడ్డ వెంకట రాధాకృష్ణయ్య, శ్రీ పలుకూరి చెంచురామరెడ్డి (పు 236)
11 ప్రస్తుతం లభ్యమయ్యే ప్రతులలో లేదని, లక్షణ గ్రంథాల్లో ఈ పద్యం కని పిస్తుందని శివతత్త్వసారం పీఠికా కారుడు (పు 44-45)
12 దేవాలయ చరిత్రము (పు 38)
13 శివతత్త్వసారం - పీఠిక (పు 42)
14 పండితారాధ్య చరిత్ర పీఠిక - తిమ్మావజ్ఝల కోదండరామయ్య
15 కిన్నెర బ్రహ్మయ్య కథ పండితుని శివతత్త్వసారం, పాల్కురికి సోమన బసవ పురాణం పంచమాశ్వాసంలోను ఉదాహృతం
16 దేవాలయ చరిత్రము (పు 38-39)
17 దేవాలయ చరిత్రము (పు 38)
18 ప్రాచీన చారిత్రక భూగోళము (పు 195)
19 దేవాలయ చరిత్రము (పు 122-123)
20 Alphabetical list of Villages .... in Madras Presidency, 1936.
21 దేవాలయ చరిత్రము (పు 40)
22 ,, (పు 146)
23 ,, (పు 149-150)
24 ,, (పు 65-66)

25. **Temples of Sreesailam ( P. 3 ) M. Rama Rao**
26. ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము 'ముఖద్వారము' (పు 455)
27 ప్రాచీన చారిత్రక భూగోళము (పు 146)
28 ,, ,, (పు 97)
29 ,, ,, (పు 257)
30. ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము 'ముఖద్వారము' (పు 456)
31 **Temples of Sreesailam ( P 3 ) M Rama Rao**
32 దేవాలయ చరిత్రము (పు 38, 39, 40)
33 దేవాలయ చరిత్రము (పు 39)
34. ,, (పు 40)
35 ,, (పు 38)
36 ,, (పు 38)
37 ,, (పు 40)
38 ప్రాచీన చారిత్రక భూగోళము (పు 195)
39 ,, ,, (పు 195)
40 ,, ,, (పు 195)
41. ఆంధ్ర దర్శిని (కృష్ణా జిల్లా) (పు 38-39)
42 ,, (కర్నూలు జిల్లా) (పు 279-300)
43. ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం 'ముఖద్వారం' (పు 185)
44 ప్రాచీన చారిత్రక భూగోళము (పు 306-307)
45 ఉదాహరణ వాఙ్మయ చరిత్ర (పు 82)
46 ,, ,, (పు 83)



# 3

# తిక్కన యుగ సాహిత్యంలో తెలుగునాడు

3 0 క్రి శ 1225 నుండి 1320 దాకా ఉన్న తెలుగు సాహిత్య కాలాన్ని తిక్కన యుగంగా ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు పేర్కొంటున్నారు ఈ యుగంలో ప్రధాన కవిశ్వరుడు కవిత్రయంలో ఒకడైన కవిబ్రహ్మ తిక్కన సోమయాజి అన్న విషయాన్ని ఆ యుగం పేరే బలపరుస్తుంది తిక్కనకంటె పూర్వుడు గోన బుద్ధారెడ్డి తిక్కన యుగంలో తక్కిన కవులు కేతన, మంచన, యథావాక్కుల అన్నమయ్య, మారన

తిక్కన యుగ కవుల సాహిత్యంలో 'తెలుగునాడు' ప్రసక్తి ఎలా ఉందో వివరించడం ఈ ప్రకరణలక్ష్యం

3 1 గోన బుద్ధారెడ్డి 'రంగనాథ రామాయణం' గోన బుద్ధారెడ్డి ద్విపద రచన. గోన బుద్ధారెడ్డి వంశీకులు కాకతీయాంధ్ర చక్రవర్తుల సామంతులుగా యిప్పటి రాయచూరు ప్రాంతాలనేలేవారు[1]

3 1 1 రంగనాథ రామాయణంలో ప్రసక్తి వచ్చిన తెలుగునాడులోని నామాలు – ఆంధ్రసీమ, గోదావరి అనేవి మాత్రమే

నీలుడు, హనుమంతుడు, జాంబవంతుడు మొదలైన కపివీరులు సీతకోసం వెదకవలసిన ప్రదేశాలలో గోదావరి, ఆంధ్రసీమ చెప్పబడినవి

దండకారణ్యంబు తప్పక వెదకి
పండి గానల గోదావరి నరసి
. . . .. .
.. కర్నాటకాంధ్ర చౌళేంద్ర
చేర కేరళ పాండ్యసీమల నరసి' (కిష్కింధాకాండం పు 216)

3 1 2 సాధారణంగా తెలుగుకవులు సందర్భం కల్పించి అయినా తమ కావ్యాలలో ఆంధ్రదేశ ప్రసక్తి తెపడం ఉంది కాని బుద్ధారెడ్డి మూలంలో ఉండే కళింగ నగరం, కృష్ణవేణుల ప్రసక్తి తెక పోవడం విచిత్రమే

భరతుడు కేకయరాజును వదలి అయోధ్యకు వచ్చేటపుడు కళింగనగరం మీదుగా అయోధ్యను చేరినట్లు మూలంలో ఉంది రంగనాథరామాయణంలో లెదు

వంశధార నదీతీరాన పర్లాకిమిడి పట్టణానికి ఇరవైమైళ్ళ దూరంలో ఉండే ముఖలింగమే కళింగనగరం అని పరిశోధకుల నిర్ణయం[2]

" తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీం
నదీం గోదావరీం చైవ సర్వమేవాను పశ్యత "

(రామాయణం – కిష్కింధాకాండం[3])

పై శ్లోకాలలోని కృష్ణవేణి ప్రసక్తి రంగనాథ రామాయణంలో లేదు

3 3 తిక్కన సోమయాజి కవిబ్రహ్మ, ఉభయ కవిమిత్రుడు తిక్కన సోమయాజి నిర్వచనోత్తర రామాయణం, విరాటపర్వం మొదలు స్వర్గారోహణ పర్వందాకా పదైదు పర్వాల ఆంధ్ర మహాభారతం తిక్కన కావ్యాలు

తిక్కన రచనలు రెండూ తెనిగింపులే కాబట్టి తెలుగు దేశంలోని ప్రదేశాల ప్రసక్తి చాలా తక్కువగా వచ్చింది పై పెచ్చు మూలంలో ఉంటేనే తప్ప నన్నయ మాదిరి అరుదుగానైనా తెలుగు ఒకాస్ని తన కావ్యంలో చొప్పించలేదు

3 2 1 నిర్వచనోత్తర రామాయణం • అవతారికా భాగంలో మాత్రం తెలుగునాడుకు సంబంధించిన గుంటూరు, కురుములూరు అనే ఊర్ల ప్రసక్తి ఉంది

తన పితామహుడు సారకవితాభిరాముడు, గుంటూరి విభుడు అని కవి చెప్పుకొన్నాడు

" సారకవితాభిరాము, గుంటూరి విభుని
మంత్రి భాస్కరు, మత్పితామహునిఁ దలచి " (1–12)

మావెన క్రి శ 1127 ప్రాంతాల్లో గుంటూరు జిల్లా సత్తెనపల్లి పరిసరాల్లో వెలనాటి చోళుల పల్యాధికారిగా పనిచేసినాడు మావెన కొడుకు కేతన కేతన ముగ్గురు కొడుకులలో నడిపివాడు భాస్కరుడు కవి తిక్కన పితామహుడు గుంటూరి విభుడైనాడు[4]

భాస్కరుని సంతానం కేతన, మల్లన, సిద్ధన నెల్లూరు నేలే వెలనాటి చోడ లనాశ్రయించినారు[5]

మొదటి మనుమ సిద్ధి కొడుకు తిక్కభూపతి కాకతీయప్రభుల పక్షాన వెలనాటి పృథ్వీశ్వరుని ఓడించినాడు కాకతీయ గణపతి నెల్లూరు వచ్చి తిక్కరాజును సింహ

పురి సింహాసనాధిష్ఠుని చేసి, దక్షిణదేశ యాత్రకు వెళ్ళినాడు[6] ఈ విజయాల వర్ణన నిర్వచనోత్తర రామాయణ కృత్యవతారికలో ఉంది

" లకుమయ గురుములూరికి నెత్తి వచ్చినఁ గొనఁడె
యాహవమున ఘోటకముల...........
తిక్క ధరణి విభుఁబోల రాజుల కరిది గాదె " ( 1-33 )

.. కురుములూరు వద్ద హొయసాలుల జయించి, అశ్వికులను చెఱపట్టినాడు[7] ఇది కడపజిల్లా, సిద్ధవటం తాలూకాలో కుడుములూరు అనే పేరుతో ఉంది[7a]

3 2 2 ఆంధ్రమహా భారతం విరాటోద్యోగ పర్వాల్లో తెలుగనాడు ప్రసక్తి లేదు భీష్మపర్వంలో సంజయుడు ధృతరాష్ట్రునికి భూపరిమాణాన్ని వివరించే సందర్భంలో ఏడు కుల పర్వతాలను గురించి చెప్పినాడు భారతదేశంలోని నదుల ప్రసక్తి ఈ సందర్భంలోనే వచ్చింది అందులో తుంగభద్ర, కృష్ణవేణి, పెన్న గోదావరి, బాహుద నదుల పేర్లున్నాయి

వ " గంగయుఁ దుంగభద్రయు, శ్వేతవతియు, వేదవతియుఁ
బెన్నయు, యమునయుఁ, దమసయు, శిరావతియుఁ గావేరియు
గోదావరియు, నర్మదయు, బాహుదయును. ." (భీష్మ 1-38)

ఈసందర్భంలో సంస్కృత భారతంలో ఈ శ్లోకం ఉంది

" గోదావరీం నర్మదాంచ బాహుదాంచ మహానదిమ్
శతద్రూం చంద్రభాగాంచ యమునాంచ మహనదిమ్[8]"

తుంగ, భద్ర రెండు నదులు కలిసి తుంగభద్ర అయింది మైసూరు మండలంలో నైరుతి దిక్కున కొండలలో పుట్టి ఇవి షిమోగా జిల్లాలో కూడలివద్ద కలిసిపోయి నాయి తుంగభద్ర కర్ణాటక రాష్ట్రం గుండా పారి, ఆంధ్రదేశంలో కర్నూలుజిల్లాకు ఉత్తరంగా వచ్చి, తూర్పుమొగంగా ప్రవహించి కూడలి సంగమం వద్ద కృష్ణలో కలు స్తుంది. ఈ నదిపొడవు 400 మైళ్లు[9]

కృష్ణానది మహారాష్ట్రలోని మహాబలేశ్వరం వద్దనున్న సహ్యాద్రి కొండలలో పుట్టింది దక్షిణ మహారాష్ట్రంలో పశ్చిమంనుండి వచ్చే వెణ్ణా (వర్ణ - వెణ్ణ) నదిని కలుపుకొని 'కృష్ణవెణ్ణా' అయింది తెలుగు సాహిత్యంలో కృష్ణవేణిగా వన్నె కెక్కింది ఈ నది పొడవు దాదాపు 1000 మైళ్లు[10].

పెన్నానది కడప, నెల్లూరు జిల్లాల్లో ముఖ్యమైనది కర్ణాటక రాష్ట్రంలో నంది దుర్గ కొండలలో పుట్టి అనంతపురం, కడప జిల్లాల్లో ప్రవహించి సోమశిలవద్ద దెవి కొండల నడుమ నుండి నెల్లూరు జిల్లాలో ప్రవహించి, ఊటుకూరు వద్ద సముద్రంలో కలుస్తుంది దీనిపొడవు 370మైళ్లు 11

బాహుద మదనపల్లి తాలూకాలోని అశ్వకొండలలో పుట్టి ఉత్తరంగా వాయల్పాడు తాలూకా గుండా పారి, కడప జిల్లాలో పెన్నానదిలొ కలుస్తుంది12 దీనికి చెయ్యేరు, మహాబాహు అనే పేర్లు కూడా ఉన్నాయి13

గోదావరి 'దక్షిణగంగ'గా ప్రసిద్ధిపొందింది సహ్యాద్రి కొండల్లో నాసికా త్రయంబకం దీని జన్మస్థానం నాసిక నగరం ప్రక్కన పారి, పైఠాను (ప్రతిష్ఠాన) నగరాన్ని చుట్టి, మహారాష్ట్రను వదలి, ఆంధ్రదెశంలొ నిజామాబాద్, కరీంనగర్ జిల్లాలకు ఉత్తరంగా ఆదిలాబాదు జిల్లాకు దక్షిణంగా ప్రవహించి, వరంగల్లు, ఖమ్మం జిల్లాలను తూర్పుగా పారి, తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలకు మధ్యగా సాగారి, రాజమహెంద్రపరం వద్ద ఏడు పాయలై తూర్పు సముద్రంలో కలుస్తుంది14
భీష్మ పర్వంలో భారతదెశంలోని వివిధ రాజ్యాల పేర్లు పై సందర్భంలోనే చెప్పినప్పుడు కళింగ, ఆంధ్ర రాజ్యాల ప్రస్తావన వచ్చింది

" పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య కళింగ కుళింగ
కోసల యవన యుగంధరాంధ్ర సింధు చెది. " (భీష్మ 1-40)

ద్రోణపర్వం నుండి స్వర్గారొహణ పర్వందాకా అందే భారతం అంతం వరకు తెలుగు దెశ నామాలు కనిపించవు.

తిక్కన కావ్యాల్లో ఆంధ్రదెశ ప్రసక్తి అత్యల్పమె నిర్వచనోత్తర రామాయణంలో కృత్యవతారికలోను, ఆంధ్ర భారతంలో మూలంలో ప్రసక్తి ఉండే సందర్భాల్లో మాత్రమె తెలుగునాడు ప్రసక్తి తెచ్చినాడు తిక్కన సోమయాజి

3 3 మూలఘటిక కెతన సంస్కృత భాషలో దండి విరచించిన 'దశ కుమార చరిత్ర' ను అదె పేర్తో కేతన తెనిగించినాడు ఈ కావ్యాన్ని తన బంధువు, గురువు ఐన తిక్కన సోమయాజికి అంకితం చెసినాడు

3 3 1 కృతి అవతారికలో కృతికర్త కొట్టరువు తిక్కనామాత్యుని నిజ స్థానమైన విక్రమసింహ పురాన్ని వర్ణించడం జరిగింది

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

మనుమసిద్ధికి రాజధాని అయిన విక్రమసింహపురం గజ, తురగ, పదాతుల్తో, చాతుర్వర్ణ్యంతో, కవిపండితుల్తో కలకలలాడుతుండేది ఆ పురం ధనధాన్యాలకు గాదె ధర్మ దయాచార విద్యా విహార భూమి సర్వవస్తు సమృద్ధితో, నవరత్నాలతో, మంచి నీటి సరస్సులతో, మూడుపువ్వులు ముప్పైకాయలుగా విలసిల్లుతుండేది విక్రమ సింహపుర వర్ణన కవి వాక్కులలో "నా రచియింపఁ బూనిన కృతి కధీశ్వరుండైన కొట్టరువు తిక్కనామాత్యునకు నిజనివాస స్థానంబగు విక్రమసింహపురంబు వర్ణించెద

" కరిఘటానిలయంబు తురగ జన్మస్థలి, సుభటనివాసంబు సుకృత కర్మ
కర్మఠ ద్విజ గణాకరము రాజన్యవం, శావాస మర్త్య వహ్యాశ్రమంబు
కీర్ణకాగారంబు కవి బుధసదనంబు, సుందర శృంగార మందిరంబు
ధనధాన్య సంగ్రహ స్థానంబు ధర్మద, యాచార విద్యావిహారభూమి
తైలఘృత లవణాది సద్ద్రవ్యపాల మమల బహువిధ రత్న రత్నాకరంబు
మధుర జలపూర కాసార మండలంబు నాఁగ విక్రమసింహాఖ్య నగరమొప్పు '

( 1-11 )

తమిళ శాసనాలలో విక్రమసింగపురంగా చెప్పబడిన ఈ విక్రమసింహపురమె నేటి నెల్లూరు ఈ పురాన్ని తెలుగు కావ్యసాహిత్యాలలో వర్ణించిన మొదటికవి కేతనే 16 నెల్లి అనగా వడ్లు అని, (అవి) బాగా పండేస్థలం నెల్లూరు అయిందని అంటారు

కవి తిక్కన మనుమసిద్ధికి హితుడు – అమాత్యుడు కేతన మనుమసిద్ధి వంశ వర్ణన చేస్తూ "అట్టి విక్రమసింహ నగరంబు కధీశ్వరుండును మనుమసిద్ధి మహీవల్లభు వంశావళి వర్ణనం వెట్టిదనిన" (1–12) అంటాడు

3 3 2 తిక్కచోడుడు మనుమసిద్ధి పూర్వీకులలో ప్రసిద్ధ వీరుడు. రాజ్య విస్తరణ చేసినాడు పృథ్వీశ తలద్రుంచినవాడు ద్రవిడ సామంతుల నేలినవాడు "ఏరువ మన్నెల నెఱ పుట్టఁగా నెఱె వైరివిభుల వామలూర నోర్చె" అని ప్రస్తుతింప బడినవాడు ఈ విజయ వర్ణనలో ఏరువనాడు, వామలూరుల ప్రసక్తి కన్పిస్తున్నది

ఏరువనాడు ప్రాచీన ఆంధ్రదేశంలోని నాడుల్లో ఒకటి ఏరువనాడు ప్రసక్తి మొట్టమొదటగా క్రీ. శ. 680 సంవత్సరం ప్రిథివీ వల్లభుని తుమ్మెళ్ళ శాసనంలో కనిపిస్తున్నది17 ఏరువనాడు కమ్మనాటికి పడమరగా, పాకనాటికి పశ్చిమోత్తరంగా పల్నాటికి వాయవ్యంగా ఉండిన ప్రదేశం నేటి నెల్లూరు జిల్లాలోని పొదిలి, దర్శి

తాలూకాలలో కొంతభాగం, కడపజిల్లా బద్వేలు, సిద్ధవటం తాలూకాలలో కొంతభాగం కర్నూలు జిల్లాలోని మార్కాపురం తాలూకా ప్రాంతం కలిసి ఏరువనాడుగా ఉండేది 10 వామలూరు ఎక్కడఉందో పరిశీలించి తేల్చాలి

కేతన వేంగి రాజ్యంలోని వెంటిరాల అగ్రహారానికి అధికారి ఆ విషయం ఈ క్రింది పద్యపాదాలలో ఉంది

" వెంగి విషయమ్మున వెంటిరాలను పేర సభిరామమగు నగ్రహారమునకు

స్రగణి యగు వానిని .. .. . .

మూలఘటికాన్వవాయ . . కేతనార్యుని సత్కవి " (1-23)

3 3 3 దశకుమార చరిత్ర కావ్య భాగంలో ఆంధ్రనగరం, కళింగ నగరం, కళింగ పురం, రామతీర్థం, శ్రీ ధాన్యకటకం అనే తెలుగునాడులో స్థలాల ప్రసక్తి ఉంది తెలుగు నాడులోని ఆంధ్రదేశం, కళింగరాజ్యం ప్రస్తావన కూడా కథాగతంగా ఉంది

3 3 3 1 అంధ్రనగరం | ఆంధ్ర నగరం | ఆంధ్రం ఆంధ్ర నగరం అనేపేరు కాకతీయ మహాసామ్రాజ్య రాజధాని ఓరుగల్లుకు ప్రసిద్ధనామాంతరం కాని మూలంలో సందర్భాన్ని పట్టి చూస్తే ఆంధ్రనగరం అనే మాటను వెంగి నగరానికి పర్యాయంగా ప్రయోగించినట్లు తెలుస్తుంది "ఆంధ్ర నగరాదాగచ్ఛన్ బ్రాహ్మణం. యథా కిల జయసింహే" అని మూలం "ఆంధ్రరాజ నృపతి యగు జయసింహుని పురమ లోననుండి" (11-30) "అంధ్రనగరంబు చేరువ కరిగి తత్ప్రదేశంబున నొక్క కొలనికడం బర్ణశాల గావించుకొని యందు వసించి" (11-39) అని కేతన రచన ఈ జయసింహుడు క్రీ శ 633-663 ల మధ్య ఏలిన చాళుక్య జయ సింహుడు కావచ్చునంటున్నారు[19] ఆంధ్ర చాళుక్యుల రాజధాని వెంగీపురం ఇప్పటి పడమటి గోదావరి జిల్లా, ఏలూరు నగరానికి ఎనిమిది మైళ్లదూరంలో ఉండేది ఇప్పుడు ఆ స్థలంలో పెదవెగి, చినవెగి అనే రెండు కుగ్రామాలు మాత్రం మిగిలి ఉన్నాయి[20] పై చెప్పిన వచనంలోని కొలను వేంగికి దగ్గరగా ఉండే కొల్లేరు సరస్సు[21]

3 3 3 2 కళింగ నగరం, కళింగ పురం, కళింగ దేశం కళింగరాజ్యం తూర్పు తీరంలో ఉత్తరం వైపు శ్రీకాకుళం జిల్లా మొదలు దక్షిణం తూర్పుగోదావరి

జిల్లా వరకు వ్యాపించి ఉండేది వంశధార నది గట్టున పర్లాకిమిడికి 20 మైళ్ల దూరంలో ఉండె నేటి ముఖలింగమె నాటి కళింగ నగరం అని చారిత్రకుల నిర్ణయం 22

" ఏను కళింగ దెశమున కేఁగి కళింగ పురంబు చేరువన మానిత బిల్వసాంద్ర విపినంబున" . . . (11-3) అని కవి వాక్కులు

"ఆంధ్రదేశాధీశుఁడగు జయసింహుఁడు . కళింగ విభునిఁబట్టి కలముల లోపలఁ బెట్టికొని సమగ్ర మద గర్వ మొప్పంగ మగుడ నరిగె" (11-22)

( కళింగ రాజును విడిపించి ) కళింగ నగరమునకనిచి (12-92) అని కవి పల్కులు పై ఇతివృత్తమంతా మంత్రగుప్తుని కథలోనిది

3 3 3 3 మూలకావ్యంలో వున్నట్లుగానే రామతీర్థం కాశేశ్వర క్షేత్రాల ప్రసక్తి తన ఆంధ్రీకరణలో కేతన తెచ్చినాడు కరీంనగర్ జిల్లాలొని మంచిరాలకు అవతలివైపు గొదావరీనదీ ఘట్టాన్నొకదాన్ని రామగుండం అంటారు ఇది దండి నాటి రామతీర్థం కావచ్చు 23 దండి 'మహాకాల నివాసినః' అని కాశేశ్వరాన్ని పేర్కొన్నాడు కాశేశ్వరం త్రిలింగాలలో ఒకటి దీన్నే మంథెన కాళేశ్వరం అని కూడా అంటారు 24 "మహాకాల నివాసుండగు పర మేశ్వరు" "మహాకాశేశ్వరారాధన" అని కాశేశ్వర క్షేత్రాన్ని కెతన ప్రస్తుతించి నాడు "ఏను రామతీర్థమెఁగి క్రమ్మఱ వచ్చి యొక మహోగ్ర వనమునందు" అని వామదెవుని శిష్యుడు సొమశర్మ పలుకులు

3 3 3 4 శ్రీధాన్యకటకం ఆంధ్ర దెశ పురాతన నగరాలలో ప్రసిద్ధి కెక్కిన నగరం ధరణికోట లెక ధాన్యవాటి చైనాయాత్రికుడు హ్యుయాన్ త్సాంగ్ వర్ణనలో మహాంధ్రదేశానికి ధనకటకం రాజధానిగా చెప్పబడింది ఈ నగర ప్రసక్తి తెలుగు కావ్య సాహిత్యంలో ప్రథమంగా తెచ్చిన కవి కేతనే 25

రాజవాహన నృపతి రాజ్యపాలనలో అతని రాజ్యమంతా శ్రీ ధాన్యకటక మయిందట ధాన్యం బాగా పండెస్థలం అని ప్రకృతార్థం ధాన్యకటకం అనే పురం లాగా సర్వసమృద్ధిగా ఉంది అని అప్రకృతార్థం ఇక్కడ రెండవ అర్థం వచ్చేట్లు కేతన అభంగ శ్లేష కూర్చుతం ప్రౌఢసుందరం వాక్యాన్నంతా ఆంధ్రదేశ నగరంగా వెయడం చమత్కారం అతని ఆంధ్రదేశాభిమానం అలాంటిది

రాజవాహన నృపతి ధర్మమున రాజ్య
పాలనము చేయునెడఁ బ్రజ పరమసుఖముఁ
గదిరె ధర యెల్ల శ్రీ ధాన్యకటకమయ్యె
నతని కీర్తులు పాల్వొంగినట్లు వెలసె" (12-93)

ఇలా మూలఘటిక కేతన తన 'దశకుమార చరిత్ర' లో మూలంలో ఉన్న ఆంధ్ర, కళింగ దేశాలను, ఆంధ్ర నగరం, కళింగ నగరం, కాళేశ్వరం, రామతీర్థం అనే ప్రదేశాలను అలాగే చూపించినాడు కృత్యవతారికలో ఎఱువవాడు, వామలూరు విక్రమసింహపురం, వెంటిరాల ప్రసక్తి స్వయంగా కేతన తెచ్చిందే ప్ర ధాన్యకటకం నగరాన్ని చమత్కారంగా కావ్యభాగంలో చేర్చినాడు

3 3 4 ఆంధ్ర భాషా భూషణం అనే లక్షణ గ్రంథం కేతన మరో గ్రంథం ఇది ఏకాశ్వాసం ఈ గ్రంథం అవతారికలో ఆంధ్ర భాషకు తనకు తెలిసిన మార్గాన్ని చూపుతానంటూ కవి చెప్పిన పద్యంలో నెల్లూరు, ఓరుగల్లుల ప్రసక్తి ఉంది కాకతీయ రుద్రదేవుడు (క్రిశ 1158-95) తన ప్రథమ రాజధాని నగరం అయిన అనుమకొండను విడిచి, ఓరుగల్లు నగరాన్ని నిర్మించి అక్కడనుండి రాజ్యమేలినట్లు "నయోగసారం' అనే కావ్యం పేర్కొంటు న్నది కేతన ఓరుగల్లు పురాన్ని, తన స్వస్థానమైన నెల్లూరును ఈ పద్యంలో ఉటంకించినాడు లక్షణ గ్రంథాల్లోకూడా ఆంధ్ర దేశాభిమానం చూపించిన కవులలో ఈ కవి కూడా చేరినాడు

"కంచి నెల్లూరు మఱి యోరుగల్లయోధ్య యను పురంబులపై గంగ కరుగు మనిన పగిది నొక్కత్రోవ చూపెద బహుపథంబు లాంధ్ర భాషకుఁగలవని యరసి కొనుఁడు" (1-13) కంచినుండి కాశికి వెళ్ళే మార్గాలలో ఇది ఒకటి కాఁబోలు

3 4 మంచన మంచనకవి 'కేయూరబాహు చరిత్ర'ను రచించి నండూరి గుండమంత్రికి అంకితమిచ్చినాడు కృత్యవతారిక 77 గద్యపద్యాలలో విస్తృతంగా ఉంది వెలనాటి చోడుల ప్రాభవం, నండూరి గుండమంత్రి నివసించే ధనదుపురం, కృతిభర్త కాకుళేశ్వర తిరునాళ్ళలో అర్థులకిచ్చే దాన ధర్మాల విస్తృతి, కృత్యవతారికలో ఉండే వివిధాంశాలు ధనదుపురం వెలనాటి చోడుల రాజధాని గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకాలోని చందవోలు గ్రామానికి పూర్వపు పేరు ధనదుపురం శాసనాలలో ధనదప్రోలు, ధనదపురము, సనదనోలు అని ఉటంకించబడింది [26]

3 4, 1 ధనదుపురం సామంతరాజులతో, ఏనుగుల్తో, అశ్వాలతో కలకల లాడుతూ ఉండినది ఆ నగరం భూసురులకు దానమిచ్చే మేరుపర్వతం దాతలకు నిత్యనివాసం అన్ని కళలకూ పుట్టినిల్లు సజ్జనులకు నెలవు చతురకాంతలకు రసికులకు వసంతోద్యానవనం మధుర కవిహంసలు విహరించే మానససరోవరం పై అంశాల్ని వర్ణించేది ఈ పద్యం

"జనపాల నుతసింహ వక్రివాలంబు, సామంత నిర్మల రత్నమంటపంబు
రాజత్తురంగ తరంగ పయోనిధి, భద్రేభ మేఘ నభస్స్థలంబు
భూదేవ దేవజాంబూనదాచలము, వదాన్య కల్పక దేవతాపురంబు
బహు కళా కర్పూర భాసి కరండంబు, సుజన ముక్తాఫల పంక్తిచయము

చతురకాంతా ప్రసూన వసంతకేళి రసిక విటజన మధుకరారామలక్ష్మి
మధురకవి రాజ నవహంస మానసంబు నాఁగ ధనదు పురంబు వర్ణనలఁదనరు,
* వసంతవేళ – ధనదు పురీనామన గిరమెప్పు (పాఠాం) (1-17)

పుష్పక విమ నాలవంటి దేవాలయాలు, వెండి కొండలవంటి మేడలు, కుబేరుని నవనిధులు కుప్ప పోసినట్లుండే అంగడి వీధులు, నీరాల నింగి తునకల్లాంటి చెరువులు, ఉద్యానవనాలు, సరస్సులు, ఒప్పిదంగా ఉండే చెరకుతోటలు, ప్రాసంగు వరిచేలు ఇవన్ని ఉన్నాయి ధనదుపురంలో అందుకే అన్ని వైభవాలకు ఆటపట్టు, కుబేరుని పురమైన అలకాపురంతో సాటివచ్చేది ధనదుపురం కవి వాక్కుల్లో పై అంశాల యింపుసొంపులు పరికించండి

" పుష్పకనిభమాంబు భూమిపై నిలిచిన యట్లుండమైన దేవాలయములు
రూప్యాచలము బహురూపంబుల నటించు రమణ శోభిల్లు సౌధముల పెల్లు
నలకాధిపతి నిధులన్నియు వెలిపీట వెదసినక్రియఁ బణ్యవీధికలును
ధాత మెదిసి మిన్నుదడఁగి వైచిన మాడ్కి గనుపట్టు బహుతటాకముల సొంపు

నుపవనంబులు సరసులు నొప్పు చేయు చెరకుఁదోటల ప్రాసంగుచేల మెయిు
నఖిల విభవంబులకు నెలవగుచు వెలయు ధనదుపురమున కెనయగు ధనదు
పురము" (1-18)

కవికి ఈ వర్ణనతో తనివితీరలేదు నగరం సుభిక్షంగా ఉంటంటే దరిద్రం మచ్చుకు లేనట్లే గదా అందుకే పేదరికానికి చిహ్నమైన మంచి కడవ, నులకమంచం, పూరిల్లు

నూలిచీరలు, రత్నఖచితం గాని ఆభరణాలు ఆ నగరంలో ప్రజలకు తెలియనే తెలియవట

" మంటికడప నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్న కీలితంబు
గాని తొడవు పుడమిఁగలుగు టెఱుంగరు
ధనదపురములోని జనము లెల్ల" (1-19)

వైభవాల్ని, ధనధాన్యాల్ని భోగభాగ్యాల్ని ఇంత అతివేలంగా వర్ణిస్తే తప్ప 'మంచన' కలం మరో అంశం పైకి పోలేదు

3 4 2 "వెలనాటి చోడ మనుజేంద్రుదు సమాత్యత యానవాల గాఁ గల తిం కంబుగా మనిన కొమ్మన ప్రెగ్గడ" (1-25) "ముప్పదిరెండు చోట్ల" విఘ్నప్రతిష్ఠలు వెలయించినాడు

రమణీయమైన కూర్మ గ్రామమున యందుఁ గుడుద్రి పురమున గ్రొత్తచర్లఁ
త్రిపురాంతకమునఁ జేర్చిన కొట్టిచౌస వాగ్గరమునఁ గళింగరాష్ట్రంబులోని
యెలమంచిలాదిగా నెలమి ముప్పదిరెండు విఘ్న ప్రతిష్ఠలు వెలయఁజేసి నాడు (1-26)

శ్రీకూర్మంలో ఉందే శ్రీకూర్మ దేవాలయం క్రీ శ 6వ శతాబ్దానికి పాలిం చిన గంగరాజుల కాలంలో నిర్మింపబడింది కూర్మావతారంలోని విష్ణువుకు నిర్మింప బడిన దేవాలయం మొత్తం భారతదేశంలో ఇదొక్కటే ఇండోనేషియాలో ఉండే కూర్మాలయం నిర్మించింది అక్కడికి వలస వెళ్ళిన కళింగులే[27]

విశాఖపట్నం జిల్లాలోని ఎలమంచిలి అనే పేరుతో క్రీ శ 945 నాటికే శాసనాల్లో కన్పిస్తుంది[28] కళింగ రాష్ట్రంలోని యెలమంచిలాదిగా అని కవి చెప్పడం వల్ల ఇది ఆనాటికి కళింగ రాష్ట్రంలో ఉండినదని చెప్పుకోవాలి నేటి విశాఖజిల్లాలో ఇది ఒక తాలూకాగా ఉంది త్రిపురాంతకం కర్నూలు జిల్లాలోఉండే ప్రసిద్ధ శైవ క్షేత్రం కుదుద్రిపురం, కొట్టిచౌన, వాగ్గరం వీటి ఆనుపానులు తెలుసుకోవాల్సిఉంది

3 4 3 కొమ్మనామాత్యుడు " వెలనాటి చోడ మనుజేంద్రాధిపాజ్ఞనం బూ . . యెకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై ధరణిం చేర్చిన పాకనాడు నిజ దోర్దండైక లగ్నంబుగా బరిపాలిం" చినాడు (1-27) "కటక సామంతులు కరి హయ బహుళసేనతొ నేతెరన్ ఢలపడియె .. క్రొత్తచర్ల పంసర భూమిన్" (1-29)

3 4 4 కొమ్మనామాత్యుని ముగ్గురు కొడుకులలో భీమన ఒకడు భీమన పుత్రుడు గుండన మంత్రి అతడు కవులపాలిటి కల్పవృక్షం "కాకుళేశ్వర తిరునాళ్ళలో నర్థుల కేపేట నర్థమిచ్చే" అనవాయతీ గలవాడు (1-44)

గుండన మంత్రి మాడలు, రత్నాలు, తిరునాళ్ళలో ఎగజల్లితే అవి వడగండ్లతో కలిసి కురిసే బంగారు వానలా ఉంటుందట అర్థులు చాతక పక్షులు గదా మరి! ఆ చోద్యాన్ని పలికేది ఈ పద్యం చిత్తగించండి.

" నలువుగఁ గాకుళేశు తిరునాళులలోపల గుండమంత్రి ని
ర్మలమతి చిట్టు వేగముగ మాడలు రత్నచయంబుఁ జల్లఁ గా
నలవడు హేమవృష్టి క్రియ నర్థులు చాతక కోటిగాఁగ లోఁ
గలకొన రాలు ముత్యములు గాఁగఁ బడున్ వడగండ్లకైవడిన్" (1-45)

శ్రీకాకుళేశుడు ఆంధ్ర విష్ణువు ఆ స్వామి తిరునాళ్ళ విషయమె పై రెండు పద్యాలలో విస్తరించబడింది ఆ తిరునాళ్ళకు ప్రజలు తండోపతండాలుగా వచ్చే విషయం అంతర్గర్భితంగా ఉంది

3 4 5 రాజశేఖర కవి (క్రీ శ 907 ప్రాంతం) 'విద్ధసాల భంజిక' అనే సంస్కృత నాటిక మంచన కేయూర బాహు చరిత్రకు మూలం అయినా ఈ విషయాన్ని కవి ఎందుకో తడవలేదు ఉజ్జయిని రాజధానిగా త్రిలింగ రాజ్యాన్ని విద్యాధర మల్లుడనే రాజు ఏలుతున్నట్లు మూలంలో ఉంది మంచన 'కళింగ' దేశంలోని త్రిపురీ నగరాన్ని ఏలే కేయూరబాహు మహారాజు అని పేరు మార్చినాడు

ఈవిధంగా మంచన కేయూరబాహు చరిత్రలో కృత్యాదిలో ధనదుపురం, క్రొత్తకర్ల, ఎలమంచిలి, రొగ్గరం, కొట్టిపొన, ఇంజరం, త్రిపురాంతకం, శ్రీకాకుళం, కుసుదుర్తిపురం, పాకనాడు, కళింగ రాష్ట్రం అనే స్థలాలు తెలుగునాడుకు సంబంధించినవి కన్పిస్తున్నాయి

3 5 యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతక కర్త 142 పద్యాలుండే ఈ శతకంలో దూదికొండ, శ్రీగిరిల ప్రసక్తి ఉంది

3 5 1 దూదికొండ గ్రామంలో సోమేశ్వరారాధ్యుని కరుణతో ఈ శతకాన్ని కవి చెప్పినాడట కర్నూలు జిల్లా ప్రత్తికొండ తాలూకా, ప్రత్తికొండ గ్రామానికి దగ్గరలోనె దూదికొండ అనే గ్రామం ఉంది

" అభిరమ్యంబుగ పాదికొండ మహనీయారాధ్య సోమేశ్వర
ప్రభు కారుణ్య వసంతకుంజనిత (మత్పద్య) మద్వాక్యప్రసూనావళిన్
. భవత్పదద్వయము నారాధింతు సర్వేశ్వరా " (131 పద్యం)

3 5 2 పురాతన భక్తనిర్మిత స్థానాలైన శ్రీగిరి వంటి దివ్య తీర్థాలు దర్శి స్తేనే దోషాలు పోతాయి సాక్షాద్భక్తులనే చూస్తే సకల పాపమంతా నశించదా? అంటున్నాడు కవి ఈపద్యంలో శ్రీగిరిని ఎంత పవిత్రక్షేత్రంగా కవి భావిస్తున్నాడో ఈపద్యం ప్రతిబింబిస్తుంది పరికించండి

" ధరణిం బ్రాక్తన భక్త నిర్మిత మహస్థానంబులై యొప్పు శ్రీ
గిరి ముఖ్యంబగు దివ్యతీర్థములు భక్తిం జూచి రే వారి దు
స్తర దోషంబులు వాయునన్న ... . సర్వేశ్వరా " (27 పద్యం)

శైవులు మొదటి పుణ్యక్షేత్రంగా భావించి పూజించే వారణాసి ప్రసక్తి 111వ పద్యంలోను, తీర్థాలలోకెల్లా పుణ్యతీర్థంగా కొనియాడబడే గంగానది పవిత్రత 119వ పద్యంలోను కవి ఉటంకించినాడు

3 6 మారన • అష్టాదశ పురాణాలలో 'మార్కండేయపురాణం' ఏడవది దానిని సంస్కృతం నుండి తెనిగించిన కవి కవిబ్రహ్మ తిక్కన సోమయాజి శిష్యుడు మారన ఈ కావ్యం "ప్రతాపరుద్రదేవ సామ్రాజ్యవర్ధన స్థిరపరేతి కరణకుశలుండు నాగయ గన్నవిభు"నికి అంకితం

3 6 1 ఈ కావ్యంలో ఓరుగల్లు, గోదావరిపరివాహప్రాంతం, కళింగ, ఆంధ్ర దేశాల ప్రసక్తి ఉంది నాల్గవ ఆశ్వాసం 175వ పద్యంలో పర్వతాల పేర్లు, 176వ పద్యంలో భారతదేశంలోని నదులు చెప్పబడినాయి గోదావరి ప్రసక్తి ఈ పద్యంలో ఉంది సహ్యాద్రికి ఉత్తరంగా గోదావరి, ఆ నది పారే ప్రాంతం మనోహరంగా, పవి త్రంగా ఉందట

" సురుచిరమగు సహ్యా నగో
త్తరమున విలసిల్లుచుండుఁ దద్దయు గోదా
వరి తత్ప్రదేశమున మనో
హరము పవిత్రము ననిందర్ర యగుఁ ధరిత్రిన్' (4-179).

కళింగ, ఆంధ్ర దేశాల ప్రసక్తి..... "కళింగ కుంతలాంధ్రాదులును" (1-181) అని ఉంది

నాగమ గన్నవిభుడు "మహితాంధ్ర నరేంద్ర దయాకటాక్ష కాంతాశ్రిత సర్వ విభవ దక్షు"డట (5-373)

నాటి ఆంధ్రరాజ్యమె కాకతీయ రాజ్యం కాకతిరాజుల రాజ్యానికి ప్రాకారం అయిన భుజ పరాక్రమం గలవాడు గన్నయ

" శ్రీకాకతి నృప రాజ్య ప్రాకారాయిత భుజా పరాక్రమ గణ్యా " (6-1) కాకతీయ చక్రవర్తుల రాజధాని ఓరుగల్లు ఇది అమరావతితో సరితూగేది ఆ పుర రక్షకుడు గన్నయసేనాని."... "సురపుర సదృక్ష కాకతి నరపాల కటక పాలనధుర శౌర్యా (7-286) అని గన్నయకు కవి ప్రస్తుతి

3 7 బద్దెన ఆబాలగోపాలము పఠించే 'సుమతి శతక' కర్త బద్దెన తిక్కన యుగంలోనివాడే ఈ శతకంలో తెలుగునాడుకు సంబంధించిన ప్రదేశనామాలేవీ కనిపించవు

3 8 తిక్కన సాహిత్య పరంగా మహోన్నత స్థానాన్ని అధిరోహించిన వాడు మన అంశం దృష్ట్యా యోచిస్తే తిక్కన సాహిత్యంలో పరిశోధనకు లభించే విశేషాలేమీ లేవనే చెప్పుకోవాలి

ఈ యుగంలోని కవులలో కేతన నాటి విక్రమసింహపురాన్ని కన్నుల గట్టి నట్లు వర్ణించినాడు ఎంతో చమత్కారంగా ధాన్యకటకాన్ని తన కావ్యంలో చొప్పించి నాడు ఆ మధ్యనే వైభవానికి మణిమకుటంలా ఉండే ఓరుగల్లును పేర్కొన్నాడు మంచన తన కాలంనాటి ధరదుపురాన్ని అత్యంత హృద్యంగా వర్ణించినాడు తన కాలం నాటి విష్ణుస్థానాన్ని పేర్కొన్నాడు శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువు తిరునాళ్ళను ఘనంగా చెప్పినాడు మారన గోదావరి-ఆప్రాంతం పవిత్రం, సుందరం అన్నాడు ఓరుగల్లును అమరావతికి పోల్చి చూపినాడు

తిక్కన యుగంలో తెలుగునాడు విస్తారంగా కావ్యాలలోకి ఎక్కకపోయినా, ఆయుగంలోని కొన్ని ముఖ్యప్రదేశాల వర్ణన సూక్ష్మంగా అయినా ఉన్నందుకు మనం సంతోషించాల్సిఉంది



## సూచికలు :


1 ఆంధ్ర సాహిత్య చరిత్ర, పింగళి లక్ష్మీకాంతం, పు 167
2 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు. 75
3 ఈ శ్లోకాలు పై గ్రంథంలో 18 వ పుటలోనివి
4 కర్ణ పర్వము - అవతారిక, పు 59
5 నిర్వచనోత్తర రామాయణము, పీఠిక పు XIII - XIV
6 కర్ణపర్వము - అవతారిక పు. 53
7. ప్రాచీన దక్షిణ భారత చరిత్ర పు 604 - 613
7. ఎ హరివంశము పీఠిక
8 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 134
9 ,, ,, పు. 161 - 162
10 ,, ,, పు. 96-97
11 ఆంధ్ర దర్శిని పు 517
12 ,, పు 361
13 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 258
14 ,, ,, ,, పు 134
15 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 192-193
16 "తులు తటాక నామాభిధాననగ (రా) ధిష్ఠానుం బయి ఎఱువ విషయం చేళన్"
ప్రాచీనాంధ్ర శాసనాలు పు 18
17 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 39
18 దశకుమార చరిత్ర, పీఠిక పు 47-48
19 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 81
20 ,, ,, పు 24
21 ,, ,, పు. 75
22 దశకుమార చరిత్ర, పీఠిక పు 47-48
23 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము పు 171
24 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 339
25 ,, ,, పు 339
26 ఆంధ్రప్రదేశ్ దర్శిని, పు 147
27 ప్రాచీనాంధ్ర శాసనాలు, పు 246




# 4

# ఎఱ్ఱన యుగ సాహిత్యంలో తెలుగునాడు

4 0 ఎఱ్ఱాప్రెగ్గడ శంభుదాసుడు ప్రబంధ పరమేశ్వరుడు కవిత్రయంలో ఒకడై ఆంధ్ర మహా భారతాన్ని పూర్తి కావించిన ఘనత యీయనకే దక్కింది ఎఱ్ఱన యుగాన్ని క్రీ శ 1320 నుండి క్రీ శ 1400 సంవత్సరం దాకా ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు నిర్ణయించినారు

యుగకర్త ఎఱ్ఱనతో పాటు ఆ యుగంలో వెలసిన కవులు భాస్కరుడు, నాచన సోముడు, రావిపాటి త్రిపురాంతకుడు, చిమ్మపూడి అమరేశ్వరుడు, కృష్ణమాచార్యులు, పోతిశెట్టి లింగకవి అనేవారు

ఎఱ్ఱన యుగ సాహిత్యంలో తెలుగునాడు ప్రసక్తి ఎలా ఉందో పరిశీలించడం ఈ ప్రకరణ లక్ష్యం

4 1 ఎఱ్ఱాప్రెగ్గడ శంభుదాసుని రచనలు నాలుగు రామాయణము, హరివంశము, భారతరణ్యపర్వ శేషము, నృసింహపురాణము అనేవి వీటిలో రామాయణం నామమాత్రావశిష్టం[1]

4 1 1 హరివంశము సంస్కృత 'హరివంశా' నకిది తెనిగింపు అద్దంకి రాజధానిగా ఏలుతుండిన వేమారెడ్డికి అంకితం వేమారెడ్డి తమ్ముడు మల్లారెడ్డి ఎఱ్ఱనను అన్నకు పరిచయం చేసినవాడు మల్లారెడ్డి మోటుపల్లిని జయించి అన్న కిచ్చినాడు అతడు కురుమలూరు రాజధానిగా ఏలుతుండేవాడు హరివంశ కృత్యవతారికలో అద్దంకి, మోటుపల్లి, కురుమలూరుల ప్రసక్తి ఉంది

4 1 1 1 అద్దంకి త్రిలింగ జనపదంలోని పట్టణం వేమారెడ్డి పాలించిన రెడ్డి రాజ్యానికి రాజధాని శ్రీ పర్వతం తూర్పుపాదం మొదలు తూర్పు సముద్రం వరకు గుండ్లకమ్మ నదికి రెండువైపులా విస్తరించి ఉండిన పూంగి నాటిలోని నగరం[2]

> " తనకు నద్దంకి రాజధానిగాఁ బ
> రాక్రమంబున బహుభూము లాక్రమించి
> యనుజ తనుజ బాంధవ మిత్రజనులకిచ్చె
> నెదురె యెవ్వరు వేమ భూపాలునకు " (హరి పూ 1-23)

ఇది ఎఱ్ఱన కృతిభర్త కిచ్చిన ప్రశంస

4 1 1 2 కడప జిల్లా సిద్ధవటం తాలూకాలోని నేటి కుసుమలూరె కవి కాలం నాటి కుసుమలూరు 3

కుసుమలూరి నాయకుడైన మల్లారెడ్డి సకల ద్వీపాంతరాల నుండి రత్నాలు తెప్పించి అన్నను సదా అర్చిస్తుండేవాడు

సకల ద్వీపాంతర ర
త్న కలాప నిరంతరార్చనా చలనారం
భక కుసుమలూరి నా
యక మల్ల చమూవరేణ్యు హారి సిపేవ్యా" ( 1-28 )

4 1 1 3 ద్వీపాంతరాల నుండి రత్నాలు ఇతర సద్వస్తువులూ తెప్పించా లంటే ఏదైనా ఒక ఓడరేవు తన వశంలో ఉండాలి కదా ! అందుకే మోటుపల్లిని జయించినాడు మల్లారెడ్డి ఆ విషయాన్ని రమణీయంగా వినిపిస్తుంది ఈ పద్యం

బాహా దర్పమునం బ్రతీప ధరణీ పాలావలిం దోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లి గొని సప్తద్వీప సద్వస్తుసం
దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతిఁబోషించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్ల రథినీనాథుండు గాఢోద్ధతిన్" (1-28)

మోటుపల్లి కాకతీయ, రెడ్డి, విజయనగర సామ్రాజ్యాధీశుల కాలంలో విఖ్యాతి చెందిన రేవుపట్టణం ఇప్పటి గుంటూరు జిల్లా, బాపట్ల తాలూకాలో వుంది 4

4 1 1 4 హరివంశ కావ్య భాగంలో ఆంధ్రదేశ ప్రసక్తి వచ్చింది శ్రీకృష్ణ బలరాములతో పోరాడేందుకు కంసుడు పంపగా చాణూరుడు, ముష్టికుడు అనే మల్లులు వస్తారు వారిలో చాణూరుడు ఆంధ్ర మల్లుడు

" చాణూరుఁడనం ద్రిలోకములఁ బ్రఖ్యాతు న్మహామల్లు" (9-105), "ఇష్టి ధంబునం బంపువడి యాంధ్రకోసలదేశీయులగు నమ్మల్లులిద్దఱును" ( 9-118 ) "కరూశ5 దేశంబునం బ్రభవించిన చాణూరుండను బ్రసిద్ధుండైన వీనిచేతఁ బెక్కండ్రు మల్లులు సిక్కిరి " ఎఱ్ఱన మొదట ఆంధ్రకోసల దేశీయులని చెప్పి తర్వాత ఈ విధంగా ఎందుకు చెప్పినాడో పరిశీలించాల్సి ఉంది

4 1 1 5 మధ్యాంధ్ర దేశాన్ని వేమారెడ్డి ఏలుతుండేవాడు

" శ్రీమధ్యాంధ్ర సుదేశ
క్షేమద కరవాల .. ...
... ... ... ...
వేమక్షితి పాల ... ... ..." ( హరి. ఉ. 4-1 )

బ్రహ్మకుండి (గుండ్లకమ్మ) నదికి గోదావరీ నదీ తీరానికి మధ్య ఉండే దేశం "మధ్యాంధ్ర దెశం' 6

4.1.1 6 పై పద్యానికి పాఠాంతరంగా ఇంకో పద్యముంది అందులో వేమా రెడ్డి గురువు ఘోడెరాయ గంగ గురుని ప్రశంసఉంది గంగగురుడు శ్రీశైల ప్రాగ్ద్వార పాలకుడైన త్రిపురాంతక దేవునికి పరమభక్తుడు శ్రీశైల ప్రసక్తి ఈ పద్యంలోఉంది

" శ్రీపర్వతేశ భక్తి ఖ్యా
పిత గుణ ఘోడెరాయ గంగ గురు కృపా
స్థాపిత సామ్రాజ్య సము
ద్దీపిత వేమ క్షితీంద్ర దీప్త దవేంద్రా" (హరి ఉ 4-1)

4 1 2 ఆంధ్ర మహా భారతము - అరణ్య పర్వశేషము . ఆంధ్రమహా భారతంలో అరణ్య పర్వం ఏడాశ్వాసాల్లో ఉంది ఏడో ఆశ్వాసం చివరి పద్యాలలో మాత్రమె ఎఱ్ఱన తన గురించి చెప్పుకొన్నాడు

4 1 2 1 పాకనాటిలోని గుడ్లూరు నీలకంఠస్థానం కవి స్వస్థలం గుడ్లూరు మన్నేఱు తీరం మీద, నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకాలో ఉంది7

" భవ్యాచారిత్రుం డాపస్తంభ సూత్రుండు
.. ... ... ... . .
ఇలఁ బాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యెసక మెసఁగు
గుడ్లూరు నెలవుగ ... .
. . .. ధర్మైక తత్పరుఁడెఱ్ఱనార్యుండు" (అరణ్య 7-469)

గుడ్లూరును నీలకంఠేశ్వర స్థానంగా కీర్తించే ఒక చాటువుంది అది

"నిను సేవించినఁగల్గు మానవులకున్ విటీవధూటీ ఘటీ
ఘన కోటీ శకటీ కటీ తటి పటీ గంధేభ నాటి పటీ

రనటీ హార పటీ సువర్ణ మకుటీ ప్రోచ్ఛాటికా పేటికల్
కనదామ్నాయ మహా తురంగః శివలింగా • నిలకం రెశ్వః[8]

ఎట్టన తెనిగించిన భారతారణ్య పర్వభాగంలో ఆంధ్రదేశ ప్రసక్తి ఎక్కడా కనిపించదు

4 1 3 నృసింహ పురాణము ఈ కావ్యం అసలు పేరు లక్ష్మీనరసింహావతారము మూలం బ్రహ్మాండ పురాణాదులు అని చెప్పబడినా బ్రహ్మాండ పురాణంలో ఈ కథ అల్పాల్పము... కావున కొంత కల్పించినట్లు ఊహింప వచ్చు[9] ఈ కావ్య పరిమితి ఐదాశ్వాసాలు

4.1 3 1 నృసింహ పురాణం అహోబలక్షేత్ర మాహాత్మ్య గ్రంధంగా చెప్పుకోవచ్చు అహోబలక్షేత్రం, తీర్థం, దైవం, క్షేత్రనామం వచ్చినవిధం, క్షేత్ర ప్రాశస్త్యం, మాహాత్మ్యం, అహోబల క్షేత్రంలోని వివిధ తీర్థాలు పవిత్రవనం ఇలా అహోబల క్షేత్ర సంబంధి విషయ సమస్తం కావ్యంలో రూపు సంతరించుకొంది

4 1 3 2 అహోబలం కాక సింహాచలం, వేంకటాచలం, పుష్పగిరి, సిద్ధాచలం, గోదావరి, కృష్ణవేణి వంటి పుణ్యక్షేత్రాల, తీర్థాల ప్రసక్తి కూడా ఆనుషంగికంగా ఈ కావ్యంలో ఉంది

కృత్యవతరణికలో వెలనాడు, పగినాడు అనే ఆంధ్రరాజ్య విభాగాల ప్రస్తావన కనిపిస్తుంది

4. 1 3 3 అహోబలం పురాతన పవిత్ర క్షేత్రం కర్నూలు జిల్లా నుండి చిత్తూరు జిల్లా దాకా వ్యాపించిన నల్లమల కొండలు ఆది శేషుని రూపంగానూ, శేషుని శిరస్సు వెంకటాచలం, నడుము అహోబలం, తోక శ్రీశైలంగాను పురాణాలు వాకుస్తాయి10 కర్నూలు జిల్లా, ఆళ్ళగడ్డ తాలూకాలో ఈ క్షేత్రం వెలసి వుంది

నూటయెనిమిది దివ్య తిరుపతులలో ఉండేవి ఆంధ్రదేశంలో రెండే రెండు. 1) తిరుపతి-తిరుమల, 2) అహోబలం. దీనికి తమిళంలో శిఙ్గవెలుకున్ఱమ్ అని పేరు పన్నెండుగురు ఆళ్వార్లలో ఒకడైన తిరుమంగైయాళ్వార్ అహోబలస్వామిని కీర్తించినాడు 10

ఏ క్షేత్ర ప్రాధాన్యం కావ్యంలో ఉటంకిస్తే ఆ క్షేత్రం పేరు మీదనే అక్కడి దైవాన్ని పేరుపెట్టి కొలవడం జరుగుతుంటుంది అహోబల క్షేత్ర దైవం అయిన

లక్ష్మీనరసింహస్వామిని కూడా క్షేత్రంలో కలిపే ఈ కావ్యంలో పలుచోట్ల కవి కొనియాడినాడు 1) అహోబల తీర్థగ్రామణి, అహోబల తీర్థనాథుడు, అహోబల తీర్థనాయకుడు, అహోబల తీర్థస్వామి, అహోబల తీర్థ స్థితుడు 2) అహోబల నాథుండు, అహోబల నాయకుడు, 3) అహోబలనిలయుడు, అహోబలనివాసుడు 4) అహోబలపురీశుడు, 5) అహోబల స్ఫార నివాసుడు, 6) అహోబలాధీశుడు, 7) అహోబలేన నరసింహుడు, అహోబలేన నారసింహుడు 8) అహోబలేశుడు అహోబలేశ్వరుడు ఇది కవి ఆ స్వామిని కొనియాడిన నామపరంపర

4 1 3 4 **అహో**బలం, అహోబిలం అని ఈ క్షేత్రానికి రెండు పేర్లు హిరణ్యకశిపుని చీల్చి చంపిన తర్వాత, స్వామి ఉగ్రమూర్తిని చూచి "నరసింహమ్ పరమమ్ దైవమ్ అహో, బలమ్ అహో, బలమ్" అని సురలు కీర్తించినారు అందు వల్ల హిరణ్యకశిపుని స్వామి చంపిన ఆ స్థలం 'అహోబలం' అయింది కొండపై ఉండే పెద్దగుహలోన గరుడుడు స్వామిని పూజించి ప్రత్యక్షం చేసుకున్నాడు గనుక 'అహోబిలం' అనే పేరొచ్చింది[11]

'అహోబలం' అనే పేరు పైచెప్పిన కారణం వల్లనే వచ్చిందని ఎఱ్ఱన

" .. ..కడింది యసురం బోదివి పట్టి ..... గగనంబున కెగసి యసహ్యాదిమ వీరుండు...సముత్తుంగ శృంగ సంఘటిత వియత్తలంబగు మహాశైలంబు నకు నవతరించి యందాసీనుండై (5-98) కులిశాకార నఖాంకుర తీవ్ర పాతనం బల నసురేంద్రు నురము బొల్పుజెఱించి కలంచి శోణితంబులు దొరఁగించె(దుంచెఁ చెను ప్రోవులుగా బల్చు పేవు లుక్కునన్ (5-100) . భీషణ దానవ దేహారక్త ముచే . నిండుఁగాలువలు సాగి ... క్రొత్త కావి సెలయేటుల చెన్నొదఁగూడె నగ్గిరిన్ (5-102) . మహామునులును నమిషులును జయజయ శబ్దంబుల నద్దేవు నభినందించిరి అజ్జగదీశ్వరుండిట్లనియె ఈ మహనీయ స్థానంబు పరమమంగళంబై నన్నుం దనయందు నునుపం గోరుచున్నయది నాహృదయంబునన్ జూడ్కులు సింతం ప్రియంబు నొందెం గావున నిమహాశైలం బనంద యుంతఁగిలవాఁడ మీరు మదయ బలం బహో బల శబ్ద పూర్వకంబుగాఁ బ్రశంసించిరి గావున ని తీర్థం బహో బల నామధేయంబునఁ ద్రిభువన పావనంబై వెలయుఁగాత" (5-122) అని నరసింహ స్వామి ఈ పేరుంచినట్లు తెలుస్తున్నది

4135 గరుడునిపై తాను ఆసీనుడై వున్నట్లు ఆ కొండను కూడా అధిరోహించి ఉంటాడు కాబట్టి గరుడాద్రి అని కూడా అహోబల పర్వతం పిలువబడుతుందన్నాడు నరసింహస్వామి

"నాచేత నధిరూఢమైన యిగ్గిరియును గరుడాద్రి యనం బ్రఖ్యాతి వహించు నని యానతిచ్చెను" ...... (5-122) ఎట్టిన ఈ విషయాన్ని పురస్కరించుకొని "గరుడాచలోజ్జ్వల గరుడాసీనునకు" (అవతారిక 38) "శ్రీమద్గురు గరుడాచలధామ" (3-1) "గరుడాద్రి కందర స్థిర మందిరంబున వెలుపారు నన్నహోబల పురీశ" (5-150) "గరుడాద్రి దివ్యసింహాసను" (5-163) అని సంభజించినాడు

4136 అహోబలపర్వతంలో రెండు శిఖరాలున్నాయి. ఒకటి గరుడాద్రి మరొకటి వేదాద్రి వేదాద్రి పైన స్వామి వెలసినట్లు కవి చెప్పిన పలుకులివి "భక్త విభవ సులభ ... నిగమ శిఖరి సింహ" (5-142) అనేవి వేదాద్రి అనే పేరు ఎలా వచ్చిందో ఎట్టిన వచనంలోనే కనుగొందాం

స్వామి అహోబలంపై నెలకొన్నాడు శ్రీమహాలక్ష్మి వచ్చి స్వామి అంకపీఠి చేరింది "ఆ క్షణంబ వేదంబులు నాల్గును సాకారంబులై తత్సమీప శైలంబున నవతరించి సహించి చనుదెంచి లక్ష్మీనరసింహు ననేక ప్రకారంబులన్ బ్రస్తుతించె నది కారణంబుగా మునురా శైలంబునకు వేదాద్రి యను నభిధానం బొనరించి కొని యాడిరి (5-129)

వేదాద్రి మహిమను స్వామి ఎంతో కొనియాడినాడు ఈ వేదశైలము విద్యా విభవాన్ని తన్నుకొలిచిన సాధులకు ఇస్తుంది (5-159) వరసగం అనిలకల్మష వెదవినోదం వెద వేదాంగ విధా విదితం నిజలభవ సిర్వేచాది విధుతి వివేక వేద్యం (5-160) అగమశైల శృంగాల మీద నేను రక్కసుని రక్తాన్నే మైపూతగా అలంకరించుకొని శ్రీనరసింహ మూర్తిగా వెలసి ఉంటాక (5-161) అని

వేదాద్రికి గరుడాద్రికి అభేదం చెప్తూ లక్ష్మీనరసింహ స్వామి గరుడాద్రి మహిమను నుతింపాలంటే ఎట్టివారికైనా శక్యంగాదు (5-161) గరుడాద్రి దరి తాలనే సర్వాలకు గరుత్మంతుడు సిద్ధ సాధ్య గంధర్వ మరుద్గణులకు సేవింపబడినది (5-162) గరుడాద్రి దివ్యసింహాసను నన్ను ఉన్నత దయార్ద్రని అహోబలతీర్థ నాధుని లక్ష్మీనరసింహుని భజించే ఉత్తములు సకలార్థములను సాధించుకొని సుఖంగా ఉంటారు (5-163) అని వాక్రుచ్చినాడు

ఈ విధంగా తాను నెలకొన్న గరుడాద్రిని, వేదాద్రిని నరసింహుడే స్వయంగా ప్రస్తుతించినట్లు కవి పలుకులు

4137 అహోబలక్షేత్ర మహిమను లక్ష్మీనరసింహుడు బహువిధాల ప్రస్తుతించినట్లు కవి నృసింహ పురాణంలో వాకొన్నాడు

నైమిశారణ్యంలో మహర్షులు రోమహర్షుని వద్ద "అఖిల పురాణేతి హాసంబులు వినుచుండి ఏ తీర్థము కలియుగమున భూతాభయ దాన చతుర పుణ్యోన్నతి నుద్యోతించు?" (1-2) అని ప్రశ్నిస్తారు సమాధానంగా రోమహర్షనుడు గాలవుడనే ముని వృత్తాంతం ఉటంకిస్తాడు గాలవుడనే ముని తీర్థయాత్ర చేస్తూ సింహచలం, గోదావరి, కృష్ణవేణి, వెంకటాచలం, శ్రీ శైలం, పుష్పనగరం ఇవన్నీ దర్శిస్తాడు అహోబలం చేరి భవనాశనిలో క్రుంకులిడి అహోబలేశ్వరుని భజిస్తాడు ఆ క్షేత్రంలో ఉండే దేవశ్రీవుడనే మునిని ఇలా అడుగుతాడు (1-10 నుండి 18 దాకా) ఇక్కడే పూర్వం జనార్దనుడు వాడిగోళ్ళతో రాక్షసుణ్ని చంపి, అతని కొడుకును మెచ్చుకొన్నాడంటారు (1-19) విష్ణువు నరసింహమూర్తిగా ఎందుకు పుట్టాడు? ఆయనకు అహోబల నాథుడనే పేరెందుకు వచ్చింది? ఆ క్షేత్రంలో ఉండే పుణ్యతీర్థాలేవి? సవిస్తరంగా నాకు వినిపించి నన్ను ధన్యుణ్ణి చేయండి' అని ప్రార్థిస్తాడు గాలవుడు (1-20) దేవశ్రీవుడు క్షేత్ర విషయాల సమస్తాన్నీ వివరిస్తాడు

"ద్వితీయ వైకుంఠంబనంబరగి యహోబలంబు సకల కళ్యాణంబులకు జన్మభూమియు, సమస్త సంపదలకు నాస్పదింబును, నఖిలధర్మంబులకు నాధారంబును బరమ భాగవతైశ్వర్యంబులకు నిత్యనివాసంబు" (5-1, 6) ఎలా అయింది?

"మేరు మందర ఆది శైలంబులును, గంగాయమునా నదులును, ప్రభాస పుష్కర మహా తీర్థంబులును . కాశీక్షేత్ర .. ఆది పుణ్యక్షేత్రంబులును, పుష్కరారణ్య దండకారణ్య అరణ్యంబులును . సాగరంబులును. మహాధ్వరంబులును . యోగాంగంబులును మహాసిధులును. కాలవిశేషంబులును . లోకంబులును .. దిగ్విదిగ్గజంబులు క్రమనియాకారంబులు ధరియించి అయ్యాదిమ దేవుం గొలువ నావిర్భవించె వసుమ్మద . దేవగణంబుల జయజయ శబ్దంబులును, పరమ యోగీంద్ర సాధువాదంబులును, ప్రహ్లాద . భక్తజనంబుల నిరంతర స్తోత్ర నాదంబులును, బ్రహ్మేంద్ర మహా ప్రసాదాభినందన ధ్వనులును, కిన్నరవీణా నిస్వనంబులును, భరతాదుల యాతొూద్య నినదంబులును గలసి బ్రహ్మాండ కటాహంబు

పూరించె నివ్విధంబున నభినవ స్వర్గం బనందగి యపర బ్రహ్మలోకంబుగా నొప్పారి, ద్వితీయ వైకుంఠంబనంబరఁగి" (5-148) నందువల్లనె సకల కళ్యాణస్పదమయింది అహోబల క్షేత్రం

4 1 3 8 లక్ష్మీనరసింహస్వామి తన్ను ప్రస్తుతించేందుకు వచ్చేసిన వారందర్నీ ఆ క్షేత్రంలోనే నిలిచి పొమ్మని ఆజ్ఞాపించినాడు తానే అక్కడ నిలిచి నాడు కాబట్టి వారందరూ కూడా నిలిచి భక్తులను తరింప చేయాలనే అలా ఆనతిచ్చి నాడు "అహోబలనామధేయంబున నిమ్మహాతీర్థంబు మదీయ నివాసంబై నేడు మొద లుగాఁ ద్రిభువన పూజనీయ త్వంబునఁ బొగడొందు నిప్పుడు మత్సేవోత్సవంబునకుఁ జనుదెంచిన యియ్యమరగణంబును, నిమ్మునిసముదయంబులును, సాదర ద్వీపాది విశేషంబులునుం గూడ నిన్నియు నివ్వాటన నిరంతరంబును సన్నిధి చేసి యుండునది యని యస్మదీయాజ్ఞాపనంబు" (5-148) అన్నాడు స్వామి స్వామి ఆజ్ఞ తలదాల్చి అందరూ అక్కడే నెలకొన్నారు "సకల సురైకవాసమును, సర్వ మునీంద్ర మయంబును, విశ్వ తీర్థ కలితమున్, సమస్త సుకృత ప్రభావంబున నై త్రిలోక దీపక మగు నీ యహోబలము"ను భక్తితో పూజించే వారికి సకల తీర్థాల్లో కలిగే ఫలం కలుగుతుంది (5-149)

"ఈ యహోబలంబు సమస్త తీర్థ సారంబు (5-161) సంతాన కాంక్షులై. వింతిల్లు కాంతలు పురుషులు .. జయార్థులై కడఁగెడు రాజులు బహు విపన్నులై . దీనులు ..నను నహోబలేశు నరసింహ దేవుఁ గొలిచి కాంతు రెల్ల కోరికలును" (5-166) అని స్వామి దివ్యవాక్కులు

4 1 3 9 పాలకడలి, శ్రీపురుషోత్తం, శ్రీకాంచీపురి శ్రీద్వారక, శ్రీరంగం, శ్రీకూర్మం, సింహాచలం, బదరీవనం వంటి ముల్లోకాలలో ప్రసిద్ధికెక్కిన నివాసాలకన్నా అహోబలతీర్థమె నాకు మిక్కిలి ఇష్టం అంటున్నాడు స్వామి. భక్తులకే కాదు స్వామికి కూడా ఈ క్షేత్రం పైన ఉండే మమకారాన్ని ఎఱ్ఱన మధుర మధురంగా సీసపద్యంలో మూసపోసినాడు. తిలకించండి తిలకించి పులకించండి

సీ క్షీరాబ్ధి వనంబు శ్రీపురుషోత్తమం బాదికేశవ మనంతాలయంబు
శ్రీకాంచి పురి హరి క్షేత్రంబు మధుర శ్రీద్వారక శ్రీరంగ భూరిపదము
శ్రీకూర్మ సదనంబు సింహచలంబను నాది వరాహ సమాశ్రయంబు
మాధవాఖ్యంబు గదాధరు నిలయంబు బదరీవనము శార్ఙ్గపాణి గృహము

గీ మొదలుగాఁ ద్రిలోక విదితంబులగు మహా స్థానములును సుజనసంస్తవముల
నొప్పఁగాని నాకహోబలతీర్థంబు పగిది నధికవల్లభములు గావు (5-169)

4 1 3 10 అహోబలక్షేత్రాన్ని ఏయే దినాల్లో సేవిస్తే ఏయే ఫలాలు పొందవచ్చో సవిస్తరంగా కవి నుడివినాడు

భక్తుడు అహోబలేశుని ఏదినం సేవించినా సిద్ధ సౌఖ్య సమ్మోదం కలుగుతుంది (5-170) వసంత మహోత్సవంలో అహోబలేశ్వరుని కొలిచిన వారి మనోరథాలు సిద్ధిస్తాయి (5-171) "హేమ రత్న రజత భూమి కన్యాదిక దానములు ఒకటి కోటి ఫలము నొసఁగు నహోబల తీర్థమున నొనర్చు ఫీనిధులకు" (5-174) "తపములు, పితృకార్యంబులు, నుపవాసంబులును నియ్యహోబలంబున అనుష్టింప ననుపమంబగు తీర్థఫలము లొందఁగఁగలుగన్" (5-175)

4 1 3 11 అహోబలక్షేత్రాన్ని ఎవరైనా సేవించవచ్చా ? సమాధానం అవుననే

యతులు, సాత్త్వికులు, చక్రాంక భాగవతులు, అహోబల తీర్థ స్థితు, నరసింహాత్మ . భజింపఁగనర్హుల్ (5-177) విప్రోత్తముల్ భూపతుల్, వైశ్యుల్. తక్కిటవారును . అహోబలేశు నను సేవింపగఁబాత్రుల్.. (5-178) . కష్టపు జాతియు నన్నహోబల స్ఫార నివాసుఁజేరి కను బ్రాజ్ఞఁ నిషేవిత పుణ్య లోకముల్" (5-179)

మానవులు కాదు గదా పశుపక్ష్యాదులు క్రిమి కీటకాలు, చెట్లు, కొండలు, ఒకటేమిటి ? "సమస్తచరాచర జంతుజాలం పునర్భవాతురతఁబొంద వహబలతీర్థవాసతన్" (5-180) అని స్వామి పలికినఅమృతపు పలుకులు

4 1 3 12 లక్ష్మి నృసింహస్వామి బ్రహ్మదేవునితో క్షేత్రమహిమ ఉటంకిస్తూ దేవమానవులు మాయ కల్పిస్తాను కాబట్టివారు మాయలో బడి చెడతారు "అహోబల తీర్థ పవిత్రసేవనంబు నవి యెల్లవారికిఁబొందనీను" (5-181) అని తరతత్త్వకోవిదులు మహాత్ములు మాయలోఁ బడి పోక "అహోబలేశు భజింతురు నిత్యధన్యులై". (5-182) ఓ బ్రహ్మ ! నీవు నా భక్తుడివి కాబట్టి సిద్ధమంత్రం ఉపదేశిస్తాను "ఇలఁగల పుణ్యతీర్థములకెల్ల నహోబలమెక్కుడన్ తలంపలపడఁజేయు . అవతారముల కన్నిటికిన్ నరసింహమూర్తి యగ్గలముగఁ జూడుము" (5-184) అని సెలవిచ్చి పంపినాడు

ఈ క్షేత్రమహిమ విన్న మునులు భక్తి రసావేశంబున నానందామృతధారం మునిగి యహోబల నాధు నిచ్చలు దలంచుచు యథేచ్ఛం జనిరి ( 5–195 ) అని నృసింహ పురాణానికి ఎఱ్ఱన భరతవాక్యం పలికినాడు

4 1 3 1 3 భక్తుల పాపాలను ప్రక్షాళనం చేసేందుకు ప్రతి క్షేత్రంలోనూ పవిత్ర తీర్థాలుండటం సహజం శ్రీశైలంలో పాతాళగంగగా–తిరుమలలో పాప నాశనం, స్వామి పుష్కరిణిగాగా– అహోబలక్షేత్రంలో 'భవనాశని' నది పవిత్ర తీర్థం ఆ పేరే తెలుపుతుంది, అందులో తానమాడితే భవబంధాలు నాశనమై ముక్తి సిద్ధిస్తుందని

వేదాద్రి, గరుడాద్రిల మధ్య ప్రవహించే నది భవనాశని ఇది రెండు పాయలుగా చీలి కుముద్వతి, పెన్న నదుల్లో సంగమిస్తుంది ఈ నదిని అంతర్వాహినిగా పేర్కొంటారు12

నరసింహస్వామి సురలు మునులు తదితరులతో శాశ్వతంగా అహోబలం మీద నెలకొన్నాడు నరసింహుని పాదసేవ కోరిన మందాకిని దివినుండి భువికి అవతరించింది స్వామి 'భవనాశిని' అని నామకరణం చేసినాడు

దివినుండి మందాకిని భువి కవతరించే పావన దృశ్యాన్ని ఎఱ్ఱన ఎంత మనోహరంగా చిత్రించినాడో పరిశీలించండి

శ్రీకమనీయమూర్తి నరసింహ పదాంబుజ సేవఁగోరి మం
దాకిని ధాత్రిమీఁది కవతార మొనర్చె నిజాంగలీల న
స్తోకతరంగ సంఘములతో సమదాలి మనోజ్ఞ పంకజ
స్తోకముతో లసచ్ఛిశిర నేక మనోజ్ఞ మహాత్సవంబుతోన్ " ( 5–123)

భవనాశనీ తీర్థం భవరోగాలకు మందు భవ పాప జ్వాలకు వైరి ..నిత్యం స్తుత్యం భవనాశని జలం.. భవనాశినిని ముమ్మారు నోరారా ఉచ్చరిస్తే భవబంధాలు నాశనమై పోతాయి స్వామి కరుణారసమే భవనాశనీనది అని స్వామి పలికిన పసిడిపలుకుల్ని తమలో ఇముడ్చుకొన్న యీ పద్యాలు భక్తులకు కర్ణాభరణాలు

" భవరోగంబుల కౌషధంబు భవపాపజ్వాలకున్ వైరి దు
ర్భవ పంక ప్రవిశోధనంబు భవ భావ స్ఫార తృష్ణా హరం

బివిరోధం బకలంక మ౦యయ రసౌదాత్తంబు భక్త ప్రియో
త్సవమెందున్ భవనాశినీ జలము నిత్యస్తుత్య మిమ్మేదినిన్" (5-151)

" భవనాశిని భవనాశిని
భవనాశిని యనుచుఁబలుకు భ కజనులకున్
భవనాశిని భవనాశిని
యవ్వటకు భువియందు సందియంబును గలదే " (5-152)

" నా కరుణారసంబు భవనాశిని నాన వినాశనాకృతిన్
శ్రీకర వాహిని తనుతఁజేకొని నాక మనుష్య లోక ద
ర్వీకర గేహ గాహిత పవిత్ర జలౌఘమునన్ మహజన
శ్లోకితయై తనర్చు నతి లోక విలోక సుపాక భవ్యతన్ " (5-153)

4 1 3 14 స్వామి అహోబలంలో నిలిచిపోగా, ఆ ప్రదేశంలో ఉండే "పున్నాగ నాగ కేసర... చందన చంపక మరువక తులసీ ప్రముఖ వివిధ తరు లతాలవాల కృతంబును నిరంతర వసంత వాస భవనంబును నగు వనంబు నందుండి .. ఆదిలక్ష్మి సకల లోకైక మాత .. వచ్చి ముకుందునంకతటి" ని చేరింది (5-124, 125, 126) "అమ్మహా లక్ష్మి నివాసంబైన యా రమణీయోద్యానంబును లక్ష్మీవనంబను పేర నమరులచేతన్ గీర్తితం" బయింది (5-127)

లక్ష్మీవన పుష్పసౌరభములతో సొంపు మీరి, భవనాశనీ సలిలంతో తడిసి, శీతాత్ముడైన మంద పవనుండు స్వామి సేవ కోసం విచ్చేసిన దేవతల మౌనుల చిత్తాల్ని ఆహ్లాద పరచినాడు (5-130)

శ్రీలక్ష్మి తాను ఆ వనంలో విహరిస్తున్నందున "లక్ష్మీవన నామమివ్వనము... లోకపావనంబు" (5-155) అని స్వామి పలికినాడు. తన్ను తలచినా, చూచినా, స్తుతి చేసినా "లక్ష్మీవన మనుపమ సకలార్థ సారమగు జనములకున్" (5-156). అంతేకాదు, సంసారమనే తీవ్రమైన ఎండ నుంచి "తన తరుశాఖల నీడ" తో రక్షి స్తుంది "తన లతావరపుష్పశోభిత" సువాసనలతో దుఃఖ వాసనల్ని తొలగిస్తుంది "అహోబల భూషణంబు, సుకృత పోషణంబు, సాత్త్విక ప్రియంబు, సర్వాశ్రయంబు, లక్ష్మీవనంబు భువన పావనంబు" (5-157) అని లక్ష్మీవన మహిమను లక్ష్మీ నరసింహస్వామి భక్తజనులకు తెలియజెసినాడు

4 1 3 15 ఎఱ్ఱన అహోబిలాన్నే గాక దేశంలోని నాటి ముఖ్య పుణ్య క్షేత్రాల్ని కూడా పేర్కొన్నాడు గాలవముని తీర్థయాత్రలు చేస్తూ గంగాద్వారం, కురుక్షేత్రం, కౌశికి, కాశి, ప్రయాగ, గయ, గంగాసాగర సంగమం, శ్రీపురుషోత్తమం దర్శించినాడు. "సింహాచలం బుపాసించె, గోదావరీ కృతగాహనుండయ్యెఁ గృష్ణవేణిఁ దఱిసె, శ్రీవేంకటాచల స్థాయిఁగొలిచె సహ్యజావేదిఁదోఁగె.. రంగనాథుని నెఱిఁగె" (1–11) ఇవే గాకుండా "గోకర్ణము సహ్యాద్రియు శ్రీకుర్మముఁ బుష్పనగము, సిద్ధాచలముఁన్" దర్శిస్తూ "లక్ష్మీకలిత మహోబిలంబు" చేరినాడు (1–18) ఎఱ్ఱన పేర్కొన్న పుష్పనగము నేటి పుష్పగిరి సిద్ధాచలము సిద్ధవటం కావచ్చు

తన వంశ వర్ణనలో ఎఱ్ఱన "వెలనాటి చోదని వలన మిగుల మన్ననఁగన్న భీమనమంత్రి పౌత్రుండు వేఁగి నాటఁగరాపర్తి వృత్తి మంతుఁడనఘుఁడెఱ పోతసూరి" (అవ 15) అని చెప్పుకొన్నాడు

4 1 3 16 ఈ సందర్భంలో వెలనాడు, వేఁగినాడు, అనే ఆంధ్రదేశ విభాగాల ప్రసక్తి వచ్చింది కరాపర్తి అనేది ఊరిపేరు అని కొందరు, ఒక వృత్తి అయి ఉంటుందని మరి కొందరు వాదిస్తున్నారు ఈ విషయం ఇంకా పరిశీలించి తేల్చాల్సి ఉంది

4 2 భాస్కరుడు : వాల్మీకి సంస్కృత రామాయణ కావ్యాన్ని చంపూ కావ్యంగా తెనిగించినవారు భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు అనే కవులు ఈ తెలుగు చంపూరామాయణానికి 'భాస్కర రామాయణం' అనే పేరు ప్రసిద్ధిగా ఉంది భాస్కర రామాయణంలో బాలకాండకు మొదట కృతిపతివర్ణన, కవి వంశ వర్ణన, షష్ఠ్యంతాలు–ఇవేవీ లేవు[13]

4 2 1 భాస్కర రామాయణం కిష్కింధాకాండలో ఆంధ్రదేశప్రసక్తి కృష్ణవేణీ, గోదావరీ, వెగవతీనదుల ప్రస్తావన ఉంది

అంజనేయాది కపివీరులు సీతకోసం వెదికిన ప్రదేశాల్లో పై చెప్పిన స్థలాలు చేరి ఉన్నాయి

" . . .వేగవతీ కృష్ణవేణీ దేవి కామెఖలోత్కలా పంబువతీంద్రవతీ సమీపంబుల ..దశార్ణ కుకురాది దేశ వన గిరి కందరంబుల సీతకు వెదకుచు, దండకారణ్యంబున కరిగి యచట గిరివన దుర్గంబుల గోదావరీ తీరంబుల నంధ్ర పుండ్ర కేరళ కురుదేశంబులఁబరికించుచు".. (కిష్కింధాకాండము 556)

కళింగ రాజ్యంలోని నదులలో బాహుద, వంశధార, నాగావళి, గోస్తని, శారద, వరాహ, చంపావతి, నదులతో పాటు వేగవతి కూడా ఉంది[14]

4 3 నాచన సోముడు ఎఱ్ఱన సమకాలికుడు, దరిదాపు ఎఱ్ఱనతో సమాన మైన ప్రతిభ గలకవి నాచన సోముడు 'ఉత్తర హరివంశ' కావ్యం ఇతని రచన ఈ కవి అష్టభాషా కవిత్వ విశారదుడు సోమునకు బుక్కరాయలు 'గత్తి' దుర్గానికి చేరిఉండే 'పెంచుకల దిన్నె' అనే గ్రామాన్ని 'బుక్కరాయ పురం' అనే ప్రతి నామం ఉంచి శా శ 1236 సంవత్సరంలో దానం చేసినట్లు పెంచుకలదిన్నె శాసనం తెలుపుతుంది[15] పెంచుకలదిన్నె ఇప్పటి కర్నూలు జిల్లాలో ఉంది

ఉత్తర హరివంశ కావ్యం కృత్యవతారికలోగాని, కావ్యభాగంలోగాని, 'తెలుగు నాడు'కు సంబంధించిన ప్రదేశ నామాలు ఏమీ కనిపించవు

4 4 రావిపాటి త్రిపురాంతకుడు ఈ కవి రచనలు సంస్కృతంలో 'ప్రేమాభిరామం' అనే వీథి, తెలుగులో అంబికాశతకం, చంద్రతారావలి, త్రిపురాంత కోదాహరణం, మాత్రం లభ్యమౌతున్నవి

4 4 1 దేవతాస్తుతి రూపంలో ఉండే ఒక విధమైన ఖండకావ్యానికి 'ఉదా హరణ' మని పేరు మొదటి ఉదాహరణ కావ్యం పాల్కురికి సోమన రచించిన 'బస వోదాహరణం' బసవోదాహరణంలో తెలుగు నాడుకు సంబంధించిన స్థలాల పేర్లు లేనందువల్ల, దాని ప్రసక్తి ఈ పరిశోధన గ్రంథంలో చోటు చేసుకోలేదు

4 4 2 శ్రీశైలానికి తూర్పుద్వారం త్రిపురాంతకం అక్కడ కుమార గిరిపై వెలసి ఉండే త్రిపురాంతకేశ్వరుని స్తుతిస్తూ, రావిపాటి త్రిపురాంతక కవి చెప్పిన ఉదాహరణ కావ్యమే 'త్రిపురాంతకోదాహరణం'

4 4 2 1 'త్రిపురాంతకోదాహరణం' లో ప్రథమా, ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ, సార్వవిభక్తికపద్యాలలో కుమార గిరి, త్రిపురాంతక క్షేత్రం, శ్రీశైల క్షేత్రాల ప్రసక్తి ఉంది

4 4 2 2 త్రిపురాంతక దేవుడు త్రిపురాంతకుడు కుమారనాథుడు కుమారగిరి రాజనివాసుడు కుమార పర్వతంచేరెడు రాజు కుమారాచలనాథుడు, కుమారగిరీంద్ర మందిరుడు - అని కవి త్రిపురాంతకేశ్వరుని పరి పరి విధముల ప్రస్తుతించినాడు

'కుమారగిరి'కి పర్యాయంగా అరుణాచలం, కుమారగిరీంద్రం, కుమార పర్వతం, కుమారాచలం, లేఁబ్రాయపుకొండ, అని కవి ప్రయోగించినాడు.

త్రిపురాంతకం శ్రీశైలం ప్రాగ్ద్వారమన్న విషయాన్ని కవి మరచిపోలేదన డానికి 'శ్రీనగము తూఱుపువాకిలి' అని పేర్కొనడమే సాక్ష్యం

శ్రీనగ చక్రవర్తి తుదిశృంగము, శ్రీనగము తూఱుపు వాకిలి, అని కవి పలికిన సందర్భాలలో శ్రీశైల పర్వత ప్రసక్తి ఉంది

4 4 2 3 శ్రీశైల శిఖరం ముక్తికోసం దర్శించడం ఎందుకు? పుట్టు చావులేని మందు నావద్ద ఉంది రండి. అని భక్తులను చెయిచాచి పిలుస్తున్నట్లున్నాడట త్రిపురాంతకేశ్వరుడు, కుమారశైలాన్నధిరోహించి ప్రథమావిభక్తి పద్యంలో ఈ రమణీయ కల్పనను పరికించండి

" శ్రీనగ చక్రవర్తి తుది శృంగము చూచెద మంచు నేటికిం
బో ననిశంబు నుండు నదె పుట్టువుఁ జావును లేని మందు నా
చె ననుచుం బతాక యనుచే నరుణాచలమెక్కి పిల్చుఁబం
చాననుఁడిందుమౌళి త్రిపురాంతకదేవుఁడు భక్తలోకమున్"

4 4 2 4 పాము–హారం, చంద్రవంక – పాపటబొట్టు, మందాకిని – మల్లెదండ, తోలు–దువ్వలువ ధరించి, బూది – చందనం పూసి అందంగా సన్నిధి దయజేసిన అర్ధనారీశ్వరుని స్వరూపం మన కళ్ళ ఎదుట సాక్షాత్కరిస్తుంది ద్వితీయా విభక్తి పద్యంలో

" పామును హారమున్ నెలయుఁ బాపటసేసయు నేఱు మల్లికా
దామము తోలు దువ్వలువు దట్టపు భూతియు చందనంబు మై
సామున నాల నందముగ సన్నిధి సేసిన చూచఁగంటి నే
నా మదిలోఁగుమారగిరి నాథుని శైలసుతా సనాథునిన్ "

4 4 2 5 స్వామి దేవాలయంపై ముక్తికాంత పయ్యెద కొంగులా జెండా కదలాడుతున్నది ఆ కేతనాన్ని దర్శిస్తేచాలు కుమార పర్వతమెలే రాజు కోర్కెలు తీరుస్తాడు ఈ విచిత్రాన్ని తృతీయావిభక్తి పద్యంలో తిలకించండి

" వాలి నటించుచు ముక్తి వర వర్ణిని పయ్యెదకొంగు చాడ్పునన్
గ్రాలు నిశాంకపుంబడగ కన్నులు జూచిన కాలు నిమ్నగా

స్ఫాలిత మౌళి చేత పురభంజను చేత కుమార పర్వతం
వేలెడు రాజుచేత ఫలియించు జనావళి కోరు కోర్కులన్ "

4 4 2 6 అడియాసలతో నీరసులైన రాజుల ఇండ్లు, వాకిండ్లు చూరడం మానివెసి శ్రీనగము తూర్పు వాకిలి ప్రవేశించి పాపాలను భస్మం చేసుకోండి గంధవతి నీటిలో మునిగి మనసులో ఉండే అగ్నిని చల్లార్చుకోండి అని ఉపదేశిస్తున్నది చతుర్థీ విభక్తి పద్యం

ఉ. ఆఁజడియాస నీరస ధరాధిపలోకము లిండ్లు వాకిలుల్
దూఱుట మాని శ్రీనగము తూఱుపు వాకిలిఁ జొచ్చి పాపముల్
నీఱుగఁజేసి గంధవతి నీటను గ్రుంగి మనంబులోన చి
చ్చాఱఁగఁ జేయుటొప్పు త్రిపురాంతక దేవునకై నమస్కృతుల్

4 4 2 7 కాలం గడిచి పోతుంటుంది ముక్తి మరోవిధంగా రాదు. కైలాసం పోయేదారి మీకు తెలియదు శ్రీపర్వతపు కొండకు రండి జన్మ దుఃఖాల్ని కడతేర్చుకోండి అని పిలుపునిస్తున్నాడు కవి పంచమీ విభక్తి పద్యంలో

" పోయెడు గాల మన్యగతిఁ బొందదు మోక్షము వెండికొండకుం
బోయెడు త్రోవ మీకెఱుఁగఁబోలదు మానవులార రండు లే
ప్రాయపుఁగొండ కందు శివ భక్తుల లోఁగొను నద్రిరాజ క
న్యాయుత పుణ్యమూర్తివలనం గడతేఱెడు జన్మ భేదముల్

4 4 2 8 బ్రహ్మపునుకే కంచం విష్ణువు కన్నే పాదాలకు అర్చన చేసే పద్మం శేషాహి చేతికి చెతోమోదమైన కంకణం చంద్రుడు తలపువ్వు కుమార గిరి రాజనివాసునికి ఇతర దైవాలు సరి అవుతారా ? అని ప్రశ్నిస్తున్నది షష్ఠీ విభక్తి పద్యం

కమలజు తోరపుంబునుక కంచము, పాదసరోరుహార్చనా
కమలము వారిజోదరుని కన్ను, కరంబున కాది భోగి భో
గము రవణంబు, చంద్రుఁడు శిఖా కుసుమంబటె ' యెవ్వరీడు మా
రమణునకుం గుమారగిరి రాజనివాసున కన్యదైవముల్ "

4 4 2 9 ఓ మనసా ' వైటి రుచులు, బాహ్య వీక్షణాలు వదిలి అంతర్ముఖంగా చూడు ; లోచవి, అంతరలోకంలో బాహ్యాక్షునవి సరి అవుతాయా ? కుమా

రాచల నాథుడు, త్రిపురాంతక దేవున్లో కరిగిపో. అని అంతర్ముఖత్వాన్ని బోధి స్తున్నది సప్తమీ విభక్తి పద్యం

ఉ వాచవి లేనుగా నొదలి వాకిళలం జవి చూపు తీపులం
ద్రోచి శివార్చనా నియతి – లో వెలి చూడక చూడనేర్చినన్
లో చవిఁబోలునే చవులు లోకము జూడని చూపులం గుమా
రాచలనాధునందు త్రిపురాంతకునందు కరంగు చిత్తమా!

4 4 2. 10 శ్రీచనుదోయిపై బాణాన్ని (విష్ణువు) చేర్చినావు నారిగా ఉండిన పాములతేడును సడలించి, మేరుగిరిని (విల్లు) ఎక్కుడించినావు అశ్వాలుగా ఉండిన వేదాలను అడ్డు విడిచినావు పద్మజునికి నాలుగు మోములను ఇచ్చినావు త్రిపురాసురుల చంపిన నీ జయవృత్తాంతాన్ని దేవతలచేత వింటున్నా, స్వామీ! కుమార గిరీంద్రమందిరా! అంటున్నాడు కవి శివునికి త్రిపురాంతకుడనే పేరు త్రిపుర రాక్షసుల్ని చంపినందుకే గదా వచ్చింది ఈ స్తుతి సంబోధన ప్రథమావిభక్తి పద్యంలో ఉన్న వైనాన్ని చిత్తగించండి

" శ్రీచనుదోయిపై శరముఁ జేర్చి భుజంగమరాజ స్యూ హే
మాచల మెక్కుడించి నిగమావళి యబ్బులు వీడ్చె పద్మజుం
జూచి మొగంబులిచ్చి దివిజుల్ గొనియాడఁగనున్న నీ రణాం
తా చరణంబు విందు చెవులారఁ గుమార గిరీంద్ర మందిరా! "

4. 4 2 11 పరమ శివుడు ఆద్యుడు ఎల్లవిద్యలు స్వామినే తెలుపు తాయి. స్వామివల్లనే బ్రహ్మాదులు పుడతారు. సరిలేని వేల్పు స్వామి ఒక్కడే. అన్యదైవాలను భజించను నన్ను నీలో కలుపుకో స్వామీ! కుమారగిరినాథా! అని ప్రస్తుతిస్తున్నాడు కవి సార్వ విభక్తిక పద్యంలో

" నీ వాద్యుండవు నిన్నుఁ దెల్పుచదువుల్ నీచేత మెరొంద ని
కై వాహ్వాజలొనర్తు నీవలన బ్రహ్మాండావళుల్ పుట్టు నీ
కే ఎల్పుల్ సరి అన్యదైవభజనం బేనొల్ల నీయందు మ
ద్భావంబొందఁగఁగన్ గుమారగిరినాథా! చంద్ర మాహామణీ "

'ఉదాహరణకావ్యాలలో' ఇది ద్వితీయమైనా అద్వితీయం అని విమర్శకుల ప్రశంస త్రిపురాంతకేశ్వరస్వామి వెలసిన కుమారగిరి, త్రిపురాంతకం, గంధవతి

తీర్థం, శ్రీనగం ఈ ఉదాహరణ కావ్యంలో కొనియాడబడిన తెలుగునాడులోని పుణ్య స్థలాలు.

4. 4 2 12 కవి యింటిపేరైన రావిపాడు ఒక గ్రామం పేరే ఈపేర్తో గిద్దలూరు తాలూకా కర్నూలు జిల్లాలో ఒకటి, నరసరావుపేట తాలూకా గుంటూరు జిల్లాలో ఒకటి గ్రామాలున్నాయి త్రిపురాంతకానికి సన్నిహితంగా ఉండే కర్నూలు జిల్లాలోని గ్రామమే కవి ఇంటిపేరు లోని గ్రామం కావచ్చు

4 5 చిమ్మపూడి అమరేశ్వరుడు చిమ్మపూడి అమరేశ్వరుడు 'విక్రమసేన మనే కావ్యాన్ని రచించినాడు ఆ కావ్యం అలభ్యం శ్రీనాధుడు మొదలైనవారు ఇతనిని ప్రశంసించినారు

ఈ కవిశ్వరుని ఇంటి పేరైన చిమ్మపూడి తెలుగునాడు లోని ఒక గ్రామమే

4 6 కృష్ణమాచార్యులు శ్రీకృష్ణమాచార్యుల రచన 'సింహగిరి వచనములు ఇది తెలుగులో మొదటి వచన గ్రంథం 60 వచనాలే లభించినాయి

4 6 1 సింహగిరి నరహరి వచనాలలో కవి ప్రయోగించిన తెలుగునాడు లోని స్థలాల పేర్లు అహోబలం. ఏకశిలానగరం, తిరుపతులు, పోతకమూరు, శేషాచలం, సంతూరు, సింహగిరి అనేవి గోదావరి నది ప్రసక్తికూడా ఈ వచనాలలో కన్పిస్తున్నది

4 6 2 సింహాచలం శ్రీవరాహలక్ష్మీ నృసింహ క్షేత్రం కళింగదేశం లోని దేవాలయాలలో ముఖ్యమైంది సింహగిరి వచనాల్లో సింహగిరి ( 17 సార్లు ) సింహాచలం (4 సార్లు) సింహాద్రి (10 సార్లు) ఈ పుణ్య క్షేత్రానికి పర్యాయ నామాలుగా పేర్కొనబడినాయి

4 6 3 స్వామిని ఈ కవి 1 సింహగిరి అప్పన్న -సింహగిరి నరపతి - సింహగిరి నరహరి - సింహగిరీశుడు, 2 సింహాద్రి జగదీశ్వరుడు - సింహాద్రి నాధుడు - సింహాద్రి నాయకుడు - సింహాద్రియప్పడు - సింహాద్రిస్వామి, 3 సింహాచలనాధుడుగా తన వచనాల్లో కొనియాడినాడు

4 6 4 సింహగిరి వచనాల్లో 30వ వచనం కృష్ణమాచార్యుల జీవిత చరిత్రను తెలుపుతుంది కృష్ణమాచార్యులు వేశ్యాసక్తుడై ఉంటాడు పోతకమూరి భాగవతులు నారాయణయ్య, ఔబళయ్య, అచ్యుతయ్య, అనంతయ్య, శ్రీచెన్నమయ్యగారలు అహోబలం

నుండి "ఏకాదశావతారమైన ఆచార్యులను దర్శించ సింహాచలమున కేతెంచిరి ... ... సింహాద్రి యప్పుడు (నివసించు) తిరుపట్టణమందు సూర్య, సోమ వీథుల కృష్ణమాచార్యుల తిరుమాళిగను కానలేక నెమకులాడుచుండిరి ..... కృష్ణమాచార్యులు జగన్మోహనాంగి యను వారకాంత కుచభరంబుల మీద హస్తంబులు వహించి.. . ఉండినాడు"

భాగవతులు అతన్నే అడిగినారు ఆచార్యులగురించి, ఆచార్యులు వారి సంగతి అడిగినాడు తామెవరో చెప్పినారు "శ్రీయహోబలమునుండి సింహాచలమున కేతెంచితిమి" అన్నారు .. "ఈ పౌతకమూరి మహాత్ముల మహత్త్వము వినియుంటిమి పటము పన్నించి శ్రీయహోబలేశుని పటము చాటున నాట్యమాడింతురట" అనుకొన్నాడు ఫలానాచోట ఆచార్యుల ఇల్లు ఉంది అనిచెప్పి పంపించి తాను మీసం, తల గొరిగించుకొని శ్రీవైష్ణవుడై వారిని కలిసినాడు

వారు ఈ విషయం తెలుసుకొని అతని "శృంగార వైభోగములకు విఘ్నం చేసినామో" అని బాధపడినారు ఆచార్యులు "మీరచ్చట సింహాద్రినాధుని సన్నిధిని స్వామిని తాండవమాడించవలెను మీ మహత్త్వము సింహాద్రి యప్పుడు వినవలెను" అన్నాడు వారు "జగదీశ్వరుని పటము గట్టించి శ్రీయహోబలనాధుని సంకీర్తన వలన స్వామిని తాండవమాడించిరి" వారి కోరికపై "కృష్ణమాచార్యులు దండెమున్జిటు తాళంబులు సంధించుకొని .. .. చాతుర్లక్ష గ్రంధ సంకీర్తన వాఙ్మాలలు చెయంగాను . సింహాద్రి నాథుండు నిజరూపంబున లీలావినోదుండై బాలత్వంబునన్బుర బాలురలోన బాలుండై కృష్ణమాచార్యుల తిరుమాళిగ సన్నిధినుండి యాడుచున్బాడుచు వచ్చి, శ్రీకృష్ణమాచార్యుల తొడలమీద గూర్చుండెను"

వారు "మగుడ శ్రీయహోబలమునకు పని వినవలెను" అని శెలవుపుచ్చుకొని "శ్రీయహోబలమునకు వేంచేసిరి. .. కృష్ణమాచార్యులు సింహాద్రి నాధుని నగరి కేతెంచి సింహాద్రినాధుని సందర్శించి. ఇప్పుడే సాయుజ్యము కృపన్జేయుమని క్షీరాబ్ధిశయనుని వేడుకొనెను క్షీరాబ్దివటపత్రశయనుండు ఘూరాంత సమయ ప్రశస్తుండై సింహాద్రి జగదీశ్వరునకు విన్నవించె"

"సింహగిరి నాధుండు శ్రీకృష్ణమాచార్యులకు నభయహస్తమున్ గృపచేసెను.. నేండు గదా సింహాద్రినాధుని వాకిళ్ల గాచెడు భాగ్యము గలుగుట నేండు గదా సింహ

గిరి యనెడు దివ్యౌషధము నా హృదయమునకు దొరకుట. నేఁడు గదా నూట యెని మిది తిరుపతులను వెంయం గలుగుట" అని సంతోషిస్తాడు (30వ వచనం)

4 6 5 కృష్ణమాచార్యుల జీవితంలో వచ్చిన శుభపరివర్తనను ఈ సుదీర్ఘ వచనం తెలుపుతుంది పొతకమూరి భాగవతులు అహోబలేశునిచేతనే తాండవమాడించ గలంతటి వారి భక్తులు కృష్ణమాచార్యుల సంకీర్తనల్లో సింహాద్రి అప్పన్న బాలుడై ఆడేవాడనే అతిలోక విషయం ఈ వచనం ద్వారా తెలుస్తున్నది పొతకమూరు దర్శి తాలూకా నెల్లూరు జిల్లాలో ఉంది[16]

4 6 6 34వ వచనంలో ఏకశిలా నగర ప్రసక్తి ఉంది "(ఏక) శిలా నగరమనియెడు నొక పట్టణమందు నగసాల పరమసేవ్యుఁడుత్తముండు" అతడు మరణించినాడు శవాన్ని అలంకరించి శ్మశానానికి తీసుకెళ్తుండినారు. అగసాలి భార్య శవం వెంట వెళుతూ, దార్లో కనిపించిన కృష్ణమాచార్యుల వారికి దండ ప్రణామం చేస్తుంది "దీర్ఘాయుష్మంతురాలవై యుండ ము" అని దీవించినాడు "నా పతిలో పాటు నేను చనిపోవుచున్నాను" అని ఆమె చెప్పింది స్వామి దివ్యనామ సంకీర్తన ఆచార్యులు చేయగా శవానికి ప్రాణం వచ్చింది ఏకశిలానగరం, కాకతీయుల రాజధాని ఓరుగల్లు, నేటి వరంగల్లు ఒకటె

4 6 7 స్వామి జగదంతర్యామి "దేవా! ఈ లోకంబున శేషాచలంబున వెంకట నామధేయుండవైతివి దేవా! లోకంబులోని ధర్మాధర్మంబులకుఁ బరమ భాగవతోత్తముల పాలికి సింహాచలంబున నిలిచితివి (21 వచనం) అని నరహరి, వెంకటేశ్వరుల అభేదాన్ని కవి ఈ వచనంలో చాటినాడు

4 6 8 కృష్ణమాచార్యులు భూ ప్రదక్షిణం చేసి, మాతా పితామహులకు తర్పణాలు వదలి, దానధర్మాలు చేసి, తిరిగివస్తాడు స్వామి వాకిళ్ళు మూసిఉంటాయి. ఇది న్యాయమా స్వామీ! అంటాడు ఈ కిందివచనంలో... "శ్రీయహోబలమును, శ్రీరంగమును, వెంకటాచలంబును, కాశీక్షేత్రంబును, ద్వారకంబును, నయోధ్యయును, శ్రీపురుషోత్తమును జూచి, దేవా! మీ గృహాంబున కధవెంచిన కవాటంబులు మూయ నీకుఁ దగునా?" అని కవి క్షోభ పడతాడు.

4 6 9 కృష్ణమాచార్యుల కాలంలో శ్రీశైలానికి వెళ్ళి శైవులయ్యేవారని, తిరుపతుల సంచరించి వైష్ణవులయ్యేవారని "దేవా! (శ్రీ) పర్వతంబునకు బోయి

శైవులగుదుర తిరుపతులఁ జూచి వైష్ణవులగుదురు " అనే వచనం తెలుపుతుంది (43 వ వచనం)

4 6 10 కృష్ణమాచార్యుల జన్మస్థలం సంతూరు అంధుడుగా పుడతాడు తల్లిదండ్రులు కూపంలో పడవేస్తారు సన్యాసి కువ్వారు శిశువును తీసికొనివెళ్ళి సాకుతాడు పెరిగి బాలుడైన తర్వాత కృష్ణమాచార్యులు సింహాద్రి స్వామి సన్నిధికి వెడుతూ స్వామికి పాలు సమర్పించి, కొన్ని పుచ్చుకొని చేతులతో కండ్లు తుడుచుకుంటాడు కండ్లొస్తాయి ఈ వృత్తాంతాన్ని 52 వ వచనం వివరిస్తుంది

"సంతూరను జనియించి . గుడ్డివాఁడై పుట్టిన శిశువును తల్లిదండ్రులు కూపంలో వేయగా, సన్యాసి కువ్వారు ఏతెంచి . సాఁకుతాఁడు . సింహాద్రి స్వామి సన్నిధికిం జనునప్పుడు. క్షీరంబులుదెచ్చి.. పుచ్చుకొని లోపల కెగి హస్తముల నయనములు దుడుచుకొన్న.. .. అంధత్వంబు మానె" (52వ వచనం)

4 6 11 "గోదావరి యావల శ్వేతద్వీపమందు మా మేనమామ శ్రీరంగాచార్యులు గలరు " అంటాడు కవి శ్రీరంగాచార్యులు సాక్షాత్తు శ్రీరంగంలో వెంచేసియున్న శ్రీరంగమన్నారే ( ? )

4 7 పోశెట్టి లింగకవి 'సవ వాళ చరిత్రం' ద్విపదలో లింగకవి రచించిన కావ్యం కావ్యావతారికలో పాలకురికి సోమనను స్తుతించినాడు (పు 2) ఈ కవి గార్లపాటి లక్ష్మణుని శిష్యుడు బగిరామపల్లి (పు 107), శ్రీరామపల్లి (పు 4) నివాసి మృత్యుంజయేశ్వరుడు బగిరాముపల్లి (పు 3, 68) దివ్యక్షేత్రనివాసుడు (పు 4, 5) అని కూడా కవి ఆ దేవుని పేర్కొన్నాడు ఆ స్వామి కృతిభర్త కథకు శ్రోత చకినాల లింగప్ప

4 7 1 ఈ కావ్యంలో కాళహస్తి ప్రస్తావన ఉంది కరికాళ చోళుడు కావేరికి కట్ట కట్టిస్తుంటాడు దేశ దేశాలనుండి రాజులు, తమ రాజ్యాలనుండి ప్రజల్తో వస్తారు వెట్టి చేసేందుకు పిట్టవ్వకు బదులు శివుడే వెట్టి చేస్తాడు ముక్కంటి చోడడు మాత్రం రాడు కరికాళుడు శివునికి ఆన పెడ్తాడు, ముక్కంటి చోడని ప్రసాదం స్వీకరించవద్దని ముక్కంటి చోడని ప్రార్థనపై ఈ విషయం చెపుతాడు శివుడు ముక్కంటి చోడడు చివరకు కరికాళుని మాట వినక తప్పలేదు

ముక్కంటి చోడడు సామాన్యుడు కాదు కాళహస్తీశ్వర సంచారుడు ఒక చోడరాజు కాళహస్తి పురంలో ఉంటాడు ఆ పట్టణ స్త్రీలు సిరికిపచ్చి కాళహస్తీశ్వరుని

పూజించి అంజలి పడతారు పూజార్లు ప్రసాదమిస్తారు నళినాక్షులు "తమ మణిం దలిఁజూచి ..కొమరొప్ప నీ చిన్ని కోమలికిపుడు రమణమై పుత్రుని రక్షించితేని... ఈ దెవదేవున కిభచర్మ ధరున కాదేవదేవున కత్యంత ప్రీతి..... దీపముల్ వెలిగింతు మనుచు..... పూజార్లచే నా ప్రసాదంబు చపలాక్షి కిప్పించి''నారు

కాళహస్తీశ్వరుని ప్రసాదమహిమతో ఆ బాల గర్భవతైంది తల్లిదండ్రులు "వాసన గల పాలవంటి వంశమున వాసన దప్పె నీవలన" విషయం చెప్పమ్మా అంటారు "అపుడందఁగా కాళహస్తి ఈశ్వరుని దర్శనంబునకు ముత్తైదువ స్త్రీలు పెక్కండ్రు నేఁగి సంప్రీతి నర్చించి.. ప్రసాదంబు చేకొనునపుడు "నేను చెయ్యి జాపినాను" నా వదినలు ఇలాటి కోరిక గోరినారు, హాస్యానికి ఆ ప్రసాద మహిమ వల్లే గర్భ మయింది "ఇదినమ్మకుంటిరే నీకుఁడే సాఁ...ముక్కన్నులును గల మూర్తియై పుట్టు" అంటుంది ముక్కన్నులును గల శివుడయిస్తాడు కాస్త పెరిగి పెద్దయిం తర్వాత "తండ్రి యెవ్వట గలఁడు .. . తండ్రులు లేనట్టి తనయులున్నారె" అని నిలదీస్తాడు తల్లిని

"బాల్యమున నాటలాడుచును చని కాళహస్తి ఈశ్వరుని దివ్యప్రసాదంబు వడసిన జయమున నా ప్రసాదంబు నీవెయై సమకూరినావు దేవదేవుఁడు మహదేవుఁ డైనట్టి శ్రీకాళహస్తి చిదాకాశ మూర్తి నీకైన జనకుండు" అని జవాబిచ్చిం దా తల్లి

శ్రీకాళహస్తి ఈశ్వరుడె తన జనకు డని తెలుసుకొన్న బాలుడు వెళ్లి స్వామితో నీకొడుకును ఇలా స్వంతనగరం లేకుండా ఉండటం బాగలేదంటాడు. కాళహస్తీశుడే ముక్కంటి చోడనికి పట్నం కట్టిస్తాడు (పు 20).

4 7. 2 కరికాళచోళుని పనుపున వచ్చిన రాజులలో కళింగరాజు కూడా ఉన్నాడు . "లాట మరాటవరాట భోట కర్నాట భోట కళింగ కాంభోజాది రాష్ట్రపతుల సహాయుఁల బరఁగ రప్పించి" అని కవి పలుకులు

ఈ విధంగా నవచోళ చరిత్ర కావ్యంలో కనిపించే శ్రీకాళహస్తి, బగిరామపల్లి - బగిరాముపల్లి - శ్రీరాముపల్లి పాలకురికి అనేవి తెలుగునాడులోని ప్రదేశాలే

4 8 ఎఱ్ఱన యుగంలో వెలసిన కవులలో ఎఱ్ఱన నృసింహ పురాణంలో అహోబల క్షేత్ర వర్ణన విపులంగా ఉంది సింహగిరి నరహరి వచనాలలో 'సింహాద్రి' ప్రసక్తి ఉంది రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణంలో శ్రీశైలక్షేత్రం

తూర్పు వాకిలిగా చెప్పబడే త్రిపురాంతక క్షేత్ర ప్రస్తావన ఉంది పోశెట్టి లింగకవి కావ్యంలో 'శ్రీకాళహస్తి' ని గురించి ఉంది

కవి సార్వభౌమ శ్రీనాధుడు తర్వాతి యుగానికి ప్రధాన పురుషుడు ఆయన కావ్యాల్లోనూ, ఆయన సమకాలికుల కావ్యాల్లోనూ 'తెలుగునాడు' ఎలా ప్రతిఫలించిందీ తర్వాతి ప్రకరణంలో పరిశీలిద్దాం.



## సూచికలు :

1 ఆంధ్ర సాహిత్య చరిత్ర, పు 275
2 "సకల ధర్మలింగత్రిలింగోనామ జనపద ...... అద్దంకి నామధేయా నగరే" (వెమభూపాలీయం) ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 4
3 హరివంశం పీఠిక, పు III
4 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 274
5 "ఆంధ్రమల్లంచ నికృతిం ముష్టికంచం మహాబలం" (అధ్యా 87, శ్లో 8) అని హరివంశమూలం
6 "బ్రహ్మకుండీ కృష్ణవేణ్ణ గోదావరీమహనది తటద్వయ తన్మధ్యదేశ దత్తానేకాగ్ర హార (అనవేమారెడ్డి అమరావతి శాసనం), ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 252
7 హరివంశం, పీఠిక, పు. 1
8 ,, పు 1
9 నృసింహ పురాణం పీఠిక, పు 5-8
10 నూటయెనిమిది తిరుపతుల వైభవము
**11.** **Temples and Legends of Andhra Pradesh - N Ramesan, p 41 As was quoted in the District Gazetteer Fairs and Festivals, Kurnool District, p 41**
12 కర్నూలు జిల్లా ఫెయిర్స్ అండ్ ఫెస్టివల్స్ గ్రంథం నుండి పు 41
13 భాస్కర రామాయణం పీఠిక, పు IX
14 శ్రీ వరాహ లక్ష్మీ నృసింహ క్షేత్రము సింహాచలము ఆరాధనపత్రిక' జూలై-ఆగస్టు, 1958, పు 194
15 ... అష్టభాషాకవిత్వం శ్రీవాలీవిజిత సంపదె
సోమాయ నాచనాంభోధేః సోమా యామిత తేజసే
(ఎ పి. కర్ణాటికా జి డి 468 పంక్తులు 20-21)
16 ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం, 'ముఖద్వారము' పు 295



# 5

# శ్రీనాథ యుగ సాహిత్యంలో తెలుగునాడు

5 0 శ్రీనాథుడు కవి సార్వభౌముడు ఆయన జీవించి ఉండిన 15 వ శతాబ్దాన్ని 'శ్రీనాథ యుగం' గా ఆంధ్ర సాహిత్య పరిశోధకులు పేర్కొంటారు.

శ్రీనాథుని కాలంనాటి కవులు 1 వినుకొండ వల్లభామాత్యుడు, 2 పోతన, 3 జక్కన, 4 అనంతామాత్యుడు, 5 గౌరన, 6 దగ్గుపల్లి దుగ్గన, 7 పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, 8 దూబగుంట నారాయణకవి, 9 భైరవరాజు వెంకట నాథుడు, 10-11 నంది మల్లయ – ఘంట సింగన, 12 కొరవి గోపరాజు, 13 వెన్నెలకంటి జన్నయ, 14 మడికి సింగన, 15 నిశ్శంక కొమ్మన, 16 అయ్యలరాజు త్రిపురాంతకుడు, 17 భైరవ కవి, 18 సూతనకవి సూరన, 19 తాళ్ళపాక అన్నమయ్య, 20 తాళ్లపాక తిమ్మక్క, 21 మొల్ల, 22, విన్నకోట పెద్దన అనే వారు.

ఈ ప్రకరణంలో శ్రీనాథుని సాహిత్యాన్నేగాక పైన పేర్కొన్న ఆయాకవుల కావ్యాలనుకూడా అవలోకించి 'తెలుగునాడు' స్వరూపాన్ని వివరించడం జరుగుతుంది

5 1. శ్రీనాథుడు శ్రీనాథుడు రచించిన కావ్యాలలో మనకు మిగిలినవి 1 శృంగారనైషధం, 2. హరవిలాసం, 3 భీమేశ్వర పురాణం, 4 కాశీఖండం, 5. పలనాటి వీరచరిత్ర, 6 శివరాత్రి మాహాత్మ్యం, [ క్రీడాభిరామ కావ్యాన్ని వినుకొండ వల్లభరాయని కృతిగా ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు చెప్తున్నందువల్ల ఆకావ్య పరిశీలన ఇంకోచోట జరుగుతుంది ]

5 1. 1 శృంగార నైషధం "సంతరించితి నిండు జవ్వనంబునయందు హర నైషధకావ్య మాంధ్రభాష" అని శ్రీనాథుడే స్వయంగా చెప్పుకొన్నాడు. సంస్కృతంలో ప్రౌఢ కావ్యంగా ప్రసిద్ధికెక్కిన భట్టహర్షుని 'నైషధీయ చరితమ్' శ్రీనాథుని చేతిలో శృంగార నైషధం' గా రూపు దాల్చింది

శృంగార నైషధ కావ్యంలో ప్రసక్తమైన తెలుగు నాడుకు సంబంధించిన ప్రదేశాలు ఆంధ్రదేశం, విక్రమసింహపురి – నెల్లూరు, మహేంద్రగిరి అనేవి

5. 1 1 1 ఆంధ్ర భాషలో తాను రచిస్తున్న కావ్యాన్ని 'ఆంధ్రభాష'లో అని కవి చెప్పడం చమత్కారం "...నైషధ శృంగార కావ్యంబు దెలియఁజెప్పితి నాంధ్రదేశ భాషను" (8-203) అని కవి పలుకులు

5 1 1. 2 శృంగార నైషధ కావ్యానికి కృతిపతి మామిడి సింగనామాత్యుడు సింగన తండ్రి చిటి పెద్ద ప్రభువు

విక్రమపురీ సింహాసనాధ్యాసియై ఉండినవాడు "శ్రీ చిటి పెద్ద ప్రభుఁడొప్పె విక్రమపురీ సింహాసనాధ్యాసియై" (1-22) అని శ్రీనాధుని పలుకులు.

"నెల్లూరి తూర్కు రాజు పౌత్రి మామిడి పెద్దనామాత్య పుత్ర .... సింగనామాత్య" (6-206) అని కృతిభర్తకు కావ్యకర్త ప్రస్తుతి.

5. 1. 1. 3 "ఆ లంకాపుర శంకరాచల మహీ వ్యాపార పారాయణ ప్రాలేయద్యుతి కీర్తిమండలు" డట (8-204) కృతి భర్త ఆంధ్రదేశ సరిహద్దులలో మహేంద్రగిరి ఒకటి ఇది నాటి కళింగ దేశంలోనూ, నేటి ఒరిస్సా రాష్ట్రం గంజాం జిల్లాలోనూ ఉంది ఆ మహేంద్రగిరె కావ్యంలో చెప్పిన శంకరాచలం

ఈ విధంగా శ్రీనాధుని 'శృంగార నైషధం' లో ఆంధ్రదేశం, విక్రమసింహపురి-నెల్లూరు, మహేంద్రగిరి అనే ప్రదేశనామాలు తెలుగునాడుకు సంబంధించినవి ప్రసక్తమైనాయి

5 1 2 హరవిలాసం శ్రీనాథుని హరవిలాసం అవచి తిప్పయకు అంకితం. హరవిలాస కావ్యంలో ప్రస్తావనకు వచ్చిన తెలుగునాడు లోని ప్రదేశాలు-కొండవీడు, దక్షిణకాశి (దక్షారామం) వేంకటాచలం, శంకర శైలం, శ్రీకాళహస్తి, శ్రీపర్వతం, సింహవిక్రమపట్టణం అనేవి

5 1 2 1 శ్రీనాధుని కాలం నాటికి "కొండవీడు పురంబు రాజధానిగా.. ..కొమరగిరి వసంత నృపాలుం"డు రెడ్డి రాజ్యం ఏలుతుండేవాడు (1-7) కొండవీడు ఆంధ్రదేశంలో ప్రసిద్ధికెక్కిన గిరిదుర్గం గుంటూరు జిల్లా, నరసారావుపేట తాలూకాలో నరసరావుపేటకు తూర్పున 13 మైళ్ళ దూరంలో ఉంది రెడ్డి రాజులకు మొదట అద్దంకి, తర్వాత కొండవీడు రాజధానులు[1]

5 1 2 2 దక్షారామాన్ని 'దక్షిణకాశి'గా శ్రీనాధుడు ఎన్నో సార్లు పేర్కొన్నాడు అలాంటి శ్రీనాధుడే శ్రీకాళహస్తిని కూడా దక్షిణ కాశిగా ఉటంకించడం విశేషం

"శ్రీమద్దక్షిణకాశికాపుర మహా శ్రీకాళహస్తీశ్వర ప్రేమాత్యోప్తవ కాలఘైరవ కృపా ప్రవర్ధిత" (5-59) అని కృతిభర్తకు ప్రశంస

శ్రీకాళహస్తీశ్వరుని ఆలయంలో పాతాళగుహ ప్రణీతుడనీ, శ్రీకాళహస్తి వస్త్ర సుధ కల్పిత విభవుడని అవచి తిప్పయకు కవి సంబోధనా పూర్వక ప్రస్తుతులు

"శ్రీకాళహస్తి నాథ ప్రాకారాంతః ప్రణీత పాతాళగుహా!" "శ్రీకాళహస్తి వస్త్ర సుధ కల్పిత విభవ యవచిదేవయతిప్పా!" (7-1) అనేవి

5 1 2 3 వేంకటాచలం (తిరుపతి-తిరుమల) క్రింది పాదాల్లో కన్పిస్తుంది

" అలిగి పోయిన వేంకటాచలంబున కెగి
కొని వచ్చె నెవ్వని "..   ...   (1-14)

5 1 2 4 వేమారెడ్డి శ్రీశైలాన్ని భక్తులు అధిరోహించేందుకు సుగమంగా ఉండేటట్లు మెట్లు కట్టించినాడు

"శ్రీపర్వత సోపాన స్థాపకుడగు రెడ్డి వెమ జగతీ పతికిన్" (1-18) కవి జేజేలు సమర్పించినాడు

5. 1. 2 5 అవచి తిప్పయ పూర్వీకులలో పావాటిసెట్టి ప్రసిద్ధుడు. అతడు నెల్లూరులో ఉండే వర్తక శ్రేష్ఠుడుగా "సింహ విక్రమ పట్టణ శ్రేష్ఠుడైన జగజెట్టి పావాణిసెట్టి విభుడు" (1-17) అనే పద్యపాదాలు తెలుపుతాయి

5. 1 2 6 పావాణి సెట్టి "నగరీశ (?) చంద్రశేఖర పదాబ్జ వందనా నందితాత్ముడు" (1-17).

5 1 2 7 రెడ్డి రాజ్యం లంకా శంకర శైలాల మధ్య వ్యాపించి ఉండేది. రెడ్డి రాజుల సుగంధ భాండాగార అధ్యక్షుడు అవచితిప్పయ

"లంకాశంకర శైల మధ్యవసుధాలంకార ధవ్యక్రమా" (6-132) అని కవి ప్రశంసాపూర్వక వాక్కులు

హరవిలాసం తర్వాత వచ్చిన శ్రీనాథుని రచన భీమేశ్వర పురాణం

5 1 3 భీమేశ్వర పురాణం భీమేశ్వర పురాణం పంచారామాలలో ఒకటైన దక్షారామ క్షేత్ర మాహాత్మ్యకావ్యం. ఆ క్షేత్రాన్ని ఇంత విస్తృతంగా వర్ణించిన, క్షేత్ర మహిమను కొనియాడిన, ఆ క్షేత్ర ప్రాంతాన్ని సూక్ష్మ సూక్ష్మం

కాలంలో పరిశీలించిన తెలుగు కావ్యం భీమేశ్వర పురాణం మరొకటి లేదనడం అతిశయోక్తి కాదు

5 1 3 1 పంచారామాలు దాక్షారామం, చాళుక్యభీమవరం (సామర్లకోట), పాలకొల్లు, గుణపూడి – భీమవరం, అమరావతి – ధరణికోట అనేవి పంచారామాలు వీటికి వరుసగా దక్షారామం, కుమారారామం, క్షీరారామం, సోమారామం, అమరారామం అని పేర్లు మొదటి రెండు క్షేత్రాలు తూర్పుగోదావరి జిల్లాలో, తర్వాతి రెండు పశ్చిమ గోదావరి జిల్లాలో చివరిది గుంటూరు జిల్లాలో వెలసి ఉన్న పావన క్షేత్రాలు

పంచారామాలకు ఆ పేర్లు వచ్చిన తీరు, అవి వెలసి ఉండే ప్రాంతాలు శ్రీనాథుడు ఈ వచనంలో విశదీకరించినాడు

"అనంతరం బా యంబికా వల్లభుండు జాంబూనద శైల కోదండం బెక్కుగించి యథాస్థానంబున నునిచి నారి యగు పాపతేనిని విశ్వంభరా భరణంబునకు నియోగించి, క్షీరాంభోరాశి తూణీరంబున వైకుంఠబాణంబు చేర్చి, వేల్పుల వడ్కొలిపి బ్రహ్మను సత్యలోకంబున కనిచి, వేదంబులం దన నిట్టూర్పు గాడ్పుల లోనం గలిపి చంద్ర సూర్యులం గాలంబు గడుప నియోగించి, కృతకృత్యుండై త్రిపుర దైతేయుల కుల దైవంబైన యద్దివ్యలింగంబును బంచ బ్రహ్మ పంచాక్షరి పంచ తత్త్వ పంచ భూత మయం బగుటం జేసి పంచ ఖండంబులుగా ఖండించి కృష్ణవేణీ మహానదీ తీరంబున ధరణాల కోట యను గ్రామంబున నమరేశ్వరుని చేతం బ్రతిష్ఠితంబగుటంజేసి, యమరలింగంబుగా బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీ తీరంబున దక్షిణ కూలంబున గుణిపూడి యను గ్రామంబున సోముని చేతం బ్రతిష్ఠితంబు సేయంబడుటం జేసి సోమలింగంబన బ్రఖ్యాతంబైన సోమారామంబును, బాలకోట యను గ్రామంబున శ్రీరామ చంద్రునిచే బ్రతిష్ఠితంబగుటం జేసి రామలింగంబు నా బ్రసిద్ధంబైన క్షీరారామంబును, చాళుక్య వంశ రాజధాని యగు చాళుక్య భీమవర నామ గ్రామంబున కుమార రత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితం బగుటం జేసి కుమార భీమలింగం బనం బ్రఖ్యాతంబు నొందిన భీమారామంబును, మొదలిమామ యగు దక్ష ప్రజాపతి యునికి పట్టయిన యారామంబ యట దక్షారామంబున శివ సన్నిధానంబై దానుండ నట్టిగా నీ ప్రకారంబున భోగ మోక్ష ప్రదంబులైన పంచారామంబులను బ్రతిష్ఠ నొందించి తానును " (4–151)

వేమ భూపతి "కాంచీ శ్రీగిరి కాశి పంచారామాది దేవ భవనంబుల... అంచిత భూదాన హాసరాశివపంక్తుల్" వ్రాయించినవాఁడు (1-40)

వెండపూడి అన్నయమంత్రిని తమ వాడుగా చేసుకొనేందుకు "పంచారామములందుఁ బల్లాల పురిం బొల్చేందు పింబాననల్ .. దూతికాతతికి అంచబిత్తు" రట (1-78) అందుకే వెండపూడన్నమంత్రి పంచారామ వధూటీ పంచాస్త్ర విహార కేళీ పాంచాలుఁడు" (1-85) గా పరికీర్తింపబడినాడు

5 1 3 2 భీమమండలం భీమమండలాన్ని శ్రీనాథుడు భీమమండలి, భీమమండలిక భీమేశ్వరు మండలంగా అభివర్ణించినాడు

భీమమండలంతో ఇతర మండలాలప పోల్చడానికి వీల్లేదట ఎందుకో ? మిగతా మండలాలకు లేని పవిత్ర లక్షణాలు ఈ క్షేత్రానికి ఏమున్నాయి ? కవి జవాబిస్తాడు ఈ పద్యంలో

" ఎక్కడఁజూచినన్ సరసి యెక్కడఁజూచిన దేవ మందిరం
బెక్కడఁజూచినం దటిని యెక్కడఁజూచినఁ బుష్పవాటికల్
ఎక్కడఁజూచిన న్నది మహీ వలయంబున భీమమండలం
బెక్కడ నన్యమండలము లెక్కడ భావన చేసి చూచినన్ " (3-23)

బృహస్పతి ఉపదేశంమీద "భీమేశ్వర శ్రీమన్మహాదేవునకు .. భూమి మండలంబు సమర్పించి భీమమండల" మనే పేరు కల్పించినాడు దేవేంద్రుడు (5-76) తూర్పున అంబుధి . దక్షిణ, తూర్పు దిక్కులకు గౌతమి, ఉత్తరం మాడామడలు సరిహద్దులుగా "సురనాథుఁడు దక్షిణ కాశి భీమలింగంబునకు ఏక భోగముగఁగట్టడ" చేసినాడు (5-77) "తుల్యాభాగా తరంగిణి ... కణ్వ వాహినితో గూడ దేవభర్త ధరణి భీమేశ్వరునకు .. ధార పోసి" ఇచ్చినాడు (5-78) పాకశాసనుడు దక్షారామ సమేతంగా భీమమండలాన్ని శ్రీభీమేశ్వర శ్రీమన్మహాదేవునకు సమర్పించి అందలి చాతుర్వర్ణ్యాన్ని పిలిపించి (5-80) పై చెప్పిన పొలిమేరల మధ్య ఉండే భూమిని "దక్షవాటీశ్వరునకు ... ధారపోసి" ఇచ్చినాను (5-81) అని పాటించినాడు

భీమేశ్వరమండలానికి సీమా సంవిభాగం ఇలా చెప్పబడింది. ఉత్తరంగా సముద్రం, పడమరగా గోదావరి, తూర్పు తుల్యాభాగా నది, దక్షిణం వృద్ధగౌతమి ఇవి సరిహద్దులు వీటి మధ్యన ఉండే పావన క్షేత్రం ఇది కవి పలుకలలో పరికించండి.

" జంభ రిపు దిక్కునకు సీమ సలిలరాశి
పశ్చిమమునకు సీమ త్ర్యంబక తనూజ
ద్యుమ్నపతి దిక్కునకు సీమ తుల్యభాగ
దక్షిణమునకు వృద్ధ గౌతమియె సీమ " (3-33)

"భీమమండలి పుణ్యక్షేత్రంబు గనుగొందము" (3-47) అని నిశ్చయించుకొని వ్యాసాగస్త్యులు "భీమమండలంబు సర్వంబున్ విలోకింపఁగన్ అంబర మధ్యంబున పరిలంఘించి" నారు (3-48) అంటే ఈ కాలంలో చేసే ఏరియల్ సర్వేలాగ అన్నమాట వారికి గోచరించిన భీమమండలి విప్పారిన సరోజంలా ఉంది ఆంధ్ర భూమి మధ్యస్థలం పద్మంగాగా సప్తగోదావర జలం మకరందంగా బ్రహ్మసంవేద్యాది తీర్థాలు రేకులుగా, దక్షవాటి కర్ణికగా, భీమనాయకుడు హంసగా, గౌతమీ, సింధు, కౌంతేయ, కణ్వనదులు, తుల్యభాగ, ఏలేరు తుమ్మికొనలుగా, ఆ పుణ్యభూమి సంసార తాప దివ్యౌషధంగా మహర్షులకు సాక్షాత్కరించింది ఇంత పవిత్ర భావన చేసిన శ్రీనాథుని పద్య పద్మం ఇదె

" ఆంధ్ర భూమిపన మధ్యము పుండరీకంబు సప్త గోదావర జలము తేనె
బ్రహ్మ సంవేద్యాది బహు తీర్థములు రేకు లకటులు చాయ దివ్యస్థలములు
నాళంబు లమరాద్రి పరా విభాగంబు కళ్యాణ భోగమోక్షము లు తావి
దక్షవాటీ మహాస్థానంబు కర్ణిక హంసంబు భీమనాయకుఁడు దేవుడు
గౌతమి సింధు కౌంతేయ కణ్వనదులు తుల్యభాగయు నేలేరు తుమ్మికొనలు
వినుత సంభావ్యమైన యాపుణ్యభూమి యనఘ సంసార తాప శాంత్యౌషధంబు"
(3-50)

భీమమండలి మహిమను కవి ఇలా వర్ణిస్తాడు భీమమండలంలోని ద్వాదశ క్షేత్రాలలో జాతరలు జరిపిస్తాడు సురేంద్రుడు భీమమండలిలో కాపురముండేందుకు దేవతలు మానవులుగా పుట్టాలని ఉబలాటపడతారు

"భీమమండలికా పుణ్యభూమియందు .. పండ్రెండు క్షేత్రములకు సురుచి రైచె అప్సరస్సులం గూడ .. జాతరలు" చేస్తాడు (3-38) "భీమమండలిఁ గాపురంబు సేయఁ పుట్టు మర్త్యయోని జనింపంగ వివిధ గంధర్వ కిన్నర విబుధ వరులు మదిఁదలంతురు" (3-31) అంతటి గొప్పది ఆ భీమమండలి మహిమ

5 1 3 3 దక్షారామం పంచారామాలలో దక్షిణ కాశిగా ప్రసిద్ధికెక్కిన పుణ్యక్షేత్రం దక్షారామం భీమేశ్వర లింగం క్షేత్రదైవం సప్త గోదావరం తీర్థరాజం.

శ్రీనాథుడు దక్షారామాన్ని ముప్పైఒక్క పేర్లతో కీర్తించినాడు ఆపేర్లివి: 1) దక్షనగరి| దక్షనగరక్షేత్రం, దక్షపురము| దక్షపురి| దక్షునిపట్టణము, దక్షవాటి| దక్షవాటీ, దక్షువటిక| దక్షవాటికా| దక్షునివాటి, దక్షునివీడు. 2) దక్షవనం| దక్షవనికా పురం, 3) దక్షిణకాశి| దక్షిణాపథ కాశి, దక్షిణాపథ కాశికా, దక్షిణ వారాణసి, దక్షిణానందవనవాటి| దక్షిణోద్యాన వనవాటికా 4) చంద్రశేఖరుని నగరు| విరూపాక్షనగరు, 5) మహేంద్ర నగరి, 6) భీమనాథ మహాస్థానం, భీమనాథుని నగరి, భీమనాయకుని నగరు| భీమనాయకుని వీడు| భీమపతి మందిర మండలం, భీమదేవు నగరు, భీమశంకరుని నగరు| భీమేశ్వర సదనం అనేవి కవి దక్షారామానికి ప్రయోగించిన పవిత్ర నామాంతరాలు

దక్షారామ పురవర్ణన భీమేశ్వర పురాణం ప్రథమాశ్వాసంలో 87వ వచనం నుండి 104వ పద్యం వరకు విస్తరించి ఉంది దక్షారామం చుట్టూ “మందారపారిజాత వనాలు, పరిఖ, ప్రాకారం ఉన్నాయి పాతాళ భైరవుడు, గుహ వినాయకుడు, సప్త మాతృకలు, పురాన్ని పరిరక్షిస్తున్నారు ఆ పురం భూమిసతికి నూపురం వంటిది అప్సరలే సానులనే పేర్తో ఆ పురంలో ఉంటారు ఆ నగరంలోని వేశ్యల సౌందర్యాన్ని వర్ణించడానికి వేయితలల ఆదిశేషునికే శక్యంగాదు ఆ విషయాన్నే క్రింది పద్య భాగాలలో

దక్షవాటికం బశ్చిమ ద్వారభూమి గోముఖార్ధేందుధరుం గౌమ్మ గొంటలమ్మ.. పరివసించు నట (1-99), దక్షపురిని నుత్తర ద్వారమందు మహిత సుగుణమ తల్లి ప్రేమందతల్లి ఉండు నట (1-100 దక్షవాటిక లావుపు గవనిన్ . భక్త జన రక్షణదక్షైన....నారాంబ వసించునట (1-101) .దక్షుని పట్టణమున దక్షిణంపు పార్శ్వపుగవనిన్ . నిలిచిన ఘట్టాంబికం గొల్వ గామిత ఫలముల్ గలుగునట (1-102) మాణిక్యాంబ పృథివినిభిమనెంపెడి యోగపీ శక్తి గణములందు .. సర్వశృంగార యగుచు భీమనాథుని సన్నిధిం బ్రేమ వెలయు నట (1-103) ఎవెస జూచినన్ విబుధు లెవెన జూచిన మా.. మండలంబు నారదమున్వర వర్గము. . సత మహేశ్వర మూర్తులు . భృంగిరిటి హాహాహూహూలు దక్షవాటికన్ కనిపిస్తారు (1-104) కవికి ఈ వర్ణనతో తనివి తీరలేదు ఇంక పెద్దవర్ణన/విశిష్ట

కవి ఈ క్షేత్ర భోగ మోక్షప్రదత్వాన్ని నిరూపించేందుకా • అన్నట్లు ఆ పురం చుట్టుపట్ల పండే పంటల పచ్చదనాన్ని ప్రతిబింబింపజేసినాడు

"...లలితోద్యానములచేతను సప్తగోదావర ప్రవాహసలిలంబుల చేతను. . తీర్థకుండలంబులచేతను, గోదావరీ, తుల్యభాగా, కౌంతేయా, వణ్యపగానది మాత్రకాయమానంబులై యిరు గాపుచు బంటవాసంబు పంటవలంతి కెదార క్షేత్రంబుల చేతను . . ఒడ్డు చెఱువులుచేతను ప్రవహ భాగ్య ఘంటాపథంబును" . . . . (1-110) అయి ఉన్నదట ద్రాక్షారామం

ద్రాక్షారామం పరిసరాలలోని పొలాల్లో పండే సస్యాల విధాలు, ఆ పంటల సర్వస్వాన్ని శబ్దాలంకార భూయిష్ఠంగా వీనుల విందుగా వర్ణించినాడు వ్యాసుడు, సతీసమేతుడై అగస్త్యుడు అభిజిద్వేళ ద్రాక్షారామాన్ని ప్రవేశించినవేళలో వారు సందర్శించిన పచ్చపచ్చని భూమాతను కవి భావించి వర్ణించి, తరించినాడు కవి కాలంలో ఆ ప్రాంతాల సస్యశ్యామలత్వాన్ని ఈ వచనం చాటుతుండడంలో సందేహం లేదు

వ "అనంతరంబ కుంభ పులిన సంభవులు సంభవులు దొడిగికొని, కదలి, కదళికా రామంబుల రమణీయకంబును, నల్లసిత బిల్వ చిరి బిల్వ విటపంబుల పొల్పులును, ద్రాక్షా మద్రాక్ష ఖర్జూర కేసర సరళ పున్నాగ నారంగంబుల రంగంబును, లవంగ లుంగల వలి మల్లీ మతల్లి వేల్లనంబుల యుల్లాసంబును, ఘోంటా కురంటక ఝుంటికా, కంటక, ఫల, కపిత్థ లోధ్ర, జంబూ, జంబిర, పారిభద్ర, భద్రదారు, శాల్మలీ గుల్మ లీలా హేవాకంబు నుద్రేకంబును, గోమలతర, తమాల, మాలాకార, శాకోట విటపి, షండంబుల మెండును, జెలికు ములికంబును, ప్రాసంగు మిసిమియుఁ, జెంగల్వతావి రేవయు గుసుమవాటియెసకంబును, నుభయ పార్శ్వంబులం గల ఘంటా మార్గంబునుగా నెకనెడం గుసుంభారంభ సంభార కుసుమ గుచ్ఛచ్ఛాయ విభాసిత సంధ్యారాగ సరభసంబును, గందియందంబును, బెసర సిరియును, మినుము నలువును, గోధుమ శ్యామాకలబెడగును మాషపర్ణి సమున్మేషంబును, నేపె యేపును, నవంటి ననుపుతనంబును, నువ్వ మవ్వంబును, గుళుత్థ సిద్ధార్థముల వృద్ధియుఁ, బ్రత్తి సంపత్తియు, చొబ్బర యుబ్బరంబును, నంది సందర్భంబును, యవ యావనాళ ప్రియంగు కోద్రవముల పరిస్ఫూర్తియుఁ, పవ్వందల సందడియు, గంటె కొట్టు తలచును, గసగస లివయును, జెంగలించు జాంగలిక్షేత్రంబులు నేత్రంబులకునింపు సొంపు సంపాదింప ననంతాంత రాంతసంబులు, తరతరంబు తరళ తర తరంగ రింఖోళికాంచలంబులం జెంగులం దువా

శించుచు నతి శిశిర సలిల శీకర నికర నిరత కరణ పరిణతిం గొల్పి పోకమోకల పూవు జాళువల నెత్తావికిం దావాలం బగ్గి కేవలంబు పౌలయు సప్తగోదావర సమీరణంబులు నాసికాపుట కుటీరంబులకుం గుటుంబకంబుగా మంద మంద గమనంబున నహిమ కర బింబం బంబరవీధి సౌధ కూటంబున హంస కలశ భంగి నంగీకరించు కొల దివభిజి ద్వేళ వేలా వనోపకంఠ కంఠాలంకారం హార దామం బైన దక్షారామంబుం బ్రవేశించి రంత " (3–57)

దక్షారామంలో నివసించె వేశ్యల సౌందర్య విభ్రమ విలాసాలను కవి అతి పేలవంగా వర్ణించినాడు దేవేంద్రుడు భీమనాయకుని భీమమండలాన్ని "వార వధూ త్రిశత ద్వయంబుతో" (5–84) ధార పోసినాడు దక్షారామ నాయకుడైన భీమేశ్వరుడే ఆపుర వేశ్యల కోసం వారితో సాంగత్యం నెరపడం వారి అతిలోక సౌందర్య విలాసాలకు పతాక "దక్షారామ వధూటీ పక్షౌరుహ మృగ మదాది వాంఛిత విలసద్వక్షః కవాట" (3–220) "దక్షపురి సాని కూతులందపిలినాడు విశ్వలోక కుటుంబి భీమేశ్వరుండు" (1–110) "ఆపురంబునం గన్నెలు కాందారి ప్రొద్దున భీమేశుండు సానివాడ కరుగున్" (1–112) అన్న కవి మాటలు, ఈ క్రింది పద్యం భీమేశ్వరుని వేశ్యా ప్రియత్వానికీ, ఆ చెలువల సౌందర్యానికీ గీటురాళ్ళ

" పదునాల్గు మహా యుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగవాలై యుం
డదు సాని పెండ్లి యెప్పుడు
నది దక్షారామ మహిమ మగునో కాదో ? " (1–113)

దక్షిణకాశి దక్షారామం దక్షిణకాశిగా ఈ కావ్యంలో పలు చోట్ల ప్రస్తుతింపబడింది "భీమేశ్వరుని దక్షిణ కాశికా తుహిన ధామ కిరీటుండు (4–31) దక్షిణకాశికా స్థాననిలయుండు (6–46), దక్షిణకాశి భీమలింగంబు (5–77), దక్షిణాపథ కాశికా ధామ భీమ (5–129), దక్షిణాపథకాశికాంతర్విహార (5–139), దక్షిణాపథ కాశికా ధవుండు (5–93), దక్షిణోద్యాన వాటికా నిలయుండు (3–127) అని ప్రస్తుతించినాడు శ్రీనాథుడు

"దక్షిణవారణాసికిని .. సదృక్షంబగునట్టి పుణ్యతీర్థము గలదే" (2–20) "దక్షిణ కాశీ నగరంబు దక్షారామంబు పొగడ బ్రహ్మకు వశమె" ... (3–30) అని కవి ప్రశ్నించడమె కాదు కాశీ విశ్వేశ్వరునికి, క్షేత్ర తీర్థాలకు, దైవాలకు

దక్షారామ భీమేశ్వరుడు, క్షేత్రాలు, తీర్థాలు, దైవాలు ఎలా సరి సమానమో నిరూపించేందుకు ఈ సీసపద్యం రచించాడు

"భీమేశ్వరేశ్వర శ్రీ మహాదేవుండు హిమధామ మౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావరి సలిల ప్రవాహంబు సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరు చుట్టు మాలెలో చిరమైన గణపతి యేకాంత డుంఠి విఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణీశ్వరుండు మాణ్డవ్యంగ దండపాణీశ్వరుండు
భైరవ స్వామి శ్రీకాలభైరవుండు నంది నందీశ్వరుండెమి సందియంబు
దక్షవాటంబు కాశికాస్థలము గాదె తీవ్రవరతెజ సత్యవతి తనూజ" (3–31)

గౌరి, ఆకాశగంగ, కాశి, దక్షిణకాశి నలుగురు శంభునికి రాణివాసాలు (3–95)· దక్షవాటిక కాశీ ప్రతిబింబం కాశీ ప్రతినిధి, కాశికా ప్రకృతి కాశీ ప్రతిమ (3–131)

దక్షిణ కాశిలో మృతి పొందినవాడు "గమి కర్మభూత కైవల్యంబున్ పొందు" తాను దక్షిణాసింద వసవాటి దక్షవాటి. భీమలింగంబు సన్నిధానంబు గైకొనియున్న కతన "తీర్థములలోన నుత్తమ తీర్థ" మయింది

దేవేంద్రుడు భీమమండపాన్ని శంభునికి ధారాదత్తం చేస్తూ "దక్షిణ కాశియందు .. పుష్కరిణులలో . సిద్ధరసంబును . పోసి" నాడు (5–88) భీమేశ్వర స్వామి "దక్షిణాపథకాశి శ్రీదక్షవాటి భువన మాన్యంబు నాదు పుట్టినిల్లు" (6–24) అని సెలవిచ్చినాడు

కాశికి దక్షిణ కాశికి అభేదం ప్రాణావసానంలో అక్షయసుఖం, మోక్షం భీమలింగం దయచేస్తాడు "సాక్షాద్దక్షిణ కాశికా నగర వక్షస్థానము మోక్షార్థాక్షర దక్ష నక్షయ సుఖంబుం ప్రాణికిన్ . భీమనాథుం డొసంగుం ప్రాణావసానంబున" (4–35) అని కవి అమృత వాక్కులు

ముక్తి క్షేత్రం దక్షారామం ముక్తిక్షేత్రం శివుని అర్ధదేహంలో ఉన్న సతీదేవి మేనకా హిమవంతులకు జనించేందుకు స్వామి వరం నుంచి నిష్క్రమించింది దక్షారామక్షేత్రంలోనె ఈ వచనం చిత్తగించండి

"బ్రహ్మాది సంస్తుతుండై సర్వార్ధదేహంబున నున్న మాయా రూపిణి, మహాదేవి భవని మోహిని, దేవకార్య ప్రయోజనంబును మేనకాదేవి భాగధేయంబును హిమవంతుని తపోవిశేషంబును, గారణంబుగా దద్దేహంబున జన్మింప నియోగించిన

భువనేశ్వరి మహేశ్వరుని దేహంబు వలన సమ్మూర్తి యయ్యెంగావున దక్షారామంబు ముక్తిక్షేత్రంబు నాఁబరగె" (2-15)

సప్తగోదావరంలో పాపాలను పరాపంచలు చేసే స్నానమాడి, త్రిపుండ్రాలు ధరించి, మొగలి వాకిలి దాటి, నందీశ్వరుని నగరిపై విష్ణువును దర్శించి, మణిశిలా సోపానాలమీద ఆకాశాన్నంటే స్వామి భవనం ఎక్కి, భీమేశ్వరుని కొలిచినవారికి ముక్తి రావటం గొప్ప కాదట స్వామి దేవాలయాన్ని ఈ పద్యం ద్వారా దర్శిద్దాం రండి :

" నేఁదిష్టమున సప్తగోదావరంబున నఘమర్షణ స్నానమాచరించి
త్రాయుష మంత్రాక్షరాభిమంత్రితమైన విమలభూతి త్రిపుండ్రము ధరించి
మొగలివాకిలి దాటి దిగువ శాక్యరరాజు నగరిపై వెన్నుని ననువుఁజూచి
మణిశిలా సోపాన మధ్యమార్గంబుగా నభ్రంకషంబైన హర్మ్యమెక్కి-
సప్తపాతాళ భువన విష్కంభములకు దెఱవి వెడలనక్జ్యోతిః ప్రదీప్తమూర్తి
శంభు భీమేశ్వరేశ్వర స్వామి గొలుచు పరమమాహేశ్వరునకే మిక్రొత్తిముక్తి "
(1-114)

5 1 2 4 పంచతీర్థాల ప్రశంస దక్షాధ్వరాలకంత్రయతీర్థం, అఖిలేష్ట సంసిద్ధి తీర్థం, సోమేశ్వరం, హైమవతం, సప్తగోదావరం పవిత్రమైన పంచతీర్థాలు పంచతీర్థాలాడితే పంచేంద్రియాలతో చేసుకొన్న పాపాలు పోతాయట ఆ వైనం క్రింది పద్యంలో

" దక్షాధ్వరానల త్రయతీర్థ మొక్కటి యోగాగ్ని నెండెని నురిసె గౌరి
యఖిలేష్టసంసిద్ధి యండ్రు రెండవ తీర్థ మెందని నుమ గాంచె సిష్టసిద్ధి
సోమేశ్వరం బండ్రు మూడవతీర్థ మెంరెని నఘము లిజ్జింకలింకు
హైమవతం బంధు రది నాలుగవతీర్థ మెందేని హిమవంతుఁడొందె పరము
సప్తగోదావరంబు పంచమ సుతీర్థ మఖిల భవ లు నెంచెని నావహిల్లుఁ
బంచతీర్థంబు లివి యాడి పంచజనుఁడు పాయుఁ బంచేంద్రియోద్భవ
పాతకములు " (3 66)

భీమేశ్వరుని పార్శ్వ భూమిలో అగస్త్యేశ్వర, రామేశ్వర, నాకులేశ్వర, గణేశ్వర, పాతాళ భైరవేశ్వరులనే పంచ శివలింగాలు ఉన్నాయి పంచతీర్థాలలో గ్రుంకి

ఆ పంచ శివలింగాన్ని పూజిస్తే పంచవిధ మహాపాతకాలు కూడా పరిహారమౌతాయి (3-171, 172, 173)

5 5 2 5 ద్వాదశ తీర్థాల మహిమ పంచతీర్థాలే కాక ద్వాదశ తీర్థాలు కూడా దక్షారామంలో నెలకొని ఉన్నాయి ఇంద్రేశ తీర్థం, సిద్ధేశ్వరం, యోగేశ తీర్థం కాలేశ్వరం, శమనేశ తీర్థం వీరభద్రేశం, బ్రహ్మేశ తీర్థం, కపాలేశ్వరం, కుక్కుటే శ్వరం, సోమనాథేశ్వరం, శ్రీమహేశ్వర తీర్థం, రామతీర్థం ఇవి ఆ పన్నెండు తీర్థాల పేర్లు వాటి పేర్లు, మహిమ తెలిపేది ఈ క్రింది పద్యం

" ఇంద్రేశ తీర్థంబు ఋషి సమాకీర్ణంబు సిద్ధేశ్వరము సర్వసిద్ధి కరము
యోగీశ తీర్థంబు యోగలక్ష్మి దాయి కాలేశ్వరము భక్త కల్పతరువు
శమనేశ తీర్థంబు శాంతి దాంతి విధాయి వీరభద్రేశంబు విశ్వనుతము
బ్రహ్మేశతీర్థంబు బ్రహ్మర్షి సేవ్య మష్టైశ్వర్యదము కపాలేశ్వరంబు

కుక్కుటేశంబు కాశికిఁ గొంత వెలితి సోమనాథేశ్వరము ముక్తి సూచకంబు
శ్రీమహేశ్వర తీర్థంబు శివుని మెచ్చు త్రిభువనాభ్యర్చితము రామతీర్థ మనఘ"

(3-74)

ద్వాదశ తీర్థాల మహిమను వేర్వేరుగా కవి వర్ణించిన తీరు ఇది

1 ఇంద్రేశ తీర్థంవద్ద .. ఇంద్రేశుని . మందారతరు పుష్పదామాలతో .. ఏటేట జాతరకేగుదెంచి ఇంద్రుండు . సప్తగోదావరమున సుస్నాతుడయి పూజిస్తాడు (3-106) ఇంద్రేశ్వరు నాలయమునఁ బ్రణవ పంచాక్షరీమంత్ర పరన ియతితో పూజించినవాఁడు ఐంద్రపద భోగ ఫలమొందుతాడు (3-109)

2 సిద్ధేశ్వర స్థానంబు సిద్ధలింగాధిష్ఠితంబు ఆస్థానంబు దక్షయజ్ఞ ప్రాగ్వంశ క్షేత్రంబు (3-111)

3 యోగీశ్వరంబను స్థానంబు నందు యోగీశ్వరేశ్వరుఁడు సనకసనందనాది యోగీశ్వరులచేతఁ బ్రతిష్ఠితుండు (3-113) '.... నరుఁడు యోగీశ్వరేశ్వరునిఁ గాంచ . అష్టవిధైశ్వర్య సంసిద్ధిఁబొందు'తాడు (3-115)

4 యమేశ్వర లింగంబు యమ ప్రతిష్ఠితంబు సకృద్దర్శన మాత్రంబున మర్త్యుండు యమ భయంబుంబాయును (3-116) "శ్రాద్ధపిండోదకాది విశ్రాణముల

శ్రీయమేశ్వర తీర్థానఁ జేసి మనుజుఁడు ... నరక మహోదకముల వెగ్గడిలు నేడు తరముల పితృగణముల ... ఉద్ధరించును (3-112).

5 శ్రీకాళేశ్వరుని సన్నిధి . జపము హ్రేల్మి యాగియు వేక్రైకము కోటిగుణంబై సమగ్రమైన ఫలంబుల.. .. గలిగించును" (3-118)

6 శ్రీవర భద్రలింగము సేవించిన మానవుండు శివుని యాస్థానమున.. కేవల గాణాపత్య మహావిభవము నొందుతాడు ( 3-120 )

7 కాలభైరవుని చేతిలో విధాతృ కపాల పాత్ర.. సప్త నదీతట భీమ భూమియందు...జారి పడింది" అక్కడ నుద్భవించిన.. కపాల శంభు. కొల్చు మానవుల . పాతకౌఘముల్.. చేరవు ( 3-140 ) ఆ కపాల మోచనాభిధానంబైన తీర్థరాజముననుఁ. దాన హోమ యజ్ఞ తంత్రవిధులు జలుప.. ఒక్కొక్కటి కోటి ఫలము గాంచును' (3-141)

8. ఒకతెక్క నేలను తాకేటట్లు కోళ్ల శివలింగానికి భక్తితో ప్రదక్షిణం చేసి మోక్ష సత్పథమెక్కినాయి ఆ శివలింగమె కుక్కుటేశ్వర లింగం (3-144,145) ఆ కుక్కుటేశ్వర తీర్థం వద్ద "దానంబు హోమంబు . ప్రతిము లొక్కొక్కటి .. సాధకులకు కోటిగుణోపలబ్ధి" నిస్తాయి ( 3-148 )

9 సోమేశ్వర తీర్థంబు సర్వదేవతా నమస్కృతంబు (3-149) సోముడు మహేశు సంస్థాపించినాడు గనుకే ఆ శివలింగం సోమేశుడయింది సోమతీర్థము నందు సుస్నాన మొనరించి శ్రీసోమశంభు భజించు ధన్యుఁడు ఇహ జన్మమునయందు . ప్రాగ్భవమున . (జేసిన) పాపము .. బాసి . దేహాంతమునఁ త్రిపుర హరునిలో లీనమౌతాడు (3-152) సురలును .. గంధర్వులు .. యక్షులు సోమేశ్వర దేవుని (3-152) కొలుస్తారు

10 మాహేశ్వర తీర్థంబు సర్వదేవతా నమస్కృతంబు ముని సిద్ధసాధ్య చారణ విద్యాధరుల చేతఁ బ్రతిష్ఠితంబైనయది పితృపిండ దానం బేకవింశతి కులంబునకు దృప్తికరంబు (3-153)

11 రామేశ్వర తీర్థంబు కటకంతున కాటపట్టు (3-156) శ్రీరామేశ్వర సమీప సీమం నిత్యయాత్రా రంభం బొనరింప నపార ఫలప్రాప్తి చెందుతారు (3-157)

12 శ్రీబ్రహ్మేశ్వరుండు . ఏకాపటిన్ పాలిస్తాడు (3-133) బ్రహ్మేశ్వర

దేవుఁ గొలుచు భాగ్యాఢ్యులకుం .. ... బ్రహ్మతుల్యత శంభు భవన పదవులు కలుగుతాయి (3-137)

పంచతీర్థాలు, ద్వాదశ తీర్థాల మాహాత్మ్యం వివరించిన అగస్త్యుడు "తీర్థములే పదియు రెండునని చెప్పనేల దక్షారామ మండలి దీర్ఘంబుగాని ప్రదేశమెద్ది" ? (3-158) అంటాడు నిజమె, భక్తునికి దక్షమండలిలో ఎటు జూచినా పుణ్యతీర్థాలే గదా,

5 1 3 6 సప్తగోదావరం సప్తర్షులు ఈ నదిని భీమమండలికి తెచ్చినారు కాబట్టి 'సప్తగోదావరం' అనే పేరు వచ్చింది ఇందుకు "సప్తర్షి సమానీత గావున సమ్మహానదికి సప్తగోదావరాహ్వయంబు సంభవించెను" (4-210) అన్న కవి వాక్కులే ఆధారం

సప్తగోదావరం సప్తనదీ, సప్తాపగ, సప్తసింధు, సప్తసింధువు, సప్తముని సింధువు, సప్త మహాముని సింధువు, సప్తతాపస వాహిని అనే పేర్లతో భీమేశ్వర పురాణంలో పరికీర్తించబడింది ఈ కావ్యంలో ఎక్కువగా ప్రశంసింపబడిన తీర్థం ఇదె.

సప్తగోదావర పావిత్ర్యం, ప్రాధాన్యం, తేటతెల్లమయేటట్లు దక్షారామ భీమేశ్వర స్వామిని సప్తగోదావర తీరైకవాసుండు (3-216), సప్తగోదావరోత్సంగ (3-192), సప్తగోదావరోత్సంగ ధాముఁడు (3-10, సప్తగోదావరోత్సంగ సన్నివిష్టుని (4-86)గా ప్రస్తుతించడం జరిగింది

సప్తగోదావరికి భీమేశ్వరస్వామికి అభేదాన్ని తెలిపే పద్యం ఈ క్రిందిది

> " సప్తగోదావరంబు నిర్ఝర మనంగ
> భీమనాథేశ్వర స్వామి వెలుపసగ
> ధర్మపయులార సద్భ వేదంబ గాని
> యర్థ ఘనంబు లేదు పదార్థ సరణి " (4-19)

సప్తగోదావరం పవిత్ర నదిగాను, పంచతీర్థాలలో ఒకటిగాను, ఈ కావ్యంలో శ్రీనాథుడు పేర్కొన్నాడు నదిగా ఎవి ప్రస్తుతించిన విధం సపగోదావర వర్ణనలో పసుగులు తుంపాలతో నిటి జల్లులు నింగి కెగజిమ్మె అద్భుత దృశ్యం, అచ్చరలు అలమకొన్న త్రిగంధపు పరిమళాలు, సౌగంధిక పుష్పాలపై ఆడే తుమ్మెదల పిండు, కలహంసల నినాదాలు, తీరం అంతటా వ్యాపించిన మావిడిజాతి, పకుళవనాలు, మన కళ్ళకు కడతాయి ఘ్రాణేంద్రియాలకు తర్పణ చేస్తాయి ఆ పద్యాన్ని చిత్తగించండి.

" వెదండ వదన పండా దండ చకకిత ప్రోజితాంభః శ్ఛటా ప్లుత నభంబు
దేవ గంధర్వాప్సరో వధూటీ స్తన స్థానక శ్రీగంధ ధవళితంబు
కనక సౌగంధిక గంధోత్తమా గంధ సార నిష్యందయంబు
చటుల వీచి ఘటా ఝాట డోలారూఢ హంస సంసన్నినాదాలసంబు

భూరి తీరావనీ ఘనీభూత చూత జాతి వకుళ వనీ సమాచ్ఛాద్యమాన
బహుళ సింధు ధునీ వన బక మరాళి దక్షపురి యొద్ద సప్తగోదావరంబు "
(1-106)

భగీరథుడు రాజు ఆ రాజువెంట దివినుండి భువికి దిగివచ్చిన గంగ సప్త మునుల వెంట వచ్చిన సప్తగోదావరంతో సాటి ఎలా వస్తుంది?

" రాజవంశజుఁడగు భగీరథుని వెనుక
బాయుతెంచిన చదలేటి పాటి యగునె
సప్తముని రాట్ప్రతాప సంప్రాప్తమైన
సప్తగోదావరంబుతో సారమహిమ " (8-16)

"అప్సరో నికర సంసేవితంబు సప్తగోదావరంబు" (3-20) పంచతీర్థాలు ఉండేది సప్తగోదావరంలోనే. "సప్తగోదావరంబునఁ బంచతీర్థంబులాడి" (3-124) అని కవి పలుకులు

"శతానందుండు శివలింగంబుఁ బ్రతిష్ఠ చేసి ... శ్రీసప్త గోదావరంబువులం ...మంత్రపూర్వకముగాఁ బుణ్యాభిషేకంబు" గావించినాడు (3-135)

"సత్యవతి సుతుఁడు దక్షవాటికనుండి...సప్తగోదావరంబున స్నానమాడి... శివార్చనం బనుదినంబు" ఆచరించేవాడు (3-190).

"సప్తసింధు సలిల స్రోతోవగాహ క్రియా తుష్ట స్వాంతుఁడనై.. భీమేశ్వరున్ ......భజింతు" (3-201) అంటున్నాడు కాశీపురంనుంచి విశ్వనాథునిచే వెడలగొట్టబడి దక్షిణకాశి కేతెంచిన వేదవ్యాసుల వాచు

కాశిలోని "మణికర్ణికా ప్రవాహమునకు సప్తగోదావర జలము సాటి" (4-40) అని కాశికి దక్షిణకాశికి అభేదం చెప్పే సందర్భంలో కవి అన్న మాటలు.

"సప్తగోదావరంబు సలిల కల్లోల శిఖర హస్తము లెత్తి పాతకంబుల జంకించు" (4-41) నట. ఎంత పవిత్రమైన భావన!

విఘ్నేశుని సేవించనందువల్ల సురలు అమృతంకోసం పాలకడలిని చిలికి నపుడు హాలాహలం జనించిందని శివుడంటాడు సురలు కార్యసాధనకు వినాయకుని పూజిస్తారు "బలారి సప్తగోదావర సలిల ధారా హేమ కలశ సమితితో జలక" మాడిస్తాడు విఘ్నపతిని

సప్తమునులు రాక్షసులు ఒకరినొకరు శపించుకొంటారు "రాక్షసులు సప్త మునిసింధువునకు నంతః ప్రవాహంబు"ండేటట్లు శాపాన్ని సడలిస్తారు

"మహర్షులు హేమకుంభంబుల సప్తగోదావర ప్రవాహాంబు పూరంబులు దెచ్చి యయ్యీభవు నభిషేకించి పూజించిరి" (4–210) కాలాతీత మౌతున్నందువల్ల స్వామివారి రాకకు వేచి ఉండకుండా స్వయం ప్రతిష్ఠడైనాడు

ఎల్లకాలం ఒక ప్రవాహంతో భీమలింగాన్ని సేవిస్తూ "సప్తసింధువు మున్నీటిని కలుస్తుంది" (6–25) భీమలింగం ఎదుట సమృద్ధిగా నీటితో ఉండి "ఉదార జలనిధి సప్తగోదావరంబు" (6–26) ప్రవహిస్తుంటుంది

సప్తగోదావర ప్రవాహం భక్తులకు ముక్తి పంటల నిస్తుంది ప్రజలకు భుక్తి పంటల నివ్వడంలో కూడా దానికదే సాటి "సప్తగోదావర ప్రవాహా సలిలంబు చేతను.. యిరుగారుకరం బంట లొసంగు పంటవలంతి కేదారక్షేత్రంబు" లున్నాయి (1–110)

"సప్తగోదావరంబు నిర్ఝర. సేక సంప్రవృద్ధ ... వివిధ తరుగుల్మ వల్లికా వేలమైన తత్పురోద్యాన వీథి" ఆకర్షణీయంగా ఉంటుంది (3–28)

సప్తగోదావర తీర్థమహిమను అందులో స్నానం చేయాల్సిన సద్విధాన్ని, ఫలాన్ని కవి చెప్పిన తీరు వ్యాఖ్యం భక్తులకు ఉపదేశ ప్రాయం

"సప్తగోదావరముకంటె సకల తీర్థసారమగు తీర్థరాజంబు జగతిలేదు" (2–181) 'సప్తగోదావరంబు'లో స్నానం చేస్తే అఖిలశుభములు .. ఆవహిల్లు తాయి (3–60) "ఇంద్రేశ్వరుగొలువన్ . సప్తసింధువునం ద్రిషవణ" స్నానమాడేవాడు స్వర్గ ప్రాప్తి పొందుతాడు (3–107)

సప్తసింధూదకంబు గ్రుంకి నపుడు యోగీశ్వరు గాంచి అష్టవివిధైశ్వర్య సంసిద్ధిపొంది"తాడు (3–115) "సప్తగోదావరంబనును నారతీర్థ పుంత్తమోత్తమం . శ్రాద్ధతిల తర్పణాది లక్షయఫలములు" (3–154) గయలో శ్రాద్ధపిండ ప్రదానాది

సకల విధులు ఫలించినట్లుగానే ఇక్కడ గూడా అక్షయఫలాన్నిస్తాయి (3-155) సప్తగోదావరానికి భీమేశ్వరునికి మధ్య ఉండే స్థలంలో సుకృతం ఏది చేసినా వేయి విధాల ఫలిస్తుంది (3-158) "సప్తగోదావరమున గ్రుంకి . . భీమనాథేశ్వరస్వామిఁ జూచు మనుజులకు సప్తజన్మముల యఘము" తొలగుతుంది (4-20) మాఘ మాసంలో కుంభరాశిలో సూర్యుడున్నపుడు "సప్త తాపస వాహినీ వ్యూహముల్ మునుఁగు నపుడు" అఖిల పాపరహితుడౌతాడు (6-36) ఫాల్గుణం ఉత్తరా ఫల్గుని నక్షత్రం మీనరాశిలో సూర్యుడు ఉన్నపుడు "సప్తగోదావరాభిషేచనం" పాతకాల భంగపరుస్తుంది (6-37).

ప్రభాత సమయంలో 'సప్తగోదావరం' లో గ్రుంకులిడేవాడే తన భక్తుడని స్వామి శెలవిచ్చినాడు సప్తగోదావర స్నాన మంత్రమ్వయి శ్లోకాన్ని కవి యిలా ఉటంకించినాడు అందులో ఒక శ్లోకం

" సప్తగోదావరం తీర్థం సర్వతీర్థోత్తమోత్తమమ్
అత్ర సన్నిహితో రుద్రో భీమనాథేశ్వరేశ్వరః " (4-22)

సప్తగోదావరం నదిగా, తీర్థంగానే గాకుండా పుణ్యక్షేత్రంగా కూడా కవి పేర్కొన్నాడు. "సప్తగోదావరోత్సంగ స్థలమునకుఁ గాశి కేదార మక్షయవటంబు తరుఁగా కితర తీర్థమ్ములు సరియె " అని కవి వాక్కులు

5 1 3 7 మరో రెండు తీర్థాలు కవి పంచ తీర్థాలు, ద్వాదశ తీర్థాలతో పాటు మరో రెండు తీర్థాలను కావ్యంలో ప్రస్తుతించినాడు అవి భూధరేశ్వర తీర్థం, వరుణేశ్వర తీర్థం అనేవి

భూధరేశ్వర లింగం హిమవంతునిచే ప్రతిష్ఠింపబడినది "భూధరేశ్వర తీర్థమునఁ గృతస్నానుడై భూధరేశ్వరు గొల్చు బోధ ఘనుడు నిత్యమంగళుఁడు నిర్నిద్ర భద్రుండును, లక్ష్మీ విలాసైక లక్ష్మియుతుఁడు" అవుతాడని "తీర్థములలో నత్యుత్తమంబైన తీర్థంబు, భుక్తి ముక్తి ప్రదంబు మంగళ మంగళాత్మకము కళ్యాణస్వరూపము" అని అగస్త్యుడు ఈ తీర్థాన్ని ప్రశంసించినాడు (3-166)

అనాదికాలంలో ప్రచేతసునిచేత "వాహినీతట స.. నిల్పబడి వెలింగెడు.. వరుణలింగంబు" వరుణేశ్వరమని పిలువబడుతున్నది ఆ వరుణలింగానికి వేయి కుండలు తీర్థవారి ధారను అభిషేకవిధి" చేస్తే "వర్షపుదోషంబు వాయంగ వాన గురియు" నట (3-113)

5 1 3 8 కుమారారామం పంచారామాలలో కుమారారామం ఒకటి. వ్యాసమహర్షి యాత్రలో కుమారారామాన్ని సందర్శిస్తాడు

" ఆలోకించె మహామునీంద్రుఁడు కుమారారామమున్ విం
ధ్యకుక్షికోపాంత ధరాలలామము బహు క్రీడావన శ్యా
మమున్ ప్రాలేయాచల కన్యకాధవ జటాభారాసనార్ధేందు రే
ఖా మానాయిత హేమకూట కల ధౌతాట్టాలక గ్రామమున్" (2-61)

కుమారారామం ప్రక్కనే కొమరేరు ప్రవహిస్తుంటుంది "కొమరేటి కల్యాణ కమల షండంబుల సౌరభ్యభారంబు సంతరించి .. రాజనారాయణస్వామి రమ్య భవన తార్క్ష్య కేతన తతికి నర్తనము గఱపి .. కుమారవనానిలములు" వ్యాసుని అలస టను పోగొట్టినాయి (2-62) "బాదరాయణుఁడు . దివ్యవాహినిఁ గొమరేట దీర్థ మాడి . శాశ్వతునకుఁ జాళుక్య భీమేశ్వరునకు" మ్రొక్కినాడు (2-63)

5 1 3 9 ఇతర క్షేత్రాలు వ్యాసమహర్షి కాశినుండి వెడలగొట్టబడి దక్షిణ కాశికి వస్తూ మధ్యలో ఎన్నో పుణ్యక్షేత్రాలు సేవించి తరించినాడు అందులో పురుషోత్తమం, శ్రీకూర్మం, సింహాద్రి పీఠికాపురం, సర్పవనం, సొంపరాయణ గ్రామం చేరి ఉన్నాయి

మాధవదేవుని తులసిమాల, పురుషోత్తమ స్వామి పాదజలం, కూర్మనాథస్వామి మెడలోని చెంగల్వదండ, లక్ష్మీనృసింహస్వామి మెని చందనపు కప్పు, వ్యాసుని కాశీవియోగ గాథాతాపాన్ని శాంతింపజేసినాయి కథను దృష్టిలో పెట్టుకొని సముచిత వర్ణనలు చేసి మెప్పించడం శ్రీనాధునికి వెన్నతోపెట్టిన విద్య గదా ఆ సీస పద్యాన్ని చిత్తగించండి

" గంగానదీ ప్రవాహ కణము మాధవదేవు దోరంతరంబు ప్రేతులసి చిగురు
పురుషోత్తమమునందుఁ బుండరీకాక్షుని దివ్య పాదాంభోజ తీర్థజలము
శ్రీకూర్మమున యందు శేషాహి పర్యంక కంఠరంబు క్రొత్త చెంగల్వదండ
సింహాద్రియందు లక్ష్మీనృకంఠీరవ సార్వభౌము ప్రసాదచందనంబు

కాశికా విప్రయోగోరు గాథ తాప శాంతి కొదవెప శిశిరాపహారమగుచు
జాయతెరువున శ్రీబాదరాయణునకు వారిహర ధ్యానపూజా పరాయణునకు"
(2-51)

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

పీఠికాపురం సముద్రగుప్తుని కాలంనుండి ప్రసిద్ధి కెక్కిన ప్రాచీన ఆంధ్రనగరం పిఠాపురం శ్రీనాథుని కాలంలో రెడ్డిరాజ్యంలో ఇది అంతర్భాగం ఇదె పీఠాపురం (2-80, 81) గా ఉచ్చరింపబడింది

పృథివికి ముత్యాల దండవలె పీఠికాపుర పట్టణము ప్రోల నేలేఱు ప్రవహిస్తుంటుంది పీఠాంబ యోగపీఠిపై అనగర పార్శ్వంలో కాపురముంటుంది ...కుంతి మహాదెవి కూర్మి మెనల్లుడైన మాధవుడు "పెద్దగవనుల .. ప్రీవావిహన జఘనుడై" నిలుచుండి ఉంటాడు (2-52)

"ఏలేటి సాటి నదులు జగతినెక్కడివి ? (2-53) ఏలేరు పంపేట ..ప్రాసంగు వరిచేలు . ఇరుగాడునుం బండు" తాయి వెదు పనసపండ్లు పండుతాయి పౌక చెఱకు తోటలకు కొదపలేదు పొన్నలు, కొండమల్లెలు, నారదాలు, పాటలీపుష్పాలు, కేతకులు పరిమళిస్తుంటాయి పీఠికాపురంలో (2-54)

"భీమెశ్వర మండలంబు పౌరువున ద్రిలింగ త్కలంబుల సంధి"లో ఉండే పీఠికాపురం "కేదార కుంభకోణార్క స్థానంబులకు సమానం"గా ఉంటుంది ఏలేటి నీటి కాలువల క్రింద మొలకెత్తే వరి మళ్ళనుండి, పండి కోతకు సిద్ధంగా ఉన్న వరి దాకా అన్ని దశల వరిమళ్ళు ఉంటాయి టెంకాయతోటలు, ఆకుతోటలు, పనసతోటలు చంపక వృక్షాలు, అరటితోటలు, ఉద్యానవనాలు, కనుల పండువుగా ఉంటాయి

పిఠాపురం "కుంతీ మాధవ దేవునకు విశ్రాంతి ప్రదేశంబును, విఠాంబికా లక్ష్మి కాటపాటంబును, హేలా సానికి హేలాపల గోష్టిమంటపంబును ననందగి ఘాత భేతాళ ఢాకినీ వ్రత ప్రముఖ భైరవ వ్రాత నిర్మిత ప్రాకార వస్తు కుట్టిమంబగు పీఠా పట్టణంబు"ను వ్యాసుడు శిష్యులతో ప్రవేశించినాడు

కవికి తృప్తితీరలేదు పొలాల్ని గురించి ఇంకా చెప్తున్నాడు కాకర పొదలు, గుమ్మడి తీగలు, పెండలం, చిలగడ, చేమదుంపల తోటలతో ఉండే ఉపవనాలు "భువన సారము పీఠికాపురవరము"నకు నలువైపులా సాక్షాత్కరిస్తాయి (2-56)

బంగారు పానపాత్ర, ఆర బండిన మాతులుంగ ఫలం, ఖేటం, లోహదండాన్ని ధరించి" పీఠికాపురోపకంఠ శృంగాటక భూమి భాగమున గాపురముంచెడు పీఠికాంబను" వ్యాసుడు భక్తితో మ్రొక్కినాడు (2-57)

కుక్కుటేశ్వరున్ని హూంకృతిదెవిని, క్షేత్రదైవాల్ని కుంతీ మాధవున్ని పూజించినాడు (2-58) హేలాతరంగిణిని ప్రస్తుతించినాడు (2-59)

సర్వపురం పిఠాపురం తర్వాత వ్యాసుడు కుమారారామాన్ని సందర్శించి నాడు ఆ తర్వాత సర్వపురాన్ని, దీన్నే సర్వవనం అని కూడా అంటారు నేటి తూర్పుగోదావరి జిల్లా, కకినాడ తాలూకాలో ఉంది సర్వవనంలో శ్రీభావనారాయణ స్వామి వెంచేసి ఉన్నాడు

వ్యాసుడు "సర్వపురాభిధానము త్రిలింగకోటి వైకుంఠమున్" దర్శించినాడు "నారదకుండికా జలములన్ . .. దేహమును ముంచి" నాడు కాశీ వియోగ దుఃఖాన్ని పోగొట్టుకున్నాడు "శ్రీభావన్నారాయణున్ లోచనోత్సవముగా దర్శించి నాడు" (2-65)

సర్వవరం ఊరు ఊరంతా విష్ణుమయమే ప్రజలంతా విష్ణు భక్తులే భావ నారాయణస్వామి కంటె పరదైవం లేదక్కడ "దివ్యాను లు నూట యెనిమిది తిరు పతులకు ఒరమ పదమైన శ్రీసర్వపురము" లో (2-66) వ్యాసుడు "శనివారోత్సవ మాచరించి" నాడు (2-67) ద్వాదశాక్షరితో, అష్టాక్షరితో చెంగల్వ పూదండ, పసిడి ఒరులతో భావనారాయణ స్వామిని సమర్పించినాడు (2-68)

ఏడిద ముందుకు సాగినాడు మునివరుడు తుల్యాభాగా తీరంబున (2-69) ఉండే అగస్త్యేశ్వరస్వామిని సంగమేశ్వర స్వామిని పూజించినాడు (2-70, 71) రామచంద్రపురం తాలూకాలో ఏడిద గ్రామంలో తుల్యభాగా తెరాన ఉండే శివలింగం సంగమేశ్వరుడు[4]

సంపర వేదవ్యాసుడు ముమ్మందుకు పయనించి తుల్యభాగా తీరంబున సాంపరాయణ గ్రామంబు చేరువ చిత్రాటవి వాటిక గపట భిల్లుండైన చలిగొండతేని యల్లుని ముక్తీశ్వరుని దర్శించి (2-72), చిల్వదళ పూజనంబు చేసినాడు (2-73), దారువన్నె బంగారాన్నే పరిహసించే క్రొంగ్రొత్తరేల పూలతో సాంపరాయ గ్రామ సవిధ శైలయున్నె పూజించినాడు

కాకినాడ తాలూకాలో ఉండే నేటి సంపర గ్రామమే సాంపరాయ గ్రామం[5]

ఓంకార పురి వ్యాసుడు ప్రభాత సమయాన్నే 'దక్షారామ యాత్రొద్యమం' ఆపాదిస్తూ 'ఓంక్రియానగర పర్యంతార్ధమార్గంబున' లోపాముద్రా, తానూవచ్చే అగస్త్యుని దూరంగా నుండే చిందినాడు (2-79) ఓంకారపురి ఇప్పటి రామచంద్రా పురం తాలూకాలో ఉండే ఓదూరు అనే గ్రామం[6]

'పీఠాపురి కుక్కుటేశ్వరుని దాయఁగఁబోయెడు అగస్త్యుని తుల్యభాగాపగ చెంత శంకర గృహాంగణ బిల్వ వనాంతరంబునన్ కలుసుకొన్నాడు వ్యాసమౌని (2-81) ఆ తుల్యభాగా తీర బిల్వ తపవనాంతరంబున శశికాంత శిలాతల ప్రదేశంబున నాసీనులై వ్యాసాగస్త్యులు అష్టకథావినోదంబులఁ బ్రొద్దుపుచ్చినారు

5 1 3 10 పవిత్రనదులు శ్రీనాథుడు భీమేశ్వర పురాణంలో ప్రస్తుతించిన నదులలో వృద్ధగంగ, ఏలానది, తుల్యభాగ, సప్తగోదావరం ఉన్నాయి

భీమమండల క్షేత్రానికి కోటిపల్లి సోమేశ్వర స్వామి శిరసుపై నర్తించే వృద్ధగంగ, పీఠాంబికను తానమాడించే ఏలానది, మకరాది జలజంతువులు దండిగా తుల్యభాగ, అప్సరలతో సేవింపబడే సప్తగోదావరం అరటితోటలతో, పోకతోటలతో అమరి ఉంటాయి ఆ వైనం క్రింది పద్యంలో

" ఒకచోటఁ గోటిపల్లిపుతు రాజ కోటీర విభ్రాజితోత్తుంగ వృద్ధగంగ
యొకచోటఁ బీఠాంబికోన్నత స్తనభారాప్లావ జర్జరితకల్లోల యేల
యొకచోటఁ జటుల నక్ర కుళీర పాఠీన కౌయ గర్భాభోగ తుల్యభాగ
యొకచోట నప్సరో నికరసంసేవితాంతరము శ్రీసప్తగోదావరంబు

సమరు నాగరఖండ సిద్ధాంత జాతి నాగవల్లీ సమాక్రాంత పూగ ఖండ
మండితోద్యానవాటి కాభంగి విభవ పాత్రమగు భీమ మండలి క్షేత్రమునను
(3-20)

కోటిపల్లి రామచంద్రపురం తాలూకా గౌతమి ఒడ్డున ఉంది గురుపత్నీగమన దోష క్షమనార్థం చంద్రుడిక్కడ ప్రతిష్ఠించిన శివలింగం పేరు సోమేశ్వర లింగం[7]

గౌతమీ గంగ ప్రవాహగతి, ఆ నది ఏయే స్థలాలను పుణ్యక్షేత్రాలుగా చేస్తున్నదో తెలిపే పద్యం ఈ క్రిందిది

" త్ర్యంబకాచల శిఖాగ్రమునందు నుదయించి పొదలి యార్యావర్తభూమి దాటి
మలఁగి దండకవని మధ్యభాగమున నారాప్రస్రవణాచల ప్రస్థ మొఱసి
పట్టిస శ్రీవీరభద్రుని సేవించి తెరసోము మందిరము దాటి
యనంత భోగేశ్వర స్థానంబు రుద్రపాదములపైఁ బ్రాపగాఁ గఁ

గోటిపల్లిపై కొమరాంఘ్రులకు మ్రొక్కి కుండలాముఖ తీర్థంబు గుస్తరించి
భీమమండాలి డాపలఁ బెట్టుకొనుచు గౌతమీ గంగ లవణాబ్ధిఁ గౌగిలించె "
(8-21)

నాసికా త్రియంబకం వద్ద జన్మించిన గౌతమి, దండకవన మధ్యంలో ప్రవహించి పాపికొండలను ఛేదించుకొని, పోలవరం తాలూకాలో పట్టిసె గ్రామంలోని వీరభద్రుని సేవించి, తాళ్ళపూడి గ్రామంలో వెలసి ఉండే తిలసోమనాథుని మందిరం ప్రక్కగా పారి, కొవ్వూరు తాలూకా కుమదెవం గ్రామంలో అనంతభోగేశ్వరుని సేవించి కోటిపల్లె సోమేశ్వర పాదపద్మాలకు మ్రొక్కి, కుండలేశ్వరస్వామి ఉండే అమలాపురం తాలూకా కుండలేశ్వర గ్రామాన్ని ఒరసి పారుతూ, భీమమండలికి ఎడమవైపు ప్రవహించి, గౌతమీ గంగ సముద్రుని చేరింది "వార్ధులేడింటికి వలపు వనిత .. మంగలోత్సంగ గౌతమీగంగ" . . (8-22) పై పద్యాలలో గౌతమిని కవి గంగకు అభేదంగా వర్ణించినాడు

5 1 3 11 దక్షారామేశ్వర స్వామిని సేవింపబోయే లోపాముద్ర అగస్త్యులకు కాశీనుండి అవమాన ఖిన్నుడై వస్తున్న వ్యాసుడు ఎదురవుతాడు తుల్యభాగా తీరంనుండి అందరూ దక్షారామానికి తిరుగుమొగం పడ్తారు దారిలో వారు తుల్యభాగతటం మీద ఉండే సాంపరాయపురాన్ని దర్శిస్తారు మామిడితోపులతో శోభాయమానంగా ఉండే పులుగుర్తి సోమేశుణ్ణి, ఓంకార పురంలో త్రికూటంలో వెలసిన హరిహర బ్రహ్మలను, శిలామహాగ్రామంలో ఉండే శివునికి మ్రొక్కి ముందుకు సాగి దక్షారామ ప్రవేశానికి అనువైన శుభముహూర్తంలో ఒక ఏకాంత స్థలంలో ఆసీనులౌతారు

" తుల్యభాగాతటీ పశ్చిమ మండలంబైన సాంపరాయపురంబు సరణిఁబట్టి
చూతాటవీ వాటి శోభమానం బైన పులుగుర్తి సోమేశు వలపలించి
యోంకారపురి దక్షిణకూటోపరిస్థితులైన హరిహర బ్రహ్మల నభినుతించి
శిలా మహాగ్రామ సింహాసనస్థున కురగహారున కెదురుండి మ్రొక్కి
యరుగువారు మునుల్ పరాశరసుతునకు దక్షవాటి బ్రవేశింపఁదగినయట్టి
శుభముహూర్తంబునకుఁ గాలశుద్ధి దెలియఁ బడిచి కూర్చుండి రొక వివిక్త
స్థలమున" (8-39)

పులుగుర్తి – శీలా, రామచంద్రపురం తాలూకాలో పులుగుర్తి దగ్గరుండే సోమేశ్వర గ్రామంలో ఉండే శంభులింగం పులుగుర్తి సోమేశుడు కాకినాడ తాలూకాలో ఉండే నేటి శీలాగ్రామమే నాటి శీలా మహాగ్రామంతి

బ్రహ్మసంవేద్యం మునిసంఘాన్ని "ఓంకారపుర పుణ్యక్షేత్రంబునం త్రికూట దివ్యభవన వాటంబున" ఉంచి నింగికెగసి, "భీమమండలి పుణ్యక్షేత్రంబు" వీక్షించాలనుకుంటూను లోపాముద్ర, అగస్త్యుడు, వ్యాసుడు (3-47) కాశిలో చస్తేనే కైవల్యం వస్తుంది ఏమాత్రం కష్టం లేకుండా "వేద్యనాయకుని దే.. లీలా గతి" ముక్తి వస్తుంది రండి! త్వరగా రండి నరులారా! అని పిలుస్తున్నట్లున్నాయి ఆకాశాన్ని చరచే అలలు గౌతమి సముద్రంలో సంగమించే స్థలంలోనివి (3-53) అమలాపురం తా లోని 'బ్రహ్మసంవేద్యం' అనే గ్రామం వద్దనే గౌతమి సాగరన్తో సంగమిస్తున్నది అక్కడ ఉండే బ్రహ్మేశ్వర స్వామి శివలింగమే వేద్య నాయకుడు[9]

నింగినుండి సంవీక్షించే మునులకు సంవేద్యం, కోటిపల్లి, దక్షారామం, అందు లోని అందమైన భీమలింగం ఉండే ఉన్నతమైన దేవాలయం, సప్తగోదావరం దర్శనమిచ్చినాయి పట్టిస, పుండరీకాద్రి, కుమారారామం, కుక్కుటేశ్వరం, పల్వలపురం, సంగమేశ్వరం, కుండలాముఖం సాక్షాత్కరించినాయి ఆ క్షేత్రాల్లో ఉండే దేవాలయాలు దృగ్గోచరమైనాయి

" అదె పట్టిస స్థానమందుండు వీరభద్రేశ్వరస్వామి యర్ధేందుమౌళి
యదె పుండరీకాద్రి యచట మార్కండేయు నిలవేల్పు శ్రీముక్కంటి వెలసెఁ బ్రోల్మి
యదె కుమారారామ మా హర్మ్యరేఖయ చాళుక్యభీమేశ సదనవాటి
యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతయు మెడ హుంకారిణీదేవి యోలగంబు
వాఁడె మాయింటివేల్పు పల్వలపురమునఁ గొప్పులింగంబు ఫణిరాజ కుండలుండు
సప్తముని సింధు సంగమేశ్వరుఁడు వాఁడె కుండలాముఖమదె మౌనికుల వరేణ్య" (3-55

పలివెల పుండరీకాద్రిలో మృకండూద్భవస్వామి, కుమారారామంలో చాళుక్య భీమేశ్వరుడు, పల్వలపురంలో కొప్పులింగం, కుండలేశ్వర గ్రామంలో కుండలేశ్వర స్వామి, ఏకిద గ్రామంలో తుల్యభాగ గట్టున సంగమేశ్వరుడు, వెంచేసి ఉన్నారు పలివెల గ్రామంలో ఉండే స్వామి ఉమా కొప్పులింగేశ్వర స్వామి ఈ శివలింగం శిరస్సుపై కొప్పు ఉంది[10]

5 1 3 12 సప్తగోదావరం-గౌతమి గోదావరి తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో నడుమ ప్రవహించి రాజమహేంద్రవరంవద్ద ఏడు పాయలుగా చీలి తూర్పు సముద్రంలో కలుస్తుంది[11] ఆ ఏడు పాయల్ని సప్తగోదావరులంటారు అవి తుల్య, ఆత్రేయ, భరద్వాజ, గౌతమి, వృద్ధగౌతమి, కౌశికి, వసిష్ఠ అనేవి[12]

తుల్యభాగా నది రామచంద్రాపురం తాలూకాలో ప్రవహిస్తున్నది దక్షారామం వద్ద "గోదావరీ, తుల్యభాగా, కాంతేయు, కణ్వాపగానది మాతృకాయమానంబులై" యిరుగారు వరిపండుతున్నది (1-110)

తుల్యభాగకు ఆ పేరెలా వచ్చింది? ఒక రాక్షసుడు సురాసురులకు "మాధ్యస్థ్యంబున వివాదంబులు తీర్చుచుండుటరు సమర్థుండగుట" అతనికి తుల్య భాగుడనే పేరు వచ్చింది (4-187) గౌతమి గంగనుండి ఒక పాయను తుల్యభాగుడు తనవెంట కొనివచ్చాడు కాబట్టి ఆ నదికి 'తుల్యభాగ' అనె పేరువచ్చింది (4-186, 188)

సప్తర్షులు శివలింగ ప్రతిష్ఠకోసం గోదావరిని తెస్తుంటారు తుల్యభాగానది వద్ద రాక్షసులుంటారు గోదావరి ఆ ప్రదేశాల్ని ముంచెత్తుతుంది అసురులు ఋషులు వాకాటులాడుకుంటారు సప్తర్షులు తెచ్చే ఆ నది 'పష్కతోయ' అవుతుందని రాక్షసులు శపిస్తారు అసురుల సమాశ్రయమైన తుల్యభాగ అపూజ్య, అస్పృశ్య అవుతుందని మునులు ప్రతిశాపం ఇస్తారు తుల్యభాగుని మధ్యస్థంలో రాజీపడి తమ శాపాల్ని కొంత సడలిస్తారు అందువల్ల సప్తముల సింధువుకు అంతః ప్రవాహముంటుంది ఉత్తర, దక్షిణాయన పుణ్యకాలాల్లో, గ్రహణ వేళలలో, ఆదివారం, పుష్యము, అమావాస్య ఇలాంటి పర్వదినాలలో తుల్యభాగ పవిత్రత నొంది శుభాలనిస్తుంది (4-177 నుండి 4-190 దాకా)

5 1 3 13 గౌదావరి భీమేశ్వర పురాణం 'స్కాందపురాణ సారమగు శ్రీగోదావరి ఖండము' గా సంస్కృతంలో ఉంది (1-27) మునీంద్రులు "పృథివి యెల్లను రక్షించు పేరంటాలు మమ్ము రక్షించు గౌదావరమ్మ యెపుడు" (4-166) అని తమలో తాము అనుకొంటారు "గోదావరి, గోదావరి, గౌదావరి యంచు(బల్కు గుణవంతులకున్ గౌదావరి తల్లి సంపాదింతు( గదమ్మ నీవు భవ్యశుభంబుల్" (4-169) అని ప్రార్థిస్తారు అంభోరాశిని కుండికాంబుజ వని గౌదావరి (4-172) గౌతముని కమండలువు నుంచి పుట్టింది గోదావరి గోదావరి గంగమ్మగా భావింపబడింది (4-171, 175) గౌతమిగంగ ఆలోల ఘనతరంగ (4-162) గౌతమ

కన్యాతటిని నీరు తాగిన మనుజులకు పునర్జన్మ ఉండదు (4-163) ఘోరపాతకాలను గంగ అలల చేతులతో ఘుమ ఘుమ ధ్వనులతో వెదిరిస్తున్నదట (4-165)

5 1 2 14 పుణ్యతీర్థసంపాలు భీమేశ్వర పురాణంలో ఆరవ ఆశ్వాసం 81 వ పద్యం నుండి 90 వ పద్యం వరకు వివిధ దేవతలు ప్రతిష్ఠించిన శివలింగాలు-తీర్థకుండాల ప్రసక్తి ఉంది సప్తసింధువుకు భీమనాథునికి నడుమ దేవేంద్రునిచే ప్రతిష్ఠింపబడిన ఇంద్రేశ్వర తీర్థం ఉంది అది పాపనాశనం భుక్తి ముక్తిప్రదం (6-83) భీమలింగానికి దక్షిణంగా యజ్ఞపురుషేశ్వర దివ్యామృత లింగం ఉంది (6-84) అక్కడే అగ్నికుండం అనే తీర్థం ఉంది అందులో తీర్థమాడి పితరులకు తర్పణాలు వదిలితే వారు ఊర్ధ్వలోక గతులౌతారు (6-85) కృత్తికా నక్షత్రంలో అగ్నికుండికలో గ్రుంకులిడి అగ్నీశ్వరుని దర్శిస్తే ముక్తి కరతలామలకం అవుతుంది అగ్ని కుండికకు దగ్గరలోనే ఉండే దక్షకుండి సర్వపాపహరం దానికి దక్షిణంగా దాక్షాయణీదేవి వెలసి ఉంది దక్షకుండంలో స్నానమాడి దాక్షాయణీ దేవికి బహుళ అష్టమీ, చతుర్దశులలో దండప్రణామం చేసే నరులకు మోక్షం లభిస్తుంది (6-87)

దక్షకుండికి ఉత్తరంగా వీరభద్ర ప్రతిష్ఠితంబు చెంగట నిలచి లింగముంది భీమనాథేశ్వరునికి పడమట వరుణ ప్రతిష్ఠితమైన వరుణ లింగముంది వరుణకుండంలో గ్రుంకులిడి వరుణ లింగాన్ని దర్శించిన నరునికి భవ బంధాలు నశిస్తాయి భీమ లింగానికి వాయవ్యంగా వాయుదేవుడు ప్రతిష్ఠించిన వాయులింగముంది వాయు కుండంలో మునిగి వాయులింగాన్ని సందర్శిస్తే నరుడు మోక్షలక్ష్మిని పొందుతాడు సోమేశ్వర లింగం సోమునిచేత ప్రతిష్ఠితం సోమకుండంలో లానమాడి సోమేశ్వరుని దర్శిస్తే నరుడు భుక్తి ముక్తి సంసిద్ధి పొందుతాడు (6 88) శివగంగ, రుద్రగంగ అనే రెండు కూపాలు దక్షారామంలో ఉన్నాయి మొదటిది పాపాలను ఉడుకడాలినది రెండవది పితృదేవతలకు తృప్తినిస్తుంది (6-17)

5 1 3 15 శ్రీశైలం – శ్రీకాళహస్తి "వేమభూపతి కాంచీ శ్రీగిరి కాశీ పంచారామాది దేవభవనంబుల . .. అంచిత భూదాన శాసనాక్షర పంక్తుల్ .. వ్రాయించి" నాడు (1-40) "కాంచీ చిదంబర కాళహస్తి కాశీ శ్రీశైలాది మహా స్థానంబులకంటెను సేతు కేదారంబుల కంటెను నతిశయంబుగాఁ జేసె యీ క్షేత్రం బును (దక్షారామాన్ని) మరగి . భీమలింగంబు సర్వమంగళాదేవియును దానును లోకరక్షణార్థంబుగా నధిష్ఠించి ఉంటాడు (6-76)

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

5 1 3 16 'భీమేశ్వర పురాణం' అవతారిక 87వ వచనం వరకు సాగింది అందులోని స్థలనామాల ప్రసక్తి కొంత

ఆంధ్రజగతి/ ఆంధ్ర భూమండలం / ఆంధ్రమేదినీ, త్రిలింగభూమండలం త్రిలింగ విషయం, తెలుగు భూమి, కళింగ, పాకనాడు, అరేడు/ అరియేడు, కాల్పట్టనం, కొలను, చోడవరం, బెండపూడి, బోదసపుర, రాజమహేంద్రం/ రాజ మహేంద్రదుర్గం/ రాజమహేంద్రవరం, శంకరగిరి, శ్రీగిరి, సింహవిక్రమ నగరం కనకాచలం, గౌతమి, పంచారామాలు శ్రీమృకండుహర్మ్యవస్వామి స్థానం, సింహాద్రి సప్తమునిసింధు అనే స్థలాలు - నదుల ప్రస్తావన ఉంది

బెండపూడి అన్నమంత్రి శ్రీనాథుని పిలిపించి "స్కాందపురాణ సారమగు శ్రీగోదావరీ ఖండమున్ ఆంధ్రజగతీభాషాప్రబంధంబుగన్.. రచియింపు" మని అభ్యర్థిస్తాడు ఆంధ్రభాష అనడానికి 'ఆంధ్ర జగతీ భాష' అనడం శ్రీనాథుని వక్రోక్తి సౌందర్యానికి తార్కాణం వీరభద్రారెడ్డి, వేమారెడ్డి, సింహాద్రి పర్యంత సీమాంధ్రమేదిని పాలనాఖండలులు (1-29)

పంటవంశం "పాకనాటిదేశంబున భద్రపీఠంబున వసించి సింహవిక్రమనగర, దువ్వూరు, గండవరాది పట్టణంబులు నిజనివాసంబులుగా . త్రిలింగ భూమండలా ఖండలులను వెమాన్నపోతన్నవను కుమారగిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్య పీఠస్థులం" కాంచినది. . "అల్లాడ భూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి పర్యంతం బుత్కళ కళింగ యవన కర్ణాట లాటాంతర్దీపంబైన ప్రతాపంబున విశ్వ విశ్వంభరా భువన మండలంబుఁ బరిపాలించి"నాడు (1-1-2)

సింహవిక్రమపురం నెల్లూరు దువ్వూరు, గండవరం కొవ్వూరు తా నెల్లూరు జిల్లా లోనివి

శ్రీకమలనాభామాత్యుడు శ్రీనాథుని తాతగారు వారిధితటీ కాల్పట్ట నాధీశ్వరుడు (1-10) కొల్లత్తురై అనే పేరుండే కృష్ణా పట్నమే కాల్పట్టణం. నెల్లూరు జిల్లా గూడూరు తా లో సముద్రతీరంలో, పాకనాటిలోని గ్రామం దీనికి గండ గోపాల పట్టణమనే నామాంతరం ఉంది ఆ కాలంలో ఇది ఒక రేవుపట్టణం13 పాళీ గ్రంథాల్లో కొల్లపట్టణమనే రేవుస్థలం తూర్పు సముద్ర తీరంలో ఉన్నట్లు ఎ.సి లా గారు చెప్తున్నారు14

సప్తమాడియ రాజఘూడియ క్ష్మాపాల వందిత శ్రీపాద వనరుహులు రెడ్డి రాజులు. వేమన క్ష్మాధవునికి సప్తమాడియ రాజన్యసమితి మ్రొక్కుతుంటుంది (1-38) ఈ సప్తమాడియలు విశాఖపట్టణం జిల్లాలోని కళింగారణ్యంలోని మన్నె కొట్టాలై ఉండవచ్చు మాడుగోలను గ్రామం పిరవల్లి తాలూకాలో వుంది ఆ పరిసర ప్రాంతాల్లో ఉండే కొండలకు మాడుగోలు కొండలని పేరు[14] ఘూడియ లేక ఘూడు అనే గ్రామం సోంపేట తాలూకాలో ఉండె ఘూడు లేక ఘూడుపూడి అనే స్థలం[15]

"బెండపూడన్న . సచివ దేవేంద్రుడు గృతికధీశ్వరునిఁజేసె" ( 1-29 ) అని కవి వాక్కులు వెండపూడి గ్రామం తుని తాలూకా, తూర్పుగోదావరి జిల్లాలో ఉంది

"గౌతమి తటమునందు.. అగ్రహారములలోన బ్రాహ్మణోత్తములు ధామములు వెండియునఁబైడి దడఁ బడఁగ'' సంపన్నులై ఉండినారు (1-41)

"వీరభద్రేశుఁడు ... శ్రీమృకండూద్భవ స్వామి శివుని ప్రోల ధర్మ శాసన ఘనశిలాస్తంభ" మెత్తినాడు

"అగ్రహారాళిని అభిమాన్యంబులు" ఇచ్చినాడు వేమభూపాల రాజ్యాభివృద్ధికరమైన రాజమహేంద్రవరము సాంద్రవిభవంబు గా ఉంది 'కమలా చలాగ్రం' పై వెలసిన 'మార్కండేయ శివుని' శిరసుపై ఉండే చంద్రుని వెన్నెలల్తో తెల్లగా చెయబడిన సౌధవీథులు "గోదావరీ పుణ్య కూలంకషా జలాస్ఫాలిత శ్రీరుద్ర పాదయుగళి" ప్రాకారాలతో గంధ గజాలు నడయాడే ఘంటా పథాల్తో ఒప్పిఉంది (1-43).

కవి పలుకులలో రాజమహేంద్రవర సాంద్ర విభవాన్ని ఈ పద్యంలో తిలకిద్దాం

సీ " కమలాచలాగ్ర మార్కండేయ శివశిర శ్శశి చంద్రికా ధౌత సౌధవీథి
గోదావరీ పుణ్య కూలంకషా జల స్ఫాలిత శ్రీరుద్ర పాదయుగళి
బలభిదభ్యున్నత ప్రాకార పరివేష గండూషి తాజాండ మండలంబు
గంధ దంతావళి గ్రైవేయ ఘంటికా ఠంకార ముఖర ఘంటాపథంబు

తే రాజ వెలబాననా నూత్న రత్న పేటి వీర రాహుత్త సుభట కంఠీరవాద్రి
వేమ భూపాల రాజ్యాభివృద్ధికరము సాంద్ర విభవంబు రాజమహేంద్రవరము"
(1-43)

మృకండూద్భవ స్వామి అంటే మార్కండేయస్వామి రాజమహేంద్రవరంతో

ఉండే శివలింగం పేరు రాజమహేంద్రంలో కమలాద్రికి దిగువ గోదావరి నదిని అంటుకొని ఉండే ఒక తీర ఘట్టాన్ని 'రుద్రపాదాల ఘట్టం' అంటారు[16]

అరేటి అన్నయ నవలక్ష కోదండనాథ రాజ్యం అనే అంబుధికి చంద్రుడు "ఆంధ్ర భూమండల అధ్యక్ష సింహాసన సంప్రతిష్ఠాపనా చార్యుడు కొలను ప్రతాప రుద్ర రాజు చేత 'అరేడు' . .అగ్రహారంగా పరిగ్రహించినాడు అన్నయ (1-50) అరేడు గ్రామం భీమవరం తాలూకా పశ్చిమ గోదావరి జిల్లాలో ఉంది [17].

అరియెటిలింగన ప్రభువరుండు. అల్లాడధరణి నాధునిచేత "ఒడ్డాది మత్స్య వంశోదయహర్షు చేతఁ బల్లవాధిపు చేతఁబలవమంది . తెలుఁగు భూమి" ఏలించినాడు (1-63)

వడ్డాది గ్రామం విశాఖపట్నం చోడవరంతాలూకాలో వుంది వడ్డాది రాజ్యాన్ని మత్స్యవంశ రాజులు ఏలేవారు పూర్వం కళింగాంధ్ర దేశంలోని ఒక చిన్న విషయం వడ్డాది దేశం ఇప్పటి చోడవరం తాలూకా ప్రాంతం [18]

"ప్రతాప వెమ వసుధాధిపుచె . భువన మనోహరంబయిన చోడసకుర్తి మహాస్థలంబునన్.. అన్నచోడవర మహాగ్రహారము" పరిగ్రహించినాడు (1-651) తూర్పుగోదావరి జిల్లాలో చోడస కుర్తి మహాస్థలం వుంది దానికి అతి దగ్గరగా చోడవరం అనె చిన్న గ్రామం ఉంది అదే ఈ అన్నచోడవరం కావచ్చునేమో అని చాగంటి శేషయ్యగారి ఊహ [19]

అరేటి అన్నయ మంత్రి పుణ్యస్థలాలకు చేసిన సేవను క్రింది పద్యం కన్నులకు గట్టిస్తుంది

" రాజమహెంద్ర దుర్గమునఁగావించె శ్రీ వీరభద్రునకుఁ బ్రాకారరేఖ
నిలిపె మార్కండేయ నీలకంఠుని ముందర రామేశుఁ దమ తల్లి నామకముగఁ
సంగమెశ్వర దివ్య శంభులింగమునకుఁగల్పించె గళ్యాణ గర్భగృహము
దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి మొగలి వాకిట ధామమును రచించె

బ్రాగ్దిశావప్రగోపుర ప్రాంగణమున సప్తముని సింధుసోపాన సరణి కెలనఁ
దిర్చె భవనంబు భీమయ దెవ నగర మంత్రి దేవయ యన్నయాఁ మాత్య
వరుడు "
(1-75)

మన్మధునివంటి బెండపూడన్న మంత్రి సంగమూన్నాశించి పంచారామాలలో పల్వాల పురంలో ఉండే ప్రౌఢ వెశ్యలు దూతికలకు లంచం ఇస్తుండే వాడు (1-78).

5 1 3 17 దక్షవాటీ మాహాత్మ్యాన్ని సవిస్తరంగా వర్ణించిన ఈ కావ్యానికి తుది పలుకులుగా చెప్పబడిన ఈ సీసం (6-106) లోని పలుకులు పంచదార చిలుకలు, అక్షర సత్యాలు

" దక్షవాటీ మహాస్థానంబులో లేని యమృత మే స్థానంబునందు లేదు
దక్షవాటీ మహాస్థానంబులో లేని యర్థ మె స్థానంబునందు లేదు
దక్షవాటీ మహాస్థానంబలో లేని యమృత మే స్థానంబునండు లేదు
దక్షవాటీ మహాస్థానంబులో లేని యజ్ఞ మె స్థానంబునందు లేదు

తే దక్షవాటిక సకల తీర్థములకిరవు దక్షవాటిక సకల విద్యలకు గరిడి
దక్షవాటిక విభవంబు తానకంబు దక్షవాటిక శివుని యంతఃపురంబు "

(6-107)

తర్వాతి వచనంలో పౌరాణికుడైన సూతుడు అలాంటి మహామహిమము గలిగిన దక్షారామంలో నివసిద్దాం, దర్శిద్దాం రండి' అంటాడు మునులతో సూతుని సకల మునుల భీమమండల దర్శనోత్కంఠకు ఈ వచనం పరాకాష్ఠ

"ఇట్టి మహామహిమంబుగల దక్షారామంబున నభివసింపుదము భీమమండలంబు దర్శింపుదము సప్తగోదావరమ్మున నాడుదము వృద్ధగంగాజలంబులం దేలుదము తుల్యభాగా తోయంబుల మునుగుదము కణ్వవాహిని నవగాహింతము కౌంతేయంబున నోలలాడుదము లవణ పయోనిధి గంగా సంగమంబులం దభిషేకింతము రండు ... .. " (6-107)

5 1 4 కాశీఖండం : భీమఖండం దక్షారామ క్షేత్ర మాహాత్మ్య కావ్యమైనట్లు కాశీఖండం కాశీక్షేత్ర మాహాత్మ్య కావ్యం "శ్రీనాథుడు ప్రాయమింతకు మిగులంగై వ్రాలి కుండ" తెనిగించిన గ్రంథం కాశీఖండం (1-7) స్కాంద పురాణంలోని ఏభై ఖండాలలో 'కాశీఖండం' ఒకటి తెలుగు కాశీఖండం కావ్యానికి మూలం

5 1 4 1 ఈ కావ్యం 'అవతారిక' లోను, ఆశ్వాసాద్యంతాలలోనూ, కావ్యభాగంలోనూ కనిపించే 'తెలుగునాడు'కు సంబంధించిన స్థలనామాలను వేర్వేరుగా పరిశీలిద్దాం

కృత్యవతారికలో ఆంధ్రదక్షమా| మధ్యాంధ్రం, త్రిలింగ, కళింగ, వెంగీ రాజ్యాలు ఒడ్డాది, కిల్లెడ చీకటి, జంతుర్నాటి, ఝాడె, బారహ, దొంతి, సప్త

మాడియ సీమలు, కప్పకొండ, కలువ పల్లి, కసిమికోట, గౌతమీతీర అగ్రహారం దూపూరు, మాకవరం, మేకరాయ, శృంగారంకోట, లోతుగడ్డ ప్రదేశాలు, దాక్షారామం/ద్రాక్షారామం, చాళుక్య భీమవరం, కమ్మాద్రి, వేదాద్రి, సింహాద్రి, రాజమహేంద్రపురం అనే క్షేత్రాలు, గౌతమి/గోదావరి, చిల్కాసముద్రం, సప్తగోదావరం అనే తీర్థాలు ప్రసక్తిలోకి వచ్చినాయి.

5 1 1 2 వీరభద్రా రెడ్డి, వేమారెడ్డి త్రైలోక్య విజయం అనే పేరు గలిగిన సౌధచంద్రశాలలలో సామంతులు, సైన్యాధిపులు, కవులు, పండితులతో నిండు కొలువుతీరి ఉంటారు (1–10) వేమారెడ్డి శ్రీనాథుని పిలిపించి నీవు రచించే 'కాశీ ఖండం' కావ్యాన్ని వీరభద్రయ్య పేర అంకితం చేయమని అభ్యర్థిస్తాడు ఈ క్షమామండలంలో నీ బోటి సత్కవులు ఈనాడు లేరు నీ ప్రౌఢ సాహిత్యాలు దాక్షారామ, చాళుక్య భీమపర గంధర్వ అప్సర భామినుల పాలిండ్ల జంటపై పూసిన చందనం కుంకుమల ద్వైరాజ్యభావాన్ని వహిస్తున్నాయి కవి సార్వభౌమా! (1–14) అంటాడు కర్పూర వసంతరాయడు వీరభద్రారెడ్డి కర్పూర తాంబూల మిస్తాడు కవి పరిగ్రహిస్తాడు (1–15)

శ్రీనాథుని సాహిత్య సౌష్ఠవాలకు కారణాలు – ఉద్బోధకాలు ఇవి ఆంధ్ర క్షమా మండలాఖండలుడైన వేమారెడ్డి కృపావీక్షణం ఘోడె రాయ గురువులపాద సమారాధనం, కమ్మాద్రిమీద ఉండే మార్కండేయ శివుని తలపువ్వైన చంద్రుని వెన్నెలలోని సుధాధార, వేదాద్రి నరసింహుని విపుల వక్షఃస్థలికి అలంకారమైన చెంగల్వహార పరిమళం – అనేవి (1–16) వేదాద్రి నృసింహక్షేత్రం జగ్గయ్యపేట తాలూకా కృష్ణా జిల్లాలో ఉంది

నాలుగవ జాతిలో జనించిన గుణరత్నాకరుడు పెదమాళ్ళరెడ్డి శ్రీదూపూరులో జన్మించి అభివృద్ధిచొందినాడు అల్లాడ వెమావెడ్డి మాకవరంబు వీకఁజేకొన్నాడు

సప్తమాడియ రాజుల ప డూడె, జంతుర్నాటి జననాథులను, బారహ, దొంతి భూపాలుల్ని, కలువపల్లి, ఒడ్డాడి కటకాధిపతుల్ని అల్లాడ వేమారెడ్డి గెలిచినాడు జంతరునాడు నేటి విశాఖపట్నం జిల్లాలోని శృంగవరపుకోట తాలూకాలో వుంది.

గౌతమీ తీరాన ఉండే అగ్రహారాలలోని బ్రాహ్మణులు ఎంత వైభవాల ననుభవిస్తుండేవారో శ్రీనాథుడు తనివితీరా భీమేశ్వర పురాణం (1–41) పద్యంలోను, కాశీ

ఖండం (1-37 వ పద్యం) లోను వర్ణించినాడు భీమేశ్వర పురాణంలోని పద్యమే యథాతథంగా కాశీ ఖండంలో ఉద్ధరించబడింది

"త్ర్యంబకాచలకస్యకాంచు పూరమున అఘమర్షణ స్నానం" ఆచరించి మడుగు ధోవతి కట్టి, విభూతి పుండ్రాలు నొసట పెట్టి, నూట ఎనిమిది ముత్యాలతో కూర్చిన రుద్రాక్షమాల ధరించి, పులిచర్మంపై కూర్చుండి, శంభుని అర్చించే వెమారెడ్డి అపర శంభున్లా ఉంటాడుట (1-39) అతని తమ్ముడు "రాజుల దేవర, రాజరాజు శ్రీరాజ మహేంద్ర భూభువన రాజ్య రమణ మనోహరుడు" అల్లయ వీరారెడ్డి (1-42)

వీరభద్రారెడ్డి గోదావరీ పావనోదకములతో నిత్యం జలకమాడుస్తాడు కర్పూరం కస్తూరి, కుంకుమం కలపం పూసి శ్రీగంధ మలదుతాడు సప్తగోదావర స్వర్ణపుష్కర హేమ సౌగంధికాలతో అర్చన చేస్తాడు (1-48)

అల్లయరెడ్డి వీరారెడ్డి సేసిల భేరీధ్వని ఒడ్డాదిని, నిర్భేదించింది శృంగారం కోట, లోతుగడ్డను (?) ఉద్ఘాటించింది శృంగవరపుకోట శృంగారంకోట అనే పేరుతో ఒక తాలూకా విశాఖ జిల్లాలో ఉంది 21

5 1 4 3 వేమారెడ్డి తమ్ముడు వీరారెడ్డి రాజమహేంద్రపురం రాజధానిగా ఏలుతున్నాడు ఇది మృకండాద్భవస్వామి ఉండే పురం గౌతమీగంగ ఆ పురి పశ్చిమ ప్రాకారాన్ని ఒరసి పారుతుంటుంది రాజమహేంద్రవరం కోటలో మదన గోపాలమూర్తి వెలసి ఉన్నాడు ఆ పురానికి తూర్పున ఉమ బోటి ఉత్తరాన శ్రీ ముల్లగూరి శక్తి వెంచేసి ఉన్నారు ధారానగర సుల్తాన్ భద్రజాతి ఏనుగులకే దుస్సాధ్యమైన గోపుర ద్వార కవాటలున్నాయి రాజమహేంద్రపురం సాంద్ర విభవం (1-58) ఈ విషయాన్ని కవి పలుకుల్లోనే చిత్తగిద్దాం

" ఉండు నేవీట మార్కండేయ మునినాథ సజ్జలింగ మసంగ శాసనుండు
ప్రవహించు నేవీటి పశ్చిమ ప్రాకార మొరసి గంగమ్మ సాగరము కొమ్మ
యావిర్భవించినాఁడేవీటి కోటలో బలభేది మదన గోపాల మూర్తి
పాలించు నేవీటి ప్రాగుదక్కోణంబు నుమబోటి శ్రీముల్లగూరి శక్తి

ప్రబల ధారాసురత్రాణ భద్రజాతి కరిమటా సైన్య దుస్సాధ కనకలోహ
తే గోపుర ద్వాః కవాట ప్రదపిత మది సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము"

రాజమహేంద్రం రాజధానిగా వీరనృపాలుడు ఏకచ్ఛత్రంగా ఏలినాడు తన

రాజ్యానికి చీకటిని, కళింగను, చిల్కాసముద్రాన్ని, సింహశైలాన్ని సరిహద్దులుగా చేసుకొన్నాడు

చీకటి అనేది ఒక సీమ సింహాచలం శాసనంలో పేర్కొన బడింది ఈ శాసనంలో పేర్కొన్నవి సింహాచల ప్రాంతాలే చిలక సరస్సే చిలకసముద్రం సింహాశైలం సింహాద్రి

గౌతమకన్యా లహరీ పరిహ తాంపవాటోపుడు అయిన వేమారెడ్డి త్రైలోక్య విజయ సౌధంలో ఉండినాడు

అర్ణోరాశి పరీత భూ భవన మధ్యాంధ్ర, క్షమాధీశ్వరుడు (3-248) పంచారామ పమాటీ పాంచాలుడు త్రిలింగ రాజపరమేశ్వరుడు చెంచుమల చూరకారుడు (3-249) కసెమికోట, వెంకటాయి, పప్పకొండ కిల్లెడాఖ్య సుహృదవనిపాంతరంగ హాలహల విషానలుడు (4-309) ఈ కృతి భర్త

కిల్లెడసీమ విశాఖపట్టణం జిల్లాలోని జంతుర్నాటిలో అంతర్భాగం అనకాపల్లి తాలూకా గొబ్బూరు ప్రాంతం కావచ్చు కిల్లెడ అనే గ్రామముందో లేదో తెలియ రాదు పై పద్యంలోని కసెమికోట, వెంకటాయి, నేటి వెంకటాపురం, కసింకోట గ్రామాలు అనకాపల్లి తాలూకాలోనివి 22

వీరభద్రారెడ్డి దాక్షారామ ప్రమదా కళాశాలను గెల్చిన మన్మధుడు (5-337) వెంగీ విషయాధీశ్వరుడు (5-338) దాక్షారామ శ్రీభీమశంకర కృపా లక్ష్మీ సామగ్రీ పరివర్ధిత భూమా సామ్రాజ్య విభవుడు (7-237)

5 1 4 4 కాశీఖండం కావ్యభాగంలో కనిపించె 'తెలుగునాడు'కు సంబంధించిన స్థలనామాలు ఇవి

అంధ్రభూమి/ ఆంధ్రదేశం, దక్షారామం/ దాక్షారామం, దక్షవాటిక, భీమ శంకరుని నగరు, దక్షిణకాశీ/ దక్షిణ వారాణాసి/ దక్షిణానందవనం, కుండలాముఖం కుమారదేవం, ఓంకారం, కొల్లాపురం, కోటిపల్లి, తాళ్ళపూడి, పర్వెల, ప్రాచ్యారామం, క్షీరారామం, ఆదిమారామం, బ్రహ్మసంవేద్యం, రాజమహేంద్రం, కమలాద్రి, వీరభద్ర గిరి, శ్రీశైలం, శ్రీకాళహస్తి, తిరుమల తిరుపతులు అనే క్షేత్రాలు

సప్తమునితీర్థం, వరుష్ఠ, భోగవతి, మార్కండేయు, తుల్యభాగ, వృద్ధగంగ, కిణ్వనది, కల్లేరు, గౌతమి/గౌతమి, గంగ, పాతాళగంగ, వైకుంఠబిలం, మధూక

కుండం, జలజకుండం, పంపధార, పల్లధార అనే తీర్థాలు హాటకేశ్వరం, శిఖరేశ్వరం, అనే శిఖరాలు, కదళీవనం అనేవి సందర్భానుసారంగా ప్రసక్తమయినాయి వింధ్య గర్వాపహరణకోసం అగస్త్యుడు కాశి వెడలాసి "దక్షిణకాశీ సందర్శనంబునంగాని" కాశీ వియోగ భారం తగ్గదని, ప్రయాణం చేస్తూ కొన్నాళ్ళకు గోదావరి నోరపకొనుచు నాంధ్రదేశంబున నడుగునపుడు (3-13) ప్రస్రవణశైలాన్ని, గోదావరిని, పంపా సరస్సును, దండకారణ్యాన్ని వీక్షిస్తాడు (3-13, 14, 15) (పట్టిసంలోని) శ్రీవీర భద్రేశుని సేవించి, తాళ్ళపూడిలోని సోమనాథునికి మ్రొక్కి, కుమారదేవం గ్రామం లోని అనంత భోగీశ్వరస్వామిని సేవిస్తాడు రాజమహేంద్రపురం లోని కమలాద్రిపై నున్న రుద్రపాదాలను అర్చించి, మార్కండేయశివుని భజిస్తాడు కోటిపల్లి తీర్థంలో కుండలాముఖంలో ఉండే శివుని తలచుకొంటాడు పల్వల స్థానంలో ఉమాకొప్ప లింగేశ్వరస్వామిని ప్రతిష్ఠిస్తాడు వృద్ధగంగలో గ్రుంకులిడి, సప్తగోదావరంలో తానమాడి, దక్షవాటికలోని భీమేశ్వరుని సందర్శించుకొంటాడు (3-16)

ప్రాతః కాలంలో తీవ్రభాను డుదయించగనే సప్తగోదావరంలో గ్రుంకు లిడి . లోపాముద్ర భీమేశ్వర జ్యోతిర్లింగాన్ని కొలిచింది (3-17) చెఱగుమాసిన దిక్కాంతలు జలజకుండోదకంబులో జలకమాడినారు పయోధరాలపై చందనం పూసు కొన్నారు అలాటివారిని ఇపుడు పరిశీలించుకొన్నాడు (3-21).

కార్తీకవేళలో భీమ శంకరు నగరులో లోపాముద్రాగస్త్యులు కలుష సంహార కారణమైన చిచ్చుబుతోరణం చూచినారు (3-24) దక్షిణవారాణాసియైన దాక్షారామం ప్రవేశించి స్వామిని చూస్తేనే కాశీక్షేత్ర సందర్శనానందం మౌనికి కలిగింది (3-25) క్లేశమూ, సౌఖ్యమూ వెంట వెంటనే కలిగినాయి అగస్త్యునికి కాశీవిరహంవల్ల దక్షిణ కాశీ సంగమం వల్ల (3-26)

భోగమోక్ష నివాసమైన దాక్షారామంలో కొన్నాళ్లుండి కొల్లాపురంలో శ్రీమహా లక్ష్మిని దర్శించడానికి వెళ్ళాలనుకొంటాడు అగస్త్యుడు (3-27)

మేరుపర్వతానికి తోబుట్టువు వీరభద్రాచలం దాన్ని పంచలింగాలు పరివేష్టించి ఉంటాయి ఈ కొండ చెంతనే తుల్యభాగ, అంతఃప్రవాహంగా పుట్టింది ఈ కొండ పాదం వద్దే కల్లటిని వదలి వృద్ధగంగ పారింది ఈ కొండ ఉత్తర దిక్కున సప్త గోదావరం ప్రవహిస్తున్నది ఈ గిరికి దక్షిణంగా కణ్వనది పారుతున్నది అలాంటి వీరభద్రాచలం వద్దకు వింధ్యదర్పాపహారి ఏతెంచినాడు (3-28) దక్షిణానందవనం

మధ్య దక్షయజ్ఞంలో దేవతలను చీల్చిచెండాడిన వీరభద్రుడు అద్రి వెన్ను తన్ని గౌతమీ నీటిలో తన కత్తి కడుక్కొనినాడు (3–30)

కమలాద్రి, వీరభద్రగిరి ఆంధ్రభూమికి వక్షోరుహద్వయం భూమికి రెండు కండ్లు, గౌతమీగంగ, ముత్యాల కంఠమాల (3–32) వాణిముక్కు కొనగోట గిల్లినవాడు, సూర్యుని పండ్లూడదన్నినవాడు, చంద్రుని పొట్ట గొంజుజక నూదినవాడు ఖడ్గంతో అగ్ని సప్త జిహ్వల్ని తఱిగినవాడు, ముప్పైమూడుకోట్ల వేల్పులు పరుగెత్తుతుంటే వెంటబడి తరిమినవాడు వీరభద్రుడు ఈ గిరిపై భద్రకాళితో కాపురమున్నాడు (3–32)

బ్రహ్మసంవేద్యం మొదలు పట్టెసం వరకు సాగారి ఉండే గోదావరి నదీ హారానికి నడుమ పంచలింగాశ్రయమైన వీరభద్ర శిఖరి నాయకరత్నంగా ఉంది (3–33)

క్షీరారామంలో, ప్రాచ్యారామంలో, ఆదిమారామంలో మునీంద్రుడు సతీసమేతంగా ఆయా దేవుళ్ళ నారాధించినాడు (3–35) అనంతరం ఆ మునిసహ్యగిరి కన్యకాప్రవాహంలో స్నానమాడి కదిలి పదునెమిది యోగపీఠాల్లో సుప్రసిద్ధమైన కొల్లాపురానికి వెళ్ళినాడు (3–36) అక్కడ కొల్లాపురిలక్ష్మిని భక్తితో ప్రస్తుతించినాడు (3–37 నుండి 50 వరకు) ఆ తల్లి ఆనతిపై స్వామి మలకు భార్యతో వెళ్తూ మధ్యలో శ్రీశైలాన్ని సందర్శించినాడు శ్రీశైల వర్ణన సంక్షిప్తంగా ఉన్నా, సమగ్రతకు కొదవలేకుండా చేసినాడు శ్రీనాథుడు

. . . .. " కఠోర మద పరిణతి దశావష్టంభం సంష్టంభ సముజ్జృంభమాన హేరంబ దశన కులిశ కఠోర కోటి భేద్యమాన హాటక కటక టంకారఘట్టి (త) తాశాంగణంబై చతుర్ద్వారంబులను జతురంతర చతుష్పక్షద్వారంబుల షోడశ గవాక్షంబుల ద్వాత్రింశన్మ కిరతోరణంబుల జతుష్షష్టి నాట్యకూటంబులను బంచాశదుత్తర సహస్ర దీర్ఘికల పశతసహస్ర కోటి లింగంబులను దశసహస్ర కోటి శక్తులనుం గోటి తీర్థంబులనుం గలిగి వరాహకుండ మల్లికాకుండ క్షీరకుండాది కుండంబులచేతను గదళీవన బదరీవన గౌరీవన బిల్వవనాది ముఖ్య వనంబులచేతను హాటకేశ్వర గుప్తమాహేశ్వర నందిమండల నివృత్త్యాదులయిన దివ్యస్థానంబులచేతను రససిద్ధి రసాయనసిద్ధి మూలికాసిద్ధి పాదుకా సిద్ధ్యాదులగు సిద్ధక్షేత్రంబుల చేతను శోభితంబై దివ్యామృత

నిర్మల శ్రీస్వయంభూ జ్యోతిర్లింగమూర్తియగు మల్లికార్జున శ్రీమన్మహాదేవునకు నిజనివాసంబై యభిరామంబై దివ్యంబనగు శ్రీశైలంబు".. (3-52) అని కవి వర్ణన

పాతాళగంగ మీద నుండి వీచె సురభిళ వాయువులు కుంభజున్ని కౌగిలించు తున్నాయి (3-53) వాతాపిదమనుడు పాతాళగంగలో అఘమర్షణ స్నానం చేసినాడు. హాటకేశ్వర దేవుని రేలపూలతో సేవించినాడు వైకుంఠబిలమధ్య వాసుని కొలిచినాడు. ఏకాంత వాసుని రామేశుని దర్శించినాడు మల్లికార్జునుని సంభ జించినాడు (3-55) భ్రమరాంబను నిష్ఠతో అర్చించినాడు (3-56), వేలాదిగా ఉండే విలాలవెంబడి అమృతమయ లింగమూర్తులను అధిక భక్తితో పూజించినాడు (3-57).

ఇల్వల దమనుడు ఇంకా మధుకకుండం పంచధారా, పల్లధారల్లో గ్రుంకులిడి నాడు హాటక శిరశ్శృంగం మీద కోటి లింగాలను భజించినాడు ఉద్యాన వీర భద్రుడున్ని ఆరాధించినాడు బ్రహ్మపాదాల్ని చందనంతో అర్చించినాడు ఘంటా సిద్ధేశ్వరుని వలన మంత్రసిద్ధి బడసినాడు ఇష్టకామేశ్వరున్ని సప్తమాతృకలను కదళీవన, కపట శబర వటుని గొలిచినాడు (3-58). శ్రీపర్వతంమీద సదా మల్లి కార్జును డుంటాడు (3-59) శ్రీపర్వతంలో ఉండే గండ శిలల్ని శంభులింగాలే ఇక్కడ ఉండే చెంచులందరూ సిద్ధమునులే (3-60) చస్తేనే ముక్తి ఇస్తుంది కాశీ క్షేత్రం శిఖరాన్ని దర్శిస్తేనే ముక్తి నిస్తుంది శ్రీపర్వతం (3-61)

శ్రీశైలాదులు ముక్తి కారణాలు (3-68) ప్రయాగ, నైమిశం, సప్తగోదా వరంబు . ఓంకారంబు .. శ్రీపర్వతంబు.. మోక్షకారణంబులైన తీర్థములు (3-69) శ్రీగిరి యందలి శిఖరేశ్వరాన్ని వీక్షిస్తే ముక్తి రావడం ఖాయం, కాశికాతీర్థమాడకుండా లక్షతీర్థాలాడినా మోక్షలక్ష్మి దరిచేరదు (3-79) శ్రీశైల కటకంబునందు సకల తీర్థంబులు గాశీ ప్రాపణ ద్వారంబున నానా సముపకారకంబులై మోక్షంబు సిదించును (4-30).

క్రీ. 1 4 క్ బ్రాహ్మణుడు నిర్వర్తించవలసిన సదాచార నిరూపణంలో బ్రాహ్మ ముహూర్తంలో మేల్కొని, స్నానంచేసి, ఏకాంతంలో, విభూతి రుద్రాక్షలు ధరించి, పద్మాసనం వేసుకొని శివుని, పరమేష్ఠిని, విష్ణువును, మునులను, ..మేరు శ్రీశైలాది పుణ్యపర్వతంబులను సంస్మరించి యా యందరు నాకు నాయురారోగ్యైశ్వ ర్యములు ప్రసాదింతురు గాక యని మనంబు బ్రార్థించి ప్రణమిల్లాలి (5-191)

5 1 4 6 దివోదాసుడు భూమండలానికి సార్వభౌముడై దేవతలను స్వర్గానికి, నాగలను పాతాళానికి, భూతాలు తమ యిష్టం వచ్చినచోటికి వెళ్ళిపోవాలని చాటిస్తాడు దివోదాస దాసులు "కాశీ శ్రీశైల కుంభకోణ .. కాళహస్తి, కాంచీ వేంకట . రామేశ్వరాది దివ్యస్థానంబుల ఘంటాపథంబుల ఘంటా డిండిమ ధ్వనుల తోడం గూడం" చాటినారు (5-275) ఈ చాటింపు విని "కోయిలం దిరుమలం బెరుమా కోయిలం దిరుపతుల మురాంతక ప్రతిమల్" మాయమై ఎక్కడికి పోయినవో తెలియదు (5-288)

"దిలీప తీర్థంబు . . సప్తముని తీర్థంబు . గౌతమీ గంగా కేరళ నర్మదా వసిష్ఠ మార్కండేయ భాగీరథ"... అనేవి మహా పుణ్యతీర్థంబులు (7-15)

శ్రీనాథుడు కాశీఖండంలో 'కాశీ' మాహాత్మ్యాన్ని ఉపాఖ్యానాలు ఆధారంగా సవిస్తరంగా వర్ణించినాడు నా పరిశోధన పరిధిలో లేనందువల్ల ఆ విషయం ఇక్కడ చెప్పబడలేదు

5 1 5 పలనాటి చరిత్ర పలనాటి చరిత్ర 'మంజరీ ద్విపద' లో రచించ ఒడిన దేశీయ మహాకావ్యం ఈ కావ్యంలో కల్లు ప్రతిష్ఠ, కార్యమపూడి యుద్ధం, బాలుని యుద్ధం అనె ప్రకరణాలు శ్రీనాథుడు రచించినవి కొమ్మరాజు యుద్ధాన్ని మొదట శ్రీనాథుడు చిపర కొండయ వ్రాసినారు[23]

పలనాటి యుద్ధం పలనాటి సీమకు పాలకులైన హైహయ వంశీకులకు దాయ భాగానికోసం సంభవించిన కుటుంబ కలహం అన్నదమ్ముల ఈ యుద్ధంలో కళ్యాణ కలచూరి రాజులు, వెలనాటి దుర్జయులు, కోట రాజులు, కాకతీయులు మొదలగు రాజులు మండలాధిపతులు పాల్గొన్నారు పెక్కుమంది వీరులు మరణించినారు. హైహయ వంశం సర్వనాశనమైంది[24]

5 1 5 1 శ్రీనాథుని రచన అయిన పల్నాటి వీరచరిత్ర ప్రకరణాలలో తెలుగునాడుకు సంబంధించిన స్థలాల వివరం : చేంకణం, పల్నాడు రాజ్యాలు

అట్లూరు, అనుమగంటి, అనేమిపురము, అరుగండ్ల, ఆర్వెల్లి, ఇప్పగిరి, ఏలేశ్వరం, కంకణంబులపల్లె, కటకం, కలువ, కార్యమపూడి/ కార్యమపురి/ కార్యమపురము, కురువ, కొండవీడు, కొదమగుండ్ల, కోలంకి, గట్టు గరికెపాడు, గుండము కోట, గుమ్మడంపాడు, గురజాల, గొబ్బూరు, చంద్రాద్రి, (?) చాలురావుల, చింత

పల్లి, త్రిపురాంతకం, దిరెచెరువు, ధరణికోట, నర్మాల, పాలపర్తి, పాలెము, పెంశల్ల పైడిపాటి, పొందుగుల, పొదిలి, పొన్నాడ, బలమూరు, మల్లూరు, మర్తెపూముల, మల వరము, మహానంది, మాచర్ల/మాచెర్ల, మాడుగులు, (ఏడు)మాడెములు, మురమ్మూరు, మెడపి/మెర మెడపి, మేళ్ళవాగు, రేపర్ల, రేవనూరు, వంగతొటల పైలు (?), శివపురి శ్రీవీర తిరుపతి, సంపెట, సన్నెగండ్ల, అనే గ్రామాలు

గౌరీమహేశ్వరం, తిలపర్వతం, నలగొండ, శ్రీగిరి/శ్రీశైలం అనే కొండలు

కృష్ణ, చంద్రభాగ, నాగులేరు/ సర్వాఖ్యతటిని, నిప్పులవాగు అనే నదులు

గంగాధార/ గంగాధారలు,/ జాహ్నవి మడుగు ,పాతాళగంగ, సింగభూపతి చెరువు అనే తీర్థాలు

ఉత్తరేపని గుళ్ళు, జన్నెదేవరగుళ్ళ, సంగమి గుళ్ల అనే దేవాలయాలు కథలో ప్రసక్తి కొచ్చినాయి

నలగామరాజు "పాండ్య, బాహ్లిక . . కర్నాట లాట కొంకణ ప్రముఖ దిగ్గజా ధిపతుల రావించి" వారికి యుద్ధంకోసం కర్పూర పీఠ్యాలు ఇచ్చినాడు (పు 511)

మాచెర్ల చెన్నుడు శ్రీనాధునికలలో కనబడి 'పలనాటి వీరుల భాగవతంబు రచించి తనకు అంకితం చేయమంటాడు (పు 294) నలగాముని మీదికి దండెత్తి పొయ్యే వీరులను జూచి 'పటు విక్రముల్ గదా పలనాటి వీరవరుల'ని ప్రజలు ఆశ్చర్య పోతారు (పు 299) 'పలనాటి నేలెడి బ్రహ్మీతనయుడు సౌందర్య దర్పకుడు' పు 370) బాలుడు తన జన్మజన్మాల వృత్తాంతం చెబుతూ "బాలుడన్ పేర నీ పల్నాటి లోన జననంబు నొందితి" అంటాడు (పు 457) పలనాటి ప్రసక్తి ఇంకా (పు 294, 492, 530 లలో కూడా ఉంది

మాచర్ల / మాచెర్ల చెన్నకేశవ పాదసేవా రతుండు శ్రీనాధుడు మాచెర్ల చెన్నుని మదిలోన దలచి ఏదైనా సద్గ్రంథం చెప్పాలనుకుంటాడు మాచెర్ల చెన్న కేశవుడు కలలో కనిపించి పలనాటి వీరుల భాగవతంబు రచించుమంటాడు (పు 293) మాచర్ల చెన్నుని మేన పెంపొందు తులసి పెద వనమాల వరమున పుట్టినవాడు కన్నమనీడు (పు 307) ఐతమ్మ సంతాన ప్రాప్తికై 'మాకాంక్ష లీడేర్చు మాచెర్ల చెన్న' అని ప్రార్థిస్తుంది (పు 336) 'మాచెర్ల చెన్నుని మన్నన బడసి ఐతమ్మ బాలచంద్రుని కన్నది (పు 485) మాచెర్ల భాగ మెలుకొమ్మని' రాయ

బారులను నాగమ్మ పంపుతుంది (పు 425) నరసింగుడు, వెలమల దోర్నీడు, నలుగురు రాజులు మలిదేవరాజులు మాచెర్ల చెన్నుని మ్రోలన దలచి మరణిస్తారు (పు 455, 474, 478, 506, 519)

కార్యమపూడి/కార్యమపురము / కార్యమపురి కాశికి సమమైన కార్యమపూడి రణరంగ భూమిని రాజు తా నిలిచినాడు (పు 343) 'శ్రీశైలభూమిలో శ్రేష్ఠమైనట్టి కార్యమపురి భూమి ఘనపుణ్యరాశి' (పు 322 కదనరంగంబైన కార్యమపూడి పుణ్యభూమి ప్రసక్తి పు 295, 300, 314, 315, 328, 335, 376, 389, 397, 400, 405, 423, 424 లలో ఉంది) 'హంకాళదేవి కార్యమపూడి యుద్ధరంగమున నాయుని పరిచార నాంచారి' వనె ఉండినది (పు 493) 'కార్యమపూడి రాజు కడు కోపగించి తన మూకలను తాను నాయుని పొడిచెను నాసాగ్రమునను' (పు 526) 'కార్యమపూడిరాజు సు బ్రహ్మనాయుడు ఖండించి వైచినాడు (పు 528)

గురజాల · గురజాల నలగామ భూపతి రాజధాని 'గురజాల లోపల కుంభి ఖండు నలగామ భూపతి నాగమ(బిలిచి' సైన్యం సిద్ధం చెయ్యమంటాడు (పు 328) 'గురజాల పురమెల్ల కోటతో కూడ పెరికి వైతురు' పలనాటి వీరులు అంటాడు భట్టు రాజుతో (పు 327) గురజాల లోనే కోడి పోరు జరిగింది (పు 427) గురజాల ప్రసక్తి పు 328, 440 లో కూడా ఉంది

మెడపి బ్రహ్మనాదులు మెడపి లోన అలరాజు చావు విని వెరగందుతారు ఏరుదు రాజును మెడపి ని పట్టము గట్టినారు తాము యుద్ధానికి వెళ్తూ ప్రజలతో 'మెడపి వదిల'మని చెప్పినారు (పు 295) నాయకురాలు రాజుతో 'నన్ను బలము నంపు నాయుని గెలిచి మలి దేవరాజును మరల మెడపికి పరువిడజేతును' అని బీరాలు పలుకుతుంది (పు 330) మంచాల భర్తను 'మెడపి చెన్నుని'గా చెప్తుంది (పు 417) అనపోతును నేపం పెట్టి వెనక్కి పంపుతాడు బాలుడు, బ్రహ్మహత్య వస్తుంది యుద్ధం చేయనిస్తే అని మంచాల అనపోతుతో 'వీరమెడపి నీవు వెలయ రక్షింప పట్టంబు గట్టెను బాలచంద్రుండు' యుద్ధానికి వెళ్ళొద్దని అని నిరోధిస్తుంది ఇంకా మెడపి ప్రసక్తి 351, 367, 373, 421, 444, 448 పుటల్లో కూడా ఉంది

త్రిపురాంతకం · బాలచంద్రుడు త్రిపురాంతకమునకు వచ్చి యుద్ధానికి రావద్దని ఆనపెట్టి అనపోతుకు లేఖ వ్రాస్తాడు (పు 433). 'త్రిపురాంతకమునకు

రణనిశ్చయముచేసి రణ కంబ మిటకు తర్లింప రెండవ తప్పు అంటాడు కన్నమ నీడు అనపోతు 'త్రిపురాంతమునకు బాలుసి తెరగెల్ల ప్రజల తా నడిగి' నాడు (పు 445)

అరణగండ్ల · ఈ గ్రామం వద్దనే బ్రహ్మన్న రాజుల నందరినీ ఓడించినాడు వారే నలగామరాజుకు సహాయంగా వచ్చినారు 'యారణగండ్ల కయ్యమున మిమ్ము నందరి పట్టి మెరసె బ్రహ్మన్న ' (పు 512) అని కవి పలుకులు

దిరచెరువు బైలు రాజు నగరం వెలుపలి 'దక్షిణ దిశయందు తనరెడు బయలు దిరచెరువను పేర తీరైన భువిని నిలిపించి గజమును' (పు 340) విప్రులకు శెలవిచ్చి వెనక్కి పంపినాడు తర్వాత కొదమ గుండ్ల చేరినాడు అక్కడ నుండి మిరియాల సరి మేర దాటి ప్రజల మెలిమి చింతపల్లియు గడచి కార్యమపూడి చేరినాడు (పు 343)

కొదమ గుండ్ల గురజాలనుండి కారెమపూడికి బయల్దేరి నలగామరాజు కొదమగుండ్లకు చేరతాడు ఆ ఊరి ప్రజలు యుద్ధానికి పోవద్దంటారు 'కొదమ గుండ్లకు చేరెఁ గుంభినీశుండు' (పు 341) రాజు ఓడిపోయి బ్రహ్మన్నకు భయపడి పారిపోయి కొదమగుండ్లలో బ్రాహ్మణులవద్ద తలదాచుకొంటాడు వారే నాయుని శరణువేడి రాజును రక్షిస్తారు 'కొదమగుండ్లకు చేరె గొబ్బునచేరి' కాచి రక్షింపరే కరుణతో మీరు' అని బ్రాహ్మలను వేడుకొంటాడు (పు 528)

చంద్రాద్రి జయసింగు నృపతికి చంద్రాద్రి పతికి నలగామరాజు సాయం కోసం లేఖలు వ్రాసినాడు చంద్రాద్రి చంద్రగిరా? నరసంపేట తాలూకాలో వరంగల్లు జిల్లాలో ఉండే చంద్రగొండ గ్రామమా?

చింతపల్లి మలిదేవుని వద్దకు నాయకురాలు సంధికి పంపించిన 'పరమాప్తుడా చింతపల్లి రెడ్డి' (పు 425) కూడా ఉన్నాడు రాజువైపు పోరాడతాడు చింతపల్లి రెడ్డి నాయునిచేతిలో మూర్ఛపోతాడు

'చెలగి బిరుదురాజు చింతపలిరెడ్డి ఇద్దరు నుండగా నిక నేలభయము' అంటారు రాజుతో (పు 525) చింతపల్లిరెడ్డికి సెలవిచ్చి పంపినాడు రాజు చింతపల్లిరెడ్డి చెచ్చెర వచ్చి ఎవరు పోయిన పోక నేనున్న వాడ నన్నుంపు దెసగవా నాయుడ బ్రహ్మ' అంటాడు నాయుని చేతిలో మూర్ఛబోతాడు (పు 527).

## ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

నలగామ ధరణీశ మౌళి వసుధీశులకు 'పోరాడి శత్రువుల బారి గొని, మనము ఏకమై భూముల నేలుకొనియెదము శ్రీగిరీశుని యాన చెన్నుని యాన' అని లేఖలు పంపినాడు

" మామ గుండముకోట మనుజేశునకును
ధరణికోట పురికి దక్షుడైనట్టి
కోలంకి రాజుకు ఘూర్జరపతికి
ఏడు మాడెము లేలు నెరుకు కామునికి
పొన్నాడ భూపతికి పొదిలె రాజునకు
కటకాధిపతికిని కలువరాయనికి
దేవాద్రి నేలెడు తెలుగు బిజ్జలుకు
... చోళభూపతికి
జయసింగు నృపతికి చంద్రాదిపతికి " (332–3)

వీరందరికీ లేఖలు వెళ్ళినాయి నలగామరాజుకు యుద్ధంలో సాయంగా 'పొన్నాడ భూపతి ..గట్టు భూముల నేలు ఘనులైన పతులు, గుండమ దేవుడు గొబ్బూరి రాజు' సేనలతో వచ్చినారు (పు 345–6)

మేడపిలో బయల్దేరి వచ్చిన బ్రహ్మన అతని బలము కార్యమపూడి ప్రయాణంలో ఏయే ఊళ్లు దాటినారో ఈ ద్విపద పాదాలు తెలుపుతాయి

" మట్టివేముల దాటి మండలేశ్వరుడు
ఘూర్ణిల్లు రవముతో గుమ్మడం పాడు
చేరి యచ్చట నిల్వ చిత్తంబు గొనక
గరికె పాటికి వచ్చి కాలూన కచట
కంకణంబుల పల్లె కడను నా ఘనులు
కంకణమ్ములు కట్టి కదిలి రా వేళ
పట్టభద్రులు పైడిపాటికి వచ్చి
మేళ్ళవాగన నిల్చె మించిన దండు" (పు 393)

"గరికెపాటున నున్న కాపులు వచ్చి కని మ్రొక్క నంతలో పోకలాకుల నిచ్చి బాలుడు పంపివేసినాడు (పు 423)

బ్రహ్మనాయునితో వచ్చినవారిలో

" కొండపీడును వారు గోవిందు వారు
ముతసానివారును ముదుప్యారు వారు
నర్మాలవారును నాయనివారు
పైడిచుక్కల పాలపర్తి వారలును
బలుమూరివారును పాతెమువారు
రేవనూళ్ళలవారు రేచర్లవారు
అనుమగంటివారు అల్లమువారు
అట్లూరి మట్లూరి యాఖ్యలవారు " ఉన్నారు (పు 297-8)

దోర్నీడు బాలచంద్రునితో నలగామరాజు సైన్యం విడిసిన తావును వివరించి నాడు సరిహద్దులు చెప్తూ—

" సన్నెగండ్లను పేర జవరన యూరు
తూరుపు దిక్కుకు తుదిమేర సొమ్ము
నాగులేటికి తూర్పు నలగొండ దాక
చెలువైన యా వప్పిచెర్లను పల్లె
పడమటి హద్దు .. ...
కొదమ గుండ్లను పేర గురి గ్రామ మొకటి
ప్రజల మేలిమి చింతపల్లియు నొకటి
ఉత్తర దిశ యెల్ల బయ్యన గాంచు
ఇక కొన్ని గురి కొండ వెంచెద వినుము
జన్ని దేవర గుళ్ళు సవనాల మేడ
వంగతోటల బైలు వన్నియు కెక్కు
సింగ భూపతి చెరువు శ్రీకరమైన
సంగడి గుళ్ళను సర్వేశుడైన
ఉత్తరేశుని గుళ్లు నూర్జితాకృతిని
ఉయ్యాల కంబంబు నున్నట్టి రావు
గరుడ కంబము దాకి కలజువ్వి చెట్టు
నల్లకొండను హత్తి నాగులేరంటి
విడిసి యున్నది దండు విభవంబుతోడ ... " (పు 430)

శివపురి బ్రహ్మనాయుడు "చుట్టు నిప్పుల యేరు శోభిల్లుచున్న నెట్టన శివ పురి నీరుగా చేసి భూతరాట్కంబంబు పుచ్చుకొన్నట్టి శూరుండు ధీరుండు"(పు 327)

ఆనేమి-ఆర్వెల్లి - పొందుగల 'అందెల రాముండు ఆనేమి పురము ముమ్మడిరెడ్డియు మొనమీరినట్టి పొందుగులను నేలు పిరమల్లు' ఉత్తరభాగాన విడిసి ఉండినారు (పు. 430) 'అర్వెల్లి నాగమ్మ యటనుండి పారిపోయింది నాయునికి భయపడి (పు 528)

సంపెట సంపెట నారన్న బ్రహ్మన బలములో ఒక ప్రముఖుడు బాలుడు 'సంపెట నారన్న జయమగు బిరుదు లెక్కడబోయెను ఎందు దాగితివి ?' అని రెచ్చ గొడ్తాడు (పు 441)

పిల్లలకోసం ఐతమ్మ దేవతలకు ఎన్నో నోములు నోచింది ఏ యే దేవత లనో ఈ ద్విపదపాదాలు చెపుతాయి

" శ్రీగిరి కేగెడు శివభక్తి తతికి

. . . . . . .

ఘన కమండలువులు కప్పెర చయము (ఇచ్చింది)
శ్రీభ్రమరాంబకు శ్రీశైలపతికి
రజిత కాంచనముల రాజిల్లునట్టి
కూష్మాండ ఫలములంగూర్చి (నది)
గౌరీ మహేశ్వర ఘన నామ శిఖరి
ఎక్కియు నోమితి నెలేశ్వరమున
దిగి వచ్చి నోమితి తిలపర్వతమున
శ్రీశైలపథమున చెలువంబు మీర
అశ్వత్థ పంక్తుల నభివృద్ధిచేసి"

ఐతమ్మ బాలునితో నిన్ను ఇన్నికష్టాలుపడి కన్నాను తండ్రీ! యుద్ధానికి పోవద్దు' అని చెప్పే సందర్భంలో ఈ విషయాలు చెప్పింది

శ్రీగిరి 'శ్రీగిరీశుని యాన చెన్నుని యాన' అని బాలచంద్రుడు (పు 413) అమ్మ మాటవిని మంచాల వద్దకు వచ్చినాను యుద్ధానికి భయపడి కాదు అంటాడు. శ్రీగిరి లింగంబు చెన్నకేశవుడు వరము లొసంగగా వర్ధిల్ల గలరు అంటుంది మంచాల బాలచంద్రునితో (పు 419) శ్రీగిరీశుని యాన చెన్నుని యాన నీవు కాదెను

పూడికి రావద్దు అని అనపోతుకు లేఖ వ్రాస్తాడు బాలుడు (పు 447) 'ఇంవేల్పు లనంగ నేర్పడియున్న శ్రీగిరి లింగంబు చెన్నకేశవుల ప్రార్థన గావించి' అనపోతు ఆత్మహత్య చేసుకొంటాడు, తనను యుద్ధానికి రానివ్వలేదని (పు 449) 'శ్రీగిరి దేవుని చెన్నకేశవుని తన మదిలోనుంచి కొమ్మభూపతి' కూలినాడు (పు 518)

ఆయా క్షేత్ర దైవాలపేర్లు ముద్దుగా ఎక్కువ పెట్టే పిలవడం ఉంది "పుట్టల భూపతి పెంజెల్లు పెద్ద ఇంద్రుని వజ్రము యిప్పగిరీశ .. చెంచుల మోబయ్య కంచి యేకాంబర మహానంది నాథ " ఇలాగా మలపరపు గిత్తలదు ఆ కాలంలో ప్రసిద్ధి కాబోలు! పొంగరం తగిలిన అన్నమ "పాతుసింహమువలె పొదలు చున్నావు మలపరపుగిత్త వలె మలసి మెదపిని" అని సందిస్తుంది

కార్యమపురిని శ్రీపీర తిరుపతిగా చేయాలనుకునే యుద్ధభూమిగా చేసినాడు బ్రహ్మనాయుడు "కార్యమపురి పుణ్యభూమి యనునట్లు రాపింతు రేపతప్ కని సంతసింప ధీరత శ్రీపీర తిరుపతి చేయవలెనంచు సూహించి" (పు 300)

నదులు - తీర్థములు పలనాటికి చంద్రభాగనది, నాగలేరు పవిత్ర నదులు 'చంద్రభాగానది సమమైన నీరు కలుగదు పల్నాటి గడ్డయందెల్ల కృష్ణకు సమ మిది కీర్తనీయంబు' (పు 382). నాగులేటిలో గంగవచ్చి కలిసిన మడుగు గంగధార/ గంగధారలు / జాహ్నవిమడుగు అని పరికీర్తింపబడింది

కార్యమపూడి వద్ద విడిదిచేసి మలిదేవాదులు 'సప్రాభ్యాతవి ని) విలసిల్లు ఘన గంగ తా వచ్చి కలసిన మడుగు'లో తానముల్ చేసినారు (పు 315) బాలుడాడిన పంతపుమాటలను 'పీనులు దొరలును వేగమే లేచి సంధికార్యము మాని జాహ్నవి కేగి ఆ మడ్గులో వెసి రన్నమంతయును' (పు 452) నిజానికి తర్పణాలు వదిలేటప్పుడే అలా చెస్తారు ఇక్కడ ప్రాణాలకు తెగించినందుకు చిహ్నంగా అలా చేశారేమో? బాలుని 'నరసింగుడు ప్రేగులు వెడలగా భేదించి పొట్ట అందుసంబునం పొడిచి నాడు (పు 474) నరసింగుని సామంతరాగోలచే పొడిచి, తల నరికి, తీసుక పోయి తమ వారికి ఆనవాలుగా చూపుతాడు మళ్ళీ యుద్ధరంగానికి వచ్చి 'ప్రవాడు ప్రేవులు వగమె పెరికి గంగధారను కలిపి కలనికి వచ్చి' (పు 479) పోరాడి చనిపోతానాడు

'చాకల చందన్న సాహసపటిమ పాతాళగంగను భావమందుంచి' పొరాడి ప్రాణాలు విడిచినాడు

పలనాటి వీరచరిత్రలో కనిపించే స్థలాల్లో కార్యమపూడి, కొదమగుంళ్ల, కోలంకి (కోణంకి అనే పేర్తో), గురజాల, చింతపల్లి, నర్మాల (నర్మాలపాడు అనే పేర్తో), పెంజెల్లు (పిన్నెల్లి అనే పేరుతో), పొందుగుల, మలవరం (మల్లవరం అనే పేరుతో), మాచెర్ల, మాడుగులు అనే గ్రామాలు పల్నాడుతాలూకాలో గుంటూరు జిల్లాలో ఉన్నాయి గరికపాడు, గుమ్మడంపాడు, శివపురి (శివపురం అనే పేరుతో) వినుకొండ తాలూకాలోను, పాలపర్తి బాపట్ల తాలూకాలో బలమూరు (బాలెమర్రు) అనే పేర్తో సత్తెపల్లి తాలూకాలోను గుంటూరు జిల్లాలో ఉన్నాయి

అట్లూరు నరసారావుపేట తా కృష్ణాజిల్లాలో ఉంది అర్వెల్లి పేరుతో జగత్యాల తా కరీంనగర్ జిల్లా, తణుకు తా పశ్చిమగోదావరి జిల్లాలో గ్రామాలున్నాయి పాలెము మిర్యాలగూడ తా నల్గొండ జిల్లాలో ఉంది పొదిలె పొదిలి తా నెల్లూరు జిల్లాలో ఉంది గట్టు మదనపల్లె తాలూకా చిత్తూరు జిల్లాలో ఉంది

5 1 6 శివరాత్రి మాహాత్మ్యం ఈ కావ్యం శ్రీనాధుని చివరి రచన శ్రీశైల మందలి భిక్షావృత్తి మఠాధ్యక్షులు శాంత భిక్షావృత్తి యతీశ్వరుల మూలభృత్యుడు ముమ్మయ శాంతయకు అంకితం చేయబడింది[25]

5 1 6 1 'శివరాత్రి మాహాత్మ్యం'లో ప్రస్తావనకు వచ్చిన తెలుగునాడుకు సంబంధించిన ప్రదేశాలు ఇవి ఆంధ్రదేశం, ఆతుకూరు, ఆముదాలపల్లి, కళింగ, కాళహస్తి, కొలను, కుక్కుటేశ్వర కుంటి, కోరంగి, గౌతమి, చంద్రభాగ, చెరువాల/చెరువాడు, చెపూరు/చేవూరు, దక్షవాటంబు/ద్రాక్షారామం, పలివెల, పిఠాపురం, మార్కండేయపురి, శ్రీగిరి తూర్పునాడు/తూర్పునాడు, శ్రీపర్వతం / శ్రీశైలం సప్తర్షి గోదావరి అవేవి

పోలిదెవయ్య కృతిభర్త పూర్వీకుడు. కొమ్మ విభుని కొడుకు అతడు. "చేపూరి (చేపూరి[26]) భీమేశు(జెలువార గుండెల(బూజ గావించిన పుణ్యమూర్తి... కొలని రామారెడ్డి వలన శ్రీగిరినాధు "నికి ఆభరణాలు అర్పించినవాడు

భక్తి రాజుచే 'పర్వతేశ్వరునకు చెరువాలు[27] (జెరువాడు) ఆతుకూరు' అర్పింపజేసినవాడు. త్రిపురాంతక స్వామికి 'ఆముదాలపల్లి రాయవేశ్యా భుజంగ వల్లవ' యిచ్చినాడు ( 1-22 ),

కొల్లేరు సరస్సు కొలను కొలను మండలం పశ్చిమ గోదావరిజిల్లాలోని ఏలూరు, భీమవరం, తణుకు తాలూకా ప్రాంతం కమలాకరపురం, పద్మినీపురం,

సరసిపురి ఇవన్నీ కొలనుపీడు రూపాంతరాలు[28] కొలని మండలికుడే రామారెడ్డి ఆతుకూరు కృష్ణా జి గన్నవరం తాలో ఉండే గ్రామం ఆముదాలపల్లి రేపల్లె తా గుంటూరు జి లోని గ్రామం

ఉత్తరదిశా గంధవహుడు దక్షిణానికి ఎలా సాగిందీ ఎంతో చమత్కారంగా కవి వర్ణించినాడు కుబేరుని అంతఃపురం, కైలాసగిరి కూటాలలోని ఓవుక్కు, పుష్పాలు, పుణికి పుచ్చుకొని చంద్రభాగానది అలలపై నాట్యమాడ్తూ, రాధాపురి మేడల గవాక్షాలలో దూరి, చంపకారణ్యం వాటిని దగ్గరించి ... 'కాశి యొరసి కళింగాంధ్ర దేశ సరణి' దక్షిణము సాగినదట (4-28) ఉత్తర హిందూ దేశంలోని కాశినుండి కథ దక్షిణ హిందూ దేశంలోని ఆంధ్ర, కళింగ రాజ్యాలకు ఇలా సాగుతుందని చెప్ప డానికి కవి ఇలా వ్రాశాడేమో!

గ్రహరాజు కోదండరాశి నుండి మాఘమాసంలో మకర రాశిలో ప్రవేశించే సమయంలో కాశి, పిఠాపురం, దక్షారామం, మార్కండేయపురులలో చక్రపుష్కరిణి, కుక్కుటేశ్వర కుండం, సప్తగోదావరం, గౌతమీ నదులలో తీర్థమాడడానికి అఖిల మునులు వస్తారని ఈ సీసం తెలుపుతుంది

" కాశిలోఁ జక్రక పుష్కరిణి దుష్కృత శుష్క గహనావళీ దావదహన జిహ్వ
కుక్కుటేశ్వర వర కుండి పిఠాపురి నఘ తమస్కాండ చండాంశుదీప్తి
దక్షవాటంబు సప్తర్షి గోదావరి కలి దోష పాషాణ కులిశధార
గౌతమీ తటిని మార్కండేయపురి మ్రోల దురితాహిసంఘాత గరుడమూర్తి

ఎన్నిటను దీర్థమాడంగ నేగుదెంతు
రఖిల మునులు ప్రభాత సంధ్యాగమముల
గ్రహగణేశుండు కోదండ రాశిఁబాసి
మకరమున కేగుఁదెరంగ మాఘవేళ " (4-32)

ఈ మాఘమాసంలోనె "దాక్షారామ భీమేశ్వరుండు దక్షిణజలధి వేలా వలయితంబులగు నేలా లవంగ లవలీ మతల్లికా కుడుంగ క్రోడంబులం గ్రీడించుటకునై సారంగ లోచనలు దాపున గొరంగి" వెడలినాడు "కాశి శ్రీశైల కుంభఘోణ శోణార్క కాంచీ కాంచనసభా కాళహస్తి కురు క్షేత్రాది పుణ్యస్థానంబులం బరమర్షి సార్థంబు తీర్థంబాడె" (4-34) నని కవి వచనం

కోరంగి తూర్పుగోదావరి జిల్లా కాకినాడ తా లో ఉంది పలివెల కొప్పులింగేశ్వర స్వామి నికవి అహరహం భజిస్తాడట ఆ స్వామిని వర్ణించిన సీసపద్యంలోని భావస్ఫోరకతను చదివి ఆనందించాల్సిందే

ఈ శివరాత్రి మాహాత్మ్యం "శ్రీకాంత భిక్షావృత్తి యతీశ్వరుండు .. శ్రీపర్వత స్వయంభూ లింగ చక్రవర్తి శ్రీమన్మల్లికార్జున మహాదేవుని ముఖమండపంబున సుఖాసీనులయి" భక్తులు, బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య, వీరభటు, స్థానాధికారులు .. వీరందరితో కొలువుండినారు ( 1-18 )

పొలిదెవయ్య కులసతి పుణ్యచరిత ముమ్మమాంబ గౌరి, శ్రీలక్ష్మి, వాగ్దేవి ఇంద్రాణులతో పోలి ఉండి . ఏ ప్రొద్దు గుణముల సతిశయిల్లి . శ్రీశైలనాథుని పట్టణమున . ఉన్నది (1-24) వారికి ఏడుగురు కొడుకులు సెట్టియ 'ధామణి శ్రీపర్వతాధీశ దండాధిపు' డా అన్నట్లుండేవ డు (1-27) పొలయసెట్టి 'మల్లికార్జున శివునకు మంత్రి యనంగ(దూర్పునాడెల్ల( బాలించు నెర్పరి' (1-28) 'శ్రీగిరి తూర్పు దేశంబులో . . భక్తి మహత్త్వంతో .. ఆగమ వేదశాస్త్రాలలోని కథాప్రసంగాలతో భక్తియుక్తుడై ప్రోల గురుసెట్టి ముమ్మయ ఉండినాడు' (1-35)

5 1 7 శ్రీనాథుడు ఆ యుగ పురుషుడే కాదు విలక్షణ సాహిత్య సృష్టికర్త కూడా ఆంధ్ర దేశాభిమానంతో భీమఖండం క్షేత్ర మాహాత్మ్యం రచించినాడు కాశీఖండంలో కూడా గోదావరి మండలంలోని ప్రసిద్ధ పుణ్యస్థలాలను, శ్రీశైలాన్ని సవిస్తరంగా వర్ణించినాడు నాడు జానపదుల జనజీవనంతో పెనవేసుకొని ఉన్న 'పలనాటి భాగవతంబు' లోని ముఖ్యఘట్టాలను, రోకటి పాటకు అనువైన మంజరీ ద్విపదలో రచించినాడు శ్రీనాథుని సాహిత్యం ఆ కాలంలోని ఆంధ్రదేశ సాంఘిక, మత రాజకీయ సంబంధమైన సమస్త విషయాలకు ప్రతిబింబం తెలుగునాడుకు సంబంధించిన వివిధ స్థలాలను తన సాహిత్యంలో చిరంజీవం చేసినాడు శ్రీనాథుడు

5 2 వినుకొండ వల్లభామాత్యుడు వినుకొండ వల్లభామాత్యుని రచన క్రీడాభిరామం ఈ కావ్యం శ్రీనాథునిదిగా చాలాదినాలు వాడుకలో ఉన్నా, చివరకు వినుకొండ వల్లభరాయనిదే అని తేల్చినారు రావిపాటి త్రిపురాంతకుని సంస్కృత 'ప్రేమాభిరామం' అనే వీధికావ్యం క్రీడాభిరామానికి మూలం

5 2 1 క్రీడాభిరామం ఒక విధంగా వాస్తవికకావ్యం కవి కాలం నాటి ఓరుగల్లు స్వరూపం మన కళ్ళకు కట్టేట్లు ఈ కావ్యంలో వర్ణించబడింది

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

ఈ కావ్యంలో కసుమ యవ్వలిదేశం, కాసల్నాడు, కురువాటికా దేశం, జనప, తూర్పునాడు, పలనాడు, ముల్కినాడు, వెగి అనె ఆంధ్రదేశ విభాగాలు ప్రసక్తికి వచ్చినాయి

ఓరుగంటి పురంబుతో . కసుమ యవ్వలి దేశంబు కతకకాంత సంపెంగ నూనె అమ్ముతుండగా కావ్యనాయకుడు, సఖుడు చూచినాడు గోవింద మంచనశర్మ కావ్యనాయకుడు అతడు 'కాసల్నాటి శ్రేష్ఠుడు' (1-43, కర్ణాటభామ మంచన శర్మతో 'వాటు ప్రౌఢిఁవిసాల మాదెదవు కాసల్నాటి బాపండవా' అంటుంది (1-92) కాసల్నాటి గోవింద మంచనశర్మ (1-150) మాచల్దేవితో 'కాసల్నాటనుండి వచ్చితిమి' (1-183) అని చెప్తాడు

కడుపు నిండా భోంచేసి 'తెల్లనాకులను పీడెము చేయుము' వచ్చే యువకున్ని చూసి, వీడు 'కరణదేశపు జాణడు[23A] (1-159) అంటాడు మంచనశర్మ సఖుడు టిట్టిభసెట్టితో

మధుమావతి పావనంబైన తమిలేటి వెగి కురువాటికా దేశ విపిన భూమి గోవు లను పేరి చెంచుల కులము నందుఁగడిమి కత్తుల యమ్మి నాఁగలుగఁగలమ' అని ఒక జోగి వ్రాసిన పద్యం ( 1-242 )

తన తండ్రి త్రిపురాంతకరాజు, 'రాయ నవరత్న భండార రక్షకుఁడు . మూడు గ్రామ గ్రాసములతోడఁ గూడంగ మోపూరు పాలించె ముల్కినాట' అని కవి చెప్పుకొన్నాడు

దారిలో కనిపించిన ఒక తెలికి స్త్రీని చూపించి మంచన శర్మ 'పలికినపుడు తెనియ రొలికి పడెడు జళుకుఁజూపులఁ గ్రొమ్మించు లులికి పడెడు ములికినాటిది కాఁబోలు' (1-102) అంటాడు

ముల్కినాటి పుర మోహన శైల సువర్ణ కందరా సదనుఁడు కాలభైరవుడు... తిప్పయ వల్లభరాయ మంత్రికిన్' (1-94) అనేది ఆశ్వాసాంతపద్యం

5 2 2 పల్నాడు| పలనాడు| పలినాడు, పల్లెనాడు|పల్లెత్మాకాంత, పల్లె దేశములు, పల్లెవిషయం అని వివిధనామాలతో పేర్కొన్నాడు ఓరుగల్లులో ఉండే 'పలినాటి' వీరపురుష పరమ దైవత శివలింగ భవనవాటి' (1-118)ని విప్రుడు దర్శించినాడు కుమారకులు వీర్ల కొలువులో పల్నాటి వీరులను పాడుతున్నారు. (1-117)

" కులము దైవతంబు గురిజాల గంగాంబ
కలని పోతులయ్య చెలిమికాడు,
పిఱికి కండ లేని యఱువది యేఁగురు
పల్లెనాటి వీర బాంధవులకు " (1-118)

'పల్నాటి యేకాంగ వీర సంప్రహారమునకు ఆరువల్లి నాయురాలి దుర్మంత్రంబు, కోడిపోరు, చాపకూటి కుడుపు ప్రథమ కారణములు (1-119). పల్నాటి ఎల్లలు ఈ క్రింది పద్యంలో తెలుపబడినాయి

"నల్లంగొండయు నాగరి
కల్లును ధరణీస్థలిం బ్రగల్భ స్థలముల్
పల్లేఱు, నాగులేఱును
బల్లెక్ష్మాకాంత యెల్ల ప్రారంభమ్ముల్" ( 1-121 )

సామంతరాజులు చాపకూడు తిన్నస్థలం ఇది ఆర్వెల్లి నాయురాలు ఉపాయం ఆలోచించింది ఇక్కడే పీలసాని నిజమనే శుద్ధికోసం సిప్పల యేటిలో ఇక్కడే ఓలాడింది గొల్లసవతి తల్లుల బిడ్డలైన రాజులు ఈ చోట్లోనే పోరినారు వీర పురుషులు యుద్ధంలో ఇక్కడ వీరమరణం పొందినారు అని జనప పెద్దలు పల్లె దేశములయందు ఆయా ప్రాంతాలను చూసి చెప్పుతుంటారు (1-122) మాచెరల చెన్నుడు, శ్రీగిరి లింగము దయతో చూడబట్టి పల్లె విషయానికి "ఉత్తర తోన మింట జల ముట్టిన మాత్రన నాపకాలలో విత్తిన యావనాళ మభివృద్ధిపరచుట" అనే మహిమ చెల్లింది (1-123)

ఇలా పల్నాటి వర్ణన ఉదాత్త వీర రస సమన్వితంగా చేసినాడు కవి.

పై చెప్పిన నాడుల వివరణ కొంత కాసలనాడు తెలంగాణంలోని హైదరాబాదు వరంగల్లు జిల్లాల ఉత్తర ప్రాంతం మెదకు కరీంనగర్ జిల్లాల్లోని కొంత భాగం [29] కురువాటిక వేంగిమండలం లోనిది అన్న విషయం వేఁగి కురువాటికా దేశం అనే పాదమే తెలుపుతుంది తమ్మిలెరు ఏలూరు దగ్గర ప్రవహించే ఒక ప్రసిద్ధమైన ఏరు కురువాటిక అనేది గోదావరి దక్షిణ తీరాన ఉండే తమ్మిలేరు పరిసర ప్రాంతంగా చెప్పవచ్చు[30]

తూర్పునాడు గుంటూరు, నెల్లూరు, జిల్లాలోని సముద్రతీర ప్రాంతం తూర్పు భాగానికి వర్తిస్తుంది[31] ములికినాడు కడప జిల్లాల్లో అంతర్భాగం కవి చెప్పిన భైరవ

స్వామి నిలయం, కవి తండ్రి పాలించిన మోపూరు – పులివెందుల తాలూకాలో ఉన్నాయి

5 2 3 క్రీడాభిరామ వీధి కావ్యంలో నాయకుడు గోవింద మంచన శర్మ చెలికాడు టిట్టిభసెట్టితో ఓరుగల్లు దర్శించను వెళ్తాడు వారు ఓరుగల్లులో చూచిన విశేషాలు, ప్రదేశాలు కావ్యం నిండా ఉన్నాయి ఆ ప్రదేశాలు ఇవి .

అంధ్రోర్వీపు మోసాల, అక్కలవాడ, ఏకవీరా దేవాలయం, ఓరుగల్లుకోట, వివిధ దేవాలయాలు, పూటకూటిండ్లు, భైరవాలయం, మధుమావతి మందిరం, మాచల్దేవి భవనం, వీరభద్రేశ్వరస్థానం, వేశవాటిక, శివలింగ భవనవాటి, స్వయంభూ దేవుని గుడి – ఇవన్నీ ఎంతో వర్ణనాత్మకంగా చిత్రించబడినాయి ఆ కాలంనాటి ఓరుగల్లు స్వరూపం చక్కగా మనం అవగాహన చేసుకోడానికి ఈ కావ్యం ఎంతో సహకరిస్తుంది

ఓరుగల్లు ఆంధ్రనగరం, ఏకశిలానగరం| ఏకశిలాపురం, ఓరుగల్లు| ఓర్గల్లు ఓరుగంటి పురంబు| ఓరుగంటి పురం| ఓర్గంటి పట్టణం| ఓర్గంటి మండలం అన్ని వివిధ నామాల్తో పిలవబడింది

"ఏకశిలా నగరంబునం దార్య వాటంబునం" కామ మంజరి ఉంది ఆమె పాత ప్రియుడు కాసన్నాటి గోవింద మంచనశర్మ కొన్నాళ్ళు పరదేశం వెళ్ళి ఇప్పుడు తిరిగి వచ్చినాడు అని ఈ 'వీధి' రూపకంలో సూత్రధారుడు చెప్పి నిష్క్రమిస్తాడు

గోవింద మంచనశర్మ "ఆంధ్రనగర యాత్రోన్ముఖుండై" (1-48) ఉంటాడు "మంచన వింటివో వినవొ మన్మథుఁడేకశిలా పురంబులోఁ జంచల నేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రి" పోరిస్తాడు (1-54) అని టిట్టిభుడంటాడు ఇద్దరూ బయలుదేరి వెళ్ళి "ఓరుగంటిపురంబు సౌధములపై యీరెండలు" మణి హేమ కుంభాల్తో ఏకాంతాలాద్ధం చూస్తారు (1-64)

ఓరుగంటి పురంబులో పెద్దగా అరుస్తూ సంపెంగ నూనె అమ్మే కనుమయవ్వలిదేశపు కరణకాంతను (1-101) కలికి చిలుకల కొలికి అయిన ములికినాటి తెలికి జోటి (1-102)ని చూస్తారు.

5 2 4 నాటి ఓరుగల్లు మహానగరం వైభవ ప్రాభవాలను సమృద్ధాన్ని, లోతైన అగడ్త, ఎత్తైన ప్రాకారం, బంగారు తలుపుల సింహద్వారాన్ని ఈ క్రింది పద్యంలో ఎంతో సజీవంగా చిత్రించాడు కవి.

సప్త పాతాళ విష్టవ మహా ప్రస్థాన ఘంటాపథం బైన గనప పరిఖ
తారకా మండలం స్తబకావతంసమై కనుచూపు గొనని ప్రాకార రేఖ
పుంజీభవించిన భువన గోళము భంగి సంకు లాంగణమైన వంకదార
మెఱుగు తెక్కలకొడి మెరు శైలముఁబోలు పెను బైడి తలుపుల పెద్ద గవని

చూచెఁ జేరెఁ బ్రవేశించెఁ జొచ్చెఁ, బ్రతి సఖుడు దాఁను రథ ఘోట శకట కరటి
యోధ సంబాధముల కొయ్య నోసరిలుచు, మంద గతి నోరుగల్లు గోవిందశర్మ"
(1-112)

సందడి తప్పకవగా ఉండే చిన్న వీధులగుండా వెళ్ళి వినోదాలు, వేశ్యల సరస సల్లాపాలు అనుభవిద్దాం ఇంతలో మధ్యాహ్నమైతే అక్కలవాడకు భోజనానికి వెళ్దాం అంటాడు మంచనశర్మ "ఆలువరి క్రింది త్రోవగా సరిగి యరిగి . పలినాటి వీర పురుష పరమ దైవత శివలింగ భువనవాటి" ని చూస్తారు (పు 115) అక్కడ పెద్ద కొలువులో పన్నాటియుద్ధం అభినయం చూస్తారు ముందరు సాగి వెపమండలు ద్వారానికి వేలగట్టిన "ఏకవీరాగార గోష్ఠంబు" కనుగొని (1-123) ఓరుగంటి కాకతమ్మకు సైదోడుగా వసించే ఏకవీరను దర్శిస్తారు (1-128) "భైరవుని తోడి జోడు మైలారదేవుఁడు ఓరుగంటి నివాసి మెరానఁగుఁగాక" (1-145) అని కోరు కుంటారు – నాయకుడు, చెలికాడు

వారిద్దరూ ఓరుగంటి నగరంలో ఉండే ఏ యే దైవాల్ని సందర్శించినారో ప్రతిభావంతంగా తెలిపేది ఈ పద్యం

"అదె భైరవ స్థాన మట మీఁద నల్లదె పమదేశ్వరీ మహాశక్తి నగరు •
వీరభద్రేశ్వరాగార మండప మదె • యదె బౌద్ధదేవు విహార భూమి •
అదె ముద్దరాల్ మునానమ్మ నివాసంబు : నల్లదె కొమరసామయ్య నగరు :
అదె పాండవుల గుడి • యట దక్షిణంబునఁ గస్తారుఁ డుండు తుర్కల మసీదు

కొంత దవ్వుల నదె మహా గోపురముల పైడి కుండలు రవి దీప్తిఁ బ్రజ్వలించి
కాన నయ్యెడు మేరు శృంగములఁ బోలెఁగేన శ్రీ స్వయంభూ నికేతనములు"
(1-149)

ఇంతలోకే "ఉడుపీథిన్ శిఖరావలంబి యను సంభ్రాంత్వీనమోసాలపై" గడియారం పదహారు ఘడియలు కొట్టింది "వెక్కిచ్చి తినఁ బోదామా" అంటాడు

పంచనశర్మ (1-156). పట్టణంలో నిత్యం మదనుడు విటీవిటులకు రాయవారి అయి పూటకూటిండ్లలోనే ఉంటాడు (1-157) అనుకుంటూ ముందుకు వెళ్తుంటారు కరణదేశపు జాణడు బోందేసి తెల్లనాకుల పీడెం నములుతూ ఎదురౌతాడు (4-159) అక్కలవాడ వెళ్ళి పూటకూళ్ల తిని వేశ్యావాటికా నిరటంబు ప్రవేశిస్తారు (1-177)

చందనంతో కళ్లాపి చల్లినారు కుంకుమతో ముగ్గులు పెట్టినారు తోరణాలు గట్టినారు – ఎవరి ఇల్లది ? (1-178) అని ఆక్కడి వానిని అడుగుతాడు మంచనశర్మ

"సర్వజగత్ప్రసిద్ధ సుమనోబాణాసనామ్నాయ విద్యోపాయ, ప్రతాప రుద్ర ధరణీశోపాత్త గోష్ఠి ప్రతిష్ఠా పారీణ . మాచల్దేవి వారాంగన (1-180) చిత్రశాలా ప్రవేశం చేస్తున్నది (1-191)అని జవాబిస్తారు పెండ్లికూటంబున నలవునంగైసేసి, హంసతూలికా తల్పంబు మీదం గూర్చున్న మాచల్దేవిని (1-183) చూచి "సీకుం గల ప్రసిద్ధి ఢిల్లి సురతాణికి లేదు పల్లవాక్షి" (1-185) అంటాడు మంచనశర్మ

"ఓరుగంటి మాచాంబ" మంచనశర్మకు మొక్కుతుంది (1-186) "మగువ నీమస్మథ చ్ఛత్ర మంటపంబు ... యోర్గంటి కటకమునం గామనం గావుత" (1-188) అని దీవిస్తాడు శర్మ కాసల్నాటినుండి వచ్చితిమి (1-183) అంటాడు తమ్ము పరిచయం చేసుకొంటూ ఈ సందర్భంలో కవి వర్ణించిన మాచల్దేవి చిత్రశాలనాటి రాజవేశ్యల వైభోగాలకు అద్దం పడ్తుంది పరికించండి.

" అదె దాప వనభూమి యసమనేత్రుఁడు వాఁడె ' సంయమీంద్రుల పుణ్య
సతులు వారె

యదె కన్యకా రత్న మబ్జావనుఁడు వాఁడె యదె రతి క్రీడా విహర శయ్య
వాఁడె వైకుంఠుండు వారె గోప స్త్రీలు యమునా నదీ సైకతాంత మదియె
యదె యహల్యాదెవి యమరాధిపుఁడు వాఁడె యదె పర్ణశాలి కాభ్యంతరంబు

తే చందురుఁడు వాఁడె యదె బృహస్పతి పురంధ్రి
జాలరిది యదె శ్రీపరాశరుఁడు వాఁడె
కుశికజుఁడు వాఁడె యదె యింద్రు కొలువు లేమ
చిత్తజుని శౌర్యమెఱిగించె జిత్రశాల " (1-191)

చిత్రశాల మాచి వెస్తూ దారిలో 'తూర్పునాటి గడిఁడు'ను (1-226), "పోఁగంటి కలుకోడి తోడఁ(బుట్టువులువోని కోడిపుంజుల యుద్ధాన్ని" (1-233) వీక్షిస్తారు.

మను ముందుకు సాగి దక్షిణ దిశగా "పైకికుంతల మొగసాల తోడిది మాధవ వర్మ మాతుర "మధుమావతీదేవి మందిరంబు" పరికిస్తారు (1-237)

సింహళద్వీపమున తప్ప ఇంకెక్కడా పద్మినీ జాతి లేదనడం కల్ల "మధుమావతీదేవి ... పద్మినీజాతిద ఓర్గంటి పట్టణమున" ఉంది (1-238) ఆమెతో ఒక రేయి గడిపిన ఒక పొక్కపు జోగి ఆమె జన్మజన్మల వృత్తాంతం ... తెనుంగుఁ బద్యమున్ .. లిఖించినాడు (1-240) అలకాపురంలో అంగార పష్ణడనే గంధర్వ రాజు కూతురు కమల పాణి ఈ జన్మలో "మధుమావ తోర్గంటి మండలమున" చిన్నిపోతి యనే పేర్తో దక్షారామమున బుట్టి భీమేశుని కూడుతుంది ఆ పై జన్మలో "పావసంపైన తమిలేటి పరిసరమున పెఁగి మరువాటికా దేశ విపిన భూమి గోవులను పేర చెంచుల పలమునందు .. కత్తులయమ్మి" అనే పేర్తో పుడ్తుంది ఇదీ ఆ పద్యం సారాంశం (1-242)

గోవింద మంచన శర్మ తన మామ మీసాలప్పయ్య ద్వివేదుల కొడుకు శ్రీధరున్తో జొన్నగడ్డాగ్రహార వృత్తి ఏ నూఱు రూకలకు అమ్మి వెట్టి" వచ్చినాను నీవూ. మదాలసా (వేశ్య) సంతోషంగా ఉండండి అని చెప్తాడు (11-245)

అక్కలవాడలోని వెలయాంధ్ర విలాసాలు వీక్షించి (1-263), వేశ వాటంబు వెడలి, భైరవాలయ ద్వారంబునఁ బాడి ... వీర భద్రేశ్వర స్థానంబు వెనుక బొడ్డన బావియందుఁ గృత సంధ్యా వందనుడై" నాడు (1-273) మంచన శర్మ

ఇలా ఓరుగల్లు స్వరూపాన్ని కవి కలం కుంచెతో పద్య చిత్రాల్లో మనోజ్ఞంగా మన కందించినాడు

5 2 5 క్రీడాభిరామ కావ్యంలో ఆనుషంగికంగా శ్రీకాకుళపు తిరునాళ్ళ ప్రసక్తి వచ్చింది ఆ తిరునాళ్ళలో వేశ్యా విటుల స్వైరవిహారాలు, సిరికాకుళదేవుని పుట్టు పూర్వోత్తరాలు అభివర్ణితాలు

కాకుళాధ్యక్షుఁడైన తెలుగు రాయఁడు దేవతాధీశ్వరుండు (1-204) కాకర పొదలో ఉద్భవించిన వాడు తెలుగు భర్త (1-205) కాకుళేశ్వరుండు విప్రకన్యతో చనవుల వెలయిస్తుంటాడు (1-206) సిరికాకుళ నాథుఁడు నాగదేవ బట్టారకు

నింట బుట్టినాడు (1-207) గరుడస్తంభ ప్రతిష్ఠ నాటినుండి కల్పాంతం తోక్త పుష్పాధ్వరము వరకు కృష్ణాతటినీ తటమునన్ ద్వాదశ క్రోశ ధాత్రి పరివేషా భ్యంతర శ్రీ పరమపదమునం బర్వకాలంబు ధాత్రి పరివేషాభ్యంతర శ్రీ పరమ పదమునం బర్వకాలంబునందున్ బరహాకి సంగమాదుల్ భగవదనుమతిం బాపముల్ గాక యుండును (1 208) యవ్వన మదంతో కన్నూ మిన్నూ గానక ఉండే వెలనాటి కోడె విధవన్ కాకొల్లి తిర్నాళ్ళలో భీమసేనున్తో అయితేనే రంజింపజేయ బడతా రేమో ? సందేహమె (1-209) తిరునాళ్ళ దినాలలో కాకుళపు తిరునాళ్ళలో పేరకమ్మ పులినతలాల్లో జరిగె స్వైర విహారాల్ని కవి విస్తారంగా వర్ణించినాడు (1-210, 211, 212) కవి కవిత్వ వాగ్దంబరములు నెల్లూరి తూము కాలువ కెంగలువల కమ్మతావిని అపహాపిస్తున్నవట (1-28)

ఈ విధంగా కవి ఆంధ్రదేశంలోని కొన్ని నాడులను, ఏకశిలానగరాన్ని, తన కావ్యంలో ప్రస్తావించినాడు

5 3 బమ్మెర పోతనామాత్యుడు సహజకవి బమ్మెర పోతనామాత్యుని కృతులు భోగినీ దండకం, వీరభద్రవిజయం, భాగవతం, నారాయణశతకం

5 3 1 భోగినీదండకం సర్వజ్ఞ సింగ భూపాలుని వేశ్యపై రచించిన దండకం భోగినీ దండకం ఈ చిన్న రచనలో కనిపించె తెలుగునాడులోని స్థలాలు రెండే రెండు బమ్మెర, రేచెర్ల అనేవి

"పండిత కీర్తనీయుడగు బమ్మెర పోతన.. భోగిని దండకము రచించె "

(పు 34)

కావ్య నాయకునిది రెచెర్ల వంశం రేచెర్ల గోత్రోద్భవున్ ... (పు 31) రేచెర్ల గోత్రాంబు సంజాత మిత్రున్ .. సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షున్ (పు 34) అని ప్రయోగాలు

5 3 2 వీరభద్ర విజయం ఈ కావ్యంలో కనిపించే 'తెలుగునాడు'కు చెందిన స్థలాలు ఇవ్వటూరు| ఇవుటూరు, శ్రీగిరి|శ్రీమహానగం అనేవి

" అనఘ డివ్వటూరి యారాధ్య చంద్రుండు
... సోమ గురుడు" (1-15)

"శ్రీమన్మహామహేశ్వర యివుటూరి సోమనారాధ్య"...

( ప్రథమ ఆశ్వాసాంతగద్య )

" జయ జయ త్రిగిరి మందిర " (1-218)

. ." శ్రీ మహానగము ఎలుపు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్ " (1-1) - ఇవీ కవి ప్రయోగాలు

5. 3 3 ఆంధ్ర మహా భాగవతం బమ్మెరపోతన, వెలిగందలనారయ, ఏర్చూరి సింగన, గంగన సంస్కృత భాగవతాన్ని తెనిగించినారు నారయ ద్వితీయ, తృతీయ స్కంధంలో కొన్ని పద్యాలు, దశమ స్కంధ ఉత్తర భాగం, ఏకాదశ ద్వాదశ స్కంధాలు రచించినాడు పంచమస్కంధ పూరణ గంగనది షష్ఠస్కంధ రచన ఏర్చూరి సింగనది 33

బమ్మెర పోతన భాగవతంలో అగుపించే ఆంధ్రదేశ సంబంధి స్థలనామాలు ఇవి అంధ్ర/ఆంధ్ర, ఇంద్రకీలం, ఋషికుల్య, ఏకశిలానగరం, కళింగ, కృష్ణవేణి, గంగ, గోదావరి, గౌతమి, చంద్రభాగ, తుంగభద్ర, బమ్మెర, భీమ/భీమరథి, రామగిరి, వేంకటాచలం/వేంకటాద్రి, శ్రీశైలం, సప్తగోదావరి - అనేవి

..."నె నంధ్రభాషను రచియింపం బూనిన శ్రీమహా భాగవతంబునకుం"...(1-31) అని కవి ప్రయోగం

5. 3 3 1 పోతన ఆంధ్రాభిమానం అసమానం మూలంలో

" కిరాత హూణాంధ్ర పుళింద పుల్కసా
ఆభీర కంకాయ వనాః కషాదయః" (4-18)

అని ఉండగా "యవన వ్యాధ పుళింద హూణ శక కంకాభీర చండాల సంభవులుం దక్కిన పాప వర్తనులు" (2-63) అని తెనిగించినాడు కిరాత, ఆంధ్ర, పుళింద - ఇత్యాదులు పాపవర్తనులు విష్ణువును సేవించి పరిశుద్ధులౌతారని మూలం కాగా ఆంధ్రులను ఆ కలుషాల నుండి రక్షించినాడు పోతన

5 3. 3 2 భారతదేశంలో ఉండే పుణ్య పర్వతాలు, నదులను గురించి చెప్పబడిన సందర్భంలో తెలుగుదేశంలోని కొన్ని కొండల ప్రసక్తి వచ్చింది

"మలయ పర్వతంబును ... శ్రీశైలంబును, వేంకటాద్రియును మహేంద్రం బును . ఇంద్రకీలంబును, రామగిరియు ... శర్కరా వర్తయుఁ, దుంగభద్రయుఁ, గృష్ణవేణియు, భీమరథియు, గోదావరియు ... చంద్రభాగయు ... మహానదులును- భారత వర్షంబునఁ గలవు అందు సుస్నాతులైన మానవులు ముక్తిం జెందుదురు " (5-54)

ఇంద్రకీలం విజయవాడ పక్కనుండే కనకదుర్గ కొండ రామగిరి రెడ్డి రాజ్యములు గ్రంథంలో (పు 277) ప్రస్తావించబడింది భీమరధి కృష్ణా జిల్లాలోని భీమానది[34]. చంద్రభాగ పల్నాటి సీమలోని చంద్రవంక కృష్ణకు ఉపనది[35]

5 3 3 3 "...బలి వలన నంగ వంగ కళింగ సంహ పుండ్రాంధ్రు లను పేళ్ళుగల వారార్వురు కుమారులు పుట్టిరి వారలు దూర్పుదేశంబునకు రాజులయి దేశంబులకుఁ దమ నామధేయంబు లిడి యేలిరి" (9-683) ఇది మూలానికి యథా తథానుసరణే.

5 3 3 4 పోతనకు పుణ్యనదుల మీదుండే భక్తి - పవిత్రమైన గోవు లకు కృష్ణుడు పెట్టిన పేర్లలోనే తెలుస్తుంది

"రా పూర్ణ చంద్రిక రా గౌతమీ గంగ రమ్మ భగీరథరాజ తనయ" (దశమ-పూర్వ 603)

5 3 3 5 బలరాముడు తీర్థయాత్రలో సంచరించిన తెలుగునాటి క్షేత్రాలు-తీర్థాలు ఇవి : ...కొమరు మిగిలి సప్తగోదావరికి నేఁగి యందుఁ దీర్థమాడి...భీమనది కేఁగి ... శ్రీశైలంబునకుం జని వెంకటాచలంబు దర్శించి" ... (దశమ ఉత్తర 951)

గోదావరిని గంగ అనే పిలుస్తాడు కవి " సజ్జనానుమతంబున నభ్రంకష శుభ్ర సముత్తుంగ భంగ యగు గంగకుం జని గ్రుంకులిడి"... (1-13) ఈ గంగ గౌతమీ గంగేనని ఆంధ్రసాహిత్య చరిత్రకారుల నిర్ణయం

..."మరలి కొన్ని దినంబులను నేకశిలా నగరంబునకుం జనుదెంచి (1-21)

5. 3 3 6 "బమ్మెర పోత రాజొకఁడు" (1-11) "బమ్మెర కేసయ లక్కసానికిన్" (1-24) అవి కవి పలుకులు

పోతన ఓరుగల్లులో భాగవతం రచించినాడని ఆంధ్రసాహిత్య చరిత్రకారులు నిరూపించారు ఓరుగల్లు జిల్లాలో జనగామ తా. లో బమ్మెర గ్రామముంది. ఇది కవి పూర్వీకుల నివాస స్థానమై కవి ఇంటి పేరు అయి ఉండవచ్చు[36]

వెలిగందలనారయ, ఏర్చూరి సింగనల భాగవత రచనలో తెలుగునాడు ప్రసక్తి రాలేదు. కవుల యింటి పేర్లు మాత్రం గ్రామ నామాలే. వెలిగందుల నారయ

నామధేయ ప్రణీతంబైన .. యేకాదశస్కంధము", "ఏర్చూరి శాసనం దెజ్జిన ప్రగ్గడ".. కవి ప్రపితామహుడు ఎజ్జిన ప్రగ్గడు

వెలిగందుల కరింనగర్ జిల్లా ఉంది 37 ఏర్చూరు వరంగల్ జిల్లాలోని గ్రామం38

5 3 4 నారాయణశతకం పోతన రచనగా చెప్పబడుతున్నది అందులో కృష్ణ, గౌతమి, తుంగభద్ర, పెన్న, భవనాశి, వేత్రవతి నదుల ప్రసక్తి ఉంది

" భవనాశిన్ గయ తుంగభద్ర యమునన్ భాగీరథిం గృష్ణ వే
త్రవతి న్నర్మద పెన్న గౌతమి పయోరాశి స్వియద్గంగయం
దివగాహంబున నైన పుణ్యములు బెంపారంగ నేడిచ్చటన్
భవదంఘ్రి స్మరణంబునం గలుగు పో పద్మాక్ష ' నారాయణా ' (87 పద్యం)

ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా అని కవి సంబోధన ఈ ధర్మపురి క్షేత్రం జగిత్యాల తాలూకా కరింనగర్ జిల్లాలోని ప్రసిద్ధ పుణ్యస్థలం39

పోతన రచించిన భాగవతం పరిణామంలో చాలా పెద్దదె మన పరిశోధనకు సంబంధించిన విషయం మాత్రం అందులో అత్యల్పంగానే ఉంది

5 4 జక్కన విక్రమార్క చరిత్ర జక్కన రచన ఈ కావ్యంలో కనిపించే ఆంధ్రదేశ స్థలాలు నదులు ఎర్దనపూడి, ఏలెశ్వరం, కాళహస్తి, కృష్ణవెణి, తోట ఓరెశ్వరం, దెవాలయం, నెల్లూరు, పాతాళగంగ, పెన్ననది, బెల్లముకొండ, భవనాశని, వెన్నెలగంటి, వేంకటాచలం, శ్రీశైలం, సిద్ధపట్టణస్థానం అనేవి

5 4 1 అహోబలతీర్థ ప్రశంస (2-208 నుండి 2-212 వరకు) ఐదు పద్యాల్లో ఉంది అహోబల పుణ్యతీర్థం (2-208) భవనాశని (2-209) శ్రీనరసింహస్వామి (2-210, 211, 212) వర్ణింపబడిన అంశాలు

పురందరుడనే ఒక వైశ్యకుమారుడు ధనానికి సద్వినియోగం దానమేనని, ధనము పంచివెసి, దరిద్రుడై, తీర్థ యాత్రలకు బయలుదేరతాడు "సాల రసాల సాల తమాల . పనస వని కృతార్థమును భాస్వదహోబల పుణ్యతీర్థమున్" (2-208). సంచరిస్తాడు "వనాశని గని తజ్జల మజ్జనాపకల్మష" డౌతాడు (2-209) సుజనావన దెవ శిఖావతంసునిం బ్రాంచిత ఘోర వీర రసభావుని శ్రీనరసింహ

దేవుని (2-210) దర్శించి శ్రీమదహోబలేశ్వరుడు .. భక్తలోకచింతామణి. నిశ్రాశ్రిత లోకము గాచుఁ గావ్రతన్ (2-12) అని కీర్తిస్తాడు

పురందరుడు ముందుకు సాగి "పుణ్యసిద్ధంబగు సిద్ధవట్టణ స్థానంబునకుఁ జని (2-213) మున్నొనరించిన పాపములన్నియుఁ వెసఁ వఱుతగలయు నవగాహన సంపన్నులకని, సద్భక్తిని పెన్న నదిం తీర్థ" మాడతాడు (2-214). సిద్ధేశ్వరునగరు సొచ్చి స్వామిని ప్రస్తుతిస్తాడు "(2-216) ఆ దేవాలయ శిఖరంపై ఉండే వృషభ కేతనం చుట్టూ భ్రమర రూపాలై తిరిగె దివ్యమునుల్ని, స్వామియొక్క "అక్షీణ పరమ తపోధన ప్రత్యక్ష పరంజ్యోతిస్స్వరూపంబును సద్భూతాయత్తచిత్తుండయి" అవలోకిస్తాడు

తర్వాత "దక్షిణ కైలాసంబనం బ్రసిద్ధి వహించిన కాళహస్తి మహాస్థానంబు ప్రనసంత భోగి కటకోత్కటకంబగు వెంకటాచలంబును" .. దర్శిస్తాడు (2-217)

శ్రీశైలం చంద్రగుప్తుడు మోక్షం కోసం "సంసారాంభోనిధి యాన పాత్ర మగు శ్రీశైలంబు మీదం దపంబారంభింపఁదలచి" (1-194) కొడుకుల పిల్చి శ్రీశైల మాహాత్మ్యాన్ని బోధిస్తాడు (1-195 నుండి 202 వరకు)

కాశీ, గయా క్షేత్రాలలో వేయి యుగాలు, కేదారంలో ఇరవై యుగాలు అధిక నిష్ఠతో ఉంటే వచ్చే ఫలం ఒక్క దినం శ్రీనగమున నున్నఁ గలుగుతుంది (1-195) శ్రీశైలాన్ని మనసులో తలుస్తూనే జాతిస్మరత్వం సంభవిస్తుంది. శిఖరాన్ని వీక్షించాలను కుంటేనే ఏడుజన్మల పాపాలు నాశనమౌతాయి ఆక్షేత్రం త్రోవలో రెండు మూడడు గులు నడిస్తే సకల జన్మల దోషాలు సమసిపోతాయి ఆ గిరికి వెళితే సాయుజ్యాన్నే పొందవచ్చు శ్రీగిరి కేగువాఁడు ధన్యుఁడగు శ్రీగిరికి వెళ్ళలేని వాఁడు పిచ్చుక కుంటే (1-96) ఆపర్వత శిఖర వీక్షణంతో భవబంధాలు తెగి పోతాయి ఆ కొండ ఇల్లుగా సదా శివపార్వతులుంటారు ఆ కొండమీద ఉండే తీర్థాలన్నీ పాతాళగంగలే బ్రహ్మాదిదేవతలు ఆ కొండపై చెంచులై ఉంటారు అట్టి శ్రీపర్వతము జూచినట్టివారు గట్టిపుణ్యంబు చేసిన యట్టివారు . (1-197) ఏపాపాలు చేసినా 'శ్రీపర్వత దర్శనం' చేస్తే నశిస్తాయి (1-198).

శ్రీశైలమాహాత్మ్యాన్ని అతివేలంగా కొనియాడే కవి భావాల్ని ఈ క్రింది పద్యాల్లో తిలకించండి

" శిల లఖిలంబు లింగములు, చెట్లు సమస్త ఋుగల్ప భూజముల్
జలములు దేవతానది జలంబులు, మానవులెల్ల సంయముల్
పలికిన పల్కులెల్లను జపంబు చరించుట సత్ప్రదక్షిణం
బులు, నిదురల్ సమాధి, తలపోయఁగ శ్రీగిరి మీఁదఁ జోద్యముల్ "
( 1-199 )

" వారణసీ పురంబున వారణ మెను దొజంగనేల కే
దార జలంబు లర్థి మెయిఁదాి వి శరీరము కోరవోవఁగా
నారడి వొందనేల ? యొక యప్పుడు జన్మము లేక యుంటకై
యారయ శ్రీనగంబు శిఖరాగ్రము చూచినఁజాలు నెమ్మదిన్" (1-200)

క్రతు విధ్వంసం, బ్రహ్మహత్య, ధర్మ ద్వేషం, సోదరీ సుత సంహారం, మొదలగు పాపాలన్నిటినీ చంద్రుడు పోగొట్టుకొని పుణ్యోదయు డవడానికి కారణం అతనికి శ్రీపర్వతం నివాసం కావడం వల్లనే (1-201) కాబట్టి నేను "శ్రీనగము నకు వెళ్తాను" అంటాడు తన కుమారులు భట్టి, విక్రమార్క, భర్తృహరి, వరరుచు లతో, చంద్రగుప్తుడు (1-202)

పురందరుడు ఉజ్జయిని నుండి సకల తీర్థ సందర్శనకు బయలుదేరతాడు "దక్షిణదిశా భాగ భాగధేయంబులగు పుణ్యతీర్థంబులు నిరీక్షించు నపేక్షం దిరిగి శ్రీపర్వత దర్శనంబు సేయం బూని మహాయుగ సహస్రానశ్వరంబగు నేలేశ్వరంబను తదీయ పశ్చిమద్వారంబు చెంగట యోగిపుంగవ హృదయంగమంబగు నివృత్తి సంగ మంబునకుం జని (2-195) నివృత్తి సంగమెశ్వరు నిఖిలేశ్వరుం శంకరుం త్రికా లము బూజ యొనర్చి" (2-196) ముందుకు సాగి శ్రీశైలాన్ని దర్శిస్తాడు

"శ్రీశైలము దగ్గరా మరణ సంక్షయకా ఫలౌషధియలతా జాలము .. సాను సంగత లసన్మణిదీప్త దిగంతరాళమున్ కని ..." (2-198) ఆ కొండనెక్కి శశి శేఖర దర్శన పూర్వకముగా నపూర్వ లక్ష్మీ సుందర మణికందర మధ్యభాగస్థిత మహాదెప మందిర ముఖమండపంబులఁ బ్రవేశించి (2-199) మల్లికార్జున సమాహ్వాయ జృంభిత సిద్ధలింగమున్ (2-200) దర్శించి కృష్ణవేణి విహార పాలితాఖిల జగ తీశ (2-202) శ్రీశైల గుహావిహార" (2-203) అని స్తుతిస్తాడు అటు తర్వాత తోట వీరేశ్వర దెవాలయంబునకుం జని (2-206) అష్టోత్తర శతంగా సాష్టాంగ నమ స్కారం చెసి ప్రశంసిస్తాడు (2-208)

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

" హరి హర సంగమంబుగ మహాద్భుత భంగి జనించి చేతులం
బరశు పినాక ఖడ్గ ఫణి పాశ కపాల వర త్రిశూలముల్
కర మనురక్తిఁ బూని నుతి గాంచిన వెల్లముకొండ భైరవుండు "

కృతిభర్త సిద్ధన మంత్రిని "ఉరు మహిమాఢ్యునిగాఁ జేయు వరసని కవి ప్రార్థన కృతి భర్త శ్రీమద్వెల్లముకొండ భైరవ కృపాప్రాప్తి సిత సామ్రాజ్యలక్ష్మీ మాధుర్యుండు (2-260)

సిద్ధన మంత్రి ప్రపితామహుడు సూరన వేద శాస్త్ర పురాణ విజ్ఞానంతో ఎద్దనపూడి రాజేంద్ర చోడ క్షమా రమణుచే సగ్రహారములు పడసినవాడు (1-33) జక్కన తాత పెద్దయ నెల్లూరి తిరుకాళ మనుజ విభుని సాహిత్యసరణి మెప్పించినవాడు [1-29] వెన్నెలగంటి సూర్యుడు, రెడ్డి మ సరసాలసవిత మహాగ్రహారముల్ గొన్న కవీంద్ర కుంజరుడు కృతిభర్త సిద్ధన్నకు పెత్తండ్రి

ఎద్దనపూడి నర్సారావుపేట తాలూకా, వెల్లంకొండ సత్తెనపల్లి తాలూకా గుంటూరు జిల్లాలో ఉన్నాయి

5 5 అనంతామాత్యుడు భోజరాజీయం, రసాభరణం, ఛందోదర్పణం అనేవి అనంతామాత్యుని రచనలు భోజరాజీయం కథాకావ్యం అహోబల నృసింహుని కంకితం ఈ కావ్యంలో 'తెలుగునాడు' ప్రసక్తి ఎలావుందో పరిశీలిద్దాం

5 5 1 ఆంధ్ర/ఆంధ్రక్షితి, అహోబలం / నిగమగిరి, ఫణిద్వేషదద్రి / పెనుమగూరు, శ్రీకాకుళం అనే స్థలాలు, కృష్ణవేణా, గౌతమి, భీమరథి, మలాపహారిణి అనే నదులు ఈ కావ్యంలో ప్రసక్తాలు.

5 5 1 1 ఆంధ్ర ఆంధ్రక్షితి : శ్రీకాకుళంలో ఉండే విష్ణువు ఆంధ్ర వల్లభుడు శ్రీకాకుళం ప్రత్యక్ష పరమపదం

" నెమ్మిఁ బ్రత్యక్ష పరమ పదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్ర వల్లభ హరిసేవ సలుపుచుండు
. . సుమ్మడి తిక్క విభుఁడు" (1-40)

నందన్నపతి తన కుమారుల్తో నేనెందరో రాజుల్ని జయించినాను నాకు 'సంపాతి' ఒక లెక్కా ? అంటాడు ఈ సందర్భంలో ఆంధ్రక్షితి ప్రసక్తి ఉంది సన్నెదుర్కొని

మున్ను వెన్నిచ్చి పాటెన కుకుర భూపతి కంటె . . నంధ్రక్షితీశ్వరునికంటె ... సంపాతి ఎంతవాడు? (4-34) అనేవి ఆ మాటలు

5 5 5 2 అహోబలక్షేత్రం. నృసింహ స్వామిని కవి అహోబలాధినాథుడు (1-68) అహోబలాధీశుడు (1-84) అహోబలనాథుడు (6-263), అహోబల తీర్థనాయకుడు (1-66) అని ప్రస్తుతించినాడు

వేదాలు స్వామి పాదాలవద్ద తుమ్మెదల్లా స్తోత్రిస్తుంటాయి బ్రహ్మ స్వామి నాభి సరసునుండి నాల్గువేదాలు చదువుతుంటాడు శేషుడు చెవివద్ద ఆప్తవర్గంపెలె పరమార్థాలు పలుకుతుంటాడు ఇంద్రాది దేవతలు ఆ దేవునికి కైవారం చేస్తుంటారు అతడు దేవదేవుడు అఖిలాంత నాయకుడు, ఆదివిభుడు, పరమ పురుషుడు, శరణాగత త్రాణపరుడు అని కవి అహోబలాధినాథుని స్తుతించినాడు (1-68)

చరాచరాలన్నిటికీ కైవల్యాన్నిచ్చే ఈ మేటితీర్థం జ్ఞానుల కెలాంటి శాశ్వతానందాన్నిస్తుందో చెప్పాల్సిన పనిలేదు ఇక ఆ క్షేత్ర దైవమహిమ వర్ణనాతీతం అంటున్నాడు కవి ఈ పద్యంలో —

" మశక పిపీలికా మక్షికా ప్రభృతులై చరియించు సజ్ఞాన జంతువులకుఁ
దృణ గుల్మ భూరుహ దృషదాధికంబులై చను జడ స్థావర జాతమునకు
నపవర్గ సుఖసిద్ధి యొసఁగెడి ధనమన్నఁ దెలివియు భక్తియుఁ గలుగునట్టి
జనులకు గమనాగమన శూన్యయగు సౌఖ్యగతి ప్రాతియిదియో యగణ్యపుణ్య"

తీర్థసేవన వినుతింపఁజెంపారు నత్యుత్తమ మయి మహి నహోబలాఖ్య
తీర్థమిట్టి మేటి తీర్థమునకుఁ గర్తయగు నృసింహు మహిమ యడుగనేల?
(1-77) ఇది కవి చేసిన అహోబల ప్రశంస

5 5 1 3 పెరుమగూరు అనంతామాత్యుడు కృత్యవతారికలో తాను పెరుమగూరు నివాసినని పేర్కొన్నాడు ఆ గ్రామం కృష్ణవేణి, మలాపహారిణి, భీమరథి కలిసే తావున అంతర్వేది అన్నాడు

" విలసితంబగు కృష్ణవేణా మలాపహారిణి భీమరథి నా ధరిత్రియందుఁ
దనరు నదిత్రయాంతర్వేది యగు పావన క్షేత్రమున శోభనముల కెల్ల
ధర నివాసంబగు పెరుమగూరి పురంబునందు విద్వజ్జనానందమైన
జీవన స్థితిచెతఁ జెన్నొందు వంశ కర్తృత్వ సంపత్తిఁ బ్రభుత్వమొంది

నెమ్మిఁ బ్రత్యక్ష పరమ పదమ్మనంగ నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన
యంధ్రవల్లభ హరిసేవ నలరుచుండు . తిక్కపెఘఁడు " (1-40)

కృష్ణవేణ కృష్ణానది మహాపహారి నేటి గన్నవరం, బెజవాడ, గుడివాడ తాలూకాలలో ప్రవహించె పుల్లేరు కావచ్చు 41 భీమరథి కృష్ణాజిల్లాలోని భీమరథి 42 పెరుమగూరు బెజవాడ తాలూకాలోని పనకమూరు గ్రామం 43 పై పద్యంలో శ్రీకాకుళంలో ఆంధ్రమహావిష్ణువున్నట్లు కూడా చెప్పబడింది

5 5 1 4 గౌతమి నది గౌతమి లేక గోదావరీ నది ప్రసక్తి కావ్యంలో మూడు కథల్లో ఉంది

మహుడు అనే కాంభోజదేశ రాజుకు సర్పటి అనే సిద్ధుని శాపంవల్ల కుష్ఠ వ్యాధి సంక్రమిస్తుంది ఎందుకె బ్రతుకు ? "గౌతమికేగి యందులో బ్రుక్కక మెను వైతు" అనుకుంటాడు (1-95) గౌతమి ఒక ముని కన్యగా సాక్షాత్కరించి హేమ కూటశైలం మీద ఉండే దత్తాత్రేయుడు నిన్ను వ్యాధి విముక్తిన్ని చేస్తాడు నీకు ఒక మంత్రం ఉపదేశిస్తాడు "గౌతమియందు దర్శన స్పర్శనాదుల వర్తింపవలయు"ను అని చెప్పి ఒప్పించి వెనక్కి పంపిస్తుంది (1-107).

వసిష్ఠముని ప్రతిదినం అగ్నిహోత్ర దేవార్చణం చేసి అరుంధతి చేత "గౌతమి యవ్వలం దపము గైకొని చేయుచున్న కుంభసంజాతునకు" (3-11) భోజనం పంపిస్తుంటాడు గౌతమికి వరద వస్తుంది "గంగా భోగవతీ తరంగిణుల కైక్యప్రీతి గావించ సబ్బంగిం బొంగుచు . పాఱు నగ్గౌతమిన్" చూసి తిరిగి వస్తుంది (3-13). వసిష్ఠుడు చెప్పినట్లు "సద్బ్రహ్మచారి వనుపున" వెళ్తున్నాను దారివ్వు అంటుంది ఏఱు ఇంకి దారి యిస్తుంది అగస్త్యునితో నేను తిరిగి ఎలా వెళ్ళేది తండ్రీ "నేడు గౌతమి దర్పం బున మిన్ను ముట్టి పాఱెక్" అంటుంది "నిరాహారున కోదనం బిడుటకై చని క్రమ్మఱ యేఁగఁబోయెదన్" అని అగస్త్యుడు చెప్పినట్లు గౌతమికిం జని (3-24) చెపుతుంది గౌతమీ మహానది తెరువిస్తుంది (3-25

గౌతమీ సింధు సమీపంబున నొక్కపసులమంద ఉంటుంది (6-271) పాలకడవ ఒకటి పగిలి ఏటివెంట పారియపు తడుపుతుంది ఎండ్రి పెట్టిన పిల్లలు, ఎండ్రి అవానే బతికి ఉంటాయి అదృష్టవశాత్తు పాలతో తడిసిన మన్ను పుట్టి నప్పటినుంచి తింటున్న ఎండ్రి పిల్ల ఒకనాడు రుచిలేని మట్టి తిని అమ్మా ఇదేమి ?

అంటుంది తన పూర్వజన్మను గురించి చెప్తూ తల్లి ఎంగ్రి ఏనా గౌతమిలో పండు నెడన్ నదిలో మునిగే బ్రాహ్మల పలుకుల్లో గంగామహిమను విన్నాను అంటుంది పిల్ల తానూ గంగకు వెళ్తానని పట్టుపడుతుంది హరి దివసంబున నీగౌతమిఁ గ్రుంకువారికి కాశిలో మరణించినవారికి పర్గ్గతి వస్తుంది (6-300) "ఈగౌతమి మును పుట్టెను భాగీరథి పిదపఁబుట్టె, ఫల మొసఁగెడిచో నీ గౌతమియే యెక్కుడు భాగీరథికంటె నంచురి ప్రాజ్ఞులు పుత్రా" (6-30) అట్టి ఘనపుణ్య వాహిని మన నట్టింటనె యున్న యది" (6-302) ఇతర నదులతో పనేమి అంటుంది పిల్ల వినదు తల్లికి, తమ్ములకు వీడ్కోలు చెప్పి గౌతమికిఁ బ్రశస్తాంజలియై (6-309) ఆ నది వెడలి ... (6-310) గంగికోసం వెళ్తా మధ్యలో ఒక పక్షి వాత బడుతుంది

5 5 1 5 గరుడాద్రి – వేదాద్రి అహోబలం పర్వతానికి గరుడాద్రి, వెదాద్రి అని రెండు శిఖరాలు వాటి ప్రసక్తి ఈ పద్య పాదాలలో ఉంది

నిగమగిరివిహార శ్రీనరసింహా (3-1) ప్రసన్న నృసింహ వపుర్విలాస వెద నగ వాస (3-264)

సముద్యద్గగాధీశ శైలాగ్రధామా (5-377) ఫణిద్విషదద్రి నివాస భాసురా (6-413)

ఆ స్వామిని కవి ఆశ్వాసాద్యంతాలలో స్తుతించినాడు

5 5 1 6 తమ శాసనాలు, లేదా కావ్యాలు ఆచంద్రతారార్కం నిలిచి ఉండాలని ఆ శాసనకర్తలు లేదా కావ్యకర్తలు ఆశించడం సహజమే అనంతామాత్యుడు తన 'నృసింహ భక్తత్వాన్ని' ఈ సందర్భానికి వినియోగించుకోవడం విశేషం అహోబలం, గరుడాద్రి, భవనాశని, నృసింహస్వామి ఉన్నన్నాళ్ళు తన కావ్యం భూమిమీద నిలిచి ఉంటుందని ఈ సీస పద్యంలో కవి ఆశంస చేసినాడు

" అఖిల జగత్సేవ్యమై భూమిపై నహోబలము దా నెందాక వెలయుచుండు
నా తీర్థమందుఁ బ్రఖ్యాతమై భవనాశని నది యెందాక నెగడుచుండుఁ
నా మహానది పొంత నత్యంత పూజ్యమై గరుడాద్రి యెందాకఁ గదలకుండు
నయ్యద్రి శిఖరంబునందు ను నెందాక శ్రీనృసింహస్వామి స్థిరతనుండు
నన్నుడీయ కృతియు నందాక సంతత శ్రావ్యమై సమస్త సభలయందు
విస్తరిల్లుఁగాత వివిధ కథా సూత్న రత్నభూషణాభిరామమగుచు " (7-257)

కవి ఆశంస నెరవేరాలనే తెలుగువారందరూ కోరుకుంటారు

5 6 గౌరన గౌరన ద్విపద కావ్యాలు రెండు – హరిశ్చంద్రోపాఖ్యానం, నవనాధ చరిత్ర

5 6 1 హరిశ్చంద్రోపాఖ్యానంలో శ్రీగిరి ప్రసక్తి ఉంది, కవి మల్లికార్జున దేవుని భ్రమరాంబికను కొల్చే సందర్భంలో

"శ్రీగిరిజాధీప శ్రీగిరినాధు" (ప్రథమభాగం మొదటిపాదం)

... భ్రమరాంబికా మహాశక్తిఁ గొలిచి, ( 17 వ పాదం) అనినాడు కావ్యభాగంలో మరెచ్చటా తెలుగునాడు ప్రసక్తి రాలేదు

5 6 2 నవనాధ చరిత్ర ఈ కావ్యంలో అంధ్రదేశం / ఆంధ్రదేశం, ఏలేశ్వరం, కృష్ణవేణి, శ్రీశైలం ల ప్రస్తావన ఉంది

5 6 2 1 నాగార్జునుడు ఒక శిష్యుని రసపిద్ధునిజేసి ఆంధ్రదేశానికి పంపి తాను ప్రాలేయగిరికి తిరిగి వెళ్తాడు

" మసలక దేహ మెమరక సిద్ధుంకఁ
దిరుగఁ బొమ్మని యంధ్రదేశంబు కతనఁ
బరఁగ విద్యాలిపి ... " (పు 232)

5 6 2 2 సిద్ధనాగార్జునుడు దర్శించిన స్థలాలలో ఏలేశ్వరం ఒకటి పూర్వం కుశధ్వజుని కుమార్తె తపస్సుచేసి శివుని మెప్పించి "తన పేరు తత్పర్వతస్థలిఁ గీర్తి లెనయ గల్పించిన యెలేశ్వరంబు"ను దర్శించినాడు ఆ క్షేత్రం వివిధ వృక్షాలతో లతలతో "ముని ముఖ్యుల కెల్ల కాలంబు వసియింపఁగా నిరవైన కూలంబులను "కలిగి ఉంది (పు 222)

5 6 2 3 అతడు కృష్ణవేణిని, నవమహాదుర్గాలను, నవ గుండాలను దర్శిస్తాడు... "లోపల పాతకంబులఁ దన్నుఁ దలచిన మాత్రానఁ దలగింపఁజాలి వెలసినదే కృష్ణవేణి దర్శించి వొలుపారు తత్తీరముల నతి కెక్కు నవమహాదుర్గాల, నవగుండములను, (పు 233) నవభైరవుల నవనందులఁ జూచి, యవిరళానందుఁడై యా పుణ్యతటిని నవగాహ మొనరించి..." (పు 234) నాడు.

5 6 2 4 గౌరన శ్రీశైలాన్ని శ్రీగిరి, శ్రీనగరం, శ్రీపర్వతం, అని పేర్కొన్నాడు శ్రీపర్వత వర్ణన అతి వెలంగా చేసినాడు శ్రీగిరి పవిత్రత,

పుణ్యాశ్రమాలు, వింత అనుభూతులనిచ్చే అద్భుతదృశ్యాలు, ప్రకృతి రామణీయకత కనులకు కట్టేట్లు వర్ణించి ధన్యుడైనాడు కవి

సిద్ధనాగార్జునుడు శ్రీశైలానికి వస్తాడు అతడు దర్శించిన శ్రీశైల స్వరూపం ఈ ద్విపదలలో వర్ణితం (పు 217-19)

"శ్రీమల్లికార్జున శ్రీమహాదేవు.. జూచు కౌతుకము మనము నిండార ..... శ్రీనగమున కేతెంచి విన(జూడ నరుదార వింత( దా( జూచె" నట (పు 216) భిక్షాందేహి అంటే పరిపక్వఫలాల్ని మునిపుత్రులకు కురిసే పాదపములగుంపులున్నాయి నీడలు తిరుగని తరుల చివుళ్ళే సుర సిద్ధ మిథునాలకు రతికేళికలకు తల్పాలు శివార్చనలాచరించు . వృద్ధమునులను.. ఫల దళ పుష్పము లంబులు .. ఒసగు కోతులు ... బ్రహ్మమంత్రాన్ని జపించే బాలకీరములు, పంచాక్షరి పఠించే పరభృతంబులు, పథ పరిశ్రాంత మానసులకు పండ్లు ఇచ్చే విహగ సంతతులు, పరమేశ్వర ధ్యానంలో ఒళ్ళు మరచి ఉండే మునుల సుఖావహంగా రాచుకొనె హరిణపోతములు, మునికుమారకులు చదువు మనోహర సామగానముల విని 'నటియించు పన్నగంబులు, ప్రాణాయామం చేసే మునుల చెమటను ఆర్చే ఏనుగులు, ఎండలో ఎకిచే యతులకు తమ పింఛాలతో నీడ గల్పిస్తూ సింగి నెగిరి వచ్చే నెమళ్లు, శివపరాయణులు కూర్చునేందుకు ఒరగగద్దియలుగా ఉండే బెబ్బులులు, శ్రీశైల నాయక సేవానురక్తులౌ శివలోక మైలార సోపాన భంగంబులై నిజప్రభ వెల్ల( గడల( దొంగలించెడు సముత్తుంగ శృంగములతో ఒప్పారి ఉంది శ్రీశైలం (పు 217)

శ్రీశైల పావిత్ర్యం క్రింది ద్విపదల్లో కీర్తింపబడింది

" దెవాలయంబుల దివ్యలింగముల
జలతృణ గ్రాస కాష్ఠ ప్రతానముల
బలసిన జ్యోతుల( బరుసవేదులను
విమల చింతామణి వేదికా స్థలుల
రమణీయమగు సిద్ధరస కూపములను
విలసిల్లి నిజ శృంగ వీక్షణ మాత్ర
నలఘు పాపంబుల నప్పుడ(గడచి
క్రమ్మర మాతృగర్భములను రాక
నెమ్మది నుండెడు నెలవుల నిలువు
నతి మహోన్నతి నమరు శ్రీనగము (పు 218)

శ్రీశైల మల్లికార్జున నగర భూనుత ప్రాసాద వర్ణన భక్తజనులకు శివప్రసాదం :

ధవళగోపుర చతుర్ద్వార బంధురము

.. . ..

తరళిత వృషభకేతన భాసురమును

మణిరంగ వల్లికా మంటపోజ్జ్వలము

.. ... ...

నైన శ్రీ మహా మల్లికార్జున నగర

భూనుత ప్రాసాదము..." (పు 219) మన కళ్ళ ఎదుట సాక్షాత్కరిస్తుంది

"నాగార్జునుఁడు పాపవినాశన ప్రఖ్యాతిఁదనరు

నాపుణ్యతీర్థంబు" లాడినాడు (పు 219)

".. నిక్కి మాచిన సత్యలోకమున కనువొంద నెగయుచు నచలశృంగములు" ఉన్నాయి విదిత సాధకులకు విస్మయం పొడమ నడపాడు తీగెలు, నవ్వెడు తరులు, నుడివెడు శిలలును" కనిపిస్తాయి "త్రావిన మాత్రి నంతఃకరములఁబావనంబుగఁ జేయఁ బరగు మడుగులు.. సాధకతతి .. యడిగిన వస్తువులవి. త్రవ్వి తండము లుగా యిచ్చి నవ్వసుధాధరోదార కూటములుఁ గలిగి త్రిలోక విఖ్యాతమై మోక్ష ఫలదమై మెఱయు శ్రీపర్వతాగ్రంబుఁ గనుగొనినాడు" సిద్ధనాగార్జునుడు (పు 221)

సిద్ధ నాగార్జునుడు శ్రీమల్లికార్జున శివలింగ దివ్యధామమై పురుషార్థ దాయకం బైన శ్రీనగంబున కేగినాడు (పు. 232) శ్రీశైలమంతయును బదియాఱు వన్నెల బంగారు చేయ మదిఁ బూనినాడు మాయా విప్రునితో 'శ్రీనగము వితత హేమంబుఁ గావింపబూనితిని' అన్నాడు (పు 243). మాయావిప్రుడు మరెవరోకాదు సాక్షాత్తు విష్ణువే చక్రింతో సిద్ధ నాగార్జునుని సంహరించినాడు కాంచనం బిప్పుడి రితి శ్రీగిరి యెల్ల దానైన తీసుకొని అందరూ తమకు తామే రాజులై అల్లకల్లోలం చెస్తారు భూమిలో న్యాయం తప్పుతుంది అందుకు చంపినాను అంటాడు విష్ణువు

5 6 2 5 సిద్ధ నాగార్జునుని మాటమీద ఒక రాజు "కృష్ణవెణి మహానది దాటి వీఁక నేలేశ్వర విభునుత్తరమున నాయితంబై మించు నశ్వమేధాద్రి వాయవ్య మున" ఉండే రాజుపైకి దండెత్తి వెళ్లాడు

గౌరన కావ్యాదిలో "మల్లికార్జున మహాదేవుని (పు 1) శ్రీ పర్వతైక నితంబ బుధజనావన పరిస్ఫుట కృపాలంబ భ్రమరాంబను" (పు 2) స్తుతిస్తాడు శాంత భిక్షావృత్తి చెప్పగా "నవనాథ చరితంబు .. శ్రీశైలపతికి . శ్రీగిరి భర్తపేర .. " అంకితమిస్తాడు

నవనాథ చరిత్రలో శ్రీశైల వర్ణన విపులంగా ఉంది పాల్కురికి సోమనవలె భావోద్విగ్నత, భక్త్యావేశం పలికించిన అక్షర ప్రవాహమె నవనాథ చరిత్ర

5 7 దగ్గుబల్లి దుగ్గన కవి సార్వభౌముడైన "శ్రీనాథ సుకవి కూరిమి సేయు మరది దగ్గుబల్లి తిప్పనార్యునకు తనూజుఁడు" దుగ్గయ ఇతని కావ్యం 'నాసికేతోపాఖ్యానం'

5 7 1 నాసికేతోపాఖ్యాన కావ్యంలో మనం సందర్శించగల తెలుగునాడుకు సంబంధించిన స్థలాలు ఆంధ్ర, కళింగ, చెందలూరు, చెదలువాడ, జయవాడ/బెజవాడ తెంకణం, దగ్గుబల్లి అనేవి

రఘుమహారాజు కుమార్తె చంద్రవతి వివాహానికి "పాండ్య కేకయ చోళ . కర్ణాట .. తెంకణాంధ్ర కళింగాది దేశములను" (2-169) రాజప్రేరిత దూతలేగి ఆహ్వానిస్తారు

అనంతామాత్యుని గంగన ఈ కృతికి భర్త. అతని వంశ వర్ణనలో చెందలూరు ప్రస్తావన ఉంది "శ్రీలు సింగార విలసిల్లెఁ జెందలూరి యనంతనామాత్య వరుఁడు ... " (1-126) "అసమశరమూర్తి చెందలూరయితరాజు" (1-27)

చెందలూరు అద్దంకి తాలూకా గుంటూరు జిల్లాలో ఉంది[44] క్రీ శ 426 సం॥లోనే ఒక శాసనంలో 'చెన్దలూరు' ప్రసక్తి ఉంది[45]

అనంతామాత్యుని గంగన విన్నవించిన మాధవవర్మ వంశ వర్ధనుడైన ఒసవ పార్థివునికి కృపాపాత్రుడు మాధవవర్మ బెజవాడ దుర్గవాస సైన్యాన్ని పొంది, రాజులను జయించినాడు పేద బాలుని చంపిన కొడుకుకే మరణశిక్ష విధించిన ధర్మప్రభువాతడు దేవతలు మెచ్చి విజయవాడలో కనకవర్షం కురిపించినారు ఆ విషయం ఈ పద్యంలో పలికించింది

"చతురంగ బలముల జయవాడ దుర్గాంబ వర మొసఁబడసి దుర్వారకేళి
జగతిస్థలంబెల్ల సాధించి జయశాసనములు దిగ్దంతి దంతముల సలిపి

వేదబాహుసహస్రగా విప్రియసుత మోహంబు పట్టక బెజవాడ హాటి గెలిపి
కలయంగఁ బురమున గాంచన వర్షంబు గురియించి దేవతాకోటి పొగడ
వసుధ నెగడిన మాధవ వర్మ వంశ
వర్ధనుండగు తమ్మ భూపసుతు బసవ
పార్థివున కార్యుండై క బాహాత్రిశయుడు
ఘనత మెఱసె ననంతయ గంగభూడు" (1-71)

విజయవాడను జయవాడ / బెజవాడ అనే రెండు పేర్లు ఈపద్యంలో ప్రయోగింప బడినాయి క్రీ. శ. 13వ శ. లోని ఒక శాసనం ఇదే విషయాన్ని ధ్రువపరు స్తున్నది[46] దుర్గస పూర్వకపు స్తుతితో "బెజవాడ యెల్లయుగ శ్రేష్ఠుఁ గొలుతు" (1-5) అన్నాడు కృతి కర్త "ప్రతుల విహారదేశములు కవి సముహాత సత్కవితా గుణ ప్రసాదితములు దగ్గుబల్లి కవి తిప్పయ దుగ్గ గుప్త వద్యముల్" (1-15) అని మెచ్చుకొన్నాడు దగ్గుబల్లి తిప్పనార్యునకు ... (1-19) దగ్గుబల్లి తిప్పనార్య ప్రియతనూజ .. (ప్రథమాశ్వాసాంత గద్య) అని కవి పలుకులు చెదలువాడ నేటి ఒంగోలు జిల్లాలో ఉంది

5. 8 పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు శృంగార శాకుంతలము, జైమినీ భారతము కావ్యాలు పిల్లలమఱ్ఱి పినవీర భద్రుడు రచించినవి

5 8 1 1 శృంగార శాకుంతలంలో కవి సూచించిన తెలుగునాడుకు సంబంధించిన ప్రదేశనామాలు ఆంధ్ర ధరణీమండలి, పిల్లలమఱ్ఱి, ఎఱ్ఱగుంట, సోమరాజుపల్లి

5 8 1 2 సోమరాజుపల్లిని వర్ణించె సందర్భంలో కవి ఆంధ్రదేశ ప్రసక్తి తెచ్చినాడు "లవణాబ్ధి వెల హేలా కాంచియగు నంధ్ర ధరణీమండలికి" (1-32) అని కవి ప్రయోగం

పిల్లలమఱ్ఱి కవి ఇంటిపేరు పిల్లలమఱ్ఱి వీరయార్యుడు (1-19) పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన (ప్రథమాశ్వాసాంతగద్యం) అని కవి పలుకులు

5. 8 1 3 కృతికర్త చిల్లర వెన్నయామాత్యునికి ఎఱ్ఱగుంట భైరవ స్వామి సకలసంపద లిచ్చి రక్షించాలి అని కవి ఆకాంక్షిస్తున్నాడు (1-5) ఆ సందర్భంలో ఎఱ్ఱగుంటలో వెలసిన భైరవుని ఆకృతి ఈ సీసంలో మూర్తిత్వం దాలుస్తుంది

" పగడంపుఁ జిగురు జొంపము సొంపు పిహసింపు కడునొప్పుఁ గుఱుచ
కెంజడలవాఁడు

విదియ చందురుతోడ వీడుకోడాడెడు రమణీయ దంష్ట్రాంకురములవాఁడు
సీధు పాన క్రీడఁ జెంగల్వ పూఁజాయఁ దొంగిలించెడి కన్నుదోయివాఁడు
క్రొత్త నీలాల రంగునకు నించుక మించి మెఱుగారు నల్లని మేనివాఁడు
పృధివి కవతంసమణి యైన బిట్రగుంట ధానకంబుగ నవతారమైన వాఁడు
భైరవస్వామి సకలసంపదల నొసఁగి మనుచుఁ జిల్లర వెన్నయామాత్యవరుని"
(1-5)

కృతిభర్త పితామహుడు మేడన సోమరాజుపల్లికి అమాత్యుడు కృతి భర్త నివాసం కూడ అదే మేడన ఏలిన సోమరాజుపల్లి అమరావతిపురం మేడన బృహస్పతి. ఈ విషయాలు కవి పలుకుల్లో—

" భూపుత వైభవ స్ఫురణఁబొల్పు వహించిన సోమరాజు ప
ల్లీ నగరామరావతికి లేఖప మంత్రియుఁబొరె...మేడన" ( 1-31 )

5 8 1 4 ఆంధ్రభూమికి ముత్యాలజల్లి దాతలు దండిగా ఉండే కల్పవల్లి చతుష్షష్టి విద్యలకు ఘంటాపథం పంట రాజులకు పాలవెల్లి అరివీర భయంకర మైనది సోమరాజుపల్లి ఆ పల్లి వర్ణన క్రింది సీసపద్యంలో –

" లవణాబ్ధి వేల హేలా కాంచి యగు నంధ్ర ధరణి మండలికి ముత్యాలజల్లి
సంగ్రామ పార్ధ రాజన్య రాజ్యశ్రీకిఁబెంపు మీఱిన జగజంపు వెల్లి
దాతలు సముదంచిత ప్రసూనములుగాఁ గామితార్థము లిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గు విద్యలకు నపూర్వ ఘంటాపథం బైన పట్టన మతల్లి
పంట నృప కౌస్తుభములకుఁ బాలవెల్లి కదన జయలక్ష్మి తొలుచూలు
గన్నతల్లి
విపుల భుజగర్వ దర్పిత విమతరాజ రాజి హృద్భల్లి ధర సోమరాజుపల్లి"
( 1-32 )

పిల్లలమర్రి సూర్యాపేట తా నల్గొండ జిల్లాలో ఉంది కవి పూర్వీకులు ఆ గ్రామ నివాసులై ఉండవచ్చు సోమరాజుపల్లె నెల్లూరు మండలంలోని గ్రామం కావ్యం వ్రాసే కాలానికి కవి అక్కడే ఉండి ఉండవచ్చు 47

5 8 2 జైమినీభారతము జైమినీ భారతంలో అంధ్ర, కాళహస్తి, కొమ్మ, పాలదుర్గం, పెనుగొండ, శ్రీవేంకట/వేంకటాద్రి అనే స్థలాలు తెలుగునాడులోనివి

"... ప్రబంధం బంధురిభాషను జైమినీ భారతము సంద్య్వమేధ పర్వంబు"... (1-26) అని కవి ప్రయోగం ఇక్కడ తెలుగునాడు ప్రసక్తి భాషాపరంగా ఉంది

5 8 2 1 కృతి భర్త సాళువ నరసింహ రాయలు "పాంచాల. ద్రవిళ .. మాళవ .. ఆది రాజులు ఏటా ఇచ్చే "రత్నాంక మత్తాంబీ వేంకట, కాళహస్తి నగరి, కళ్యాణ సౌధాంచల ప్రాంచచ్చాసన సాశ్వాంకిత శిశ ప్రాలేయ రుఙ్మండలు" డు (5-238) సామంత రాజులిచ్చే కప్పాలతో దేవాలయాలకు కృతి భర్త దానధర్మాలు చేసేవాడని పద్యభావం

5 8 2 2 "భోనగిరి చెంబీ కొమ్మ ధారాపురీ పెనుగొండాద్యఖిలైక దుర్గ హరణ ప్రేంఖత్ప్రతాపోదయా (5-21) శ్రీవేంకటాద్రినాథ దయావర్ధితరాజ్యా... " (5-1) అన్నవి కవి స్తుతి వాక్యాలు.

తిగుళ భూములు తెంకలుగఁ జరించిన దొడ్డ
చెవుల హొతులనెల్లఁ జెండి వైచి
... ... ...
పంతెంచి చప్పగఁ బాల దుర్గము మెట్టి
... . .
పెనుగొండ కడ ప్రాలి పిక్కటిల్ల మెదరైన
ప్రతిపక్షులను హతాహతము చేసి
. సార్వభౌముని బిరుదైన సాళువంబు "

నృసింహ సార్వభౌముని పరాక్రమాన్ని సాళ్వ (డేగ) పక్షిగా పోల్చి, ఆ రాజు జయించిన రాజ్యాల్ని రూపకాలంకారంలో ఉటంకించినాడు కవి తిగుళభూమి అంటే కన్నడంలో తమిళదేశం అని అర్థం నృసింహుడు గెలిచినవాటిలో పాలదుర్గం, పెనుగొండ కూడ ఉన్నాయి బోనగిరి (భువనగిరి) నేటి నల్గొండ జిల్లాలో భువనగిరి తాలూకా కేంద్రం ఓరుగల్లు పతనానంతరం వెలమ ప్రభువుల పాలన క్రింద ఉంది సది నరసింహరాయలు కొమ్మదుర్గం, పాలమిగ్గాలను కూడ జయించినాడు

5 8 2 3 పిల్లలమఱ్ఱి సాధారణమైన మఱ్ఱి కాదట చంద్రమండలం దీని పుట్టిల్లు ప్రళయకాలంలో వెన్నుని శయ్యకు ఆకులిచ్చింది పితృదేవతలకు సత్రశాల అయింది శివునికి నిలువ నీడ అయింది అటువంటి పిల్లలమఱ్ఱి పేరుతొ ఉండే వంశం శారదాపీఠం ఆ వంశంలో పినవీరన వాక్య సరణి సరసుల చెవులకు పండుగ అట ఆ గ్రామానికి పేరునిచ్చిన పిల్లలమఱ్ఱిని కవి వర్ణించిన తీరు హృద్యంగమంగా ఉంది

"అమృతాంశు మండలం బాలవాలముఁగాగ మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగిరించె విలయ సింధుగత కైతవ డింబ శయనీయ వర పలాశములతోడ
చిత్రదేవతలకు సంచిత సత్త్రిశాలయై చెట్టు గట్టెప గయా క్షేత్రసీమ
సిలువనీడయ్యె నిందీవర ప్రియ కళా కోటీరునకు భోగికుండలునకు
మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు పేరు వదెఁగాదు శారదా పీఠకంబు"
వారి లోపలఁ వినవీరు వాక్య సరణి సరసులకు వెన్నెఁగర్ణ రసాయనంబు (1-22)

పిల్లలమఱ్ఱి కవి కృతులలో ఆంధ్రదేశ ప్రసక్తి అత్యల్పంగా ఉన్నా నేడు ప్రసిద్ధిలో లేని కొన్ని గ్రామాల వర్ణన కవికాలం నాటి వాటి వైభవాన్ని చాటుతుంది

5 9 వెన్నెలకంటి సూరన ఆంధ్ర శ్రీవిష్ణు పురాణము వెన్నెలగంటి సూరన కవి రచన

5 9 1 ఈ కావ్యంలో కనిపించే తెలుగునాడుకు సంబంధించిన స్థలాలు, నదులు ఇవి అల్లూరు, గుడ్లూరు,చంచుమల, చదలువాడ / చెదలువాడ, చెరుకూరు, తిరుమల, తెలగాణ, పంగులూరు, పాకనాడు, బసవాపురం, రావూరు/రావురు/రావూరు, వెన్నెలగంటి అనే స్థలాలు కృష్ణవేణి, గోదావరి, భీమరథి, మన్నేఱు అనే నదులు

5 9 1 1 ఈ కావ్యం రావూరి రాఘవరెడ్డికి అంకితం అతని రాజధాని గుడ్లూరు అతడు పంట రెడ్డి ఈ కావ్యంలో పేర్కొనబడిన గుడ్లూరు, ఎఱ్ఱా ప్రెగ్గడ నివాస స్థలమైన గుడ్లూరు రెండూ ఒకటే 48

5 9 1 2 గుడ్లూరులో వెలసి ఉన్న నీలకంఠేశ్వరుడు, కేశవస్వామి, పోలేరమ్మ, పాప వినాశన మహిమ గలిగిన మన్నేఱు, ఇవన్నీ దర్శన మిస్తాయి ఈ పుర వర్ణన చేసిన పద్యంలో పరికించండి

" గౌరీ సమేతుఁడై గరిమతో నేవీట నేపారు నీలకంఠేశ్వరుండు
వారాశి కన్యతో వర్తించు నే పీట గిరిభేదిసుతుఁడైన కేశవుండు
యోగినీ సహితయై యొప్పారు నే పీటఁ, బసిడి పోలేరమ్మ భవునికొమ్మ
పాప వినాశయై యొప్పారు నే పీట మన్నేఱు మిన్నేటి మారటనుచుఁ
గుంజరంబులు వెయి గొలువంగ నే వీటఁగొతగు చక్రవర్తి పుడమి యేలె
నట్టి రాజధానియై యొప్పు గుడ్లూరి నొనర నేలుచుండి యొక్కనాడు
(పీఠిక 16)

చంచుమల చూఱకాఱుండును.. అన్నది కృతి భర్తకు బిరుదు.

5 9 1 3 చదలువాడ/చెదలువాడ "అనుపమ నాదింత్మె సతియైన మహీసుతతోడఁబంక్తోదర విభుఁడై యయోధ్యఁబ్రమదంబు చెలంగఁ గనుందుకైవడిన్ వర విభవంబుతోఁ జెదలువాడ పురంబునఁనుండు రాఘవేశ్వరుఁడు" కృతినాథునికి ఇల వేలుపు (పీఠిక 5) అమ్మాంబ, రావూరి తమ్మయ బసవ భూపాలుడు "శ్రీరమ్యానఁ జెదలువాడ శ్రీరఘునాథున్ గోరి భజించి" (పీ 80) ముగ్గురు పుత్రులను పొందినారు కృతిభర్త "చదలువాడ రాఘవ విలసత్కారుణ్యలబ్ధ విగత స్తబ్ధుడు" (7-43)

ఈ వెన్నెలకంటి సూరన "వెన్నెలకంటి సూర్యుని మనుమనిఁ జెదలూరి యమర మంత్రి సత్పుత్రుని"డు (పీ 23)

"తిరుమల తాతయం మనుమఁడైన సింగరాచార్యుడు" బసవయ రాఘవుని గురువు (పీ 68)

5 9 1 4 రావూరి రాఘవరెడ్డి వంశీకులం కందరికి గురుడై రాజుల పూజ లింగమై పంగులూరి యన్నయ వెలసినాడు (పీ 49) "ఘోడియరాయ విఖ్యాతి" నొందినాడు "పంగలూరన్నయార్యుండు" (పీ 50)

కృతిభర్త కవిని పిలిపించి విష్ణుపురాణ కావ్యాన్ని తనకు అంకిత మిమ్మని గ్రంథాక్షతలు, కనక మణి భూషణాంబరాలు ఇచ్చి కర్పూర తాంబూలం సమర్పించి తమ తండ్రి పేర "బసవాపురంబను నగ్రహారం చేక భోగంబుగా నొసంగి గౌరవించి" నాడు (పీ 26)

రావూరు/ రావురు/ రావూరు అని కృతిభర్త ఇంటిపేరు "రావూరిపుర వరాధీశ్వరుండు బసవ భూపాల రాఘవుండు" (పీ 15) రావూరి బసవ భూపాలు రాఘవు వంశంబు" (పీ 26). రావూరు ఇంకా (పీ 34, 39, 40, 51 58, 62, 63, 7-1) లలో ప్రసక్తి వచ్చింది "రావురి తమ్మయ బసవక్ష్మావర సూనునకు .. రాఘవావనీ పతికి" (పీ 81) "రావురి బసవనితేంద్రుడు రాఘవ భూపా" (2-1) అని రావూరు రావురుగా గూడ పిలువబడింది

5 9 1 5 వెన్నెలకంటి. "వెన్నెలకంటి సూరన నామధేయ ప్రణీతంబైన ... శ్రీ విష్ణు పురాణంబునందు..." అని ఆశ్వాసాంత గద్యలు "వెన్నెలగంటి సూరయామాత్య కవిత్వ వైభవుఁడు కృతిభర్త" (8-480) "అల్లూరి యనమార విభుఁడు పాకనాట" విస్తరిల్లినాడు (పీ 53). తెలగాణ, పాకనాడు అనే ఆంధ్రదేశ విభాగాల ప్రసక్తి ఈ కావ్యంలో ఉంది

"తమ్మయి బసవ విభుఁడు .. తెలగాణ భూములఁ గల మన్నెవారిచే బల వంతమునను కప్పములు" తీసుకొన్నాడు (పీ 41) "పెమ్మమహానాయక రత్నంబు పాకనాటను" వెలసినాడు (పీ 54)

5 9 1 6 విష్ణుపురాణ కావ్యంలో కృష్ణవేణి, గోదావరి, భీమరథీ, నదుల ప్రసక్తి ఉంది "గోదావరీ, భీమరథీ, కృష్ణవేణ్యాదినదులు సహ్యంబునను" . (2-41)

పై విధంగా వెన్నెలగంటి సూరన గుడ్లూరు మొదలైన, ఊర్లను తెలంగాణ, పాకనాడు అనే తెలుగునాడు భాగాల్ని, కృష్ణ, గోదావరి, భీమరథి వంటి నదుల ప్రస్తావన తెచ్చినాడు

5 10 దూబగుంట నారాయణ కవి · 'పంచతంత్ర' కావ్యం దూబగుంట నారాయణకవి రచన తమ్మరాజు బసవరాజుకు ఈ కృతి అంకితం

5 10 1 ఈ కావ్యంలో దూబగుంటిపురం (1-14), వేంకటగిరి అనే స్థలనామాలు తెలుగునాడులోనివి

"సరసుని దూబగుంటిపుర శాసను నారయ నామధేయునిన్" (1-14) "వేంకటగిరీశ కరుణాంకురిత భాగ్యా" (5-72) అని కృతిభర్తకు కవి సంబోధన శ్రీవేంకటేశ్వర స్వామి కరుణతొ భాగ్యసంపన్నుడైన వాడని భావం

5 11 బైచరాజు వేంకటనాధుడు 'పంచతంత్ర' కావ్యం బైచరాజు వేంకటనాథుడు రచించినది ఈ కృతిలో తుంకట్ల, పొలేపల్లి అనేవి తెలుగునాడు లోని స్థలనామాలు వీరభద్రుడు "తుంకట్ల శ్రీపతిరాజపుత్రి" ని పెండ్లాడినాడు పోలేపల్లి అచ్చంపేట తాలూకా మహబూబ్‌నగర్ జిల్లాలో ఉంది పర్వత ప్రభుండు పొలెపలి తిమ్మవసుమతీపాల పుత్త్రిని" పరిణయమాడినాడు (1-33)

5 12 నంది మల్లయ్య - ఘంట సింగన ప్రబోధ చంద్రోదయం ఈ జంటకవుల రచన పెసరు వాయ వంశస్థుడైన గంగయ మంత్రి కృతిభర్త మాధవవర్మ సంతతివాడై ఉదయగిరిని ఏలుతుండిన బసవ భూపాలునికి అమాత్యుడు

5 12 1 ఈ కావ్యంలో ఉదయశైలం, పెసరువాయ అనే రెండు తెలుగు దేశ స్థలాల ప్రసక్తి ఉంది

క్రీ శ 1470లో పురుషోత్తమ గజపతికి గంగియమంత్రి, బసవ భూపాలుడు సహాయులై సాళ్వ నృసింహుని ఓడించి జీవగ్రాహంగా పట్టుకొన్నారు ఆ సంద ర్భాన్ని వర్ణించేది ఈ పద్యం

" యే రాజుదయశైల మెలమిని భేదించెఁ గపట హిత మదాంధకారమడఁగ
గణపతి సురధాణి గడీ దుర్గముల కెల్ల నే రాజు వజ్రింపు బోరు తల్పు
(అట్టి బసవ భూపాలుని మంత్రి) గంగయామాత్యవరుఁడు" (1-16)

5 12 1 1 కృతిభర్తను "పెసరువాయ వంశవార్ధి విసరుహారిమంజుభా (2-75) అని కవి ప్రస్తుతించినాడు

ఉదయగిరి ఒక గిరిదుర్గం నెల్లూరు మండలంలోని ఉదయగిరి తాలూకాకు కేంద్రం నెల్లూరు, కావలి, పొదిలి, కోవూరు, కందుకూరు, కనిగిరి, ఆత్మకూరు ప్రాంతాల మధ్య ఉండే భూభాగం ఉదయగిరి రాజ్యం పెసరవాయి గ్రామం కర్నూలు జిల్లా నంద్యాల తాలూకాలో ఉంది 50

5 13 కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశిక కొఱవి గోపరాజు రచించిన కావ్యం కథాసరిత్సాగరం ఈ కావ్యానికి మూలం51 ఈ గ్రంథంలో ప్రసక్తిలోకి వచ్చిన తెలుగునాడు సంబంధిత స్థలాలు, తీర్థాలు ఇవి అంధ్రమండలం, కళింగ, వెలనాడు, అహోబలం, ఇంద్రకీలం, ఏకశిలానగరం, కామవరం, కాళేశ్వరం, ధర్మవరం, పల్లికొండ, భవనగిరి, లేములవాడ, వేముగల్లు/త్యాగసముద్రం, శ్రీనగం సనదప్రోలు, సూరవరం, కృష్ణ, గౌతమి/గోదావరి, తుంగభద్ర, పాప హిమ నాశనం- అనేవి

5 1 3 1 కమలాకరుడు తన దేశ పర్యటనలో తెలుగునాడులోని విశేషాలు చెపుతూ "అంధ్రమండలంబును గోణదేశంబునం దెలుగుం కవితకు వ్రాలు వల్ల నను నియమంబులు చూచినాఁడను" అంటాడు (4-181) 'అంధ్ర కవితా పితామహా' దని కొఱవి సత్యనారనకు బిరుదుంది

5 13 1 1 పూర్వకవి స్తుతి వర్ణనలో వేములవాడ భీమన ప్రశంస ఒక పద్యంలో చేయబడింది వేములవాడ లేములవాడగా కూడా పిలువబడుతుండేది ఆ పద్యం తిలకించండి—

" లేముల వాడక వుచియై లేములవాడం జరించు లేమలవాడం
దా మెఱసిన భీముని నుత, భీముని బలభీము విమతభీముని దలతున్ "
(1-11)

కొఱవి వెన్నామాత్యుడు కవి పూర్వీకులలో ఏడవతరంవాడు అతడు "వెలనాటి పృథివీశ్వరుని రాజ్యభార ధుర్యుండై కళింగ నిరోధియై సనదప్రోలు నెలవుగా" ఉండిన

వాడు[52] (1-42) గోపరాజు పెదముత్తాత పెద్దిరాజు[53] పల్లికొండ జనపాలుడు మల్లన దేవ రాజుచె నెన్నఁగఁగుంచె లందలము నెల్లియుఁ గైకొని మంత్రియై ప్రతాపొన్నతి కెక్కినవాఁడు (1-46)

5 13 1 2 కసవరాజు గోపరాజు తండ్రి వేముగల్లు జన్మభూమిగా పెరిగినవాడు (1-55) వెముగల్లుకు త్యాగసముద్రం అనే పేరు వచ్చిందట అది శ్రీపురుషోత్తమాశ్రయం ఆ వర్ణన ఈ క్రింది పద్యంలో పరికించండి

" రాణామల్లన కీర్తి చంద్రికలు పర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వన దుర్గమై గుణ మణిస్తోమంబుల స్నిండి య
క్షీణ శ్రీపురుషోత్తమాశ్రయము నై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగసముద్ర నామము వహించె న్వేముగల్లీ మహిన్ " (1-56)

కవి యింటి పేరైన 'కొరవి' గ్రామం వరంగల్లు జిల్లాలో మానుకొండకు దగ్గరగా ఉంది

5 13 1 3 రాజు ధరించిన వస్త్రాలపేర్లు ౩ఆ. 188వ వచనంలో ఒక పెద్ద పట్టికలో ఇవ్వబడింది అందులో "కామవరంబులను, సూరవరంబులును" అనే వస్త్రాలు ఆ యా ఊర్లలో నేయబడేవి కావచ్చు

ఉజ్జయినిలో భట్టి ముఖ్యామాత్యుడు అతని చెలికాడు ఇంకొక మంత్రి ఉంటాడు ఆయన పుత్రుడు గ్రహిలుడు అగమ్మకాకిలా తిరిగె గ్రహిలున్ని తండ్రి నిందించగా కోపంతో ఇల్లు వదలి పెట్టి 'దక్షిణభూమికి' ఒక్కడే వెళ్ళిపోతాడు ( 8-139 )

5 13 1 4 భువనగిరి వద్ద ఒక అగ్రహారంలో పౌరాణికుడు తీర్థఫలాలు తెలుపుతూ శ్రీశైలం మహిమ చెప్తాడు గ్రహిలుడు ప్రభావితుడై శ్రీశైలం, అహోబలం, ధర్మపురి సందర్శిస్తాడు నాడు ప్రసిద్ధిలో నున్న ఓరుగల్లు పట్టణాన్నికూడా చూస్తాడు

శ్రీశైల ప్రసక్తి 8-141 నుండి 153 వ పద్యం వరకు చేయబడింది అందులో శ్రీశైల పర్వతం, హృద్భృంగపర్వతం, పాతాళగంగ, మల్లికాకుండం మొదలైన తీర్థాలు, స్వామిప్రాసాదం వర్ణితాలు

ఉపవాసాలు, దానధర్మాలు, జపాలు, వీటితో కృశించి చచ్చేకంటే 'కాశిలో పొంది విడిచి ముక్తి పొందవచ్చు'ను (8-141) శ్రీనగం చూస్తే చాలు ముక్తి వస్తుంది అని పౌరాణికుడు చెప్పిన మాటలు క్రింది పద్యంలో ఉన్నాయి

“ మెట్టక పెట్టక పట్టక, గట్టక, తీర్థముల ముక్తికిం జన రాదే
తొట్టును వొరయక మెయిమెయి, కట్టెదురన్ శ్రీనగంబు గానం
జాలున్” ( 8-142 )

కైలాసపర్వతానికి తన భక్తులు రావాలి అంటే దేహాలు త్యజించాలి కాబట్టి భక్తులు తను త్యాగం చేయకుండా అధిరోహించి ఉండే శ్రీనగంలో వచ్చి నెలకొని ఉన్నాడు పరమశివుడు శ్రీపర్వతంలో ఉండే సమస్తం శివాంశవ్యాప్తకాలే అంటున్నది ఈ పద్యం

“ శిలలెల్లను లింగంబులు సలిలంబులు దివ్యసింధు సారంబులు తి
గలు సంపెసలా ద్రుమములు మందారములు పలుకులు ముక్తిపదంబుల్”
( 8-144 )

ఇలా పౌరాణికుని వల్ల శ్రీశైల మహిమను విన్న గ్రహీతుడు “శ్రీపర్వతంబునకై పొవుట మేలటంచు ఆ దివ్యాన కేతనున్ హృదయఘంగాళ్ళన్ జగత్ప్రాతమైన నగం బల్లన దాటి” నాడు ( 8-145 ) గ్రహీతుడు పక్షుల విహారస్థానం “జనిత శ్రేయానుషంగన్” “క్షతగిరి కటకోత్సంగ బాతాళగంగన్” (8-146) “కని యందుఁ గల దక్షిణావర్తంబునఁ గృతస్నానుండై మల్లికాకుండంబును, ఘటికేశ్వరంబును, భ్రమరికాశ్రమంబును, గాలహ్రదంబును, దేవహ్రదంబును, సంధ్యామౌనంబును, జాతకేశ్వరంబును, నందిమండలంబును మున్నుగాఁ ద్రింశద్యోజనాయతంబును ద్రింశద్యోజనవిస్తీర్ణంబును నగుటం జేసి బహుకోటి తీర్థమయంబు నగు నా రమా క్షమాధరంబు మీదికిం జని కనకమయ ప్రాసాదంబు చొత్తెంచి” (8-147) “పూర్వార్జితమగు పుణ్యసముదయమునం . మల్లికార్జునదేవుని” సందర్శించినాడు (8-148) “శ్రీపర్వత విపిన కార్త చింతామణికిన్ అర్చనలిచ్చి” (8-149, 150 ), అంజలిఘటించి (8-151), ఓ స్వామీ, గంగా, పార్వతి, కుమారస్వామి వినాయకులతో బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలందరూ నీతో పాటు ఉండగా “కలిమికొండకు” నేతెంచి నిలిచితివి నిన్ను జూచి ధన్యుడనైనాను (8-152) అని ప్రార్థించినాడు గ్రహీతుడు

5 13 1 5 గ్రహిలుడు ముందుకు సాగి "వేద పురాణ వేద్యు.. అసురాంతకు శ్రీనరసింహమూర్తి నహోబలనాథుని" చూచి ప్రణమిల్లినాడు (8-154) అతడు కన్నడ భూమికి వెళ్ళి ఒక బ్రాహ్మణోత్తముని వద్ద శుక్రనీతిని బృహస్పతి నీతి శాస్త్రాన్ని పఠించినాడు (8-155) తర్వాత "కాకిత మూలశక్తి గనిగా నొనరించిన పైడిచట్టు నా నేకశిలాభిధానమున నెన్నిక కెక్కు ... సిరి పుట్టిన యింటికి నోరుగంటికిన్" వెళ్ళినాడు చందన గంధులు విటులు జాణలు, దాన వినోదులు ప్రభా సుందర మూర్తులు, కవులు, శూరులు పెద్దలు ఉల్లసిల్లగా దేవేంద్రుని వైభవం కలిగిన కాకతి భూపతి రాజ్యలక్ష్మి పెంపొందె ఆ నగరంలో మహోత్సవ లీలతో ఉండినాడు (8-158) ఆ పుర జనుల పరిచయంతో సకల కళాప్రవీణుడైనాడు

5 13 1 6 మళ్ళీ తీర్థయాత్రలకు బయలుదేరినాడు గ్రహిలుడు (8-159) త్ర్యంబక శిఖరోద్భూత, పరమపూత .. త్రిలోకీమాత, మహాపాతక సంఘాత విఘాతానుయాత అయిన గంగను (గోదావరి) సందర్శించినాడు (8-100) అందులో "ఉదకం బా లోనం దెకతెక నుడుకంగా నద్భుతమైన మడుగు" చూచి ఆశ్చర్యపడినాడు (8-161)

ఆ ఉష్ణ గుండం పేరు పాప హిమ నాశన తీర్థం విక్రమార్కుడు ఆ ఉష్ణ గుండం మహిమను తిలకించేందుకు బయల్దేరి "ఆంధ్రభూమి కాననములు దాటి పాప హిమనాశన సార్థము నుష్ణ తీర్థమును" చేరతాడు (పు 186)

గ్రహిలుడు "గౌతమీ తీర కాననముల్దాటుచు నొక్కనాడు కడు పుణ్యంబైన కాళేశ్వరంబున కేతెంచి ముక్తీశ్వరుం గొల్చి" నాడు (8-176) హరిహరు లొకటే అని పురాణాలు చెప్పే పలుకులకు సాక్ష్యంగా నరసింహుడు, రామేశ్వరుడు ఇద్దరూ ఉండే ధర్మపురికి వచ్చినాడు (8-177) "అట చని గంగలో జలకమాడుచు యమునికుండము చూచి" బ్రహ్మ కూకటి ముసు ముట్టి వెల్వడి . నరసింహమూర్తి"కి మ్రొక్కి పూజించినాడు (8-178) "నర్మద తుంగభద్ర, యమునానది, జాహ్నవి కృష్ణ, గౌతమి" నదులలో పాపాలు పోయేందుకు గ్రుంకులిడినానో ? దానధర్మాలు చేసినానో "ధర్మపురి నృసింహ నిజదైవమవౌ విభు నిన్ను" జూచినాను (8-179). "శాశ్వతమౌ కృపారసము చాడ్పున ముందఱ గంగ ప్రవహిస్తుండగా... భుక్తి ముక్తి సదనంబగు ధర్మపురీశుడైన రామేశ్వరుడు" మా కభీష్ట సంపదలిచ్చుగాత . అని కోరుకొన్నాడు (8-181) అలా గ్రహిలుడు విద్యలు నేర్చి తీర్థయాత్రలు చేసి తిరిగి

అవంతికి వెళ్ళే తండ్రితో "అంధ్రభూమి గౌతమిలో" ఉష్ణగుండం చూచినానని, ఆ విశేషాలన్నీ చెపుతాడు (8–184)

కొరవి గోపరాజు కావ్యం ఆధారంగా 'గంగ' అంటే ఆంధ్రదేశంలో గౌతమీ నది అని, ఏకశిలానగరం అంటే ఓరుగల్లు అని నిర్ద్వంద్వంగా నిరూపింపబడింది

5 14 మడికి సింగన సకల నీతి సమ్మతం, పద్మపురాణం, జ్ఞానవాసిష్ఠ రామాయణం, భాగవత దశమస్కంధం – మడికి సింగన రచనలు

5 14 1 'సకల నీతి సమ్మతం రామగిరి శ్రీకేశవస్వామికి అంకితం ఈ సంకలన కావ్యంలో మడికి, రామగిరి అనె రెండు తెలుగునాటి ఊర్ల ప్రసక్తి ఉంది సరస కవితా విలాసుడు మడికి సింగయామాత్యుడు . (1–3)

.. రామగిరీంద్ర కేశవస్వామి త్రి [లోకనాథుడు] ధ్రువంబుగా మర్త్యజాతి నాథు వయ్యెడున్ (1–1) రామగిరి శ్రీకేశవస్వామునకు సమర్పించుట యదియు పరమ పూజా విశేషంబు కావుతమని ... (1–9) కవి పలుకులు

పద్మపురాణోత్తరఖండాన్ని, భాగవత దశమ స్కంధాన్ని మడికి సింగన కందన మంత్రి కంకితం చేసినాడు కందన మంత్రి పూర్వులు కాకతి గణపతి దేవ చక్రవర్తి కాలంనుంచీ ప్రసిద్ధులు కందన మంత్రి అన్న కేసన మంత్రి రామగిరి దుర్గంరాజధానిగా చెసుకొని సబ్బినాటి రాష్ట్రాన్ని పాలించిన గురిజాల ముప్ప భూపాలుని మంత్రిగా ఉండినాడు 55

5 14 1 1 కృతిభర్త ఇంటిపేరు వెలిగండల అతని కులాశ్రయుడు రామగిరి పట్టణాధీశ్వరుండైన ముప్పడి క్షోణిపాలుడు (1–12)

గురిజాలాన్వయ దుగ్ధ వార్ధి హరి.. తెలుంగురాయుఁడు .. (1–13) గురిజాల గోత్ర వార్ధి కుముదమిత్రుడు ... ముప్పడివిభుఁడు (1–13) మత్త భూపాలుండు తనకు సహాయుడుగా గౌతమి దక్షిణంబునం బరమ పావనమగు సబ్బినాటి రాష్ట్రం బున రామగిరి పట్టణంబు నిజ రాజధానిగాఁ బురందర విభవుండై రాజ్యంబు సెయుచు నౌద రాజ్య స్థాపనాచార్య . చలమర్తి గండ గజ గంధవారణ నానా బిరుద విఖ్యాతుండును.. ముప్ప భూపాలచంద్రునకు నిఖిల సామ్రాజ్య భూభార దురంధరుం డును. యమ్మహారాజు మన్ననవడసి.. కందనామాత్యు వంశావతారంబు (1–21) గన్నయ మంత్రి కాకతీయ గణపతి క్షితి నాయకు నొద్ద మాన్యుఁడై.. (1–27)...

మెలగూరి పడమటి గవని యందు పచ్చ సముద్రింబనం దమ తండ్రి పేరిట నగాధ నిర్మల జలపూరంబగు బావియును గాడియును గల్పించె (1-28) ... గుడి కట్టెఁ గట్టి రామేశఁబ్రతిష్ఠ చేసె నుతి కెక్కఁగ నా మెలగూరి వాకిటన్ (1-29) మెలంగూరు అనే గ్రామం హుజూరాబాద్ తాలూకా కరీంనగర్ జిల్లాలో ఉంది 56 ఇదె మెలగూరు కావచ్చు

5 14 1 2 కేసన మంత్రి "ధర్మపురంబునందు నంచితముగ నన్నసత్ర మిడి శ్రీనరసింహుని గుడిఁగట్టి విష్ణుఁ బ్రతిష్ఠ యొనర్చి"నాడు (1-39)

.. "కేసన కేశవేంద్రు గుడిపై . హేమకుంభ శిఖరంబెత్తించి" నాడు (1-41) "శ్రీరామాచల రాజశ్రీ రమ్యారాధనయ విశేషణకృత్యా" (6-1) అని కృతిపతికి సంబోధన వుంది

వెలిగందలామాత్యుండు (1-52) మడికి సింగనఁ జేపట్టక కీర్తిగలదె శ్రీమంతునకున్ (1-53) అని భావించి మడికి సింగనను పద్మపురాణోత్తరఖండం తెనిగించమన్నాడు

కందనామాత్యుని "వెలిగందల నరహరి పదజలరుహ మకరంద మత్త షట్చరణ" (1-184) అని కవి కీర్తించినాడు

5 14 1 3 మాఘమాస స్నానంబు ... చంద్రభాగయును, గౌతమియు భీమరథియును, దుంగభద్రయును, కృష్ణవేణియును, గావేరియును నివి మొదలుగాఁగల తీర్థంబులును నాకలోక సౌఖ్యంబు నందించును (3-206).

5 14 1 4 శ్రీరాముడు దండకారణ్యంబు ప్రవేశించి పంచవటి యను తీర్థంబునకుం జనుదెంచి తత్ప్రాంతంబున (8-125) గౌతమీ గంగను సతీభ్రాతృ సమేతంగా చూసినాడు గౌతమగంగ (గోదావరి) ను కవి ఎంతో హృద్యంగా, భావస్ఫూరకంగా వర్ణించినాడు క్రింది పద్యంలో-

" కని రా గౌతమగంగ సమ్ముఖ కురంగన్ బ్రస్ఫుటాంభోజినీ
వని సంభూత పరాగపూరిత విభాస్వత్సైకత తొత్సంగ ధీ
ర, నికుంజోదర సుప్రకేసరి కిశోర స్తోమచంగన్ వన
స్థానీయార్ఘ్య విధాన దర్భ సుమనస్సత్సంగం బృథ్వీశ్వరుల్ " (8-126)

కవి పై విధంగా గురిజాల, ధర్మపురం, మడికి, మెలగూరు, రామగిరి/ రామాచలం, వెలిగందల అనే స్థలాలను, కృష్ణవేణి, గౌతమగంగ/ గౌతమి, చంద్రభాగ, తుంగభద్ర

భీమరథి అనే పుణ్యనదుల్ని రుద్రసాగరం అనే చెరువును తన కావ్యంలో ప్రస్తావించినాడు

5 15 అయ్యలరాజు త్రిపురాంతక కవి 'ఒంటిమిట్ట రఘువీర శతకం' అయ్యల రాజు త్రిపురాంతకుని రచన 'రఘువీరా । జానకనాయకా ।' అన్నది శతక మకుటం

5 15 1 ఈశతకంలో అహోబిల గ్రామం, ఒంటిమిట్ట, శ్రీగిరి, శ్రీవేంకట స్థలాల ప్రసక్తి ఉంది కడపజిల్లా సిద్ధవటం తాలూకాలోని ఒంటిమిట్ట చరిత్ర ప్రసిద్ధమైన స్థలం ఇక్కడ రఘునాథుని ఆలయం ఉంది........ యొంటిమిట్ట రఘువీరా జానకి నాయకా (13వ పద్యం), .... తాపజోద్భయ యొంటిమిట్ట రఘునాథా ... (6వ పద్యం) అని కవి సంస్తుతి

5 15 1. 1 మరణం మానవులకు నిశ్చయం ఒంట్లో చేవ ఉండగానే పుణ్యక్షేత్రాలు దర్శించాలి అంటూ కవి ఈపద్యంలో శ్రీగిరీ, అహోబిలం, శ్రీ వేంకటాద్రి చేరవలసిన పుణ్యస్థలాలుగా చెప్పబడినాయి "చావుల్ మర్త్యులకెల్ల గల్గుటలు నిస్సందేహముల్ దేహముల్ చెవల్గల్గిన నాడె శ్రీగిరి గయా శ్రీవేంకటాచలాహోబిలగ్రావ ప్రాంతములందుఁ జేరవలె" (87 వ పద్యం) కవి తెలుగునాడులో శైవులకు ముఖ్యమైన పవిత్రస్థలం శ్రీశైలాన్ని, వైష్ణవులకున్న 108 దివ్య తిరుపతులలో రెండైన తిరుమల, అహోబిలాన్ని ఉటంకించినాడు

5 16 నూతన కవి సూరన ధనాభిరామం అనే కావ్యాన్ని నూతన కవి సూరన రచించినాడు దాక్షారామ భీమేశ్వరునికి ఈ కావ్యం అంకితం [57]

5 16 1 ధనాభిరామంలో మనం దర్శించే తెలుగునాడు స్థలాలు, తీర్థాలు చిమ్మపూడి, దక్షారామం, పట్టిస, ముదిగొండ, సప్తగోదావరం అనేవి

దక్షారామం దక్ష నగరి, దక్షపురి, దక్షవాటి, దక్షవాటికా, దాక్షారామం, ద్రాక్షారామపురం అని వివిధనామాల్తో కవి ప్రస్తుతించినాడు

5 16 1 1 కవి పూర్వకవి స్తుతిలో చిమ్మపూడి యమరేశ్వరు, భాస్కరు, రంగనాథునిన్ (1-2) భజించినాడు కవి గురువు ముదిగొండ వీరభద్రుడు. ముదిగొండ గ్రామం కాశీపేటకు పడమరగా మైలున్నర దూరంలో ఉంది [58]

5 16 1 2 పట్టెసం ఒక ఆయుధం పట్టెస వీరభద్రుని కవి చేసిన స్తుతి ఈ పద్యంలో హృద్యంగా ఉంది

" శ్రీ ధాత్రీధర కన్యకారమణు దాక్షారామంబునన్ సర్వలో
కాధారున్ ఫణిరాజ కంకణుని చంద్రాకల్ప సర్వజ్ఞు స
ద్భోదానందకరైన భక్త హృదయాంభోజాత వాసున్ వచో
మాధుర్యంబున దక్షవాటిపురి భీమస్వామి చింతించెదన్" (1-1)

" ఒసపరి యింద్రనీలముల యొప్పు నటించెడి మేనికాంతితో
ముసల గదాంకుశాల కరముద్గర కుంత శరాసనోగ్ర ప
ట్టెస పటు ఖేటకావళులన్ దన హస్తమునన్ వెలుంగఁగా
పొసఁగిన మేటి ఉలుపని పూని భజించెద వీరభద్రుడన్" (1-2)

5 16 1 3 రూపం గొప్పదని మన్మధుడు, ధనం గొప్పదని కుబేరుడు వాదించి 'దాక్షారామ క్షేత్రానికి' వస్తారు రూపంతో మన్మధుడు స్వాధీనపరచుకొన్న వేశ్యను, ధనంతో కుబేరుడు లొంగ దీసుకొంటాడు భీమేశ్వర స్వామి ధనం, రూపం రెండూ లోకానికి అవసరమే అని వారిద్దరికీ సర్ది జెప్పి పంపిస్తాడు ఈ కథ జరిగిన స్థలం దాక్షారామం కాబట్టి కవి ఆ నగరాన్ని, భీమేశ్వరుని, దేవాలయ ముఖమంటపాన్ని, సప్తగోదావరాన్ని విస్తృతంగా వర్ణించినాడు

కృత్యాది పద్యంలో 'దక్షవాటిపురి భీమస్వామిఁజింతించెదన్' (1-1) అని దక్షవాటిని స్తుతించినాడు కవి ఆ క్షేత్ర మహత్త్వం బోధపడేటట్లు దక్షవాటి భీమేశ్వరునకున్, దక్షవాటి పుర భీమేశా (1-28) త్రిదక్షవాటీశ్వరా (1-83, 3-111) దక్షవాటికా భీమేశా (2-1 దక్షవాటీశ్వరుని హిమధామ ఖండధరుని (2-53) దక్షనగరీశా (2-131) దాక్షారామ భీమేశ్వరా (3-109), దాక్షారామ శ్రీ భీమనాధ (3-1) దక్షవాటీ నిలయున్ (3-10), దక్షపురీశ్వరా (3-32), ద్రాక్షారామ పురాధిపు (3-103) అని భీమేశ్వరుని కవి స్తుతించినాడు

కుబేరుడు మన్మధునితో "మాటలు పని లేవు సమస్త వైభవోత్కరమగు దక్షవాటీ పురిఁగల్గు ధిరాప్తలిలోనఁ బోయి నీరూప సంపద మాపు" "యా పుర వరసీమఁ జూపెదను భూరి ధనంబున నామహత్త్వమున్" అని పందెం వేస్తాడు (1-79)

సూనాస్త్రుడు 'దక్షవాటి పురవరమునకున్' వస్తాడు (2-11). ఈ సందర్భంలో కవి ప్రబంధోచితంగా దక్షారామ పురవర్ణన 15 పద్యాలలో చేసినాడు (2-13 నుండి 2-27 వరకు) కోటలు (2-13), పరిఖలు (2-14), పురము (2-15), గోపురాలు (2-16), మేడలు (2-17, 18, ఏనుగులు (2-19), అశ్వాలు (2-20) సరస్సులు (2-21), ఉద్యానవనాలు (2-22), మందమారుతం (2-23), అంగడ్తెలు (2-24, 25) చాతుర్వర్ణ్యం (2-26) విశ్వేషగా వర్ణితమైనాయి

"వైరి నృప పుంగవ సేన కభేద్యమై అప్పురము కోటలు" న్నాయి (2-13) "జలరాశి చౌకఁజేయుచు పలు తెఁగుల పరిఖ" లమరి ఉన్నాయి (2-14)

" నవనిధానంబులకు మహోత్సవము నయము
నింపు సొంపొందఁ దనలోన నిముడుకొనుచు
ననుచు నందఱుఁ గొనియాడ నవనిలోన
సాటికెక్కెను శ్రీ దక్షవాటి పురము " (2-15)

'అప్పురము గోపురముల్ గగనంబు' ముడుతున్నాయి దారిలేక సూర్యుడు గవాక్షాల్లో దూరి పోతున్నాడు (2-16) 'అప్పురము మెలగు హర్మ్యతలోగ్ర సీమలం' బాలికలు అచ్చెరలేమల్తో కలిసి ఆడుకుంటూచు (2-17) 'దివ్య గేహ సముదంచిత కుడ్య విచిత్ర రత్న సంజాల సుదీప్తి' ప్రసరించి రాత్రిని పగలు చేస్తుండడం వల్ల తిరిగే ప్రజలకు చీకటి భయం లేదు (2-18) 'జంగమ శైల సంఘ' మనేట్లు 'మాతంగముల్' (2-19) ఆకాశానికైనా పరుగెత్త గల అశ్వాలు (2-20) ఉంటాయి తుమ్మెదలు, చక్రవాకాలు, హంసల్తో వికసించి పరిమళం వెదజల్లే పద్మాలతో కమలాకరాలుంటాయి (2-21) పూలతో, పండ్లతో నిండిన తీగెలు, చెట్లతో, 'వసంత వైభవ రమా కల్యాణధామంబులై యారామంబులు' ఉంటాయి (2-22) మకరందాల సోలి .. కుసుమ వాసనలఁ గ్రోలి.. జగములకెల్ల నానందమగుచు' చల్లగాలి విహరిస్తుంటుంది (2-23) అప్పురి చంద్రముఖులు ఎంతటి విలాస విభ్రమవతులో, సుందర తరుణీమణులో అక్షరసత్యంగా చెప్పేది ఈ క్రింది పద్యం చిత్తగించండి .

" నిగనిగ మనియెడి మేనులు
దిగదిగ నడచినను నొగిలి తెగియెడు నడుముల్
జిగిబిగి గల కుచములు నగు
మొగములు దముఁ బొగడ బురము వనితలకెల్లన్" (2-25)

'దక్షవాటి అమరావతీపురి కలదు సాటి ధరణి సౌఖ్యంబులకుఁ జూటి ... (2-26) సకల సౌఖ్యంబులకు జన్మస్థానంబన, సర్వంసహా కాంతకు దర్పణం బనఁ దనరి లోకాభిరామంబగు దాక్షారామంబు'ను చూచినాడు చిత్రజాతుడు (2-27)

మన్మధుడు సందర్శించి, తానమాడి ధన్యుడైన 'సప్తగోదావరం' స్వరూపాన్ని కనుల కట్టేట్లు రెండు పద్యాల్లో వర్ణించినాడు కవి. సప్తగోదావరాన్ని ముక్తికామినిగా అభేదరూపకంలో కవి చెప్పిన తీరు హృద్యంగా, ఉదాత్తంగా ఉంది

" కమనీయ తర కచ్ఛపములు మీఁగాళ్ళుగా సైకతస్థలి కటిస్థలము గాఁగ
భాసురావర్త విభ్రమకీర్తి నాభిగా వర కోకములు కుచద్వయము గాఁగ
విదిత శంఖములు యొప్పిదము కంఠమ్ముగా మోవి పద్మము సొంపు
మొగముగాఁగఁ
దళుకు వేడిస మీలు ధవళ నేత్రములుగా నవకంపు ఫేనంబు నవ్వు గాఁగ
ఘనత తనయందె పుణ్యముల్ గలుగుననుచు వీచికా హస్తములు సాచి
వెక్కఁ బిలుచు
ముక్తికామిని విధమున మురియుచున్న సప్తగోదావరముఁజూచె శంబరారి '
( 2-28 )

సంస్మరణ చేస్తే యోగఫలం కలుగుతుంది చూస్తేనే పాపాలు పోతాయి, తీర్థమాడితే పథాలు కలుగుతాయి 'చారు సప్త గోదావరి సింధుసమున్ నవతు ధారుణి లేవు తలంప వాహినుల్' అని కవి విశ్వాసం భక్తుల ఆమోదం

వేడుకు వింటి వెల్పు 'దక్షవాటికా కటక ఘంటావీధిం' నడిచి వెళ్ళేటప్పుడు మదనుడే మనిషై వచ్చినాడా అని ప్రజలు ఆశ్చర్యపోతారు (2-36 నుంచి 2-39)

పంచశరుడు భీమేశు మందిరం వద్దకు చేరతాడు తనకాలం నాటి భీమ మందిరం వైభవాన్ని కవి ప్రతిభావంతంగా అందంగా, చిత్రించినాడు ఈ పద్యంలో —

" గురుతరంబగు చిత్ర గోపుర ప్రాకార మహిత కాంచన మణిమంటపముల
ప్రత్యగ్ర రచనానుబంధ బంధుర శాత కుంభ రత్నోజ్జ్వల కుంభములను
భూరి నిశ్చల వాత పూరణ తోరణ చాతుర్య వృషభేంద్ర కేతనములు
పటహ భేరి శంఖ పటు ఘంటికానేక భీషణాటోప నిర్ఘోషణములు

వెళ్ళి ప్రార్థిస్తాడు 'దక్షధ్వరాధ్యక్ష శిక్షా .. శ్రీ దక్షవాటీ పురాధీశ' [3–100] అని దండకంతో స్తుతిస్తాడు 'దాక్షారామ పురాధిపుఁడు .. ' బ్రహ్మ విష్ణువులతో మదనునికి ప్రత్యక్ష మౌతాడు [3–103] కుబేరుని కూడా పిలిపించి రూపం, ధనం సమానమే మీరిద్దరు కలసి మెలసి ఉండండి అని శలవిచ్చి అంతర్ధానమౌతాడు భీమేశ్వరుడు

ఇలా సూరన తన కావ్యానికి కథాస్థలంగా దాక్షారామాన్ని ఎన్నుకోవడమే గాకుండా, ఆ పురవర్ణన సమగ్ర సుందరంగా చేసి నాటి దాక్షారామ వైభవాన్ని తన కావ్యం ద్వారా మన కన్నుల ముందర నిలిపినాడు

5 17 తాళ్ళపాక అన్నమాచార్యులు తాళ్ళపాక అన్నమాచార్యులు క్రీ శ 1424లో జన్మించి 1503లో నిర్యాణమందినాడు [59] ఆయన రచించిన సంకీర్తనల సంఖ్య 32,000[60] తిరుమలలో వుండేసిన వేంకటేశ్వరస్వామిపై వేలాది సంకీర్తనలు పాడడమేగాక తెలుగునాడు, తమిళనాడు, కర్ణాటకరాష్ట్రాలలో ఉండే ప్రసిద్ధ క్షేత్ర దైవాలపై కూడా సంకీర్తనలు రచించినాడు

అన్నమాచార్యుల సంకీర్తనలలో [ఇప్పటికి అచ్చుకెక్కిన సంపుటాలలోవి] తెలుగునాడుకు చెందిన ప్రదేశాలు, తీర్థాలు ఇవి–అహోబలం, ఉద్దగిరి, ఊటుకూరు, ఒంటిమిట్ట, ఓగునూతల, కడప, కోన, గండవరం, గండికోట, గుత్తి, చాగలమఱ్ఱి/ చేగలమఱ్ఱి, చింతకుంట, తిరుపట్ల, తిరుపతి/దిగువతిరుపతి/దిగువ పట్టణం, తిరుమల, పాపిలిపాడు, నల్లబల్లి, నెలదలూరు, నెల్లూరు, పోట్లదొరితి, మంగాంబుధి, మండెము, మాచెనవోలు, ముడియం, వావిలిపాడు, వెలిగోడు, వేదాచలం, సంబటూరు, సింహాద్రి అనేవి

తిరుమలకు సంకీర్తనలో ఉండే ఇతర పేర్లు–కొండ, తిరుమలకొండ, వెంకటగిరి/ తిరువెంకటగిరి, వేంకటనగం, వెంకటాచలం, వేంకటాద్రి, శేషగిరి / శేషాద్రి అనేవి ఏడుకొండల్లోని అంజనగిరి, గరుడాద్రి కూడా ప్రసక్తిలోకి వచ్చినాయి

అహోబలక్షేత్రంలోని భవనాశినది, ఎఱ్ఱగిలకనుమ, గద్దెరాతికనుమ, గుబ్బలి కొండ కనుమ, దొంగల సాని కనుమ, సోమశిలకనుమ అనే కనుమలు అన్నమా చార్యుల సంకీర్తనల్లో ప్రయోగింపబడినాయి

పైన చెప్పిన స్థలాల ప్రసక్తి సంకీర్తనలలో ఉండే విధాన్ని పరిశీలిద్దాం

5 17 1 అహోబలం "అహోబలేశ్వరుఁడంకులడమఁడు
మహా మహిమలను మలసేవాఁడే" (సం 6-112)

అహోబలం ఇంకా పలుచోట్ల కీర్తించబడింది

'భవనాశితీర యహోబల నారసింహ' (సం 1-453) భవనాశి ఎగువ అహోబలంలోని పుణ్యనది

5 17 2 ఉద్దగిరి "విచ్చనపెడినె యూడీ పీఁడె కృష్ణుఁడు
వొచ్చము లేనివాఁడు వుద్దగిరి కృష్ణుఁడు"
(సం 10-172)

"తొలుత నుద్దగిరిఁ గందువ విజనగరాన
యెలమి రతులు చూపే నేమి చెప్పేదమ్మా"
(సం 19-216)

నెల్లూరు జిల్లా ఉదయగిరి తా ముఖ్యపట్టణం ఉదయగిరి అదె ఉద్దగిరి ఈ గ్రామం వద్ద ప్రాచీన కృష్ణదేవాలయం నేడు శిథిలమై కనబడ్తున్నది ఈ గుళ్లోని బాలకృష్ణుని విగ్రహాన్ని రాయలు 1514 లో ఈ దుర్గాన్ని జయించి విజయనగరానికి తీసుకెళ్ళినాడంటారు[61]

5 17. 3 ఊటకూరు "తియ్యని మాటలఁ దేలించేవు
వొయ్యారపు వూటకూరి చెన్నరాయా"
[సం 16-2-24]

కడపజిల్లా రాజంపేట తా లోని ఊటుకూరు గ్రామంలో చెన్నరాయుని దేవాలయం ఉంది

5 17 4 ఒంటిమిట్ట "ఇందులోనే కానవద్దా యితఁడు దైవమని
విందువలె నొంటిమిట్ట వీర రఘురాముని"

కడప జిల్లా సిద్ధవటం తాలూకాలో ఉండే ఒంటిమిట్ట గ్రామం ఇక్కడి రామాలయం చాలా ప్రాచీనమైంది[62]

5 17 5 ఓగుసూతల "కలికితనాన శ్రీవేంకటనాథ కూడితివి
నలువై నోగుసూతల నారసింహుఁడా"
[సం 16-2-18]

" అల్లదిగో వోగసూతు లౌబశేప పెద్దకోన
మండల పాలకొండలకు నట్టనడుమ
పిండ్రప దాసులతోఁత విహరించే దేవుడు"
[ సం 11-80 ]

.. 'శ్రీవేంకపే (డొగు సూతలలో( గూడె' [17-385] కడప జి కడప తా లో చిన్నదాసంపల్లి సమీపంగా కొండలోయలో వేయి సూతులుంటే ప్రదేశముంది దాన్ని వె ూతుల కోన, నా సూతల కోన, వొగసూతులకోన అంటారు ఇక్కడ నరసింహ స్వామి దేవలయముంది ఈ ప్రాంతంలోని కొండలను మండల పాలకొండ మల అంటారు 63

5 17 6 కడప . " శ్రీవేంకటేశ ఋా పిన్నది
నాతో(హడించినది నలి సి...న్న(గడపలో "
[సం 15-245]
" కమ్మటి శ్రీవేంకటాద్రి కడపరాయడవై
నెమ్మది(గూడితి విదె . " [సం 17-45]

ఇంకా కడప వెంకటేశుని ప్రసక్తి సం 10-200, సం 17-45, 290, 291, 417, 501, 563, సం 22-21, సం 23-30, సం 25-252, 490 సం 29-323 సంఖ్యలుండే సంకీర్తనలలో కనిపిస్తున్నది

పిన్నల పండగవాయ కడపరాయని తెరు
మిన్న నెలి శృంగారము మితిమీరినట్లు " [సం 8-93]

అనే సంకీర్తనలో స్వామి రథోత్సవం వర్ణింపబడింది జిల్లాకేంద్రమైన కడపకు దగ్గర్లో దేవరకడప లేక దేవుని కడప అని పిల్తా ఉండె ఊర్లో, శ్రీ ప్రసన్న వెంకటేశ్వరస్వామి వెలసి ఉన్నాడు 64 ఆ దేవున్నే అన్నమాచార్యులు 'కడపరాయని'గా స్తుతించినాడు

5 17 7 కన " మిక్కిలి నెచుపని మెలు మిలోయి
గుక్కని వలపుల కొ కోన చెన్నరాయ "
[సం 16-2-219]

కడప జి కడప తా లో నందిమండలానికి దక్షిణంగా పాలకొండ పర్వతంలోని ఒక కోనలో చెన్న కేశవస్వామి ఆలయముంది 65

5 17 8 గండికోట. “వెయ్యినాల్కల పాము వెన్నకేశ్వరా
వెయ్య (వెయ్యం) పెవు గండికోట వెన్నకేశ్వరా”

గండికోట దుర్గం కడప జి, జమ్మలమడుగు తాలూకాలో ఉంది[66] అక్కడ వెలసిన స్వామి చెన్నకేశ్వరుడు

5 17 9 వాగలమఱ్ఱి “కందనూరి సూటిని వాగలమఱ్ఱి చెన్నుండవై
అందవు శ్రీవెంకటేశ అడివా నాకు”
( సం 3-562 )

కర్నూలు జి ఆళ్లగడ్డ తాలూకాలో వాగలమఱ్ఱి గ్రామం ఉంది. అక్కడి స్వామి చెన్న కేశవస్వామి[67]

5 17 10 ఘనుఁడవు చింతకుంట కంభమురాయ” (సం [illegible]-200) చింతకుంట పేర్తో జమ్మలమడుగు, ప్రొద్దుటూరు తాలూకాలలో రెండున్నాయి[68] ఏ గ్రామమో పరిశీలించాల్సి ఉంది

5 17 11 తిరుపల్లి “మంగళము తిరుపల్లి మదనగోపాల” [అన్నమాచార్యులచరిత్ర-పీఠిక పు 62) తిరుపల్లి పుదిపల్లి కావచ్చు చిత్తూరు జి చంద్రగిరి తాలూకాలో ఉంది[69]

3 17 12 తిరుపతి/దిగువతిరుపతి/దిగువపట్టణం.

“తెంకిని శ్రీవేంకటాద్రి దిగువ తిరుపతిలో
కొంకక వరాలిచ్చే గోవిందరాజా” [ సం 5-208 ]
“అంచి శ్రీవెంకటగిరి నడె తిరుపతిలోన
రేఁచిన మోహానఁ గూడ రేయిఁ బగలదివో” [ సం 17-575)
“దిగువపట్టణములోని దేవ హనుమంతరాయ” [సం 7-16]

5 17 13 తిరుమల 7. తిరుమలక్షేత్రం సంకీర్తనలలో కొండ, తిరుమల కొండ, వెంకటగిరి/తిరు వేంకటగిరి, వెంకటనగం / వెంకటాచలం / వేంకటాద్రి శేషగిరి/శేషాద్రి అని కీర్తించబడింది

దిగువ తిరుపతినుండి తిరుమలకొండ నెక్కి వెళ్లే యాత్రికుల అనుభూతి, పరిసరాలు, ప్రకృతి దృశ్యాలు ఈ సంకీర్తనలో ప్రతిబింబిస్తున్నాయి పరికించండి—

" అదె చూడు తిరువేంకటాద్రి నాలుగు యుగము
లందు వెలుగొందీ ప్రభ మీఱఁగాను ॥పల్లవి॥

తగు నూటయెనిమిది తిరుపతులం గల
స్థానికులును చక్రవర్తి పీఠకములును
... ... . ... ..
వాగి నొరఁగు బెరుమాళ్ల వునికి పట్టయి వెలయు
దిగువ తిరుపతి గడవఁగాను
పొదలి యర యోజనము పొడవునఁ ..
పది నొండు యోజనంబుల పరపునను ఁబరగి
... ... ... ... ...
ఎక్కువల కెక్కుడై యెసఁగి వెలసిన పెద్ద
యెక్కు డతిశయముగా నెక్కి నంతటి మీఁద
అక్కజంబైన పల్లవరాయని మటము
అల యేడ్ల పేట గడవన్
చక్కనేగుచు నవ్వచరిఁ గడచి హరిఁ దలఁచి
మొక్కుచును మోకాళ్లముడుగుఁ గడచిన మీఁద
నక్కడక్కడ వేంకటాద్రీశు సంపదలు అంతంతఁ
గాన రాఁగాను
కనకమయమైన గోపురములను జెలువొంది
జగతీధరుని దివ్యసంపదలు గల నగరు
సరగుననుఁ గాన రాఁగాను
ప్రాకటంబైన పాపవినాశనములోని
భరితమగు దురితములు పగిలి పాచుచునుండ
ఆకాశగంగ తోయములు సోకిన భవము
లంతంత వీడి పారఁగను
ఈ కడను కోనేట యతులుఁ బాశుపతులు
యేకమై తిరువేంకటాద్రీశుఁడా దరిని
యే ప్రొద్దు విహరించఁగాను " [సం 5-130]

పెద్దయెక్కుడు . మెట్లు నిట్టనిలువుగా ఉంటాయి. తిరుమలకొండ ఎక్కేటప్పుడు కష్టమైన ఎక్కుడు

పల్లవరాయని మటము తిరుపతిలోని ఆళ్వార్ తీర్థంలో నమ్మాళ్వారు తిరుమాళిగెను నిర్మించినాడు 'వానెడుత్తకైమలగర్' అతడే పల్లవరాయడు అతడే నిర్మించిఉండవచ్చు 'పల్లవమటాన్ని'

అవ్వచరి : మోకాళ్ళ ముడుపునకు ముందుండే లోయ అవ్వచరి కనుమ అని కూడా అంటారు

మోకాళ్ళముడుపు ఒక్కొక్క మెట్టు మోకాలి ఎత్తుండి మోకాళ్ళు ముడుచుకొని ఎక్కాల్సి ఉంటుంది కాబట్టి మోకాళ్ళముడుపు అని పేరు సాలగ్రామ మయమైంది కాబట్టి అక్కడనుండి మోకాళ్ళతో భక్తులు నడిచి పోయేవారట కాబట్టి మోకాళ్ళ ముడుపు అయిందని మరికొందరి నిర్వచనం.

" అదివో అల్లదివో శ్రీహరి వాసము
... ... ... ... ...
అదె వెంకటాచల మఖిలోన్నతము
.. ... .. ... ...
చెంగట నల్లదివో శేషాచలము
నింగినున్న దేవతల నిజవాసము " [సం 5-27]
" శ్రీవెంకటగిరి నదె తిరుపతిలోన" [సం 17-575]
"వెంకటనగముపై వేదాచలముపై
కింక లేక వడిఁ బెరిగిన సింహము " [సం 1-13]
" తెంకినె శ్రీవెంకటాద్రి దేవుని మెప్పించినాఁడు" [సం 10-155]
" చేవ మీరి శేషాద్రి శిఖరము మీఁదను
భావింప మేఘము జడి వట్టిపిమించినట్లు " [సం 19-107]
" పొడవైన శేషగిరి బోయనాథుఁడు " [సం. 1-460]
" గుట్టు మాతోఁ జేసేవుగా కొండలరాయా
వట్టి జోలి యిఁక నేల వద్దు " [సం 23-361]

5 17. 19 మండెము

"శ్రీవేంకటేశుండ మండెము రాయుండవై
సమ్మతిం గూడె వెట్టై" [సం 3-94]
"మండెము రాయుఁడవై నన్నుఁ గూడితివి
. . . శ్రీవేంకటనాథుఁడు" [సం 16-2-34]

"నవమూర్తి మండెము నారసింహ" [సం 1-259, సం 5-162] కడప జిల్లా రాయచోటి తాలూకాలో ఉండే చిన్నమండెం గ్రామం ఇక్కడ వెలసిన నృసింహస్వామిని మండెము రాయడు, నవమూర్తి నారసింహుడుగా కవి కీర్తించినాడు[75]

5 17 20 మాచనవోలు "జట్టి శ్రీవేంకటేశ మాచనవోలి చెన్నుఁడవై" (సం 10-78) కడపజిల్లా అదె తాలూకాలో ఉండే మాచనూరు మాచనవోలు దీని నామాంతరం[76]

5 17 21 మాడుపూరు

తితియందెల ప్రోఁత చెన్నకేశవా
యీ రీతి మాడుపూరిలో నిట్లా దేవా
చిన్నవై గోపాలులతోఁ జిల్లదిప్పులాడితివి
యెన్నిక మాడుపూరిలో నిట్లా దేవా" (సం 8-179)

అన్నమాచార్యుని మేనమామగారి ఊరు కడప జి సిద్ధవటం తా లో ఉండే మాడుపూరులో చెన్నకేశవదేవాలయం ఉంది[77]

5 17 22 ముడియము

"జయమాయ నీకు నాపె సరసములూ
నయగారి ముడియము నారసింహా" (సం 17-139)

కడప జి జమ్మలమడుగు తా లోని పెద్దముడియం గ్రామం ముడివెము/ముదివేము, ముడియ్యం, త్రిలోచనపురం ఈ గ్రామానికి నామాంతరాలు[78]

5. 7 23 వావిలిపాడు

"వెలిసె వావిలిపాటిలోపల వీరవిజయుఁడు రాముడు" (సం 6-178)
"వితత వావిలిపాటి వీరరామయ" (సం 7-39)

చిత్తూరు జి వాయల్పాడు తా గ్రామమె వావిలిపాడు

5 17 24 వెలిగోడు :

" కుంకుమాంక వక్ష వెలిగోటి కేశవ సర్వ
శంకా హరణ నమో జగదేక కేశవా " (11-1-96)

కర్నూలు జి ఆత్మకూరు తా లో వెలుగోడు గ్రామం వెలిగోటి కేశవస్వామిని కేవల కృష్ణావతారంగా అన్నమాచార్యులు కీర్తించినారు 79

5 17 25 సంబటూరు . "చక్కని యీ వెన్నుఁడూ సంబటూరి
చెన్నుఁడూ
అక్కడ నిక్కడ చూపి ఆసలు రేఁచీని" (17-162. 167)
"ఎంత వాఁడవయ్యా నిన్ను నేమనేము
సంతకూటముల వాఁడ సంబటూరి చెన్నుఁడా"
(సం 29-245)

కడప జి కమలాపురం తా లో ఉంది సమ్మటూరు అని శాసనాల్లో ప్రయుక్తం. శ్రీధామ్మపురం, చమటూరు నామాంతరాలు80

5 17 26 సింహాద్రి.

"చిత్తగించి పంచవటి సింహాద్రి లోన నుండి
వత్తుగా లోకములు పావనము సేయఁగను ( సం 1-278 )

5 17 27 కనుమలు . అంగన అందాల అంగాల్ని ప్రకృతితో పోల్చడం కవులకు పరిపాటే అన్నమాచార్యులు తన చుట్టుపక్కల ఉండే కొండ కనుమల్తో అంగన అవయవాల్ని పోల్చడం ఎంతో హృద్యంగా ఉంది

భూమినీ భూదేవిగా చూచిన కవులకు పోలికల కేం కరువా? చిత్తగించండి! ఇదే ఆ సంకీర్తన

" సొంపుల నీవదఁపు సోమశిలకనుమ
యింపులెల్లఁ జే గొనఁగ విల్లు నీపతికి ॥పల్లవి॥
కలికి నీ పిఱుఁదనే గద్దెరాతి కనుమ
మెలనూళ్ళ లతలతోనె ముంచుకొన్నది
ఇది వో నీ కెమ్మోవి యెఱ్ఱశిల కనుమ
కదిసి లేఁజిగురులఁ గప్పుకొన్నది

కాంత నీ చిత్తమే వొంగలహాని కనుము
యింతటి వేంకట పతి కిరవైనది
పంతపు సిగుబ్బులే గుబ్బలికొండ కనుము
మంతనాల కనుమాయ మగువ నీపతికి " (సం 12-115)

డా॥ వేటూరి ఆనందమూర్తిగారి తాళ్ళపాకవారి పదకవితలు...(వ్యా సం) గ్రంథంలో తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనలలో కనిపించే మరికొన్ని స్థలాలు చెప్పబడినాయి[81]

5 17 28 కనకగిరి రాయఁడు (సం 3-14) రాయవొజి సమీపమందలి కనకగిరి యేమో అని గ్రంథకర్త.

5 17 29 చింతనూరు (డి నం 465, 11658 పు 41), దాసరి పల్లె రాముఁడు, కదిరి వసంతుడు, చుక్కాపల్లి చెన్నుడు, నెల్లూరు శ్రీవేంకటనాధుడు — ఇవి ఆ గ్రంథంలో పేర్కొనబడినాయి ఇంకా గండవరం, గుత్తి, వెదాద్రి స్థలాల ప్రసక్తి కూడా వుంది

5 17 30 గండవరం

"బాలసుకు నూవేరు లలన లిరుగడల
బాల గండవర గోపాల నీసుఁకాలఁ" (డి నం 465)
బి నం 11658)

గుంటూరు జి గండవరం లోని బాలగోపాలునే తాళ్ళపాకవారు కీర్తించి ఉంటారు

5. 17 31 గుత్తి. "సౌమిత్రి సహోదర రామా
చెముంచి గుత్తిలో వెలసిన రఘురామా "

అనంతపురం జి గుత్తి తాలూకాలో వెలసిన రఘురాముని కవి కొనియాడినాడు[82]

5 17 32 వేదాద్రి.

" నగముపై యోగానంద నారసింహము వీఁడె (10-182)
ఆదిమ పురుషుఁడు అహోబలమునను
వేదాద్రి గుహలో వెలసీ నాఁడే " (9-218)

కృష్ణాతీరం వేదాద్రియా ? నెల్లూరు జిల్లా నరసింహుని కొండా ? నరసింహుని కొండకే వెదగిరి నామం వుందంటారు

పై విధంగా తాళ్ళపాక అన్నమాచార్యుల వారు వేల సంకీర్తనల్లో తిరుమల శ్రీ వేంకటేశ్వరుణ్ణి స్తుతించినా, తనకాలంనాటి ఆయా ఊర్లలో ఉండే దైవాలను కూడా కొలిచినాడు

5 18 తాళ్ళపాక తిమ్మక్క సుప్రసిద్ధ సంకీర్తనాచార్యులు తాళ్ళపాక అన్నమాచార్యుల పెద్ద భార్య తిమ్మక్క ఆమె రచన ‘సుభద్రాకళ్యాణం’ మంజరీ ద్విపదలో ఉంది ఈ చిన్న కావ్యంలో అహోబలం, తాళ్ళపాక, పర్వతం, వేంకటాద్రి అనేవి తెలుగునాడు లోని స్థల నామాలు

5 18 1 అర్జునుణ్ణి తీర్థయాత్రలో నన్నయ ఆంధ్రదేశం తీసుక వచ్చినట్లు తాళ్ళపాక తిమ్మక్క కూడా అర్జునునిచేత అహోబలం, శ్రీశైలం, వెంకటాద్రులను సందర్శింపజేసింది అర్జునుడు

" చనుదెంచె పర్వత స్వామి సన్నిధికి
అమర నహోబలం బా వేంకటాద్రి
వరుస నాపై కంచి వరదులఁగొలిచె " (పు 6)

పర్వతం శ్రీశైలానికి మరో పేరు
కవయిత్రి కావ్యాంతంలో ఇంటి పేరుతో కూడా తన పేరు చెప్పుకున్నది "అవనిలో తాళ్ళపాకాన్నయగారి తరుణి తిమ్మక చెప్పెఁ దాను సుభద్ర కళ్యాణ మను పాట - కడు మంచి తేట పలుకులను "

తాళ్ళపాక కడప జి రాజంపేట తా లో ఉండే గ్రామం[83].

5 19 ఆతుకూరి మొల్ల ఈ కవయిత్రి మృదుమధురంగా ‘రామాయణాన్ని’ రచించింది

5 19 1 ఈ కావ్యంలో మనకు కనిపించే తెలుగు దేశంలోని స్థలాలు ఆతుకూరు, గోపవరం, శ్రీనగం

- "ఆతుకూరి కేసయ వరపుత్రిని మొల్లయనఁగ బొదలిన దానన్ " (అవ 11)
- "విఖ్యాత గోపవరపు శ్రీకంఠ మల్లేశు వరముచేత
  నెఱిఁగవిత్వంబు జెప్పఁగ నేర్చి కొంటి ' (అవ 12)

అవతారికలోనే శ్రీశైల మల్లికార్జున స్వామి తమకు శుభాలిస్తాడు అని కవయిత్రి ఆశంస ఉంది

" శ్రీనగ మందిరుం డమర సేవితుఁడు . మల్లికార్జునుఁడు
తా నిడు మాకు శుభంబు లొప్పుగన్" (అవ 2)

ఆతుకూరు పల్నాడు తా గుంటూరు జి లో ఉంది గోపవరం నెల్లూరు జి లో ఉంది.

5 20 విన్నకోట పెద్దన 'కావ్యాలంకార చూడామణి' అనే లక్షణ గ్రంథం విన్నకోట పెద్దన రచించినాడు. ఇది చాళుక్య విశ్వేశ్వరునికి అంకితం. ఈ గ్రంథంలో ఆంధ్రదేశం, దుమారామం, త్రిలింగం, కాళేశ్వరం, దాక్షారామం, శ్రీపర్వతం, రాజమహేంద్రపురం, విన్నకోట అనేవి తెలుగునాడుకు సంబంధించిన స్థల నామాలు

5 20 1 ఆంధ్రభాష అనే బదులు 'ఆంధ్రదేశ భాష' అని కవి వాడడం విశేషం శ్రీనాథుడు కూడా ఇలాగే ప్రయోగించినాడు "ఆంధ్రదేశ భాషా వివిధ ప్రసంగముల చందము నందముగా నొనర్చి" (1-11)

విశ్వేశుని వంశానికి "భృత కుమారారామ భీమెుడు చాళుక్య భీముఁడు" చంద్రుడు (1-4) అట

5 20 2 ఆంధ్రదేశానికి త్రిలింగదేశం అనేపేరు ఎలా వచ్చిందో ఈ పద్యం తెలుపుతుంది

ధర శ్రీపర్వత, కాళేశ్వర, దాక్షారామ సంజ్ఞ వ.లు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జను గృతులన్"
(1-5)

5 20 3 రాజమహేంద్రపుర ప్రస్తావన రెండు చోట్ల ఉంది "రాజమహేంద్రపుర స్థాత రాజనరేంద్రుఁ డెక్కువ తాత" విశ్వేశన్న పటికి (1-4) తృతీయోల్లాసంలో ప్రబంధోచితమైన అష్టాదశ వర్ణనలు చేసే సందర్భంలో పురవర్ణనకు ఉదాహరణగా తాను నివసించే రాజమహేంద్రవరాన్నే వర్ణించినాడు విన్నకోట పెద్దన గంభీర పరిఖ, ఎత్తైన ప్రాకారం, చాతుర్వర్ణ్యం, గౌతమి ఇవన్నీ సాలంకారంగా ఈ సీసంలో చూర్చబడినాయి

"గంభీర పరిఖ నాగ స్త్రీల కక్రాంత కేళి విహార దీర్ఘిక యనంగ
నుత్తాల సాల మప్సరల కుచ్చె దివిఁ బ్రాకఁ జెలన దీర్ఘ నిశ్రేణియనఁగఁ
జతుర చాతుర్వర్ణ్య సంఘ మర్థుల పాలి రాజిత కల్పతారామమనఁగ
భ్రాంత సుస్థితయైన భవ జూట వాహిని భుక్తి ముక్తి ప్రద స్ఫూర్తి యనఁగ
నెప్పుడును నొప్పు రాజమహేంద్రవరము" (3-94)

కవి యింటిపేరు విన్నకోట – విన్నకొట గ్రామం కృష్ణా జిల్లాలో ఉంది84 లక్షణ శాస్త్రంలో ఉదాహరణలకోసం తమకిష్టమైన క్షేత్రాల్నో, ఊర్లనో చెప్పడం వల్ల ఆ నాటి వాటి వైభవం మనం ఇప్పుడు తెలుసుకొగలుగుతున్నాము

5 21 శ్రీనాథ యుగంలో వెలసిన కవుల సాహిత్యాన్ని పరిశీలించినపుడు తెలిసే ముఖ్య విశేషాలు కొన్ని

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

శ్రీనాథుడు తన కావ్యాలలో వీలున్నంత ఎక్కువగా నాటి 'తెలుగునాడు' స్వరూపాన్ని ప్రతిబింబింపజేసినాడు శ్రీనాథుని కావ్యాలలో పంచారామాలు, శ్రీశైలం పల్నాడు వంటివి ప్రాధాన్యత వహించాయి వినుకొండ వల్లభరాయని వీధి కావ్యంలో ఓరుగల్లు సవిస్తరంగా వర్ణితమైంది ధనాభిరామంలో దాక్షారామం కథా స్థలం సింహాసన ద్వాత్రింశికలో ఆంధ్ర దేశంలోని ముఖ్యక్షేత్రాలు వర్ణింపబడినాయి. గౌరన నవనాథ చరిత్రంలో శ్రీశైలం విస్తారంగా చోటుచేసుకొంది తాళ్ళపాక అన్నమయ్యలో తిరుపతివంటి వైష్ణవ క్షేత్రాలు ఆ క్షేత్రాధి దైవతాలు పరికీర్తింపబడినారు

తెలుగు మాగాణంలో ప్రబంధ సస్యాలు పండించిన స్వర్ణయుగం కృష్ణదేవ రాయల యుగం – లేక ప్రబంధయుగం ఆ యుగ సాహిత్యంలో 'తెలుగునాడు' స్వరూపాన్ని తర్వాతి ప్రకరణంలో పరిశీలిద్దాం

## సూచికలు :

1 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 109
2 ,, పు 216
3 నూటయెనిమిది దివ్యతిరుపతులలో తెలుగు దేశంలో ఉండేవి తిరుపతి-తిరుమల అహోబలం రెండు మాత్రమె సర్వవరం అందులో చేరదు
4 భీమేశ్వర పురాణం, పు 51
5 ,, పు 50
6 ,, పు 50
7 ,, పు 49
8 ,, పు 50
9 ,, పు 50
10 ,, పు 50-51
11 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 134
12 ,, పు 318
13 ,, పు 82
14 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 82
( India as described in early texts of Buddhism and Jainism p 78 )
15 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 467
16 భీమపురాణం, పు 47
17 ఆంధ్ర కవి తరంగిణి, సం 5 పు 62
18 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 43
19 ఆంధ్ర కవి తరంగిణి, పు 65-66
20 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 151.
21 ,, పు 467

22. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 88
( వావిళ్ళవారి ప్రతిలో 'పెంకటూయి' బదులుగా 'మేకరాయి అని ఉంది )
23 తెలుగు చారిత్రక కావ్యాలు
24 ,,
25 శివరాత్రి మాహాత్మ్యము, పీఠిక పు 3-4
26 చేవూరు అని ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం పు 171
27 చెరువాలు గ్రామము - ఆంధ్రదేశ చరిత్ర భూగోళసర్వస్వం, పు 169
28 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 63, 111-14
29 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 83
30 ,, పు 94
31 ,, పు 164
32 ,, పు 269
33 ఆంధ్ర సాహిత్య చరిత్ర, పు 442
34 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 247
35 ,, పు 146
36 శ్రీ మహా భాగవతము పీఠిక, పు 18
37 ,, పు 23
38 ,, పు 24
39 ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం, పు 228
40 ,, పు 46, 320
41 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం, పు 258
42 ,, పు 247
43 ,, పు 258
44 ఆంధ్రదేశ భూగోళ సర్వస్వం
45 ప్రాచీనాంధ్ర శాసనములు, పు 170
46 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం, పు 238
47 శృంగార శాకుంతలం, పీఠిక, పు 22
48 ఆంధ్ర శ్రీవిష్ణు పురాణము, పీఠిక, పు 3
49 ప్రాచీనాంధ్ర చారిత్రిక భూగోళం, పు 34-35
**50 A L Vt - M P P 393**
51 సింహాసన ద్వాత్రింశిక, పు 1
52 ,, పు 5
53 ,, పు. 6

54 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం పు 112
55 సకలనీతి సమ్మతం, పీఠిక, పు 5
56 ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వం పు 379
57 ధనాభిరామం, పీఠిక, పు 6
58 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం, పు 267
59 తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహిత్య ప్రక్రియలు, పు 62-63.
60 ,, ,, పు, 157
61 తాళ్ళపాక కవుల పదకవితలు, (ది భా) పు 286
62 ,, పు 286
63 ,, పు 287-288
64 రాయలసీమ లోని దేవాలయాలు, పు 55
65 తాళ్ళపాక కవుల పదకవితలు, పు 291
66 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం, పు 124
67 తాళ్ళపాక వారి పదకవితలు, ద్వి సం పు 291
68. కడప ఊర్ల పేర్లు, పు 278
69 తాళ్ళపాక వారి పదకవితలు, పు 294
70 పై గ్రంథంలోనివే కొన్ని ఉదాహరణలు, వివరణలు
71 కడప ఊర్ల పేర్లు, పు 341
72 ,, పు 332
73 కడప ఊర్ల పేర్లు, పు 382
74 తాళ్ళపాక వారి పదకవితలు, (ద్వి సం) పు 298
75 ,, ,, పు 298
76 కడప ఊర్ల పేర్లు, పు 417
77 తాళ్ళపాక వారి పదకవితలు, (ద్వి సం) పు 299
78 కడప ఊర్ల పేర్లు, పు 373
79 తాళ్ళపాకవారి పదకవితలు, ద్వి సం పు 305
80 కడప ఊర్ల పేర్లు, పు 472
81 తాళ్ళపాకవారి పదకవితలు, ద్వి. సం పు 293
82 ,, ,, పు 294
83 కడప ఊర్ల పేర్లు, పు 306
84 ఆంధ్ర దేశ చరిత్ర భూగోళ సర్వస్వం పు 433

# 6

# శ్రీకృష్ణదేవరాయల యుగ సాహిత్యంలో తెలుగు నాడు

6 (1) పదహారవ శతాబ్దాన్ని శ్రీకృష్ణదేవరాయల యుగం అంటారు ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు. ఆంధ్ర భోజుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు, అష్టదిగ్గజ కవుల పోషకుడు, సంగీత శిల్ప నృత్య కళాపోషకుడు, సంస్కృత భాషలో కావ్యాల్ని తెలుగులో 'ఆముక్తమాల్యద' ప్రబంధాన్ని రచించిన ప్రౌఢ కవీంద్రుడు, ఆంధ్ర సాహిత్య నందనంలో ప్రబంధ ప్రసూన పరిమళాల్ని వెదజల్లించినవాడు శ్రీకృష్ణ దేవరాయలు.

16వ శతాబ్దాన్ని 'ప్రబంధయుగం'గా కొందరు ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు పరిగణిస్తారు. ప్రబంధ ప్రక్రియ ఆ శతాబ్ది ఆంధ్ర సాహిత్యాన్ని ఏకచ్ఛత్రంగా ఏలింది. ప్రబంధాల్లో ఆద్యంగా చెప్పబడే మనుచరిత్ర, ప్రౌఢప్రబంధాలుగా చెప్పబడుతున్న ఆముక్తమాల్యద, వసుచరిత్ర, పాండురంగ మాహాత్మ్యాలు ఈ యుగంలోనే ఉద్భవించినాయి.

పద్య నవలగా ప్రస్తుతించబడే విచిత్ర చిత్ర కల్పనస్ఫూర్తి రసవత్తరంగా సాగిన కళాపూర్ణోదయం, భక్తిభావాన్ని మహోన్నతంగా చిత్రించిన ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యం ఈ యుగంలో వెలుగు చూసినవే.

శ్రీకృష్ణ దేవరాయల యుగంలో నేను పరిశీలించిన కవులు ముప్పయి మంది. వారు – 1 అల్లసాని పెద్దన 2 నంది తిమ్మన 3 శ్రీకృష్ణ దేవరాయలు 4 అయ్యలరాజు రామభద్రుడు 5 మాదయగారి మల్లన 6 ధూర్జటి 7 చింతలపూడి ఎల్లన 8 మోహనాంగి 9 కందుకూరి రుద్రకవి 10 తెనాలి రామకృష్ణుడు 11 సంకుసాల నృసింహకవి 12 దోనేరు కోనేరు నాథుడు 13 భాను కవి 14 భైరవ కవి 15 భట్టు పెసుమర్తి కోదండరామకవి 16 అందుగుల వెంకయ్య 17 రామరాజభూషణుడు 18 పింగళి సూరన 19. అద్దంకి గంగాధర కవి 20 పొన్నిగంటి తెలగన కవి 21 రామరాజు రంగప్ప రాజు 22. తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు 23 మరింగంటి సింగరాచార్యులు 24 చరిగొండ ధర్మన్న 25 బొడ్డుచెర్ల చిన తిమ్మయ 26 తాళ్ళపాక తిరువేంగళ నాథుడు

27 తెనాలి అన్నయ 28 తెనాలి రామభద్రకవి 29 దామర్ల వెంగళనాయకుడు 30 సారంగు తమ్మయ — అనే వారు

ఆయా కవుల కావ్యాలలో మనం దర్శించగల తెలుగునాడు స్వరూపాన్ని తెలపడమే ఈ పరిశీలన లక్ష్యం

6 1 అల్లసాని పెద్దన ఆంధ్రకవితా పితామహుడు 'అల్లసాని పెద్దన' 'అల్లసానివాని అల్లిక జిగిబిగి' అని ప్రసిద్ధికెక్కినవాడు శ్రీకృష్ణదేవరాయల 'భువన విజయ' ఆస్థానంలో తెలుగు ప్రబంధ పరిమళాల్ని వెదజల్లిన అష్టదిగ్గజ కవులలో అద్యుడు రాయల స్వహస్తాలతోనే 'గండపెండేరం' దాకాలికి తొడిగించుకొనినాడు ఎదురైనపుడు తన మద కరీంద్రము డిగ్గి కేలూత యొసగి ఎక్కించుకొనెవాడు పెద్దన కవీశ్వరున్ని రాయలవారు

పెద్దన 'మనుచరిత్ర' ప్రబంధాలలో నాయకమణిగా చెప్పబడుతున్నది ఆ ప్రబంధం రాయలవారికే అంకితం కృత్యవతారికలో ఆశ్వాసాద్యంతాలలో రాయల విజయాలను పరికీర్తించినాడు అల్లసాని పెద్దన. రాయల దిగ్విజయ పరికీర్తనలో కనిపించే తెలుగునాడుకు సంబంధించిన స్థలాలు, నదులు ఈ క్రిందివి

6 1 1 ఆంధ్ర, కళింగ, వేగి రాజ్యాలు, ఉపహూచలేంద్రంబు/ఉదయాద్రి ఒడ్డాది, కనకగిరి, కొండపల్లి, కొండవీడు, జమ్మిలోయ, పొట్నూరు, మాడెములు అనే దుర్గాలు-పురాలు, కృష్ణా, గౌతమీ నదులు

మను చరిత్రలో ఇవి గాక అదనంగా కనిపించేవి నంద వర పురం, పంపా రామాలు వాటి ప్రసక్తి కావ్యంలో ఉండే తీరు గమనిద్దాం

6. 1 2 కృష్ణరాయల పూర్వ దిగ్విజయ యాత్రలో నాలుగు ముఖ్య ఘట్టాలున్నాయి ఉదయగిరిని జయించడం, కొండవీడును జయించడం, కొండపల్లి విజయం, సింహాచలం వద్ద జయస్తంభ ప్రతిష్ఠాపన 1

6. 1. 3 మను చరిత్రలో ఉదయగిరి విజయప్రసక్తి (1-11,37, 2-101) మూడు సందర్భాలలో సన్నుతించబడింది 'ఉపహూచలేంద్రంబు మొదలు నెవ్వని కుమారతపఃప్రగౌండాచల రాజ్యమిచ్చె' (1-11) 'తొలు వొత్త సుదయాద్రి శిలఁదాకి పెంప్రడింప నపు డోహాయన వెచ్చనై జనించె' (1-37) నని కవి సన్నుతి కళింగ పై చైత్రయాత్రను పెద్దన ఈ సీస పద్యంలో వర్ణించినాడు

తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాకి కెరలు సింహపు లేహముస వెస్సునై జరించె
మఱి కొండవీడెక్కి మార్కొని నలిమైన యల కసవాపాత్రు నంటి రాచ
నట సాగి జమ్మిలోయఁ బడి వేఁగి దహించెఁ గోన వట్టెట్టెఁ గొట్టానఁ బగిలె
గనకగిరి స్ఫూర్తిఁ గరచె గౌతమిఁ గ్రాచె నవుల నా పొట్నూరు రవులుకొనియె
తె మాడెములు పేర్చి నొడ్డాది మసి మొనర్చెఁ గటకపురిఁ గాల్చె గజరాజు
గలఁగి పఱవఁ
దోఃసముద్భవ ఘోర నీ దురవగాహ ఖేలదుగ్రప్రతాపాగ్ని కృష్ణరాయ"
(1–37)

కృష్ణరాయల ప్రతాపాగ్ని ఏకవిచ్ఛిన్నట్లుగా కవి రూపకాలంకార సమన్వితంగా రచించినాడు ప్రతాపరుద్ర గజపతి కటకపురి మొదలు నెల్లూరు మండలం వరకు ఉండే తెలుగు దేశాన్ని పాలిస్తూ ఉండేవాడు.[2] రాయలు ఉదయగిరిని గెలిచినాడు కొండవీడును జయించినాడు కృష్ణా గౌతమీ నదుల మధ్య ఉండే వేగినాటిపై దండెత్తి జమ్మిలోయ, కొనసీమ, కొట్టాము మొదలగు మన్య సీమలను జయించినాడు కోన కొట్టాములు రెండూ గోదావరికి తూర్పున ఉండేవి రాజమహేంద్రవర దుర్గాన్ని లోబరచుకొన్నాడు బాహుబలింద్ర వంశస్థుల రాజధానియైన పొట్నూరిలో విజయ స్తంభం నాటినాడు[3] ఒడ్డాది మున్నగు పురాలను ఆక్రమించినాడు.[4]

కనకగిరి మొదలగు తెలంగాణంలోని దుర్గాలను రాయలు వశపరచుకొన్నాడు శ్రీనాథకవి వర్ణించిన సప్త మాడెములను గెలిచినాడు ఇవి గంజాం జిల్లాలో తూర్పు కనుమల పొడవునా ఉండే కొండప్రాంతంలో వెలసిన చిన్న రాజ్యములు ఒడ్డాది ప్రస్తుతం విశాఖజిల్లా వీరపల్లి తాలూకాలో ఉంది దాన్ని కూడా గెలిచినాడు రాయలు కృష్ణరాయలు విజయాంకములు. లిఖించి తాళ సన్నిభముగ పొట్నూరి వద్ద కంబం నిల్పినాడు సింహభూధర ప్రభు తిరునాళ్ళకు దిగి వచ్చే దేవతలు కళింగ మేదినీ విభుని అపకీర్తి అనే మసి పూసి ఆ విజయాక్షరాలు నిత్యం చదువుతుంటారట (1-40) ఆ నాడు సింహాద్రి తిరునాళ్ళు వైభవోపేతంగా జరుగుతున్నట్లు కూడా ఈ పద్యం వల్ల స్పష్టమౌతుంది

6 1 4 కృష్ణా గౌతమీ మధ్య భూమిని గెలిచినట్లు "కృష్ణా గౌతమీ మధ్య భూమ్యస్తోకోత్కలి రాట్పురీ హరణ లీలా వార్య శౌర్యోదయా" (2-78) అనే ఆశ్వాసాంత పద్యం తెలుపుతుంది

6 1 5 "కుకురు కాశ కురు. కోసల ఆంధ్ర ... సింహళ కన్యకలు రాయల రాజ లాంఛనాలు మోసే పరివారికలుగా ఉండేవారు" (1-83)

6. 1 6 రాయల కళింగ జయాన్ని గజపతుల అపజయావమానాల్ని ఈ క్రింది పద్యపాదాలు ప్రతిబింబిస్తాయి

"దుర్భరానకార్పటీ ఘూర్ణమాన కొండపల్లి కొండవీడు మండలా" (3-144)
"అసకృన్మాద్యత్కళింగాంగనా బంధిగ్రాహ విగాహి తోత్కర కకుబ్ఘాటీ సమాటీకనా"
"కాంతార పాతిత కాళింగ పులేశ" అనేవి ఆ పద్యపాదాలు (5-105)

6. 1. 7 శ్రీకృష్ణరాయలు "వర పంపారామ రామా మణీ గేయహ గేయా మేయ జయాం"కుడు (6-124) "వెంకట విభు చరణ స్మరణ ప్రసంగ సంతత మతి" (1-17)

6 1 8 అల్లసాని పెద్దన సంపవర పుర వంశోత్తంసుడు (ఆశ్వాసాంత గద్య) సండవరం ఆదోని తాలూకా కర్నూలు జిల్లాలో ఉంది 5

ఇలా అల్లసాని పెద్దన 'మనుచరిత్ర' ప్రబంధంలో మనకు కనిపించే తెలుగు నాడు స్వరూపం కృష్ణరాయలనాటి విజయయాత్రకు లోబడిన ఆంధ్రదేశ స్థలాలే

6 2 నందితిమ్మన రాయల అష్టదిగ్గజకవులలో రెండవవాడు 'ముక్కు తిమ్మనార్య ముద్దు పల్కు' అని ఈ కవికి కవితా ప్రసిద్ధి 'పారిజాతాపహరణ ప్రబంధం ఈయన రచన కృష్ణరాయల వారికి అంకితం

6 2 1 పారిజాతాపహరణ ప్రబంధంలో కనిపించే తెలుగునాటులోని ప్రదేశాలు కాళింగ దేశం, అనంతగిరి, ఉదయగిరి / ఉదయాద్రి కంబం మెట్టు, కొండపల్లి, కొండవీడు, జల్లిపల్లె, దేవరకొండ, నంది, బెల్లంకొండ, వినుకొండ, శ్రీవేంకటగిరి, అనె దుర్గాలు-గ్రామాలు, భువనవిజయం (రాజాస్థానభవనం), మలయకూట ప్రాసాదం అనే ప్రసిద్ధ భవనాలు ప్రసక్తాలు

6 2. 2 కృష్ణరాయల తండ్రి నరసరాయలు ఆతనికి 'కాళింగ యవనాది వివిధ దేశాధినాథులు అరిగాపులు'గా ఉండినారు (1-11) కృష్ణరాయలు "విదళిత కాళింగ మదాస్పద సింధుర కుంభరత్న" మని కీర్తింపబడినాడు (3-61) ప్రద్యుమ్నుడు మూర్తత్వంతో కొండవీటి వద్ద కృష్ణనందనుడు మన్మథున్ని జయించినాడు అది మానుషమా ? కృష్ణరాయలు 'కొండవీటి' యుద్ధభూమిలో ప్రతాపరుద్ర నందను

డైన వీరభద్రుని కరుణామతి అను కాపాడెనాడు (1-21) కృష్ణరాయలు ప్రతాప రుద్ర గజపతి కొడుకు వీరభద్ర గజపతిని పంపసంగా బంధించిన విషయం తిమ్మన ఎంతో చమత్కారంగా పైపద్యంలో నివేదించినాడు

ఉదయగిరి కొండవీటి పదపీఠల మండలిక భాస్కర పదదా (3-60)
కొండపలి కొండవీటి మండల దండేశ సింధు మంథర కథరా ' అని

రాయలవారికి కవి ప్రస్తుతులు

6 2 3 కృష్ణరాయలు ఉదయగిరి, వినుకొండ, కొండవీడు, బెల్లంకొండ దెవరకొండ, జల్లిపల్లి, అనంతగిరి, కంబంమెట్టు గెలిచినాడు ఒల సికాయము దాలి మట్టులనె కటకమును (కటక్ – ఒరిస్సా) అనుదినమెప్తాడని ఉత్కళ మహీపుడు అను దినమూ భయపడుతూ ఉండేవాడు నంది తిమ్మన అందంగా అల్లిన ఈ సీసపద్యం కృష్ణరాయల విజయపరంపరను అడుగడుగునా వర్ణిస్తుంది

" ఉదయాద్రి వేగ యత్యుద్ధతి సాధించె వినుకొండ మాట మాత్రన హరించె
గూటము ల్సదరంగ కొండవీడగలించె బెల్లముకొండ యచ్చెల్లఁ జెరిచె
దెవరకొండ యుద్వృత్తి భంగము సేసె జల్లిపల్లి సమగ్రశక్తి డులిచెఁ
గినుక మెండు ననంతగిరి క్రిందు పడ జేసెఁ గంబంమెట్టు గ్రక్కునఁగదల్చె
బలసికాయము కాలిమట్టులనె యదఁచుఁ గటకమును సింత ననుచు నుత్కల
మహీశుఁ
డను దినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ
విభుఁడు" (1-23)

ఉదయగిరి నెల్లూరు జిల్లా ఉదయగిరి తాలూకాకు ప్రధానపట్టణం (గిరిదుర్గం) వినుకొండ గుంటూరు జి వినుకొండ తా లోని గిరిదుర్గం కొండవీడు గుంటూరు జిల్లా నరసా రావుపేట తా లో నరసారావుపేటకు 13 మైళ్ళలో ఉంది ప్రసిద్ధి కెక్కిన గిరిదుర్గం బెల్లంకొండ గుంటూరు సత్తెనపల్లి తా లో ఉండే గిరిదుర్గం కొండపల్లి కృష్ణాజిల్లాలో బెజవాడకు 9 మైళ్ళ దూరంలో ఉండే గిరిదుర్గం దెవరకొండ నల్గొండ జి దేవర కొండ తా కు ప్రధాననగరం గిరిదుర్గం, కంబంమెట్టు, వరంగల్లు జి లోని కమ్మం మెట్టు గ్రామం గిరిదుర్గం అనంతగిరి తెలంగాణలోని గిరిదుర్గం నల్గొండ జి హుజూర్‌నగర్ తా లో ఉంది[6] జల్లిపల్లి తెలంగాణా లోని మరొక గిరిదుర్గం[7]

'వేలుపు గొండ యుద్వృత్తి భంగముఁజేసె' అని పాఠాంతరం 8
వెలుపుగొండ వరంగల్ జిల్లాలోని గిరిదుర్గం 'జఫర్ ఘడ్' అని దీనికి ఇప్పటిపేరు 9

6 2 4 కవి యింటిపేరు నంది అది ఒక గ్రామం పేరే 'మలయమారుట ప్రాసాద నివేశ కృష్ణరాయ మహీశా' (2-1) అని తిమ్మన కవీశ్వరుని సంబోధన మనుచరిత్రలో కూడా 'మలయమారుట హర్మ్యవిహారీ' అని ఉండగా వావిళ్ళవారి ప్రతిలో 'వలయమారుట హర్మ్యవిహారి' అనే అప పాఠముంది' (1-33)10 'భువన విజయాఖ్యా సంపన్నవరత్న విభాత నలిరాప్త' అని తిమ్మన రాయల్ని కొనియాడినాడు (5-110) జగత్ప్రసిద్ధమైన రాయల ఆస్థానమండపం భువన విజయం సంగీత సాహిత్య నృత్య కళాక్షేత్రం గదా అది ·

నంది తిమ్మన 'పారిజాతాపహరణం' లో మనకు కనిపించే తెలుగు ప్రదేశాలు రాయలవారు గెలిచిన దుర్గాలు -అతని సరస, సాహిత్య జీవితాలకు నెలవులైన ప్రాసాదాలు మాత్రమే

6 3 శ్రీకృష్ణ దేవ రాయలు మూరురాయరగండడు, ఆంధ్ర భోజుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు, సంస్కృతాంధ్రాలలో సవ్యసాచిగా కావ్యాల్ని రచించినవాడు, సకల కళా పోషకుడు, దైవభక్తుడు - శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవ మతాన్ని కాంతాసమ్మితంగా బోధించే 'ఆముక్తమాల్యదా' ప్రబంధం రాయలవారి ఏకైక ఆంధ్రరచన తిరుమలేశునికి అంకితం

6 3 1 'ఆముక్తమాల్యద'లో తెలుగునాడుకు సంబంధించిన ప్రదేశాలు, నదీతీరాలు ఇవి-కళింగదేశం / కళింగ మేదిని / కళింగరాజ్యం/అంధ్ర /ఆంధ్ర, తెలుగు దేశము, ఉదయాద్రి / ఉదయోర్వీధరం / పూర్వాద్రి, ఒడ్డాది, కనకగిరి, కొండపల్లి, కొండవీడు, జమ్మిలోయ, పొట్నూరు / పొట్టునూరు, మాడెములు, విజయవాటి, శ్రీకాకుళం, సింహాచలధరం, సింహాచలం, వేంకటాచలం, శేషనగం, కాకోదరనగం, గౌతమి, కోనేరి, స్కందసరస్సు అనేవి

6 3 2 "రాయలు కళింగదేశ విజిగీషా మనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరంబులుండి, శ్రీకాకుళ నికేతనుండును మధు మథను సేవింపంబోయి" నాడు (1-11) ఏలలో అంధ్ర జలజాక్షుఁడు" కనిపించినాడు (1-12), నేనూ, ఆముక్తమాల్యదా శ్రీరంగంలో పెండ్లాడిన కథ చెప్పు ; నేను 'తెలుంగురాయఁడ'ను

'ఓ కన్నడరాయా' 'దేశంబు తెలుఁగు' నేను తెలుఁగువల్లభుండను "దేశ భాషలందు తెలుఁగు లెస్స" అని నీకు తెల్సిందె కదా. కాబట్టి తెలుగులోనే కావ్యాన్ని రచించు వెంకటపతి నీ యిష్టమైన వెల్పుగదా! ఆయనకే అంకితం చెయ్యి! పేర్లు వేరే అయినా ఆయనా నేనూ ఒక్కడే. అన్నాడు ఆంధ్ర విష్ణువు (1-13 నుంచి 16 దాకా)

6 3 1 రాయలనాడు ఒప్పుకొన్నారు కవి వంశవర్ణన చేసుకోవాలి ఎలాగ? తన్ను గురించి తన జయాలను గురించి, తానే చెప్పుకోవడం! అందుకే అల్లసాని పెద్దన మనుచరిత్ర కావ్యావతారిక నుండి కొన్ని పద్యాలు గ్రహించినాడు రాయల విజయములను వర్ణించిన పద్యాల్లో మనుచరిత్రలో చెప్పిన విషయాలు పోగా మిగిలినవి మాత్రమె ఇక్కడ పరిశీలింపబడతాయి

కళింగరాజ్య లక్ష్మి రమణీ లలామ కృష్ణరాయ నృప కుంజరుని మిన్నులు ముట్టిన మోహ జాలతో చేరింది 1-38) 'ఉత్కళ క్షత్రియపాత్రు' లంధరు అచ్చరల వాడవ కనుకందని మెనల్తో కాపురం పోయినారు బలసూదప పీటికి కొండవీటికి తొంటి పెద్దలే సూత్రము బన్నిన రౌ. మజి. (1-37)

"ఉత్కళ క్షత్రియ పాత్రులు యుద్ధమున గాసి పడి చావలేదు ముట్టడియందాహారపదార్థములు లభింపక పోవుటచేత ఆకటికి మాడి యసువులను విడిచిరి కావున కనుగందని మేనులతో స్వర్గమున కతిథులైరి" అని వేలూరు వెంకటరమణయ్యగారి వివరణ 11

6 3. 4 ఉదయగిరి దుర్గ విజయం "కర్ణాట ధరా ధృతిస్థిర భుజా హేవాక లబ్ధేభరాడుదయోర్వీధర" అనే ఆశ్వాసాంత పద్యంలో (1-89) వర్ణింపబడింది

ఉదయగిరితో పాటు కొండవీటి గిరిదుర్గం గెలుపు ప్రసక్తి ద్వితీయాశ్వాసాంత పద్యంలో ఉంది "భూమండన కొండవీడు ధరణీభృద్దుర్గ పూర్వాద్రి భాస్వదిభేశాత్మజ వీర భద్ర జన జీవగ్రాహ రాహూయమాణ ..." (2-101) అని ప్రతాప చంద్రుని జీవగ్రాహంగా పట్టుకొన్న సంగతి పై పద్యపాదాలు తెలుపుతాయి

పాత్ర ప్రహరేపడు మొదలైన ఓఢ్రుల చేత రక్షింపబడే మిన్నంటే సమర్థమైన యంత్రాలుండే 'కొండపల్లి'ని హరించే సామర్థ్యం ఉన్న కరవాలం కలవాన్ని అని తన్ను గురించి రాయలు సాలంకారికంగా ఆశ్వాసాంతపద్యంలో చెప్పుకున్నాడు (3-93) ఈ పద్యం రాయల 'కొండపల్లి' ఘనవిజయాన్ని చాటుతుంది

6 3 5 పొట్నూరు- సింహాచలం వద్ద రాయల విజయస్తంభ ప్రతిష్ఠాపన విషయం (1-36, 40, 4-290) మూడు చోట్ల ఉంది మొదటి రెండు పద్యాలు మనుచరిత్ర పీఠికలోనివే చివరి పద్యం మాత్రం రాయల రచన "సింహాచల దంభ కేసరి పదాభీష్టార్క నా పుణ్యలబ్ద దుచట్టంకణ పొట్టునూరి విజయస్తంభోపలోట్టంకితాంక దృఢేష్టాక్షర కృష్ణరాయనృప" (4-290) అని పద్యం సింహాచల నృసింహుని పాదసేవచే పొందిన విజయం, పొట్టునూరి విజయ స్తంభం మీద రాయలువారు చెక్కించిన శిలాక్షరాలు చెఱగనివి అని పద్యభావం

6 3 6 ఆముక్తమాల్యద కృతి భర్త అయిన వెంకటేశ్వర స్వామిని, తిరుమలను, స్వామిపుష్కరిణిని రాయలు ఆశ్వాసాద్యంతాల్లో స్తుతించినాడు షష్ట్యంతా లలో కూడా స్వామి ప్రశంస ఉంది

"గిరిపుష్కరిణీ తట ఘహన గన గుహా ఖేట వంచక పుళిందునకున్" (1-48) వెంకటాచలపతికిన్ (1-49) "కృకవాకు ధ్వజ దీర్ఘకాప్లవ క్రీడోత్సవో ద్యుత్సుకా" (3-90). శేషనగహర్మ్యకా (5-9) "వార్భృత కోనరి హారి హిర ణ్మయ హర్మ్య చంక్రమ పదా" (5-160) కాకోదర నవోదయస్థ పతంగా (6-1) వెంకటాచల రమణా (7-1) అని స్వామివారికి రాయల ప్రస్తుతులు శేషనగం మీద నెలకొన్న స్వామి, స్వామి పుష్కరిణి తెప్పోత్సవంలో తేలియాడే వెంకటేశ్వరుడు, బంగారు మందిరంలో నడయాడే బాలాజీ, కొండల కోనేటి రాయడు రాయలపలుకుల్లో మనం దర్శించే వెంకటేశ్వర స్వామి

రాయల ఆముక్త మాల్యద ప్రబంధంలో మనం దర్శించె తెలుగునాడు స్వరూ పము అద్దూ ఆపూలేని విజయ పరంపరలలో రాయలు గెలిచిన దుర్గాలు- రాయల ఇలవేల్పయిన శ్రీవెంకటేశ్వరస్వామి క్షేత్రం శేషశైలం, స్వామి పుష్కరిణి, స్వామి వారి ఆలయం

6 4 అయ్యలరాజు రామభద్రుడు అష్టదిగ్గజ కవులలో అయ్యలరాజు రామభద్రుడు కూడా ఒకడు 'రామాభ్యుదయం' ఈ కవి రచన గొబ్బూరి నర సింహరాజుకు అంకితం

6 4 1 రామాభ్యుదయ కావ్యంలో ప్రసక్తికి వచ్చిన తెలుగు నాడు సంబం ధిత ప్రదేశాలు ఆంధ్రి / ఆంధ్రీ, కళింగ, ఒంటిమెట్ట, కందనవోలు/కందెనవోలు, కొండవీటిపురం, గొబ్బురిపురీ/గొబ్బూరి గొబ్బూరు, చినకొట్ల, ధర్మవరం, వెంకట నగం అనేవి

6 4.2 'అంగ మగధాంధ్ర మకుర కళింగ' మహారాజుల కిరీటమణుల కాంతి కృతికర్త పాదాలను శోభావంతం చేస్తున్నదట (4-178) 'ఆంధ్ర పనుల సైరంధ్రి భవత్కీర్తి పాళ ప్రసవ కాంతి'ని కృష్ణవిభుని భుజబల ప్రతాపంతో వర్ధిల్లె కీర్తి పరిహసిస్తున్నదట ( అప 99 )

6 4 3 గొబ్బూరి పురి నృసింహ శౌరి పొల్పు నిర్మల హాసమై (అప 11) గొబ్బూరి నృసింహ నృపాలుని నందనుండగన్ ( అవ 2 ) . గొబ్బూరి నారసింహుని ( అవ 3 ) గొబ్బూరి తిమ్మ నృపాల సింహ నరసింహాఖ్య చూడామణిన్ (అప 1) గొబ్బూరి జలధిలోని శైవాత్మ కుండను (అవ 12) అని కృతిపతి వంశ చరిత్రలో గొబ్బూరు ప్రసక్తి వచ్చింది గొబ్బూరు మాన్యాపురం తా కర్నూలు జి లో ఉంది

6 4 4 కవి స్వస్థలం ఒంటిమిట్ట కడప జి లో ఉంది "ఒంటిమిట్ట రఘువీర శతక నిర్మాణకర్మఠ ఆయ్యలరాజు తిప్పయ మనీషి' కవి పూర్వీకుడు

6 4 5 గొబ్బూరి నారసింహునికి ఆరుగురు పుత్రులు – పెదతిమ్మరాజు, చిన తిమ్మరాజు, కృష్ణంరాజు ఇత్యాదులు వారిలో "పెదతిమ్మ భూవర కులాగ్రణి కందనవోలి భర్త . . కొండవీటిపుర దుర్గ రక్షణ పటిష్టమతిం చిన తిమ్మశౌరి" చేత చెయిస్తూ రాజ్యమేలినాడు (అవ 96)

కృతిభర్త "చినకొట్ల, ధర్మవర, నానారాజ్య ధౌరేయ, కందెనవోలి ముఖదుర్గ రక్షణ చణోదగ్రప్రభావోదయా" (1–97) అని స్తుతింపబడినాడు కందెనవోలు నేటి కర్నూలు వెంకట నగాధ్యక్షుండు కృతిపతిని రక్షించాలని కవి ఆశంస (అవ 1)

అయ్యలరాజు రామభద్రుని కావ్యంలో గొబ్బూరి నరసరాజు పాలనకు సంబంధించిన ప్రదేశాల ప్రసక్తి ఉంది వేంకటేశ్వర నివాసమైన 'వెంకటనగం' ప్రసక్తి ఒక పద్యంలో కనిపిస్తుంది

6 5 మాదయగారి మల్లన · శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజ కవులలో మాదయగారి మల్లన కూడా ఒకడు ఇతని కావ్యం రాజశేఖర చరిత్రము నాదెండ్ల అప్పయ కృతిభర్త

6 5 1 రాజశేఖర చరిత్రంలో కనిపించె తెలుగునాడు స్థలాలు అయ్యంకి పున్నాగహారం, గుత్తిదుర్గం, నాదిండ్ల, వేంకటగిరి అనేవి మాత్రమే

6 5 2 "శంకర పాదసేవన పావన మానస పంకజాత, అయ్యంకి పురాగ్రహార విహారకర, మాదయమల్లనసత్కవీ" అని కృతికర్త చేసిన కవి సంబోధన వల్ల అయ్యంకి పురాగ్రహారానికి అధికారి. ప్రస్తుతం కృష్ణా జిల్లా దివి తాలూకాలో ఉండే అయ్యంకి గ్రామం కావచ్చు 12

" నాదింల్లాన్వయ పార్ధి శీత రుచ. గోపనమంత్రి ధర్మ ధన గోపన
సమ్మతి గుత్తి దుర్గలక్ష్మీపరిపాలన ప్రేమసమిద్ధ భుజాబలశాలి " (1-27)

6 5 3 నాదెండ్ల గోపన మంత్రి గుత్తి దుర్గ పరిపాలకుడుగా ఉండేవాడని పైపద్యం చాటుతుంది. గోపమంత్రి తిమ్మరుసు మేనల్లుడు

.. "వెంకటగిరి గ్రావ వ్యాఘ్రాగ్రంబునం దావిర్భూత జనానురాగమునఁ బ్రత్యక్షాకృతిం బొల్చు నద్దేవోత్తంసుడు ప్రోచుఁ గాత మన నాదెండ్ల ప్ప దండాధిపున్"
( 1-1 )

అని కవి ఆశంస. వెంకటగిరి తిరుమలకొండే. నాదెండ్ల గుంటూరు జి. నరసారావు పేట తా. లో ఉంది13

ఈ విధంగా మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రంలో కనిపించే స్థలాలు కవి కివ్వబడిన అయ్యంకి అగ్రహారం, కృతిపతి పరిపాలిస్తుండే గుత్తిదుర్గం, కృతిభర్త యింటి పేరైన నాదెండ్ల గ్రామం, కృతిభర్తను చల్లగా చూడాల్సిన వెంకటేశ్వర స్వామి నివాసం వేంకటగిరి అనేవి

6 6 ధూర్జటి అష్టదిగ్గజ కవులలో ఒకడుగా రాయల మన్నన పొందిన కవి ధూర్జటి "స్తుత మతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గె ని యతులిత మాధురి మహిమ" అని ఈయన కవన మాధురిని కొనియాడే చాటువు

ధూర్జటి రచనలు రెండు 1) శ్రీకాళహస్తి మాహాత్మ్యము, 2) కాళహస్తీశ్వర శతకము అనేవి. కాళహస్తి పతి కృతి పతి

6 6 1 శ్రీ కాళహస్తి మాహాత్మ్యం మాహాత్మ్య గ్రంథంగానే గాక, కవి అతులిత భక్తికి, కవితా మాధురికి మారు పేరుగా తెలుగు సాహిత్య రంగంలో నిలిచి ఉంది. ఈ కావ్యంలో మనం దర్శించే తెలుగునాడులోని స్థలాలు, నదులు, తీర్థాలు పొత్తపినాడు, ఉడుమూరు, కాళహస్తి, కాళద్వీపం, తిరుకాళహస్తి, దక్షిణ కైలాసం, యమదిక్కైలాసం, జ్యోతిస్సిద్ధవటం, పీఠికాపురం, మహాకాళేశ్వరం, విక్రమసింహ

## ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

నగరం, వేంకటాచలం, శ్రీకూర్మం, శ్రీశైలం, సింహాచలం అనే ఊళ్ళు, స్వర్ణముఖరి, మొగలేరు, కుంభజ ఘటధర కన్యక, కృష్ణవేణి, గుండ్లకమ్మ, గౌతమి, పెన్న అనే నదులు, అవిముక్తం, ఇంద్రపతీర్థం, క్షీరనాయకతీర్థం, మయూరతీర్థం, మార్కండేయ మునీశ్వర తీర్థం, మోహాన తీర్థం, శివతీర్థం, సహస్రశ తీర్థం అనే పుణ్యతీర్థాలు, అగస్త్యాగ్రాసం, పడమటి కైలాసగిరి, దక్షిణరజత గిరి, అలిచెన స్థాణు నగరి, పుష్పాంబ కొండ, ఆండె నాడె కొండలు, ఇందుప్రాల శైలం, సదాశివ కొండ అనే కొండలు, గజకాననం, పూర్వాపరపుణ్యకాననువులు అనే అరణ్యాలు (ఒక్కొక్క స్థానానికి, నదికి, కొండకు ఉండే నామాంతరాల స్వరూపం ఆ యా చోట్ల వివరించబడతాయి)

6 6 1 1 కాళహస్తీశ్వరుని క్షేత్రమహిమ ద్యోతకమయ్యేట్లు కవి ఆ యా క్షేత్రం, పర్వత, నది, తీర్థాల పేర్లతో కలిపి ప్రయోగించినాడు.

కాళహస్తి నిలయుండు (4–39), కాళహస్తి సదనుండు (2–1) కాళహస్తి నాయకుండు (1–29) కాళహస్తిపతి (1–7 ఇటు కాళహస్తిపతి (2–158) కాళహస్తివిభుండు (1–47) కాళహస్తి దైవము (4–43), కాళహస్తిపురదైవము (3–222), కాళహస్తి నుండు (1–11 ఇంకా పలుచోట్ల) తిరుకాళహస్తీశుండు (4–203) కాళహస్తీశ్వరుండు (ప్రథమాశ్వాసాంతం – ఇంకా పలుచోట్ల) కాళహస్తి గిరినాథపురుష (4–119) కాళహస్తి గౌరిపతి (4–103) కాళహస్తి తుహినాంశుధరుండు (4–107) కాళహస్తి బాలేందు కళాధరుండు (4–104) కాళహస్తి హరీశుండు (1–31), శ్రీకాళహస్తి శివుండు (4–103, 117) శ్రీకాళహస్తి మహాదేవుండు (4–109), కాళహస్తి సర్వేశ్వరుండు, (4–51) శ్రీకాళ ద్వీపేశుండు (4–68, 94) అని అనేక విధాల కవి శ్రీకాళహస్తీశ్వర స్వామిని కొనియాడినాడు.

6 6 1 2 శ్రీకాళహస్తి అనే పేరు వచ్చిన వైనాన్ని పరిశీలిద్దాం "తొలి యుగమున త్రినామము గల వెలందియుఁ బ్రతి యందుఁ గాళంబను వాముల బేఁడును, దానికి సీతలి యుగమున హాస్తియున్ వ్రతంబుఁ గొల్వన్ (2–93) "గౌరి యండు, చెలందిఁ, బాము, గజముం గైవల్య సామ్రాజ్య లక్ష్మి రూపంబగు తన్ను గూర్చుకొనఁగా, శ్రీకాళహస్తీశ్వరుండై" పరమ శివుడు వాజిల్లినాడు (2–93, 94) క్లుప్తంగా ఆ కథ యిది

"కృత యుగ వేళ మర్కట కీటక మెక్కటి క్షితిధర కన్యకాంబు పరిషిక్త శరీరముతోద" (2-95) స్వామికి ప్రాకారములు, గోపురములు, నర్తన మందిరములు భోగమంటపం, గర్భగృహం, అంత పురం తంతువులతోనే అత్యంత నిష్ఠతో కట్టింది (2-96) ఆ సాలెపురుగు భక్తిని పరీక్షింపాలని శివుడు "ఆత్మావాసంబున నున్న దిప శిఖ కీలాఖిల తీవ్ర ప్రభా వ్యావిద్ధాంబరమై తంతుల్కొని తదియాగారముల్ ధూమమై పోఁజేసె" నాడు (2-98) సాలెపురుగు "కటకటా! నేను ప్రయాసమునఁ గట్టిన యిండ్లను గాల్చె దీపము అంపు పెక్కటగతి దీపికానల శిఖా పిసరంబులఁ ద్రావ బోవఁగన్" (2-101) అయ్యో కాలి బూడిదై పోతుందె ఈ సాలీడు - అని శంకరుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మన్నాడు (2-104) కైవల్యమే యభీష్ట మంది సాలీడు (2-105) "ఉర్వి లలముకొన్న తన తేజము లోపల నూర్ణనాభమున్" చెర్చుకొంది శివలింగం (2-107)

త్రేతాయుగం చివరలో ఒక "కాలఫణి భక్తిన్ దివ్యమాణిక్యముల్ పాతాళంబు నుండి తెచ్చి" స్వామిని అర్చిస్తుండేది ద్వాపరయుగ ప్రారంభ కాలంలో యుగా తీతుడైన శంకరుని 'ఒకహస్తి శ్రేష్ఠం' పూజించడానికి వచ్చింది (2-109) కేతకి సిది వారిలో గుర్తింపలిడి, మారేడు కొమ్మలు, పద్మాలు, కుముదాలు, కోసి తెచ్చి పాము అర్పించిన మణులను తోసివేసి "తొండానఁ గ్రోలిన తోయములను దక్షిణకైలాస ధరణీధరావాసుని" తానమాడించి పూజలు చేసి వెళ్ళిపోయింది (2-110)

సర్పం వచ్చి చూచి కోపంతో అవన్నీ పొర్దోసి తన పూజ తను చేసి వెళ్ళింది ఇలా ఒకటి చేసిన సమర్చనను మరొకటి తోసివేసి పగ పెంచుకొన్నాయి పాము అన్నవిహారాలు కట్టిపెట్టి రాత్రంతా శివరాత్రి జాగారం చేసి తన శత్రువు వస్తూనే మట్టుపెట్టాలనుకుంటుంది హస్తి తక్కువ తినిందా? పగవాన్ని పరిమార్చాలి అనే వచ్చింది

"పిన్నరూప మగుచు పెల్లగాఘాంబుజ నాళ మధ్య సీమఁ గాలనాగ మడఁగి యుండ" (2-143) గా కరి అక్కడికి చేరింది 'పాము సమర్పించిన రత్నాల్ని తీసి పారేయాలనుకొంది (2-146) అందుకోసం తొండం సాపుతూనే ఫణిరాజు "నా పూజ భగ్నఁడీవేళనను గ్రహించె" నని ముక్కుం గ్రోళ్ళలో సెక్కి . తదీయ కుంభ కుహర స్థానంబునం దిర్మిమ్మరన్ కొండల్గూలఁగ నెత్తి మొత్తుకొని దిక్కుల్మొట్ట గీఁపెట్టుచున్ (2-147) మొగలేటి మడుగున మునిగి తుండమ్మున నుదక మాక ర్షించి యూఁది యూఁది ..పెట్టునఁజిది చీది"ంది

దిక్పాదరీ తోచలేదు కరికి. ధర్మబుద్ధితో "ఏను చచ్చుట తప్పదు.. ... సరి చంపి చచ్చుట జనాహ్లాదంబు గాదా? యవాటీన స్థాణు నగంబు పద్మశిలగా" చేసు కొంటూను అసుకొంది (2-119). కరంబు శిరంబు యచ్చోటంత భగ్నత దాకింది. కుంభములు పగిలినాయి. కుంభస్థలములో ఉంచిన పాము చితికి పోయింది. ఏనుగూ మరణించింది. "తదీయ మరణస్థానంబు నవాపిన కైలాస నికటంబునను, సువర్ణముఖరీతటంబు నగంబు చేసి, క్షాద్రవేయ భద్రగజంబులు వృషభాకారంబుల దాల్చినారు (2-150, 152). స్వామిని పరిపరి విధముల ప్రస్తుతించినారు. స్వామి వారికి సాయుజ్యమిచ్చి గౌరి సహితుడై ఆ లింగంలో లీనమైనాడు. "అది మొదలుగ జంద్రాలంకారుడు.. శ్రీకాళహస్తిపతి యనగ బరగె" నాడు (2-155, 156). శ్రీకాళహస్తీశ్వరుడు నెలకొన్న నగం కాబట్టే శ్రీకాళహస్తి అనే పేరు ఆ నగానికి సార్థకంగా వచ్చింది.

6 6 1 3 శ్రీకాళహస్తి దక్షిణ కైలాసం ఎలా అయింది? సమాధానం ఇది– సింహ శరభాది మృగ సంకులితమైన 'గజకాననం' అనే ఉగ్రకాననం ఉండేది. విశ్వామిత్రుని శాపంతో తన పుత్రులు మరణించగా, వసిష్ఠుడు కుప్పకూలి పోతాడు. వసుమతి వసిష్ఠుని సముదాయించి శివుని కొల్వమంటుంది. ఆయన ఉగ్ర తపస్సు చేస్తాడు (1-65 నుండి 71 దాకా). "పంచముఖంబుల తోడి, ముక్త కంపు కాకారంబున పంచశర భంజనుండు పరమ శివలింగ రూపమున ఒప్పిమూభి ముఖంబున ప్రసన్నుడై" నాడు (1-75). స్వామి వసిష్ఠుడు కోరినట్లు యుగయుగాల అక్కడే నెలకొంటానని వసిష్ఠ ప్రతిష్ఠిత లింగంలో ప్రవేశించి నిలిచి పోయినాడు (1-75 నుండి 89). మహాదేవి ప్రమథులతో విభుని సేవింపను విచ్చేసింది. జ్ఞాన సూనాంబగా కీర్తిగొన్నది (1-89 నుండి 91 దాకా).

6 6 1. 4 ఆదిమ దంపతులు వసిష్ఠ తాపసాశ్రమ వనం లిఖానివాసులు కావడంతో రజతగిరి, దానికి తోడుగా దేవతాశైలం దక్షిణ దిక్కుగా వచ్చినాయి. ఆదిమ దంపతులకు తూర్పుభాగంలో 'దక్షిణ కైలాసము' అనే పేరుతో వెండికొండ విహారశైలమైంది. ఆ కొండకు ఉత్తరంగా 'పసిడికొండ' భైరవ, దుర్గాంబ, నాగముఖ రక్షితమై నిలిచింది. స్వామి అక్కడ వచ్చి నిల్చినాడు కాబట్టి కాళహస్తి 'దక్షిణ కైలాసం' కాగా, వెండికొండ 'దక్షిణ కైలాసగిరి' అయింది.

6 6 1 5 బ్రహ్మ వాణిని శత వాణులుగా చేసి సుఖించినాడు. ముప్పై వేలు రాక్షసులు పుత్రులుగా పుట్టినారు. భూదేవి గోడు చూడలేక తన మనోబలంతో

ఉగ్రుని ఉప్పరించేట్లు చేసి పరమేష్ఠి ఆ రాక్షసుల్ని పంపించినాడు పుత్రశోకితుడైన బ్రహ్మ ఉగ్రుని చూడగా అతడూ బూడిదై పోయినాడు (2-4 నుంచి 63) 'దక్షిణ రౌప్య శైల శృంగాంతరవాసు'ని గొల్చి పాపరహితుడయ్యెందుకు హంసల రథంతో తాను వాణి పయనించి, దక్షిణ రౌప్యశైలమున్ దర్శించినాడు మొగలేటఁ ఊర్ధ్వమూర్తి యహప్ప దర్శించి, జ్ఞాన ప్రసూనాంబ గొలిచి, దక్షిణ కైలాస గోత్రంబునఁ గూర్చుండి "అఖిల భూతాత్మ ముక్తియై యతి యిల్లు కొడుకుఁబడయగ సర్వేశుఁగూర్చి తపము" చేసినాడు (2-64 నుంచి 70) శివుడు ప్రత్యక్షమైనాడు "దేవ, నీవంటి దైవంబు దివ్య తీర్థరాజముల లోన దక్షిణ రజత శిఖరి వంటి క్షేత్రంబు" లేవు (2-76) నా కోర్కె నెరవేర్చు స్వామీ' అన్నాడు బ్రహ్మ "దక్షిణ కైలాసగోత్ర వీక్షణ మాత్రంబునను బ్రహ్మహత్యాది దోషంబులు వాసె మాఘమాసంబున మఘా నక్షత్రంబున సుషీ కాలంబున సువర్ణముఖరి స్నానమాచరించి, మౌనంబున నీ మహా లింగమునకుఁ బ్రదక్షిణంబులుఁ బ్రణామంబులుఁ బంచాక్షరీ మంత్రజపంబులును నూట యెనిమిది సేసి, ప్రతి మఘా నక్షత్రంబున నిష్టాధంబున నొక్క సంవత్సరంబు నడిపిన సుపుత్రుఁడు కలుగు, నీవె కాదెవ్వరీ వ్రతంబు నడపిన నిట్లయౌనని యానతిచ్చి సర్వేశ్వరుం డంతర్ధానంబు" నొందినాడు బ్రహ్మ భృగువు వంటి తపోనిధి కొడుకుగా కన్నాడు

6 6 16 శ్రీకాళహస్తి క్షేత్రమాహాత్మ్యాన్ని తెలిపే కథలు ఉడుమూరు తిన్నప్పకథ, నత్కీరుని కథ, ఇద్దరు వేశ్య కన్నెల కథ। వాటి పరామర్శ స్థూలంగా కొంత

పొత్తపినాటిలో పవినభూమిఁ గిరాతులకాటపట్టు లోకోత్తర వస్త్రవస్తుప్రభుమూలను పట్టుని మెప్పి ఉంటుంది అప్పక్షేణంబున కిథీశ్వరుండు నాథ నాథుండు.

పుళింద వేషుని మంచిగామిని తండే అనే ఆమె వారి నందనుడు తిన్నడు వారు 'కాటమేని జాతర' చెయ్యలేక చేసేందుకి వెళతాడు వేటకు తిన్నడు బయలుదేర తాడు సకల మృగ సంకలితంబగు వెంకటాచలంబు వంతం దెంచె పెట్టుకొని ఆవన విపిలో గల మృగాదిజంతువుల సంహరించినాడు 'పూర్వావని భృత్త నాటవుల' లో వేటను వెస్తా 'కుంభజ గ్రావ సుతా పుష్కరగిరి కాననమధ్యమున' విడిసినాడు 'అంజినాటి కొండలందు, సదా శివుకొండ, జనుని దిక్కు వెండికొండ'ల్లో వేటలాడు తుండగా స్వప్నమున శివుడు తిన్ననికి కలలో కన్పించి, "ఇచ్చట శిలా వట మూలం

బుసఁగొంత పెంప మొగలేటి మరిన్ శైలసుతాపతి" ఉన్నాడు. పూజించు అన్నాడు మాంస పంది వెంట తిన్నడు పసుగత్తి వెళ్లి ఉద్భవలింగాన్ని దర్శించినాడు శివలింగం అడవిలో ఒంటరిగా ఉంచి "ఇష్టం పంపనేల? . ఉడుమూరికి రాఁగదవయ్యా లింగమా!" అని ప్రార్థించినాడు. లింగం వెంట వస్తే దాకా తాను రానని వనవా రాన్ని ఊరికి పంపించినాడు "వాప్పలు కేలు దోయియొప్పిన్నన్ పవిత్ర కాంచనముఖీ జల మిప్పఁగ వచ్చి" స్వామికి నిమజ్జనమార్చి వాప్పంరసంజుడు ఆరగించమంటాడు శివుడు ఆరగించడు. శివు తినకపోతే నా ప్రాణాలే విడుస్తాను అని ఏడుస్తాడు తిన్నడు శివుడు ఆరగిస్తాడు

శివ బ్రాహ్మణుడు ఈ కిల్మిలం, ఎంగిలి, ఎలా తింటున్నావ్ స్వామీ! అంటాడు తిన్నని భక్తి మాకు అంటాడు శివబ్రాహ్మణులతో స్వామి శివుని నేత్ర రోగం మాన్పించేందుకు ఒక కన్నిచ్చిన తిన్నడు, శివుని రెండో కంటికోసం నిటలా క్షునకగ్గాన చెప్పు కాలితో గుర్తుగాసం కాక్కిపట్టి తన రెండో కన్ను పెరికించ బోతాడు స్వామి ప్రత్యక్షమై తిన్నని, బ్రాహ్మణుని తన ఆత్మలో ఐక్యం చేసుకుం టాడు (త్ర 3-130)

6 6 1 7 తిరువుకు తాళికేక ఒక శివ బ్రాహ్మడు వలస వెళుతుండగా శివుడు ఒక పద్యం చెప్పి, దాన్ని పాండ్యరాజు సభలో పఠిస్తే రాజు వెయి మాడలు ఇస్తాడు అని పంపిస్తాడు. ఆ పద్యభావం తప్పంటాడు నత్కీరుడు శివుడే వచ్చి వాదిస్తాడు పార్వతిదేవి కురులకు పరిమళం ఉండవచ్చు గాని, మానవ కాంతల కుండ దంటాడు నత్కీరుడు. శివుడు మూడోకన్ను చూపిస్తాడు తలచుట్టూ కన్నులు పెట్టు కున్నా తప్పు తప్పే అంటాడు నత్కీరుడు కుష్టవ్యాధి పీడితుడి వవుతావు అని శివుడు శపిస్తాడు. కైలాస శైలం దర్శిస్తే వ్యాధిపోతుందంటాడు. నత్కీరుడు కైలాస శైలం కోసం పయనిస్తాడు

దారిలో అణ్ణామలై కాంచి వంటి వివిధ క్షేత్రాలు సందర్శిస్తాడు నత్కీరుడు "విక్రమ సింహ నగరాసన్నయగు పెన్నయుఁ దీర్ఘయాత్రాపరులకు సురతరువు కొమ్మ యగు గుండ్లకమ్మయు, సుకృతి భూత పాతక శ్రేణి యగు కృష్ణవేణియుఁ గమలా చలోత్తుంగ సంగత తరంగ యగు గౌతమీగంగయుఁ, కుక్కుటేశ్వర పీఠంబగు పీఠికాపురంబును, అంహోమతంగ సింహంబగు సింహాచలంబును, విదళితోభయ కర్మంబగు శ్రీకూర్మంబును, గోకర్ణంబును .. పురుషోత్తమంబును" .. సేవిస్తూ ముందుకు సాగినాడు నత్కీరుడు

కాశిని దర్శించిన తర్వాత కైలాస పర్వతానికి ఎలాపోవాలో అని బాధపడుతుండగా ఒక భూతం చేతికి చిక్కి కుమారస్వామి దయతో బయటపడతాడు "కైలాసం బనెఁ గాని యుత్తర దిశా కైలాస మంచాడ(ద్రా) కాల(గ్రీవుడితండు దక్షిణ దిశాకైలాసముం జూచినన్ జాలుం గుష్టము" అని ఆలోచించి కుమారస్వామి, ఒక కొలనిలో తానమాడితే కైలాస పర్వతం చేరతావు అని ఉపదేశిస్తాడు అలా కొలనులో స్నానమాడి తల ఎత్తగా "అవాచీన స్థాణునగంబు హేమముఖరీ సింధు ప్రతీరంబునన్" చేరి ఉంటాడు కుష్టవ్యాధి మానింది నత్కీరునికి హేమముఖరీ కూలస్థ కైలాసమున్ సమీపించి, ఆ నదిలో తీర్థమాడి, గిరిజాధిపుని .. నూఱుపద్యముల ద్రావిడోక్తిం సంస్తుతిచేసినాడు ఆ కవి కోరినట్లుగానే 'కాళహస్తి పురదైవంబు' సాయుజ్యమిచ్చినాడు (3-180 నుంచి 222)

6 6 1 8 మధురాపురిలో మాణిక్యవల్లి అనే వేశ్యకు ఇద్దరు కూతుళ్ళు చదువుకొంటుంటారు శ్రీకాళహస్తీశ్వరునకు నత్కీరుండు చెప్పిన నూఱు పద్యంబులు పారంబుచేసి నిత్యవ్రతంగా పఠిస్తుంటారు "శ్రీకాళహస్తి పతి పద కోకపదారాధనంబె కులధర్మము ఆత్మనాథుండు దక్షిణ కైలాస విభుండు, . శ్రీకాళహస్తి నిలయు వినుత యొనరింపు జిహ్వక. వార ధర్మోపదేశంబు వలదు తల్లి" అంటారు తల్లి పోరు పడలేక ... "కాళహస్తీశ్వరున్ జేరంబోవక మానరు .. ఏ ధన్యులు మము . గాళహస్తి సర్వేశ్వరునిన్ గొలువఁ దొడుక బోయెదరు?" అని చింతిస్తుంటారు కన్నగాండ్రు ఇది విని "యింతులు సమ్మించినఁ గాళహస్తి నత్తురేఁ దక్కుచద్ద్రవ్యముల్" అని అనుకొని ఆ కన్యలతో "తిరుకాళహస్తి పతిఁజూప న్మాది. భారంబు .. నిశావేళం బ్రయాణంబు" రండి అంటారు వారు "జంగమాంగనా విలాసంబుఁగైకొని . కాళహస్తీశు దర్శించు కాంక్షఁగదలి" అనేక ధనంబులు వారి చేతికిచ్చినారు

దారిలో దొంగలు అకృత్యం చేద్దామనుకున్నపుడల్లా శివుడు ఏదో ఒక వేషంలో కనిపిస్తుంటాడు. పిడవిండ్లలో చంపబోగా జంగమ దేవరగా వచ్చి పూజలు కొని శ్రీకాళ ద్వీపేశుండు వారికి ఆత్మవిద్య ఉపదేశం చేసే నెపంతో సిద్ధ మెల్కొని ఉండేట్లు చేస్తుంటాడు "మాపటి సందునన్ చేరంబోదురు కాళహస్తికి" ఇంతలోనే ఏదో చెయాలి అని దొంగలు ఆలోచిస్తుంటే చెల్లి పసిగట్టి అక్కకు తెలుపుతుంది "అక్క వగి, యో యమ్మ పరాకేటికే చెప్పం జూపఁగరాని లోకజననన్ శ్రీకాళ

తానందంబు సంభవించు . శ్రీకాళహస్తి శివుని బూజింప మోక్షంబు సిద్ధమనుచు ఆ కన్యలు కుంభసంభవ ధరాధర కన్యకల దర్థమాడి . కాళహస్తి గిరిజాధిపు మానస విధి నిల్పి జప భాష చెసంగ . మనసూరకుండ కాళహస్తీశు దర్శింపఁ గదియు నపుడు శివుడు వారికి సాయుజ్యమిచ్చినాడు (4-115 నుంచి 127).

6 6 1 9 దక్షిణ కైలాస పర్వతానికి ధూర్జటి కవీశ్వరుడు కావ్యంలో ప్రయోగించిన నామాంతరాలు ఇవి అవాచీన స్థాణునగం (2-149) దక్షిణ కైలాస గోత్రం (2-69) దక్షిణ కైలాస ధరం (1-99) కాలదిగ్భాగ కైలాస శైలం (1-46) యామ్యభాగ కైలాసగిరి (1-110), అంతక దిశా రజత పర్వతం/యమాశ వెండిమల (4-115) జముని దిక్కు వెండిమల (3-53) దక్షిణ కలధౌత గిరి (4-117) దక్షిణ రజతగిరి (4-108) దక్షిణ రజత క్షితిధరం (2-153) దక్షిణ రజత శిఖరి (2-76) దక్షిణ రౌప్యధరాధరం (1-134) దక్షిణ రౌప్య శైలం (2-66) అనెవి

కాళహస్తీశ్వర స్వామి దక్షిణ కైలాస ధరణీధరావాసుఁడు (2-110) దక్షిణ రౌప్య శైల శృంగాంతర వాసుఁడు (2-64) గా పేర్కొనబడినాడు

6 6 1. 10 మేరుగిరి 'దుర్గాంబకొండ' గా వెలసింది (1-116) స్వామికి దుర్గా ధరాధరము విహారస్థలం అందుకే "కృత దుర్గా ధరణీధర సాను వినోద విహార" (2-153) అని కవి సంస్తుతించినాడు

6 6 1. 11 కాళహస్తీపుర వర్ణన పది పద్యాలలో (1-17 నుంచి 26 విపులంగా చేసినాడు ధూర్జటి "సంసార పార దౌచ్చాటనానల కీల .. కామలతా మూల కంద కుద్దాలంబు . అమృత లింగాకరము కాళహస్తి పురము" (1-17( "అతులైశ్వర్య పరంపరా విలసితంబైనట్టి తత్పట్టణ ప్రతిబింబంబునఁ జంద్రకాంత రచిత ప్రాకార మొప్పారు శివుఁడనంగ" (1-19) "కీటమునకైనం జక్రికైన న్మదాంధున కైనన్, బహు జీవ హంతకయినన్ దుర్వాసనల్ బాసి మోక్షనిధిం గొల్ల గొనంగ వచ్చునట" (1-20) చాతుర్వర్ణ్యం (1-23) వర్ణితమైంది "అప్పుర మున కామిని జనులు పొల్తురు యోగిజనంబు బోలికన్" (1-24) గజ, తురంగాల వర్ణన (1-25, 26) ఉంది అప్పురంబున కధిశ్వరుండు ... విశ్వేశ్వరుండు, రాజ శేఖరుండు (1-28)

శ్రీకాళహస్తి నాయకుఁడు ... యాదవ భూకాంతుని భక్తి తెలియఁ బూని, ఆ రాజు నిజ పురంబగు నారాయణవనముఁజేరి . రాజ వీధులందు చరించినాడు (1-31). మిండ జంగమై వచ్చిన అతని సేవలో రాజు 'పళ్ళెరపు కోమలి' నిమగ్నమై ఉండగా రాజు పిలిపించినాడు "కాళహస్తి విభుని దలచుచు ...రాజు ముందు నిలచిందామె తల గొరిగించినాడు శిక్షగా రాజు జంగం ఆమె నెత్తిన హస్తం చేస్తూనే తుమ్మెద పిండు వంటి కేశపాశం వచ్చింది ఆమెకు

మాయ జంగాన్ని రాజు దర్శించినాడు "కాళహస్తిం గల చోద్యముల్ బుధులు సెప్ప వచ్చి కనుంగొనన్ మహాలింగ నివాసమెవ్వియన్న" లేనందున చింతిస్తున్నాను "నీ కెన యైన భక్తవరుఁడం గానను .. దలఫాల శైల శిఖరాలయ గేహమ్ముఁ గట్టఁ బంపవే" అని ఆదేశించినాడు జంగమయ్య . "కాళహస్తి కనకశిఖర దివ్య నివాస పంక్తి మోహనముగఁ గట్టఁ బంపెద"ను, కాళహస్తి మహిమ వినిపించుస్వామీ' అని కోరినాడు మాయాజంగం మహేశ్వరుడే అని తెలిసి స్వామి ఆ క్షేత్రమహిమను, పవిత్రతను ఉపాఖ్యాన సహితంగా వివరించినాడు యాదవరాజు కట్టించిన స్వామి దేవాలయ వైభవం తిలకించండి ఈ పద్యంలో

"దక్షిణకైలాసధర హేమముఖరీ సరో నదీ మధ్యమ భూమియందుఁ
దిరుకాళహస్తీశ్వరుఁ దిరుగు వాలంగ జలాంత శిలాంత పర్యంతముగను
నేల త్రవ్వించి యన్నెలవున నుంచియు, రస వర్గ మెరిత మూర్తుయితోడ
సిటికల శిలల సంఘటించ బంధించి, యా మీద హిమగిరి సాటి వాహ
చండ గుహ భైరవాదుల సదనములును, గోపురావరణ నటన మంటపములును
భక్తి గట్టించి యమ్మహీపాలవరుఁడు, ధరణి నేలుచు నుండె శంకరుని కరుణ"
(4-203)

6 6 1 12 శ్రీకాళహస్తి ఎంతటి పవిత్ర క్షేత్రమో అంతటి పుణ్యతీర్థం స్వర్ణముఖరీ నది ఆ నది తీరంలో మొగలి పొదల విస్తారాన్నిబట్టి మొగలేరు అనే పేరు, అగస్త్యకొండల్లో పుట్టింది కాబట్టి అగస్త్య పర్వత సుత - అనే పేరు వచ్చినాయి సువర్ణముఖరీ నదికి ధూర్జటి ఈ కావ్యంలో ప్రయోగించిన నామాంతరాలు ఇవి అష్టాపదముఖరీ (3-223) కనకముఖరీ (1-12) కాంచనముఖి (3-87) పొన్మొఖరి (1-64) సువర్ణముఖరీ (1-12) స్వర్ణముఖరి (1-107) హేమముఖరీ (1-148 ఇంకా కొన్నిచోట్ల), కేతకినది (2-110) కేతకి తటిని (4-150)

కేతకీ ద్వీపవతి (4-114) కేతక్యాపగ (4-173) మొగలేరు (2-67, 3-56, 4-117) కలశీసుత గిరికన్యా శైవలిని (2-153) కుంభజ క్షితధర కన్యక (2-95) కుంభజ గ్రావ సుతా [3-52] కుంభ సంభవ కుంభినీధర కన్యా [4-108] కుంభ సంభవ ధరాధర కన్యక [4-118] అనేవి

కాళహస్తీశ్వరుని "కలశీసుత గిరికన్యా శైవలినీతట కల్ప మహీరుహా" [2-153] అని కవి ప్రశంసించినాడు స్వర్ణముఖరీ జనన ప్రకారం, ఆ నది మాహాత్మ్యం ప్రథమాశ్వాస 107 వ వచనం నుండి 157 వ పద్యం వరకు విస్తృతంగా వర్ణింపబడింది ఆ కథ సూక్ష్మంలో మోక్షంగా ఇక్కడ చూదాం

పరమశివుని వివాహవైభవం చూడడానికి దక్షిణ దిక్చరాచర భూతములు హిమశైలమునకుఁ జనుదెర ఉత్తరాశా భూమి క్రుంగి దక్షిణ భూమి కడు నొద్ద గెడవు గాఁగ నెగసెన ఏసిని మాన్పను నీవైన, నేనైన సమర్థులము నీవు వెళ్ళు' అన్నాడు అగస్త్యునితో పరమశివుడు లోపాముద్రలో కదలి వచ్చినాడు అగస్త్యుడు దక్షిణానికి ఆ ప్రయాణంలో

"వింధ్య పర్వత గర్వంబు విఱుగఁద్రొక్కి, గౌతమీ కృష్ణవేణ్యవగాహనములు
సేసి శ్రీశైలనాథు దర్శించి మ్రొక్కి, సిద్ధ వట నాథుఁగొల్చి విచ్చేయునపుడు
(1-108)

"కుంభజుఁడు లోపాముద్రతోఁగూడి దక్షిణకైలాసము" దర్శించినాడు "యామ్య భంగ కైలాసగిరిన్ డగ్గఱి వంచిత పాంచ భౌతిక సుఖాకారాంగమున్ ఫణా రాజన్మహా లింగమున్ కాంచి వధూయుతుఁడై ధ్యానించి"నాడు . పంచాశద్వర్ణ మూర్తిం బరమ శివరమణిం జ్ఞానపుష్పాంబఁగొల్చినాడు దుర్గాంబకొండ నధిరోహించి, దుర్గాంబకు మ్రొక్కులిడినాడు (1-109 నుండి 116)

"మఱియు సమ్మునీశ్వరుండు గణేశ్వర భైరవాదులఁగొల్చి మునీశ్వరుల సన్నిధిని నిల్చి చంద్రికా కంచరితంబు గాని నిండు జందరు చందంబున మందాకినీ సుందరంబగు పుణ్య నది ప్రవాహంబు లెని కతంబున నిమ్మహాస్థలంబు దుఃఖంబు నావహించు చున్నయది, పరమేశ్వరు నుద్దేశించి తపంబొనర్చి యిక్కడ నొక్క నదిఁ బ్రవహింపఁజేయవలయు నను యా సంకల్పంబు నిర్విఘ్నంబుగా ననుగ్రహింపుఁడని వారలచే ననిపింపకొని దక్షిణకైలాస గోత్రంబునకుఁ జతుర్యోజన మాత్రంబున

రాత్రించర దిశాభాగంబున నొక్క మహాశైలంబుఁ గని" "ఆ కొండనెక్కి ఝరాంబు ధారలన్ స్నానంబుఁ జేసి" తపము చేయడానికి కూర్చొన్నాడు

"హేమధామ కిరీటునిఁ గూర్చి . తపమొనరింతుఁ గాక" । .. ఆయన కృపచే "భవకిల్బిష దభ్రసింధు'వు ప్రవహిస్తుంది అంది ఆకాశవాణి అగస్త్యుని ఉగ్ర తపంతో తన ఇంద్రపదవికి ఎక్కడ ముప్పు వస్తుందో నని దేవేంద్రుడు వెళ్ళి శివున్తో మొరపెట్టుకొన్నాడు శంకరుడు "ఎకు భీతిఁ బొందకు బలే దగస్త్యముని దక్షిణ రాష్ట్ర ధరాధరంబు దాపున నది లేని దుఃఖమున" మహాతపం చేస్తున్నాడు అని చెప్పి వారిని పంపించివేసినాడు (1-118 నుంచి 137)

"చదలే జనిపెద నీ బడి నది యాతని కొసఁగి మరలు మంజుగర్భా" అని మహాదేవుండనుపుటయు .. అజుఁడగస్త్యుని యెదుట ప్రత్యక్ష" మైనాడు అభ్ర గంగా నదిఁ దెచ్చి యిచ్చట నఖండ గతిం బ్రవహింపఁజేయుఁ" అని అభ్యర్థించినాడు అగస్త్యుండు (1-135 నుంచి 139 తమ్మిచూలి ఆకాశంవంక చూసినాడు సువర్ణ శోభా విభవంబుతో బహుళ భంగ మహా ముఖరత్వ సంపదన్ దేవనదీ ఝరంబు" నను దెంచింది "విదరించి తద్గుణ శ్రీ వెలయన్ సువర్ణ ముఖరీ ప్రథ దానికిఁగల్గ" జేసినాడు (1-140) ఆ గిరికి 'అగస్త్యగ్రావం' అనే పేరు వచ్చింది "ఆశాంతంబులన్ వగులంగ మ్రోయుచు, నభం బాద్యంతంబు నీకరాక్రాంతంబై మెఱయన్ సువర్ణ ముఖరీ గంగానదీ రత్నము" (1-141) ముని వెంట సాగింది

ముక్తాఫలాల్తో। శైవాలంతో, బిసకాండాలతో, జలపక్షులతో, అభంగ భంగాలతో ఒప్పారిందా నది "అరుణ ధరణీ భాగ యోగంబున శోణ భద్రాకారంబును, శ్వేత భూతల సమేత స్రోతంబుల వలన క్షీరతరంగిణీ శృంగారంబును, నీలశోణీతల ప్రవాహ శ్రేణి వలనఁ గృష్ణవేణీ విలాసంబును" (1-142)స్వర్ణముఖరీ నదికి సంక్రమించినాయి (1-142)

"వేంకటాచలాలంకారంబై, పరసు రామేశ్వర క్రీడారంగంబునకుం రంగవల్లికయై, కాళహస్తిపుర లక్ష్మీ బాలికామణికి మణిమాలికయై, యోంకార పుట భేదన భాగ్యదేవతాలలామంబై" ప్రవహించి వచ్చింది సొన్నముఖరి నది "ఘటసూతియుఁ దత్తటినీ తటంబుల శివలింగ ప్రతిష్ఠలు సేయుచు దక్షిణ కైలాసంబుఁజేరం జనుదెంచి" నాడు (1-142)

లోపాముద్రయుఁ దాను హేమముఖరీ లోలోర్మి డోలాంతర వ్యాపారంబులఁ దేలి (1–143) శివుని, జ్ఞాన ప్రసూన కలికను దర్శించి స్తుతించినాడు "అక్కడఁ గల తాపస బృందంబుతోడ దంపతులా శైలోపాంత హేమముఖరీ ద్వీపవతి తట శిలా ప్రదేశమునందు" (1–149) సంభాషించినాడు తన్నె వారు స్తుతించగా వినయంతో తల ఒగ్గినాడు "ఈనది యిక్కడ నుత్తరంబునకు నభిముఖమైనదియును, శివునకు గృహమైనదియుం దలపోయ నిది యవిముక్తంబున్" (1–156) అని ఆ నదికి కాశీ లోని అవిముక్తంతో సారూప్యత ప్రతిపాదించినాడు అగస్త్యుడు

6 6 1 13 శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో మనం దర్శించగల తీర్థాలు, అవిముక్తం, ఇంద్రతీర్థం, నిర్ఝరనాయక తీర్థం, మయూర తీర్థం, మార్కండేయ మునీశ్వరతీర్థం, మోహన తీర్థం, శిఖితీర్థం, సహస్రలింగతీర్థం అనేవి కాళహస్తి క్షేత్రం లోని తీర్థాల ప్రశంస కాశం అనే సర్పం, హస్తి చేసిన స్వామి ప్రస్తుతిలో ఉంది ఆ ప్రస్తుతిలో క్షేత్ర, తీర్థ, దైవతాల ప్రశంస కూడా ఇమిడి ఉంది

" జయ జయ కలశీసుత గిరి కన్యా, శైవలినీ తట కల్ప మహీరుహ
జయ జయ దక్షిణ రజత క్షితిధర, సంయమి సేవిత పాద సరోరుహ
జయ జయ వీస జ్ఞాన ప్రసవా, చల కన్యా కుచ దృఢ పరిరంభణ
జయ జయ కృత దుర్గా ధరణీధర, సాను వినోద విహార విజృంభణ
జయ జయ భారద్వాజాశ్రమ వన, సరసిజ కేళీవన పరితోషిత
జయ జయ నిల క్ష్మాధర పుణ్యా, స్థల కాపాలిక భాషిత భూషిత
జయ జయ మోహన తీర్థాలోకన, సంభ్రమ రత భవ బంధ విమోచన
జయ జయ శిఖి తీర్థాశ్రిత యోగీశ్వర మానస సంవిత్సుఖ సూచక
జయ జయ సహస్ర లింగాలయ దర్శన మాత్ర స్థితి మోదాపాదక
జయ జయ ఘన మార్కండేయ మునీశ్వర తీర్థ నిషిక్త విపచ్చినక
జయ జయ నిర్ఝర నాయక తీర్థ స్నాతక జన కలుషేంధన పావక
జయ జయ కరుణేక్షణ రక్షిత నిజ చరణారుణ పంకేరుహ సేవక
దేవా ! నిన్ను వర్ణింప రమా వాగ్దేవీ వల్లభు లైనను శక్తులే" (2–152)

వేశ్య కన్నెకల ప్రస్తుతిలో పుణ్యతీర్థ ప్రశంస వారి కథలోనే ఉటంకించబడింది

6 6 1 14 ఇంద్రకీల శైలం విజయవాడ వద్ద ఉండే కనకదుర్గ కొండ విన్నడు పూర్వజన్మలో అర్జునుడు. ఆ కథ చెప్పే సందర్భంలో అర్జునుడు "ఇంద్ర

కీల శైలేశ పయిం దపంబు రచియించె పాశుపతాస్త్రముం బడయ" (4-177) అని ఉటంకించబడింది

6 6 1 15 శ్రీకాళహస్తి క్షేత్ర మహిమను ప్రబోధించే ఈ క్షేత్రానికి ముక్తివధూటికి అభేదాన్ని ప్రతిపాదించే ఈ రెండు పద్యాల్తో కాళహస్తి మాహాత్మ్య కావ్య ప్రశంసను ముగిద్దాం

"శ్మశానాశా రజతాద్రి మేను, శిర మా శంభుండు దుర్గాద్రి నీ
ల మహాద్రుల్ భుజదోయి, పొమ్మ్శుఖరి లీలా వేణి, బాహాంఘ్రు లిం
ద్ర మయూరాఖ్యసహస్రలింగ పద భారద్వాజ తీర్థంబు లై
యమరున్ ముక్తివధూటి కన్నగర మాహాత్మ్యంబు సామాన్యమే?" (1-64)

"అక్కడఁబొల్లి సింహ శరభాది మృగాకులమై పునః పునః
పక్కణ నిస్వణ శ్రవణ బంధురమై శబరీ కిరాత స
మృక్కృత మన్మథ శ్రమ విహార మహా ఖురళీ కుడుంగమై
వాక్కలికీకృతేతర దవ జ్వలనోగ్ర వనంబు చెల్వగన్" (1-65)

దక్షిణ కైలాసంగా భక్తజనుల హృదయాల్లో పవిత్రభావనను, ప్రస్పందనను గలిగించే శ్రీకాళహస్తి క్షేత్రాన్ని ఇంత విరివిగా వర్ణించినది ధూర్జటి కావ్యం ఒకటే అని చెప్ప డంలో తప్పేమీ లేదు ఆ క్షేత్రం, తీర్థం, అధిదైవతాల మహిమను ఉపాఖ్యాన పూర్వకంగా కొనియాడుతుంది కావ్యం ఆ యా సందర్భాలలో తెలుగునాడు లోని మరి కొన్ని పుణ్యక్షేత్రాలు, పావననదులు, పర్వతాలు ప్రసక్తానుప్రసక్తంగా పేర్కొన బడినాయి

6 6 2 కాళహస్తీశ్వర శతకం ధూర్జటి రెండో రచన కాళహస్తీశ్వర శతకం భక్తి శతకాలలో విశిష్ట శతకంగా దీనికి పేరుంది శ్రీకాళహస్తీశ్వరా అన్నది ఈ శతక మకుటం ఈ శతకంలో కనిపించే తెలుగునాడు ప్రదేశాలు, నదులు— కాళహస్తి, శ్రీశైలం అనే పుణ్య క్షేత్రాలు, సువర్ణముఖి అనే పుణ్యానది

6. 6 2 1 సాలెపురుగు, సర్పం, సామజం, చెంచు వీరికి మోక్షమిచ్చిన సంగతి, శ్రీకాళహస్తీశ్వరుడుగా స్వామికి సార్థక నామం అయిన సంగతి 40, 41 పద్యాలలో చెప్పబడింది

'శ్రీశైలేశు భజింతునా యభవు గాంచినాథు సేవింతునో' అన్న పద్యంలో శ్రీశైల క్షేత్ర ప్రసక్తి ఉంది (పద్యం 72)

6 6 2 2 శ్రీకాళహస్తి క్షేత్రానికి పక్కనే పవిత్ర సువర్ణముఖరి నది ప్రవహిస్తుంటుంది ఆ నది తీరంలో ఉండే మామిడి తోపులో పద్మాసనం వేసుకొని కూర్చొని స్వామిని జపిస్తుంటే చాలు ఈ సంసారమాయ నటనలు, వృథా స్వామి అంటున్నాడా భక్త కవి చిత్తగించండి

" దినముం జిత్తములో సువర్ణముఖరీ తీర ప్రదేశామ్ర కా
నన మధ్యోపల వేదికాగ్రమున నానందంబునం బంకజా
సన సిద్ధిస్థితి నున్న జూడఁగన్న నది యా సౌఖ్యంబు లక్ష్మీ విలా
సిని మాయానటనల్ సుఖంబులగునె శ్రీకాళహస్తీశ్వరా '' (పద్యం 85)

ఈ విధంగా ధూర్జటి తను రచించిన రెండు రచనలు దక్షిణ కైలాస వాసునికి అంకితం ఇచ్చి తరించినాడు ఆ క్షేత్ర, తీర్థ, అధిదైవాల్ని నోరారా వర్ణించి, ఆంధ్రులకు ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని కరతలామలకం చేసినాడు

6 7 చింతలపూడి ఎల్లన శ్రీకృష్ణ దేవరాయల 'అష్టదిగ్గజ కవులలో' ఒకడు గాకపోయినా, రాయల సమకాలికుడై, మన్ననలు గొన్న కవి చింతలపూడి ఎల్లన ఈ కవి రచన 'రాధామాధవ' ప్రబంధం అచ్యుతునికి అంకితం

6 7 1 ఆ కవి ప్రౌఢ కవితా మాధురికి మెచ్చి భూషణాలే గాక 'రాధా మాధవ కవి' అనే బిరుదును కూడా ప్రసాదించినాడు శ్రీకృష్ణ దేవరాయలు ఆ విషయానికి అక్షర సాక్ష్యం క్రింది పద్యం

" రాధా మాధవ మచ్యుతాంకితముగాఁ బ్రౌఢ క్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయ విభుఁగర్ణాభేక మెప్పించి నా
నా ధాత్రీ ప్రతిమాన సత్కృతులలోనన్ భూషణ శ్రేణితో
రాధామాధవ నామ మందిన జగత్ప్రఖ్యాత చారిత్రుఁ డన్ " (1-30)

రాధామాధవ కావ్యంలో మనకు కనిపించే తెలుగునాడుకు సంబంధించిన స్థలాలు మూడే మూడు కళింగ, చింతలపూడి, సింహగిరి అనేవి

6 7 2 రాధకు స్వయంవరం చాటించినాడు సహస్రగోపుడు ఆ స్వయం వరానికి వెంచేసిన రాజులలో కళింగ రాజు ఉన్నాడు 'గజ ఘటా ఘంటికా ఘణ ఘణాత్కారముల్ పొంగార వచ్చెఁగళింగరాజు' అని కవి పలుకులు (4-5)

6 7 3 సరస్వతి పంపగా వచ్చిన 'కలికిచిలుక' రాధకు రాజకుమారుల వృత్తాంతం వివరిస్తుంది స్వయంవరంలో ఆ సందర్భంలో గజపతి వర్ణన ఉంది. సీపీతని పెండ్లాడితే సింహాద్రి తిరునాళ్ళలో నరసింహ స్వామికి సేయవచ్చు కిన్నర కన్నెలు పాడే మధుర గీతికలు వినవచ్చు అంటుంది. కవి వాక్యాల్లో పరికిద్దాం

"నళినదళాక్షి సింహగిరి నాయకుఁ జందన పర్వ వేళ నీ
చెలువుఁగూడి నీవెలమి సేవ యొనర్పఁగఁబోలు రత్నపు
గ్విలసిత శృంగ కోణముల పీఠెల మెట్టుచుఁ గిన్నరాంగనల్
కెలయుచుఁ బాడు తన్మధుర గీతి వినం గల వింపుసొంపులన్" (4–277)

కవి ఇంటిపేరు చింతలపూడి గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలో ఉండే 'చింతలపూడి' కావచ్చు 'చింతలపూడి రామయ్యప్రభు సుపుత్ర సుకవి వర్య రాధామాధవం బను శృంగార ప్రబంధంబు నందు' అని ఆశ్వాసాంతగద్య

ఈ విధంగా చింతలపూడి ఎల్లన రాధామాధవ ప్రబంధంలో కళింగ, చింతలపూడి, సింహగిరి అనే తెలుగునాడులోని ప్రదేశనామాలు కన్పిస్తాయి

6 8 మోహనాంగి . ఆంధ్ర భోజుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయలు ఆయన కుమార్తె మోహనాంగి మారీచీ పరిణయం ఆమె రచించిన కావ్యం అవతారికా పద్యాలు, కావ్యభాగంలో కొన్ని పద్యాలు మాత్రమే లభించినాయి

6 8 1 మారీచీ పరిణయం అవతారికా భాగంలో కనిపించే తెలుగునాడు సంబంధిత ప్రదేశాలు, నదులు – ఉదయగిరి, కనకగిరి, కొండవీడు, గోలకొండ, పొట్టునూరు, రాజమహేంద్రవరం, విజయవాటిక, శ్రీకాకుళం, సింహాచలం అనే దుర్గాలు, పురాలు, కృష్ణా, గోదావరీ నదులు

6 8 2 కృష్ణరాయల పితామహుడు ఈశ్వర రాజు. "ఉదయాద్రి ప్రభృతి ప్రదేశముల బాహుప్రాభవోపేతుఁడై కదన క్షోణిని నిల్చి ..ర్జించి"నాడు (అవ 54)

"ఉదయగిరిం గలట్టి బలియుం బహరేశ్వర పాత్రు నొంచి . వాఁడు దాల్చు నవరత్న కిరీటము కాలిపీఁటగా .. పదముల వారి పురముల స్నాన మొనర్చె"నాడు" కృష్ణ జగతీతల కాంతుఁడు" (అవ 75)

6 8 3 "కనకగిరిన్ వసించునెడఁ గల్గక మానదు స్వర్గవాసమంచును భయమంది కావలియు, సూపులుఁజానలుఁదాను, దాసి గ్రుచ్చిన విడనాడి, వింధ్యమునకుం జనియెన్ ముసు వీరభద్రరాజు" (అవ 76) రాయలు యుద్ధరంగంలో నిలబడి పిలుస్తూనే అలాజరిగిందట

6 8 4 కృష్ణరాయల పూర్వ దిగ్విజయ యాత్రను సరళంగా, శబ్దాలంకార సమన్వితంగా, కవయిత్రి రచియించింది. కొండవీడు, విజయవాడ, రాజమహేంద్రి వరాలపై రాయల విజయాలను అక్షరసత్యాలుగా తెలిపే పద్యం ఇది-

" కొండవీడు జనులు కొండ పీడుట మాని కావించి రచటనే కాఁపురంబు
విజయవాటిక వారు విజయవాటిక యఁకఁ డమ యూరు కాదని తల్లడిలిరి,
రాజమహేంద్రవర ప్రజల్ 'రాజ మహేంద్రా' యనిరి చేతులెత్తి మ్రొక్కి-
యొడ్డె మూఁకలు చేతులొడ్డె మూకస్థితి భయకారణమున సంప్రాప్తి కాఁగ
దిక్కులదరంగ సప్త ధాత్రీధరములు గ్రక్కదల గృష్ణరాయ ధరావరుండు
విపుల సేనతోఁ బూర్వ దిగ్విజయ యాత్ర కేఁగు నెడలఁదుందుభి భేరి
మ్రోఁగెనంత' (అవ 78)

6 8 5 కృష్ణా గోదావరీ నదుల మధ్య ప్రాంతాన్ని రాయలు పాదాక్రాంతం చేసుకొన్నాడు కృష్ణరాయల గజసేన తాగగా "కృష్ణ గోదావరులందుఁ గల జలముల్ సంపూర్తిగా శూన్యముల్ కాఁగా వానిని దానధారల యథాకారంబు గావించినాడు కృష్ణరాయలు (అవ. 79) రాయల గజబలాల సంఖ్యను, వితరణ బుద్ధిని మేళవించి చెప్పినదీ పద్యం

6 8 6 రాయలవారు నిల్పిన పొట్టునూరి విజయస్తంభం "సీతానాథ సమాన వీరుఁడగు నా శ్రీకృష్ణరాయేంద్రుఁ విఖ్యాతిన్ లోకుల కెల్లఁదెల్లముగ వ్యాఖ్యానంబు గావింపఁగాఁ బాతాళంబున నుండి వెల్వడిన సర్పస్వామియే"నట (అవ 80).

6 8 7 "కృష్ణరాయ కరాసిచేఁ ద్రెళ్ళి గోలకొండ, బీజపురంబుల నుండి స్వర్గ పట్టణంబున కరుదెంచినట్టి దొడ్డఖాను బిడ్డల కుంపుడుగత్తెలగుచు" ఊర్వశి మెనక, రంభ, తిలోత్తమ ఎబ్బిలు మాదిరి వస్త్రధారణ, అలంకరణలు, బురఖాలు ధరించినారట (అవ 84)

6 8 8 ఆముక్తమాల్యద కృతి నందిన శ్రీవేంకటేశ్వరుడు, ఆ ప్రబంధ నాయకుడైన శ్రీరంగనాయకుడు, ఆ కృతి రచించమని కలలో ప్రత్యక్షమైన శ్రీకాకు

కాంధ్ర విష్ణువు, ఆ ప్రబంధం వ్రాయకముందు రాయలు కొల్చిన శ్రీసింహాచలాధినేత రక్షిస్తుండగా కృష్ణరాయ భూపాలుడు అంటున్నాడు (అవ 93)

లభ్యమైన 'మారీచీపరిణయం' పీఠికా భాగంలో చమత్కారంగా, సరళంగా, అలంకారసమన్వితంగా కృష్ణరాయల విజయాల కీర్తనం చేసిన కవయిత్రి మోహనాంగి

6 9 కందుకూరి రుద్రకవి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో ఈశాన్య పీఠాన 12 సం॥ అధివసించి ఉండి అష్టదిగ్గజకవులలో ఒకడైన వాడు కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయం అనే యక్షగానం,* నిరంకుశోపాఖ్యానమనే ప్రబంధం, జనార్దనాష్టకం ఈ కవి రచనలు రుద్రకవి నేటి ప్రకాశం జిల్లా కందుకూరుకు సమీపంలోని చింతలపాలేనికి చెందినవాడు 14

6 9 1 ఈయన రచనలలో మనకు కనిపించే తెలుగునాడులోని ప్రదేశాలు, నదులు, కందపురం / కందసంశ్రితాచలం / కందుకూరు / తార భూమిధరం అనే ప్రదేశాలు, గోదావరి అనే నది మాత్రమే

సుగ్రీవ విజయం • ఈ యక్షగానం కందుకూరి జనార్దనునికి అంకితం ఇందులో మనకు కనిపించే పురం కందుకూరు ఒకటే కందుకూరి జనార్దనుని ప్రసక్తి ఐదు చోట్ల ఉంది "నానా నేత్రుడు కందుకూరి జనార్దనుండు నందితార్యుడు కందుకూరి జనార్దనుండు . సతదయాళుడు కందుకూరి జనార్దనుండు" అని ఒకే పాటలో మూడు చరణాల్లో స్వామి ప్రస్తుతి ఉంది తర్వాత అర్ధచంద్రికల్లో సర్వముదానగు జన్నపృక్కిన్ అని, దశావతారాలను కీర్తించే పాదాలున్నాయి కృత్యంతంలో ద్విపద ఛందస్సులో "నిగమ గోచరు పేర నిఖిల లోకేశుడగు కందుకూరి జనార్దను పేర నంకితంబుగ" అని కవి చెప్పుకొన్నాడు

6 9 2 నిరంకుశోపాఖ్యానం ఈ ప్రబంధం కందుకూరి సోమేశ్వర స్వామికి అంకితం ఈ కావ్యంలో కందపుర / కందుకూరి నగరి / కందుకూరు / కందసంశ్రితాచలేంద్ర / తారభూమి స్కంధ సోమేశ్వరం అనే ప్రదేశాలు, గోదావరి నది ప్రసక్తి లోకి వచ్చినాయి.

భూరి కృపావేశ కందపుర సోమేశా (4-1) అని రెండు చోట్ల, భూత భుజంగ దేశ కందపుర సోమేశా (3-1) అనే చోట కందపురి ప్రసక్తి ఉంది ఇంకా (1-17, 2-1) లలో కూడా కందపుర ప్రసక్తి కనిపిస్తుంది. కందపుర జనార్దనుడు

భీకర విరోధి మర్దనుడు, భక్తలోకాన్ని రక్షిస్తాడు (1-2)

"కందుకూరి నగరీ సోమేశ్వర స్వామి లోకాభీష్టంబు లొసంగగాత" (1-1) అని కవి ఆశంస 'కందుకూరి పట్టణ ప్రకాండ మండనోదయా' (2-144) అని కవి ప్రశంస

కంద సంశ్రితాచలేంద్ర కందరా (2-144) తార భూమి ధర ధామా (4-135), మహనీయైందవ సత్కళా భరణ రమ్య స్కంధ సోమేశ్వరా (2-142) అని కవి ప్రస్తుతి వాక్యాలు

వారాంగనా బద్ధుడైన నిరంకుశునికి అతని తల్లి బోధనచేస్తూ "విప్రధర్మంబెల్ల వీటిం బుచ్చి విరాళి పోకలఁబోనేర్చితే కుమార, కులము గోదావరిఁగలపి వేశ్యాసంగమానచే గావించితే సుపుత్ర" (2-83) అంటుందా తల్లి - హృదయంలో దుఃఖం సెగలు చిమ్ముతున్నా పలుకులలో మమతా మాధుర్యాల్ని చిలికిస్తూ 'కులం గోదావరిలో కలపడం' చక్కని జాతీయం

6. 9 3 జనార్దనాష్టకం : జనార్దనాష్టకానికి పాఠాంతరపద్యాలు రెండు కలిపి జనార్దనదశకం అవుతున్నాయి దక్షిణ నాయికుడైన జనార్దనుని శృంగారాలు, సరాగాల్ని ఎత్తిపొడుస్తూ నాయిక అన్న పలుకులే ఈ పంచదార చిలకల్లాంటి పద్యాలు 'దనుజ మర్దన కందుకూరి జనార్దనా' అన్నది ప్రతి పద్యంలోనూ ఉండే మకుటం మచ్చుకు మొదటి పద్యం ఉదాహరిస్తాను -

" సిరులు మించిన పసిడి బంగరు జిలుగు దుప్పటి జారఁగా
చరణ పద్మము మీఁద దేహము చంద్రకాంతులు దేరఁగా
మురువు చూపుచు వచ్చినావో మోహనాకృతి మీరఁగా
గరుడవాహన దనుజమర్దన కందుకూరి జనార్దనా !"

ఈ విధంగా కందుకూరి రుద్రకవి రచనలలో కందుకూరు, అందులో ఉండే జనార్ధనుడు, సోమేశ్వరస్వామి, గోదావరి మనకు దర్శనమిస్తాయి

6 10 తెనాలి రామకృష్ణుడు 'పాండురంగ విభుని పదగుంభనంబు' అన్నది తెనాలి రామకృష్ణకవి కవితా ప్రస్తుతి ఈయన అష్టదిగ్గజాలలో ఒక కవి అని ముందు నిర్ణయించినా తర్వాత కాదని ఆంధ్ర సాహిత్యకారులు తేల్చివేసినారు ఈయన రచనలు ఉద్భటారాధ్య చరిత్ర, ఘటికాచల మాహాత్మ్యము పాండురంగ మాహాత్మ్యము అనేవి.

తెనాలి రామకృష్ణుని రచనలలో మనకు కనిపించే స్థలాలు, పర్వతాలు, నదులు ఆంధ్రభూమి, కళింగదేశం; అహోబిలం, కదిరి, కరిద్విషన్నగం, కొండపీడు, కొల్లాపురి, గరుడాద్రి, తిరుమల, తెనాలి, నాదెండ్ల, పీఠికాపురం, పెనుగొండ, విరూరు, శేషగిరి, శ్రీశైలం అనే స్థలాలు-పర్వతాలు; కృష్ణ, గౌతమి, చంద్రభాగ, తుంగభద్ర, పెన్న, బాహుద, భవనాశని, భైమి, వేగవతి, వేత్రవతి, వృద్ధగంగ అనే నదులు

6 10 1 ఉద్భటారాధ్య చరిత్రము ఈ కావ్యంలో ప్రసక్తికి వచ్చిన ఊళ్లు కదిరె, చెదలువాటిపురం, తెనాలి, నాదెండ్ల అనేవి ఊర దేచమంత్రి ఈ కృతికి భర్త

6 10 1 1 కొండవీటి (కనక పీఠ(గొలువు దీరు .) శ్రీవీర శరభమూర్తి దేచమంత్రిని ప్రోచు(గాక అని కవి ఆశంస (1-5) మూలస్థాన మల్లికార్జునస్వామి చెదలువాడ శ్రీరామచంద్రుడు, వేదండ ముఖ తటాకం, చంద్రాననల గాంధర్వ మాధురి, వీసుగుల సమృద్ధము ఇవన్నీ ఉండేనాటి కొండవీడును ఈ పద్యంలో సాక్షాత్కరింప జేసినాడు. తెనాలి రామకృష్ణ కవి

" మహిత మూలస్థాన మల్లికార్జున శిరస్స్థల చంద్ర చంద్రికా ధవళిమంబు
చెదలువాటి పుర శ్రీరఘూద్వహ భుజాస్తంభ రక్షణ విధా సంభృతంబు
వేదండముఖ తటాకోదిత పద్మ సౌగంధిక గంధపాళింధమంబు
రాజబింబాననా రాజిత గాంధర్వ మాధురి సాధు రీతి ధరంబు
కరటి కట నిర్గళద్దాన నిరవధిక మార్గ నూతన వృష్టి జంబాలితాఖి
లావనీ పాల మందిర ప్రాంగణంబు గురుసమృద్ధుల నలుదోడు కొండవీడు "

(1-14)

6 10 1 2. రెడ్డి భూవర సింహాసనమై ఉభాయతనమై వర్ధిల్లు తత్పట్టణంబును బాహా బల సంపదం బెనచు భద్రోద్యోగి నాదెండ్ల గోపరసాధీశు(డు" (1-15) నాదెండ్ల గోప మంత్రిని ప్రస్తుతించేవి ఆరు పద్యాలు నాదెండ్ల గోప విభు(డు (1-16) నాదెండ్ల గోప శౌరి (1-18) నాదెండ్ల గోపమంత్రి (1-19) అని స్తుతింపబడినాడు అతనికి ఊర అన్నయ దేచ మంత్రి మంత్రిగా ఉండినాడు (1-21)

6. 10. 1 3 'కదిరె రెమ్మయ మాడ్కి'. (3-186) అని ఒక భక్తునికి

ప్రశంస పండితారాధ్యుడు, పాల్కురికి సోమన కూడా ఈ భక్తున్ని కొనియాడి నారు నేటి అనంతపురం జిల్లాలో 'కదిరి' ఒక తాలూకాకు ప్రధాన పట్టణం

6. 10. 2 ఘటికాచల మాహాత్మ్యం ఈ కావ్యంలో ప్రస్తావింపబడిన తెలుగునాడుకు సంబంధించిన స్థల – నది నామాలు అహోబలం, తిరుమల అనే స్థలాలు, కృష్ణ, తుంగభద్ర, వృద్ధగంగ, వేగవతి అనే నదులు

6 10 2 1 ఘటికాచల మాహాత్మ్యంలో 108 దివ్య తిరుపతులు పేర్కొన బడినాయి అందులో అహోబలం, తిరుమల మాత్రమే తెలుగుదేశంలో ఉండే తిరుప తులు అహోబల పర్వతాధ్యక్షుండైన శ్రీయుతాయుత వక్షు శిక్షిత విపక్షు" (1-65) "అత్తిరుమలకడ నున్న యమర లోక మాన్యు" (1-61) అని నృసింహస్వామికి, వెంకటేశ్వర స్వామికి ప్రస్తుతులు

6 10 2 2 "వృద్ధగంగ కృష్ణయు కావేరి తుంగభద్ర వేగవతి యాదిగా గల వివిధ నదుల" (1-70) ప్రసక్తి కావ్యంలో పుణ్యనదుల పేర్కొనే సంద ర్భంలో ఉంది

6 10 3 పాండురంగ మాహాత్మ్యం 'పాండురంగ విభుని పద గుంభ నం' అనే నానుడి ఈ ప్రౌఢ కావ్యాన్ని రచించడం వల్లనే తెనాలి రామకృష్ణునికి వచ్చింది ఈ ప్రబంధంలో కనిపించె తెలుగునాడులోని ప్రదేశాలు, పర్వతాలు, నదులు ఇవి ఆంధ్రభూమి, కళింగదేశం, అహోబలం, కరిద్విషన్నగం, కొల్లాపురి, గరుడాద్రి, తెనాలి, పీఠికాపురం, పెనుగొండ, శేషగిరి, విరూరు శ్రీశైలం అనే స్థలాలు, పర్వ తాలు, కృష్ణ, గౌతమి, చంద్రభాగ, తుంగభద్ర, పెన్న, బాహుద, భవనాశని, భైమి, వేగవతి, వేత్రవతి అనె నదులు

6 10 3 1 పాండురంగ మాహాత్మ్య కృతి భర్త విరూరి వేదాద్రి మంత్రి "ఆంధ్రభూమీ కుమాగ్రహారాభమైన శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేత సరసకవి. రామకృష్ణుఁడు" కృతి కర్త

6 10. 3 2 నిగమశర్మ తండ్రి సభాపతి. "అతండు కళింగ దేశాభర ణంబగు పీఠికాపురం బధిష్ఠించి సకల మహీసుర శ్రేష్ఠుండై" (3-4) వెలసి ఉండి నాడు .. అతని కొడుకు నిగమశర్మ "కళింగోద్భవుఁడగు కతమునను ప్రేలఁజూపక గసుగందక" ఉండినాడు (3-17)

6 10. 3 3 గరుడాద్రి సింహాసనమున నుండి యెల్ల జగముల నేలు లక్ష్మీశ్వరుండు శ్రీ యహోబిల నారసింహ నాయకుండు" (1-31)

అయుతుని ఘోర తపస్సు మాన్పేందుకు ప్రయత్నించే సందర్భంలో కృత్రిమ మునిగా వచ్చిన దేవేంద్రుడు చెప్పిన మాటలు ఇవి "కంచి భజించి శేషగిరిగన్గొని ...కరిద్విషన్నగ శిఖామణికిం బ్రణమిల్లి .. దివ్యాలి తీర్థముల్లెల్ల నాడుచున్" వచ్చినానని చెప్తాడు కరిద్విషన్నగం అంటే సింహాచలం

అగస్త్యుడు "అనంగరోపయ సిద్ధిగొ ద్రాపురి లక్ష్మి సేవించెన్ స్తుతియించె నాగమకథా శుద్ధోక్తులన్" (1-123) అని కథ సందర్భంలో కవి చెప్పిన పలుకులు

పుండరీక క్షేత్ర వర్ణనలో "కేదారంబు కంటె షడ్గుణంబును, వారణాసి కంటె దశమగుణంబును, శ్రీశైలంబు కంటె ననంతంబునై పుండరీకుని పేరం బొంద శీకంబన మహిమండల వైకుంఠలంబనగ నుండు" (2-96) అని పాండురంగ స్వామి పుండరీకునితో పలికిన మాటలు

"కను గొండయ ఇతని ధైర్యము పెనుగొండ వలె" (2-80) అని వను గొండయ కిచ్చిన కవి ప్రశంసా వాక్యాలు

6 10 3 4 కృతిభర్త వేదాద్రి ఇంటిపేరు విరూరి 'విరూరి పట్టణపతిన్ వేదాద్రి మంత్రీశ్వరున్' కృష్ణుడు రక్షించుగాక అని కవి ఆశీంచినాడు (1-1). ఆ యా సందర్భాల్లో విరూరి వేదాద్రిరాజ (1-2) విరూరి వేదాద్రి చమూవిభుండు ... (1-3) విరూరి మంత్రి వేదాద్రికి (1-6) విరూరి మందిరుడు (1-3, 70) విరూరి వేదాద్రిశౌరి (1-20) విరూరి కర్త (1-33) విరూరి మంత్రిమణి (1-78) విరూరి శాసన (1-81) విరూరి వేదాద్రిరాజు (1-72) అని ప్రస్తుతింపబడినాడు కృతిభర్త పేరైన వేదాద్రిని వేదగిరి (1-73) వేదాచలమంత్రి (1-5) అనడం కవి చమత్కారం

6 10 3 5 కుమారస్వామి అగస్త్యునికి వివిధ పుణ్యనదుల ప్రభావం ఒక సీస పద్యంలో వివరించినాడు ఆ విశేషణాలు ఆయా నదుల విశిష్టతను తెలుపుతాయి

" మిన్నేటి పొటియుఁ బెన్న యున్నతియు, విపాశ వాసియుఁ జంద్రభాగ వేగ
యును, శరావతి భూతియుఁ, వేత్రవతి చరిత్రము, బాహుద యుదార
తయును గృష్ణ
వేణి యగణ్యాభివృద్ధియుఁ గావేరి రీ...యుఁ, గపిల లీలావిభవము
మంజీర మంజువాక్ర్వైభవంబును, భవనాశనీ క్లేశ నిర్నామకృతియుఁ
దుంగభద్ర ప్రసంగ, ముత్తుంగ భద్ర రాణరాజిల్లు గౌతమియోజ, మఱియు
వార్తకెక్కిన తీర్థ ప్రవర్తనములు స్వామి వినిపించె వింధ్య సంస్తంభయితకు"
(1-148)

6 10 3 6 శివుడు నారదునితో తెలవిచ్చిన మాటలు –సహ్యాద్రిలో జనించిన కృష్ణ, గౌతమి, భీమరథి నదులకు త్రిమూర్తులం అధిదేవతలం కృష్ణుడు కృష్ణానదిని, బ్రహ్మ గౌతమిని, నేను భైమిని కాచి ఉంటాము అని ఈ భావాన్ని కవి పద్యంలో పరికిద్దాం–

" కృష్ణవేణి ప్రకాశించు నెంత మేర
నంత మేర మదీయమై యతిశయిల్లు
భైమి యేటి మున్న జలజసంభవుని యదియ
కాన మూర్తిత్రితయ మయాకార యయ్యె" (2-228)

"ఖిల దుష్కృప ప్రభావోదయ శ్రీసద్ధిన్ నగు దాని గౌతమి"అని చెప్పబడింది దండకారణ్యం కంటె గొప్పది గౌతమి ప్రాంతం అంతకన్నా గొప్పది పుండరీక క్షేత్రం (5-89)

పై విధంగా తెనాలి రామకృష్ణుడు తెలుగు నాడు సంబంధితమైన ఆంధ్ర, కళింగ భూములను, అందులోని ప్రముఖ పట్టణాలను, క్షేత్రాలను, పుణ్యనదులను తన కావ్యాల్లో ప్రస్తావించినాడు

6 11 సంకుసాల నృసింహ కవి : కవి కర్ణరసాయన ప్రబంధం సంకుసాల నృసింహకవి రచన ఆ ప్రబంధంలో 'తెలుగునాడు'కు సంబంధించిన ప్రదేశ నామాలేమీ కనిపించవు

సంకుసాల అనే కవి యింటిపేరు గ్రామనామమని, నేటి 'సుంకేసుల' నాటి సంకుసాల గావచ్చునని అంటున్నారు సుంకేసుల అనే పేరుతో కడప జిల్లా కమలా

పురం, కడప, పులివెందుల తాలూకాలలో ఏదో ఒక స్థలం15 పులివెందుల తాలూకాలోని సుంకేసుల గ్రామంలో వెలసిన నరసింహస్వామి పేరు కవికి తల్లిదండ్రులు పెట్టి ఉంటారని ఒక ఊహ16

6.12 దోనేరు కోనేరు నాథుడు: 'బాలభాగవతము' దోనేరు కోనేరు నాథుని రచన. ఈయన కావ్యంలో కనిపించే ఆంధ్రదేశంలోని ప్రదేశాలు – నదులు, అహోబలం, ఆరవీడు | ఆరవీడు, కందనోలు, పోలూరు, దోనేరు అనే ప్రదేశాలు– కృష్ణవేణి, గోదావరి, తుంగభద్ర, భీమరథి, సుప్రయోగ అనే నదులు

6.12.1 ఈ కావ్యానికి కృతిభర్త చినతిమ్మ రాజుల కవి "శ్రీమదహోబల త్ర్యంబకంబా సమగ్ర ... పెద్ద ... మహాదేవు"డు

కృతిభర్త తన తండ్రి "ఆరవీటి రామక్షితిపాత్మజుడగు తిమ్మభూపాలుడుకొం బుణ్యమ్ము గాఁగ" బాలభాగవతం రచింపమని కవిని అభ్యర్థించినాడు (1-19)

'పూర్వ సన్వయమున ఆరవీటి ... భూపాలుడు ... నుండినాడు' (1-29) తను "మన్నెపులి యని అంతట దిశలఁ వెలఁగి ... రాజ్య సంస్థాపకుండయ్యె. ఆరవీటి ...నుండయ్యె" (1-30) అతని కొడుకు రామరాజు

6.12.2 "గబ్బున్ దెబ్బది వెంపరాళ్వకులు వెక్కం గొల్వఁగా ... పెన్మబ్బుల్ గప్పఁగఁ గందనోలు గొను ప్రేమన్ ఉబ్బుమిట్టన్ సవా ... నుబ్బుణఁగించి తోలి"నాడు రామరాజు (4-33),

"కావేరి, గోదావరి, కృష్ణవేణి, తుంగభద్ర, సుప్రయోగ, భీమరథియను తరంగిణులు సహ్య మహీధరంబున వెడలె" (2-91) అని వచనం

కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాలోని గ్రామం ఆరవీడు. అర్వీటి వంశం విజయనగర సామ్రాజ్యాధిపతుల కాణాచి17 సుప్రయోగ అనగా పెన్నానది. పల్లవ యువరాజు విష్ణుగోపుని ఉరువుపల్లి శాసనం, తెలుగు చోడుడు పుణ్యకుమారుని మాలెపాడు శాసనంలో పెన్నకు సుప్రయోగ అనే పేరు వాడబడింది18

6.13 భానుకవి: ఈయన రచించిన కావ్యం 'పంచతంత్రి' కృతిపతి భండారు లక్ష్మీనారాయణుడు శ్రీకృష్ణదేవరాయల అంతఃపురంలో వాద్య, సంగీత, నృత్య విద్యలకు ఆచార్యుడు 19

6 13 1 ఈ కావ్యంలో కనిపించే గోదావరి, శేషాద్రి తెలుగునాడుకు సంబంధించిన నది – పుణ్యక్షేత్రాలు

"పల్లి గోదావరి తీరంబునఁ బ్రభంజనమ్మను పట్టణంబు గలదు" (2–4) అన్నప్పుడు గోదావరి ప్రసక్తి ఉంది

"లక్ష్మాయాఖ్యుఁడు శేషాద్రీశ్వర పాదయుగళీ చింతారత స్వాంతుఁడు'' (2–135)

తెలుగునాడుకు సంబంధించిన గోదావరి, శేషాద్రి 'పంచతంత్రి' కావ్యంలో ప్రస్తావనకు వచ్చినాయి

6 14 భైరవ కవి గారుడపురాణాంతర్గతమైన శ్రీరంగమహాత్మ్యాన్ని ఈ కవి రచించినాడు. ఇతడు గౌరన పుత్రుడు శ్రీశైల మల్లికార్జున స్వామి దేవేరియగు భ్రమరాంబ కృపచేత సారస్వత సిద్ధి బొందినవాడు 20

6 14 1 శ్రీరంగమహత్త్వం తెలిపే ఈ క్షేత్ర మాహాత్మ్యం కావ్యంలో కనిపించే తెలుగునాడు స్వరూపం ఇది అహోబలం, శ్రీవెంకటాచలం, సింహాచలం అనే పుణ్య క్షేత్రాలు – కృష్ణ, గౌతమి, చంద్రభాగ, తుంగభద్ర, పెన్న, భవనాశని అనే నదులు ప్రసక్తాలు

6 14 2 భరద్వాజుడు తన శిష్యులతో సహా తీర్థ తత్పర మతియై దర్శించిన క్షేత్రాలు, తానమాడిన తీర్థాలు ఈ పద్యంలో చెప్పబడినాయి

" తపసియుఁ జని కంచి దర్శించెఁ గేదారమాడె, గంగాద్వార మధిగమించె
సింహాచలంబు వీక్షించెఁ గురుక్షేత్ర మరిగెఁ బుష్కరముల ననుసరించె
కాశికాపురి నవగాహంబు సేసెఁ బ్రయాగంబునందు గయా వటంబుఁ
గనిసె, గోదావరిఁ గాంచెఁ గృష్ణానది భజియించె, శ్రీరంగభర్తఁ గొలిచె
సన్నుతించె నహోబలస్వామిఁ బ్రణుతి సేసె శ్రీవేంకటాచలవాసి నెలమి
నర్చగావించె, హస్తి శైలాధిపతిని, దీర్ఘబాహు జగన్నాథ దేవునకును "

(4–749)

కావేరిని పుడిసిలి బట్టి తాగబోయే సుబోధున్ని వారించి విష్ణువు తన స్వరూప వర్ణన చేసే సందర్భంలో తన అర్చావతారాలలో "శ్రీరంగ శ్రీముష్ణ శ్రీవేంకటాచల సాలగ్రామ నైమిశ తోతాద్రి పుష్కర నారాయణాశ్రయంబులను నీ యెనిమిది స్థలంబులం గల మదీయ మూర్తులు స్వయంవ్యక్తములు" అని చెప్పినాడు (1–191)

6 14 3  హరికి లీలా విహార యోగ్యమైన పుణ్యనదుల ప్రసక్తి వచ్చింది కలుష పంకజ కళికా తమి గౌతమి . సత్య సంపద్యోగ చంద్రభాగ .. సతత జన్మాచలాళని భవనాశని దూరీకృత క్షుద తుంగభద్ర, ఒసగ సౌభాగ్య దాసి సంపన్న పెన్న ... భువిఁ బ్రసిద్ధి నెక్కిన పుణ్యనదులు" అని ఉటంకించబడింది ( 1–75 )

6 14 4  కావేరీ నదీ వర్ణన ఈ కావ్యంలో ఒక పెద్దవచనంలో చేయ బడింది తక్కిన నదులకన్న కావేరి గొప్పది అనే నిరూపించే సందర్భంలో "అధ్యాత్మ విద్యయుం బోలె నెల్ల వారికి వితర్కింప నశక్యంబై మెరసి, పెన్నఁ జిన్న చేసి, తుంగభద్రను భంగపరిచి, కృష్ణఁ దూష్ణికరించి, . వాహ్నావి నిహ్నవించి, గౌతమిలో తమి యడంచి . యన్య సరిన్నివహంబు నపహరించి" అని కొనియాడబడింది (1–132)

భైరవ కవి శ్రీరంగమహత్త్వం ఆ క్షేత్రమహిమనే తెలిపే కావ్యమైనా ప్రసక్తానుప్రసక్తంగా తెలుగునాడులోని పుణ్యక్షేత్రాలను, పావన నదులను గురించి కూడా మనకు తెలుపుతుంది

6 15  భట్లు పెనుమర్తి కోదండరామ కవి  'వల్లభాభ్యుదయము' అనే కావ్యం భట్లు పెనుమర్తి కోదండరామకవి రచన  ఇది శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్య గ్రంథం అస్తవ్యస్తంగా ఉందిస బ్రహ్మాండ పురాణోత్తర ఖండం ఈ కావ్యానికి మూలం అని కవి చెప్పుకొన్నాడు  ఇప్పటి సంస్కృత గ్రంథంలో ఆ భాగం కానరాదు[20]

ఆంధ్ర విష్ణువు నిశంభుని చంపి కృష్ణాతీరంలో కాకుళం అనే పట్టణం కట్టి అందు నివసించినాడు నిశంభుడు నాగరాజు ఆంధ్రవిష్ణువు ఆంధ్ర రాజు అని చరిత్రకారులు చెపుతున్నారు[21]  ఆంధ్ర విష్ణువునే వల్లభరాయడు అని కూడా అంటారు ఈ దేవుడే 'ఆముక్తమాల్యద' రచించమని శ్రీకృష్ణరాయలను కోరిన స్వామి

6 15  వల్లభాభ్యుదయ కావ్యంలో తెలుగునాడుకు చెందిన స్థలాలు, పర్వతాలు, నదులు, తీర్థాలు ఇవి —ఆంధ్రదేశం (3–19, 53), ఆంధ్ర భూతలం (2–7) ఆంధ్ర భూమి (2–125), కళింగదేశం (2–89, 4–100), కాకుళం/ శ్రీకాకుళం, బ్రహ్మకుండికా క్షేత్రం, వేంకటాచలం (1–12) శ్రీకూర్మం (3–101), సింహాచలం

[3-101] ధరణివరణ (ధరణికోట) (3-18) అనే ప్రదేశాలు, పర్వతాలు – కృష్ణా గోదావరి, గౌతమీ (3-101) బ్రహ్మకుండ తరంగిణి (3-59) అనే నదులు –చక్ర తీర్థం అనే సరోవరం ఈ కావ్యంలో ప్రసక్తాలు

6 15 2 "సుమతి యను నృపుడు దైవప్రేరిత చిత్తవృత్తి నాంధ్రి భూతలముపై రాగిల్లి" ఏతెంచినాడు శ్రీకాకుళాన్ని చూచినాడు (2-7) విష్ణువు 'ఏ గతి వాన్ని వి తరికి నేగి వసింప పురనాగతుం డెట్లు గు నాంధ్రభూమికిన్ వివరింప వరి సూత" అని అడిగినారు మునులు (2-125) అహిచ్ఛత్రపురంలో వల్లభస్వామి ఉండి "అనేక కాలంబు గడచిన పిమ్మట నాంధ్రదేశంబునం దనరు శ్రీకాకుళంబున కేగు తలంపు నెమ్మనంబునం బొడమిన" (4-19) వెళ్ళే ప్రయత్నం చేస్తాడు. గంగా తీరం అనావృష్టి పీడితం కాగా సుమతుండు తన వారితో "నేము మి యాంధ్ర దేశంనకు నరిగెద" మని రాజుతో చెప్పినారు (3-50)

6 15 3 కళింగదేశ ప్రసక్తి ఈ కావ్యంలో రెండుచోట్ల ఉంది ఆంధ్ర విష్ణువు ప్రసాద మహిమను తెల్పే ఇతిహాసంలో "కళింగదేశమున .. యజ్ఞశర్మయను వాడుండుండెను" (2-89) అని కథ మొదలుపెట్టబడింది చైత్రోత్సవ సమయంలో స్వామికి "కటక కళింగాంగ కాశ్మీర పతులు హస్తములతో నాలవట్టములు" పట్టినారు (4-100)

6 15. 4 శ్రీకాకుళ క్షేత్రానికి ఆ పేరు వచ్చిన వృత్తాంతం ప్రథమాశ్వాసం 68 పద్యంనుండి 105 పద్యం వరకు వివరించబడింది సూక్ష్మంగా ఆ కథ యిది–

"వాణీ భర్త హిరణ్యగర్భుడు పునర్బ్రహ్మత్వము గోరి . పూర్వం దిక్కట లసద్వారాశి చెంతన్ సురశ్రేణీ సేవిత జహ్ను సన్ముని సుతా సీమన్" తపం జేస్తూ ఉండగా, . శ్రీవల్లభస్వామి "యిచ్చటను వాలుదపం బొనరించి తింక గృష్ణా తటిని తటంబున.. దపం బాతపిం జేయు ఏ సరుదెంతుంబుత్త్రికా" అన్నాడు (1-69 నుంచి 75) అక్కడ తపం కొనసాగించమని మార్కండేయుని నియోగించి విధాత కృష్ణాతీరం కోసం పయనించినాడు

"మధ్యనొక్కచో ననుపమ కాననాంతర మహానది రమ్య తరంగ డోలికా కనదుర రాజహంసము, ఖగ ప్రకరాకుల తీర భూరుహం బనువుగం గాంచి" బ్రహ్మ తనివి తీరక "పెక్కు రూపముల్తై కనుంగొని" ప్రేమ విహ్వలుడైనాడు మళ్ళీ తను ఒక్కడు గానే నిల్చినాడు "సర్వదేవతా సంతతు లేగుందెంచి ... అతి రమ్యత వచ్చుట యోజన ద్వయం బంతట నిల్చియున్. ఆ లమైన యట్టి భవదాకృతి కామిత

భద్రదాయి శ్రీకాకుళ నామధేయ మగుచుండుగాక' యని వేడినాడు బ్రహ్మ. అంగీకరించి "పరమపావనంబును, నిఖిల పాపహరంబును, కామితార్థ ప్రదంబును, ముక్తి దాయకంబునై, లోకంబునం బ్రఖ్యాతంబగు పుణ్య క్షేత్రంబుగా ననుగ్రహించి నైజాకుల నిధానంబునఁ గాకుళాభిధానం బొసంగినాడు. బ్రహ్మ కాకుళాఖ్య పురణం బునఁ వొల్లిటి కంటె గొప్పగా తపసు చేసినాడు.

విష్ణువు ప్రత్యక్షమై నీ కోర్కె తెలుపు అన్నాడు. నేనొనరించే తపసు చేస్తుండగా సర్వదేవతలు ఇక్కడ వచ్చి నిలిచినారు "ఈ దేవపురపు నివాసము విప్రవరాకుల మయ్యెఁ గావునన్ దప్పక కాకుళాఖ్యాపురి మెసర్చితి దేవ యనుగ్రహింపవే". "సహ్యజా తీరమందు నిఖిల పరివార సంపదలు నిరవధి యుతముగాఁగ విహరించి" నావు "లోకములోఁ బ్రఖ్యాతిగఁ గామితవరద యనఁ జెలఁగ మహా సహితం బాకల్పంబుగఁ బూజలు గైకొనుమా" అని ప్రార్థించినాడు బ్రహ్మ. నీకు పునర్బ్రహ్మత్వం ఇచ్చినాను 'క్షేత్రమగా పేరిట నది సంశయ మింతయు లేదు కాకుళ క్షేత్ర నివాస మందది యశేష విశేష పవిత్ర పాత్రమై ఖ్యాతిఁ బ్రసిద్ధి కెక్కఁగ" అని వరమిచ్చినాడు శ్రీమహావిష్ణువు. కాకుళ - కాకుల శబ్దాలు ఉపాంతరాలు. క - బ్రహ్మదేవత, ఆకుల - వ్యాప్తమైనది బ్రహ్మ యాత్ర రమః యని యను జూచి తన్నాతీక బహురూపముల నంద యప్పుడు నిలిపినందువలన కపురనే దానికి పేరు గలిగినట్లును కథ తెలుపుతుంది[22]

విష్ణువు అక్కడ నెలకొనడానికి మరో కారణం చాలా ఉందట. విష్ణు పాదాల నుండి పుట్టిన గంగ సముద్రుని చేరపోయింది. సముద్రుడు అక్కడే ఉన్న "కృష్ణా తరంగిణి లలనం గనుంగొని" విరహవ్యథ పొందుతూ ఇలా అన్నాడు "చూచితె సహ్యజాతటిని యప్పయః పూర పాన్నాప ప్రాపరితంబు, నేను పదాశ్రయ మంబరకేశ మూర్ధ గమ్యోచిత మమ్మహా విభవ మెప్పునె నీకని సహ్యమాని" నాడు. ఆమె సిగ్గుతో, శోకంతో విష్ణువు నుద్దేశించి దారుణమైన తపస్సు చేసింది. "కృష్ణాదేవి సద్భక్తికిన్ విన్నాణంబున కాత్మ మెచ్చి ప్రత్యక్షమై, వన్నె నీ తలపేమి తెల్పవె" అన్నాడు స్వామి. అలల హస్తాలు సాచి నా నాథుడు కౌగిలించుకొనే ఈ తీర భూమిలో నిల్చి "లోకపావని యని పూజవల్ పొగడు వైభవ గల్గఁగ నాకు దృష్టి ప్రాపొనర వసించు" మని వినయంగా ఆ మహానది వేడుకొంది. అట్లే ఒప్ప

కొన్నాను నీ కోరిక కూడా అదే గదా బ్రహ్మ ! నే నీ రూపంతో అనేక కాలం ఎక్కడ నివసిస్తాను అని అలాగే అక్కడే విష్ణు దేవుడు నిలిచినాడు (1-110 నుంచి 116)

కాకుళంలో నిల్చిన వల్లభస్వామి "కలియుగాగమమైనను జహ్ను కన్యకా తటమున కేఁగును . కృతయుగంబుకుఁ గ్రమ్మరి పూర్వరూప విస్ఫుటముగ వచ్చును" (2-124) ఈ వృత్తాంతమంతా సవివరంగా (2-125 నుంచి 4-51 వరకు) చెప్పబడింది

6 15 5 శ్రీకాకుళ క్షేత్ర మహిమ ఎలాంటిదో కొంత చూదాం స్వామి ఆంధ్ర నాథుడు (1-121) ఆంధ్రనాయకుడు (2-19) ఆంధ్రనిరేజ నేత్రుఁడు (2-72) ఆంధ్రాధిప మురహరుఁడు (2-42) తెల్గు వల్లభరాయఁడు (1-122) అని స్తుతించబడినాడు అంతేకాదు, ఈక్షేత్ర ప్రాధాన్యాన్ని, పావిత్ర్యాన్ని నొక్కి చెప్పేందుకు ఆ క్షేత్రం పేరు మీదనే స్వామిని కవి పిలవడం జరిగింది కాకుళ నాథుఁడు (1-1) కాకుళ నేత (2-106) కాకుళ పతి (1-107) కాకుళ భర్త (2-67, 73) శ్రీకాకుళ భర్త (4-78) కాకుళ రాయఁడు (2-1) కాకుళ వల్లభుఁడు (2-82) కాకుళాధిపుఁడు (2-18) కాకుళాధీశుఁడు (2-70) కాకుళాధీశ్వరుఁడు (4-77) కాకుళేశుఁడు (1-53) కాకుళసదన ప్రదేశుఁడు (4-1) కాకుళ క్షేత్ర శౌరి (1-123) ఈ ప్రస్తుతులన్నీ క్షేత్ర ప్రాధాన్యాన్ని తెలిపేవే గదా !

6 15 6 కాకుళపురం కాకుళపుర వర్ణన కవి 2-31 నుండి 39 దాకా చేసినాడు వకుళ తమాలాది వృక్షాలుండే మహోద్యానాలు, కలహంసలు కల్హారాలు ఉండే తటాకాలు, వజ్ర కవాట గోపుర ద్వారాలు, నానా ధాన్య పూరితాగారాలు, షష్ట్యుత్తర శత త్రయాలయాలు, దేవమందిరాలు వీటన్నిటితో 'కాకుళ నగర వరము' నిగమ శరణమై ఉంది దివ్య మంగళ పాఠక స్తుతులు పాడే నిత్య సూరులు, తిరుమణి తిరుచూర్ణం, శంఖ చక్రాంకితులైన విష్ణు భక్తులు, విలుకాండ్రు, కనక పీతాంబరులు— నరలోక వైకుంఠంగా ఉంది కాకుళాఖ్యాత పురం (2-32) చందన . రసాల తమాల – ఇలాంటి చెట్లన్నీ ఉండే విశాలవనాలున్నాయి (2-33)

ఈ వర్ణనంతా ఒక యెత్తు అష్ట దిక్పాలకుల పురాల్తోను, సత్యలోకంతోను, వైకుంఠంతోను, విశిష్టతలో సాటి వస్తుందని కవి వర్ణించిన వచనం ఒక ఎత్తు పఠించి పరవశించాల్సిందే

"అమరాలయంబు లీలంగన శక్ర పాదప విపిన విభ్రమ వైభవంబునను, పవన భవనంబు కరణి యజ్ఞాంగాగ్ని శిఖా సముజ్జ్వలనంబును, యమ నగరంబు భంగిఁ గాల స్కంధవార విహార కమనీయంబును, నైర్ఋతి నిలయంబుం బోలె భూతావాస పతాళ భాసురంబును, ప్రచేతసు సదనంబు పగిది వరుణ శోభాంజన రంజనీయంబును, గంధవహు మందిరంబు లాగునఁ బ్రసన్న వాత పోత కలితంబును అలకాపురంబు తెరవునఁ గుబేరవర తుంగ సుందరంబును, కైలాసంబు సొబగున నీశ్వర శివా సమన్వితంబును, యోగీంద్ర నివాసంబు వడువునఁ బిప్పల శాండిల్య గాలవ కౌశిక తాపస విలసితంబును, నాగలోక ప్రభేదనంబు విధంబున నాగరంగ సుషిరా యుతంబును, పర్జన్య భవనంబు విధంబున ఘన ఘనసార ఘుమఘుమాయమానంబును, నాస్త్రాగారంబు సొంపున గణికా విలాసినీ సంతానోపేతంబును, సత్య లోకంబున సదామోద బ్రాహ్మ విరాజమానంబును, వైకుంఠంబు రీతి విష్వక్సేనాద్భుత మోక్ష వైలక్షణ్యంబును గల నారామంబు సకల జన నయనాభిరామం బగుటయు" (2–34) ఈ విధంగా ఆరామ వర్ణన పవిత్రంగాను, ఉదాత్తంగాను కవి చేసినాడు.

గజరాజ ముఖ రాజైన అనంత పాలుని పెద్దల పటు వేషము దాల్చి వల్లభ దేవుడు వచ్చి "క్షేత్రము గౌరి పట్టి నృప శేఖర.. ఫణి పట్టణ పురాధివాసుడ . వల్లభ నామ ధేయుడన్.. ధాత్రిని గృధ్రాభిధాన తటినీ తట సుక్షేత్ర మొసంగుము" అంటాడు (3–116 నుంచి 119) తాను గంగా తీరంలో ఉండిందీ, బ్రహ్మకుండి క్షేత్రంలో నివసించిందీ, శ్రీకాకుళంలో నిలవాలని వచ్చిన విషయం ఇవన్నీ వివరించినాడు రాజుకు ఆ విషయాలు క్రింది పద్యంలో

" ధాత్రిని విష్ణు పాద జనితాతట భూతలమందు నయ్యహి
చ్ఛత్రపురంబు వాసి చని శంకరపాలిత బ్రహ్మకుండికా
క్షేత్ర సమాశ్రయంబున వసించితి నిప్పటి ద్వాదశాబ్దములన్
చిత్రముగాను జగ్గె నరసింహ నృపాలక మంత్రిపుంగవా!"

"అచట వంపి వచ్చి నను శ్రీకాకుళ క్షేత్రమందు నిలుచు చిత్తవృత్తి గలదు" 6. 15 7 పూర్వం సుమతి అనే రాజు ఆ పట్టణాన్ని నిర్మించి ఉండిన విధంగానే అనంత పెద్దడు "శ్రీవల్లభుని ప్రతిష్ఠించి.. వీరభద్ర విఘ్నరాజ క్షేత్ర పాలకులను ప్రతిష్ఠ చేసి – మంటపాలు ప్రాకారగోపురాలు ... నిగమచయ ప్రశాస్త్ర

కమనీయము కాకుళ పట్టణాఖ్యముకన్" నిర్మించినాడు (2-42 నుండి 47) "వైదికులకు, బాహుజులకు, కోమట్లకు, అపరిమిత ధాన్య వర్షక హలాయుతాన సంపదున్నతులైనట్టి చరణజులకు ... నిత్య మధవ కైంకర్యనిపుణ మహిమ కాపురంబగు కాకుళాఖ్య పురంబు (4-47) .. వనావళులు ఇరువంకల చైత్రరథంబులో యనన్ (4-49) ఉండేట్లు "వృత్తి వ్యాపారమునను నొక్క తద్విధమున నొనరించి" (4-51) కాంచి పైకి పోయినాడు అనంతపాల రాజు

6 15 8 పవిత్ర కాకుళ క్షేత్రానికి తగినట్టి పుణ్యనదిగా కృష్ణానది ప్రక్కనే ఉంది గదా! ఆ నదిని కావ్యంలో పలు పేర్లతో ప్రస్తుతించినాడు కవి అవి - కృష్ణాతటిని (1-24), కృష్ణా తరంగిణి (1-111) కృష్ణా సరిత్ (2-116), అసికిని/అసికినియగా (3-104) సహ్యగిరిజా నది (2-131), సహ్యజా (1-48 ఇంకా నాలుగుచోట్ల) సహ్యజా సరిత్ [3-103, 4-96] అనేవి ఆ నది పావిత్ర్యాన్ని నొక్కి చెప్పడానికి కృష్ణా కూల దేవాధివాస [4-191] కృష్ణా తీర దేశాధిపా, కృష్ణా తటిని తటాది కృత భూషణకు [1-24] కృష్ణా తటి న్యాయతత నిలయుడు [1-60] కృష్ణా పూర్వ తీరోల్లసద్భవనాభ్యంతర భాసమాన మణి ముక్తాహార కృష్ణా సరిత్తీరవాసుండు [3-56] అని పరి పరి విధముల ప్రస్తుతింపబడినాడు ఆంధ్రమహావిష్ణువు

6 15 9 వల్లభదేవునికి ఆంధ్ర మహావిష్ణువు అనే పేరు ఎలా వచ్చిందో తెల్పుతుంది ఈ కథ సుమతి అనే సూర్యవంశరాజు "భారత వర్షాభోగ ధరాపాల నిపుణపుణ్యాత్ముడు, ఇలపై ధారాళ సంచార సుప్రావీణ్యంబున నాంధ్ర భూతలముపై రాగిల్లి యేతేర సద్భావ ప్రౌఢి మునీంద్ర చంద్రు నివహ వ్యాప్తుండునై యొప్పునా శ్రీవిష్ణుస్థలిఁ జేర నేఁగె నెలమిన్ శ్రీకాకుళాఖ్యమున్" [5-7] అక్కడుండే మునులు సత్కరించినారు స్వామి దర్శనం చేయించినారు మునివరేణ్యులు.

" అర లేకివ్వట దేవాలయ వనాలానిక మద్ద్వార గో
పుర వీథీ ప్రఘణాభిమంటప చయంబుల్ భాసురాందోళికా
ద్యుడు యాన ప్రకరం బౌనర్చి మటి నిత్యోల్లాస మాసోత్సవో
త్కర సంవత్సర వైభవోల్లసిత కైంకర్యంబు లీ సామికిన్ (2-15)

నడిపింపవలయు నరవర!" అని అడిగినాడు "ఈ దేవుండు మదీయ సత్కుల ధనంబు .. ఈ యిందిరా ధాముఁడే దివ్యంబగు నాంధ్ర నాథుండు" అన్నాడు

రాజు ఆ రాజు "ఆదిబ్రహ్మము కాకతీశాధిపుని మ్రొక్కుచును . ఆంధ్రనాయక దాసుండవుదు" నుడివినాడు అప్పటి నుండి "కాకతాధిప శ్రీనాథన కాంక్ష నాథాభిధానంబు యదార్థంబై" [1-16 పంచి 20] నది

6 15 10 ఆ క్షేత్రానికి 'చక్రతీర్థం' ప్రత్యేక విశిష్టతను ఆపాదిస్తుంది. ఆ తీర్థం ఏర్పడిన విధం ఇది – సుమతి మహీపాలుడు దేవాలయాన్ని అన్ని వాంగులతో కట్టించినాడు వస్త్రాలు వేరుగా పరిసినాడు "సహ్యజా నదీ జల మతి పంక యుక్త కలుషంబయి" నది "మాధవు పదార్చనకు నిర్మల సలిలంబు గల్గమికి" రాజు చింతించినాడు

ఒక జలాశయం త్రవ్విద్దాం అనుకొన్నా అంతవరకు పూజ ఎలా సాగుతుంది? అని ఆలోచిస్తూ స్వామిని తలచుకొన్నాడు రాజు స్వామి తన సుదర్శనం వైపు చూచినాడు

" అవ్విష్ణుదేవు నవుజ్ఞం జేసి ప్రభాకర సంకాశ ప్రకాశంబై దైత్య చక్ర నిబర్హణంబగు చక్రం బది విక్రమంబున భూతలం బది రయంబున భేదించి రసాతల గతంబగు గంగా
ప్రవాహంబు మనోవేగం బునం గొని వచ్చి సరోవరం బొసరించి క్రమ్మఱ హరిభుజా దండంబు నాశ్రయించె నది కారణంబుగా న త్తీర్థరాజంబు చక్రతీర్థం బనం బరగెను"
[2-25]

ఆ చక్రతీర్థంలో రాజూ, మునులు, తానమాడి ఆ తీర్థజలంతో హరికి సమర్పించినాడు (2-27) ఆ సహ్యజా చక్ర వారి విలాసాన్ని, శోభను ఈ క్రింది పద్యంలో తిలకించవచ్చు–

" సుర దీర్ఘికాంతర పరివాహ తరళిత సుషమా విశేషానిమిషు లనంగ
నుత్సవ సమయ సముల్లాస సలిలావగాహ భాగవత యుగ్మంబు ననఁగ
మానస కాసార మహనీయ సంచార రాజ మరాళాభిరామ మనఁగ
వీచికా జాల వికాచల సానులఁ గ్రీడించు కిన్నరాకీర్ణ మనఁగ

మునిగి తోఁచుచు స్నానమునఁ జెలంగి యోలలాడంగ నొప్పు విశాల మీన
చక్రవాక లసత్కాంచ వకిత విపుల సారస విహారి సహ్యజా చక్రవారి"
(2-40)

6 15 11 వల్లభాభ్యుదయ కావ్యంలో శ్రీకాకుళక్షేత్రం, కృష్ణానది, చక్ర తీర్థాల ప్రసక్తి మాత్రమే కాకుండా ధరణివరణ, బ్రహ్మకుండికాక్షేత్రం, శ్రీకూర్మం, సింహాచలం అనే క్షేత్రాలు, గౌతమి, బ్రహ్మకుండి నదుల ప్రస్తావన కూడా ఉంది

అనంత పాలుడు "సకల సేనాపరివృతుండై .. మార్గమధ్యంబునఁ గల పుణ్యక్షేత్రంబుల సురాలయ నికర నిర్మాణ ద్విజస్థాపనాది ధర్మంబు లొనరించుచుం జని శ్రీకూర్మనాయకు నారాధించి, యచటు గదిలి సింహాచలంబున కరిగి, తద్దేవున కలిభక్తి నతి యపచితి విధానంబు లాచరించి, యనంతరంబు గోదావరీ తటంబున కరిగి యా నది నవగాహనానుష్ఠానంబులు దీర్చి"... తర్వాత కృష్ణానది చేరబోయినాడు (3-102)

ముక్కంటి మహా జనపతి గంగానదిలో సతీసమేతుడై తానమాడి యోగ పాదుకలపై తిరిగి 'తన ధరణి వరణ నగరంబునకుం జనిన' (3-48) అని ఒక కథా సందర్భంలో చెప్పబడింది ముక్కంటీశ్వరుడు త్రిలోచన పల్లవుడు కృష్ణానది ఒడ్డునందున్న ధరణి వరణ నగరము (ధరణికోట) రాజధానిగా నాంధ్ర దేశాన్ని ఏలుతుండేవాడు[23]

వల్లభ స్వామి గంగాతటాన్ని వదిలి 'బ్రహ్మకుండీ తరంగిణీ పారమందు... ఉదిని వసించినాడు (3-56, 57) ఆ విషయాన్ని అనంతపాలునితో అంటున్నాడు ఇలా – "ధాత్రిని విష్ణుపాద జనితా తట భూతలమందు నయ్యహిచ్ఛత్రపురంబు వాసి చని, శంకర పాలిత బ్రహ్మకుండికాక్షేత్రసమాశ్రియంబున వసించితి, నచ్చట ద్వాద శాబ్దములొ చిత్రముగాను జర్గె" అని

6 15 12 కవి యింటిపేరు భట్ల పెనుమర్తి భట్లపెనుమర్రి దివి తా, కృష్ణా జి లో ఉంది

శ్రీమహావిష్ణువుకే అంకితమైన ఈ కావ్యానికి 'వల్లభాభ్యుదయం' అనే పేరుతోపాటు 'శ్రీకాకుళక్షేత్రమాహాత్మ్యం' అనే పేరు కూడా ఉన్నట్లు ఆశ్వాసాంత గద్యల్లో కవి చెప్పినాడు శ్రీకాకుళక్షేత్రాన్ని కృష్ణానదిని, చక్రతీర్థాన్ని, ఇంకా శ్రీకూర్మం, సింహాచలం, గౌతమిలను కూడా తన కావ్యంలో కవి ప్రస్తావించినాడు

6 16 అందుగుల వెంకయ్య • రామరాజీయం లేక నరపతి విజయం అనే కావ్యం అందుగుల వెంకయ్య రచన. రామరాజు ఆస్థానకవి ఇతడు రామరాయల, అతని వంశీకుల విజయాల్ని ఈ కావ్యం విపులంగా వర్ణిస్తుంది

6 16 1 ఈ కావ్యంలో కనిపించే తెలుగునాడు ప్రదేశాలు, నదులు ఇవి- కాళింగ రాజ్యం, కృష్ణా సేతు మధ్య క్షితి, ధళంధుగుల, అయలకొండ /అయిలకొండ, అవుకు, ఆకులపాడు, ఆదవానిదుర్గం/ ఆదవేని, ఆరవీడు, ఉదయగిరి/ఉద్దగిరి, ఓరుగల్లు కందనవోలు / కందనోలు, కలుపకొల్లు / కలువకోలు, కొండపల్లి, కొండవీడు, కోట, గంగినేని కొండ, గుత్తిదుర్గం, గోలకొండ / గోలుకొండ, చంద్రగిరి దుర్గం, జూటూరు, నందేల, నాగార్జునకొండ, పాకెం, హొసుగల్లు, పెనుగొండ, బెల్లముకొండ, మొసలిమడుగు, యాదగిరి, రాజమహేంద్రం, రామగిరి, వినుకొండ, వేంకటాచలం/శేషాద్రి అనే దుర్గాలు, పురాలు -కృష్ణా, గంగావళి, గౌతమి పెన్న, భీమరథి అనే నదులు

6 16 2 రామరాయల మహాసభా సదనం 'లక్ష్మీనివాసాఖ్య' వెలిగి ఉండేది [1-13] కోసలు గెలిచి కైకొన్న యేడుగులివె ... కాళింగ విషయం దోసంగిన కనకమిదిగో యనుచు సచివులు తెలుప" గైకొనేవాడు రామరాయలు

శ్రీరంగాధిపుని కొడుకు పెద్ద వెంకట ధరిత్రీజాని ... కృష్ణా సేతు మధ్య క్షితిన్ ... ఏలినాడు (1-328)

6 16 3 కవి యింటిపేరు అందుగుల ఇది ఒక ఊరి పేరే కావచ్చు కృతిభర్త యింటిపేరు ఆరవీటి బుక్కరాజ విభుడు ఆరవీటి పురము నేలుచు.. దన కులమును దదాఖ్య నలర వెలసినది [1-202]

6 16 4 "సోమదేవరాజు దండెత్తి చని మహోద్దండ వృత్తిని గంగినేని కొండపల్లిలోఁగాను గుత్తి, కందనవోలును, గలువకోలును, గోట, రాచూరు నెటువంటి రాజులకైన సాధింపఁగారాని మొసలిమడుగు యాదగిరి నగరము సాతానికోట వరుసతో సాధించి" నాడు [1-182] ఆ రాజు బిరుదు గద్యలో పై చెప్పినవి సప్తదుర్గాలుగా పేర్కొనబడినాయి

6 16 5 బిరుదు గద్యలో "శ్రీ సంతత వేంకటాచలపతి చరణారవింద సేవా కందళిత సామ్రాజ్య సుఖోపభోగుఁడు"గా చెప్పబడినాడు బుక్కరాజవిభుడు [1-203] బుక్కరాజు కొడుకులు సింగరాజు మొదలగువారికి నందెల యొసఁగ నా నందను లాపుణ్యదమనుచు రాజభాగ్యఁగ నేలుచుఁగులము నందెల పేర ధరిత్రిఁ" దనరినారు [1-207] రామరాజు పెద్దసేనతో "కందనోలు సాధింపఁగాఁదలచి ...

గట్టిగా మొట్టడి దిగిన నా బిప్పని మిక్కిలి యుబ్బించి ప్రకట సప్తాంగములఁగొని...
కందనోలు రాజధానియుఁగాగ వసుమతియును" నేలినాడు (1-208)

అతని బిరుదు గద్యలో "నిరావాపాదవానీ దుర్గ నివాసి కాసపుదయ దుర్మదఖల నిర్మథన" అని చెప్పబడింది (1-210)

6 16 6 ఆ రామరాజు కొడుకులలో తిమ్మనృపతి భూకాంతాతిలకంబైన యప్పుడు దా నేలుచు విఖ్యాతిగ నప్పురి పేరన్ బ్రీతిన్ దన కులము వెలయఁ బెంపొందినాడు (1-218) కొండరాజు ఆదవెని నేలినందువల్ల ఆదవెని వంశంగా అతని సంతతి పేరుకెక్కినారు శ్రీరంగరాజు ఆరవీటి పురాధ్యక్షుడు 'గోలగొండ వజీర్ల కోటల కాయమున్' చించేది ఆ రాజు కత్తి (1-244)

6. 16 7 ఆరవీటి వేంకటపతి రాయడు "గుణముల చెలువుఁ బేర్కొని యెప నంటినా వీక్షింప శేషాద్రి విభుఁడతండు"గా పేరెన్నిక గన్నవాఁడై (1-26) కందనోలు పురమేలినాడు (1-267) ఆరవీటి గోపాల రాజ విభుడు కందనోలు నిజ రాజధానిగా నేలినాడు (1-275).

6 16 8 రామ రాయలు "సలక విభు తిమ్మరాజు సేనలను ద్రుంచి గుత్తిఁ, పెనుకొండ, మఱి గండికోటఁ గండనోలు పుర మాదవె నవలీల గెలిచి"నాడు (1-280)

రామరాయల బిరుదు గద్యలో . కన్యాకుమారి భీమరథ తటాంత నిక్షేప విజయ స్తంభ .. గుత్తి దుర్గ నిర్భేదకపుర .. ఆదవని దుర్గాపహరణ ... పెను కొండ దుర్గసాధక .. చంద్రగిరి దుర్గ రాజ్యాధీశ్వర .. ఉదయగిరి రాజ్యపాలక . . కందన వోలు కవాట భేదక .. జూటూరు సమర నిర్వాహక .. చందనపాటి ఖడ్గ సాయక, కొండవీటి దుర్గ నాయక పుట్టపల్లి సీమాధిష్ఠిత ధామసాగర . ఓరుగల్లు నగరపోషణ. గౌతమీ స్నాన పావనాకార. రామగిరి దుర్గ ప్రతిష్ఠాపక, యాదగిరి దుర్గ భేదన గోలకొండ పుర దూషణ, అయ్యలకొండ చండ విమతహాలాహల; అయిలకొండ హరణ కౌతూహల, సానుగల్లు కృతిపరాక్రమ, పానుగంటి దుర్గ పాటన ధుర్య, వెల్లముకొండ వల్లభ .. కొండపల్లి హరణ ..వినుకొండ పాలక, వినూత్న కృత నాగార్జునునికొండ . రాజమహేంద్ర రాజధనుశ్శాసన" అని రామరాయల రాజ్యంలో ఉన్న తెలుగు దేశం లోని దుర్గాలు – నగరాలు

6 16 9 "మానవులు నేనుఁగు ల్బట సమాజము పీసుగు పెంటగాఁగ గంగావళిపండి కృష్ణ దనుకా నొనరించి నిరామ్ముఁ దొలినాడు రామరాయలు కొడుకు కొండరాజు (1-303)

వేలూరు నిజ రాజధాని గాఁగ..... చిన్న వెంకటపతి కొడుకైన శ్రీరంగరాయ మౌళి యుదయగిరి దండ వెలుగొందుచుండు కుతుపశాహు నణచినాడు (1-360)

'రామరాజీయం' కావ్యంలో రామరాయల పూర్వీకులు, రామరాయల సంతానం వీరందరి జయాలు, ఏలిన పురాలు కొలిచిన దైవాలు ఉండే క్షేత్రాలు ప్రస్తావించ బడినాయి

6-17 రామరాజ భూషణుడు ఇతని అసలు పేరు భట్టుమూర్తి అళియ రామరాజు ఆస్థానంలో కవి భూషణం కాబట్టి ఈ కవి కాబిరుదు వచ్చింది 'వసుచరిత్ర' అనే విశిష్ట ప్రబంధం, హరిశ్చంద్ర నలోపాఖ్యానం అనె ద్వ్యర్థికావ్యం ఈయన రచించినవే రెండవ కావ్యంలో తెలుగునాడుకు సంబంధించిన ప్రదేశాల పేర్లు కనిపించవు

6 17 1 వసుచరిత్రలో కనిపించే తెలుగునాటి ప్రదేశాలు - పర్వతాలు - నదులు కందనోలు, చంద్రగిరి దుర్గం, పెనుగొండ కొండలు , కృష్ణ, గౌతమి అనేవి

6 17 2 "అనఘతర కందనోలి మహాపురీ నిశాంతుఁడగు రామ మేదినీ కాంతుడలరు" (1-30) అని కవి పలుకులు తురకల గజసేనలను పెనుగొండ కొండల వద్ద వీర తిరుమలరాయడు చీల్చి చెండాడినాడు ఏనుగుల చర్మాలు, మనుషుల పుఱ్ఱెలు, ఎముకలు వీటన్నిటితో పెనుగొండ - శివుడా అన్నట్లుంది ఆ చమత్కారాన్ని ఈ పద్యంలో తిలకించండి

" తిరుమలరాయ శేఖరుని ధీర చమూ ఘటరాజి యాజి భీ
కర యవనేశ్వర ప్రహిత ఖాన బలంబులఁ జక్కు సేయ న
ద్ధరఁ బెనుకొండ కొండలు మద ద్విప చర్మ కపాల మాలికా
పరికర భూషితంబులయి బల్విడిఁగాంచె గిరీశ భావమున్" (1-53)

6 17 3 హరుడు తారశైలంపై ఉంటూ రాజశేఖరుడైనాడు శ్రీ వేంకటేశ్వరుడు చంద్రగిరి దుర్గంలో రాజశేఖరులతో సేవింపబడుతున్నాడు ఇది తిరుమల రాయని కొడుకు వేంకట నాయకుని గురించి చెప్పినమాటలు అటు బాలాజీకి కూడా అన్వయ మౌతాయి ఈ పద్యం ఆలోచనామృతం

హరుఁడా తార సుశైల దుర్గమున సధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతి వహించుఁ జంద్రగిరి దుర్గంబందు శ్రీ వేంకటే
శ్వరుఁడొప్పెన్ బహు రాజశేఖర సదా సంసేవ్యుఁడై యీరయి
ద్ధర బంటేలిక వాసి తద్గిరులకుం దద్వల్లభ శ్రీలకున్ (1-80)

6 17. 4 తిరుమలరాయల కొడుకు రఘునాథుడు నిజాము సేనలను త్రుంచి నాడు నవాబుల ప్రాంతంలో ప్రవహించె 'కృష్ణ'కు నల్లని నది అనే పేరు సార్థక మైంది ఎలా? మహమ్మదీయుల ఏబిల సుర్మాలతో కూడిన కన్నీళ్ళ ప్రవాహంతో కలిసి

ఈవిధంగా భట్టుమూర్తి వసుచరిత్ర ప్రబంధంలో కందనోలు, చంద్రగిరి' కృష్ణ, గౌతమి మనకు దర్శన మిస్తున్నాయి

6 18 పింగళి సూరన రాఘవ పాండవీయం అనే ద్వ్యర్థికావ్యం, ప్రభావతీ ప్రద్యుమ్నం, కళాపూర్ణోదయం అనే ప్రబంధ రత్నాలు పింగళి సూరన రచనలు

ఈయన రచనలలో మనకు కనిపించే తెలుగునాడు స్వరూపం అహోబలం ఆకువీడు, కొండవిడు, నంద్యాల, నిడుమానూరి కృష్ణ రాయ సముద్రం, తిరుమల / వెంకటనగం/ వేంకటాచలం, వేంకటేశనగరు, రాచపూడి, వెలగలెటి, శ్రీకూర్మం, శ్రీగిరి, శ్రీశైలం, సింహాచలం అనే ప్రదేశాలు—కృష్ణ, గౌతమీ నదులు, పాతాళగంగ, శత తాళ దఘ్న హ్రదం, స్వామి పుష్కరిణి అనే తీర్థాలు ప్రసక్తాలు

6 18 1 రాఘవ పాండవీయం ఆకువీటి పెద వెంకటరాజు ఈ కృతికర్త కృతికర్త వంశీకులు ఆకువీడు నేలినందువల్ల అది వారి ఇంటి పేరుగా వచ్చి ఉంటుంది . "ఆకువీటి తిమ్మ ప్రభు వేంకటాద్రి (పీఠిక - 1) ఆకువీటి పురాంకుండు .. పెద వేంకటాద్రి విభుఁడు (పీ 20) ఆకువిటి పురీ శాసనాంకుఁడగుచు (ఇమ్మ భూపతి) (పీ 22) ఆకువీటి తిమ్మ విభుఁడు (పీ 30) ఆకువీటి పురాంక శ్రీ పెదవెంకట నృప . (పీ 48) ఆకువీటి ప్రథిత తిరుమల క్ష్మాపతి (ఆశ్వాసాంతగద్య)

. ఈ విధంగా ఆ వంశీకుల చరిత్రలో ఆకువీటి పుర ప్రసక్తి వచ్చింది, ఆకివీడు గిద్దలూరు తాలూకా కర్నూలు జిల్లాలో ఉంది కవి ఇంటిపేరు పింగళి ఆ గ్రామం కృష్ణాజిల్లాలో ఉంది వెలయు వెంకటాద్రియ యన చిన వేంకటాద్రి (పీ 33) చక్కని శ్లేషలో ఆ పద్యంలో వేంకటేశ్వరస్వామి ఆ రాజు హృదయంలో ఉన్నాడని, మెరుపర్వతం కంటె వెంకటాద్రి గొప్పదని, వెంకటాద్రి కాలికి బెట్టిన బిరుదు అందెలు చూచి శత్రురాజులు తల వంతురని కవి వర్ణించినాడు

రాజమహేంద్ర పరాధి పురి పైత్ర విచిత్రమునం బరిభూషితుడై. ఆ యిమ్మ మహిజాని ప్రసిద్ధి గాంచినాడు (పి 25)

రామభద్రుడు ధర్మరాజు రాజ్యంచేసే కాలంలో 'శ్రీ ధాన్యకటకమై చెలువొందె రాష్ట్రింబు నెల మూడు వానలు గురిసె' అని చెప్పబడింది (4-201) తెలుగు నాడు లోని ధాన్యకటక నగరాన్ని గుర్తు తెస్తున్నాయి ఈ పలుకులు కేతన కూడా ఇలాగె అన్నాడు (పు 65)

"కుక్షి ధ్వంస పతంగు(గ్గ)రై మహా గోదావరి తీర స్వచ్ఛపాయ పథంబు నేడు చొరకెనే" అని భూమి దేవతలు సంతోషించినారట రామున్ని చూస్తూనే (3 66)

6 18 2 కళాపూర్ణోదయం ఈ కావ్యంలో మనకు కనిపించే తెలుగు నాడులోని స్థలాలు - పర్వతాలు, తీర్థాలు, అహోబలం ఆరవీడు, కొండవీడు, తిరుమల/వేంకటనగం / వెంకటాచలం, వెంకటేశనగిరి, శ్రీపర్వతం, శ్రీశైలం, సింహాచలం, పాతాళగంగ, శత తాళ దమ్మహ్రదం, స్వామి పుష్కరిణి అనేవి

6 18 2 1 కళాపూర్ణోదయ కావ్యం నంద్యాల కృష్ణ భూపతికి అంకితం. అరవీటి బుక్కరాజు కొడుకు సింగరయ్య ఆతని కొడుకు నరసింగరాజు "నరసింగ నంద్యాల పురాధిపత్య విభవాతిశయంబు వహించి మించె తన నంశ మెల్ల రాజు నంద్యాల పద ప్రసిద్ధి" దనరారింది (1-26) కృతి భర్త వంశీయుల ప్రస్తావనలో నంద్యాల ప్రసక్తి పద్దెనిమిది సార్లు వచ్చింది

6 18 2 2 మణి కంధరుడు. "విష్ణుభక్తి హృదయంబునం బొదల దీర్థయాత్రి" కావించినాడు మధుర, హరిద్వారం, సాలగ్రామం పురుషోత్తం - ఇవన్నీ దర్శించినాడు తర్వాత "శ్రీపార్వ విభుని యంఘ్రి సరోరుహంబులు కను దమ్ములకు విందుగా నొనర్చి, సింహాచలాధీశ సేవా విశేషంబులను జన్మంబు నలంకరించి, శ్రీమదహోబల స్వామి పాదనఖాదం ాల సంఘము ఫాలశికి నొసగి వెంకటేశ్వర చరణారవింద గంధ నందదిందిందిర శ్రేణి నైల్యమునను నిజ శిఖా కాంతికి బుట్టి నిర్వహింప" తిరుమల కేతెంచినాడు (2-126)

"ఘన ప్రమద ప్రేమ విశేష సంభృత పరీరంభ క్రియా సంభ్రమ భ్రమ కాలాభిముఖ ప్రసార లహరి దాహ సమాజా సమాన మనోజ్ఞంబగు స్వామి పుష్కరిణికి" వచ్చినాడు (2-127)

"హరసంతతాశ్రిత స్వాంతమైన స్వామి పుష్కరిణియును నా శౌరి భక్త తపవును"స్నానసవేళ అన్యోన్య పావనత్వాన్ని పొందినాయి (2-128) వరాహ మూర్తిని సేవించినాడు (13-129) తేజానికి, వాయువుకు, ధారుణికి, గగనానికి, సలిలానికి పావసత్వం గలిగించే వేంకటేశనగము చేరినాడు (2-130)

మృదు పదాంబుజములు మెఱుగుటందెలు పైడిదుప్పటి మొల ముప్పిడి . . ఇవి సర్వాలంకార సమన్వితుడై ఉండే శ్రీవేంకటేశుని దర్శించినాడు మణి కంధరుడు (2-132)

6 18 2 3 స్వామిని మూడు అహోరాత్రాలు సేవించి వేంకటనగంబు డిగ్గి వెళ్ళినాడు (2-137). కంచి, శ్రీరంగం ఇవన్నీ దర్శించినాడు నలకూబరుని శాపబలం వల్ల భృగు నిపాత లంపట మతియై శ్రీశైలం చేరినాడు (4-192)

6 18 2 4 స్వభావ సిద్ధుడు 'శత తాళ దఘ్న హ్రదంబులో' నివసించి ఉండినాడు (5-183) ఒకనాడు యోగనిష్ఠ వదలి హ్రదము లోపల వెలువడి . . సకల బుధసేవ్యమైన శ్రీశైలమునకు అరుగుదెంచినాడు (5-184)

సిద్ధుడు.. శ్రీశైలము ... గాంచినాడు అది నీల లోహిత లసన్మణి చిత్రిత సాను వైభవోత్తాలము. . నిత్య వర్ణ గుణజాలము ముక్తి లతాలవాలము" (5-185)

కుబేరుమల, మందర నగం, మెరుగిరి, వింధ్య, హిమాద్రి వీటన్నిటికీ ఏదో ఒక లోనుగుంది లోపరహితమైంది కాబట్టి శ్రీనగము శ్రీనగమన్ ఘనకీర్తికిం దగున్ (5-186) అంటాడు కవి ఇదే భావం పాల్కురికి సోమనలో వుంది (పు. 28)

సిద్ధమణులుండే గనులు, సిద్ధౌషధ మూలికలు, సిద్ధ రసధునులు ఇవన్నీ కలిసిన రూపే శ్రీగిరి (5-188) పాతాళగంగ యనియెడు కైతవమున నగేంద్రు కాలి కడియము ద్యోతించు (5-189)"ను

అంతటి పవిత్రమైన ఆ ఉత్తమ పర్వతాన్ని అధిరోహించి, స్వామిని సేవించి, భృగుపాతం చేసే మణి కంధరున్ని వారించినాడు సిద్ధుడు (5-191)

మృగేంద్రవాహన అభినవ కౌముదితో "శ్రీశైలంబున నొక్కశాపంబు కారణంబుగా భృగుపాతంబున కాయత్తపడుచున్నవాఁడు" ఈ ఖడ్గమిచ్చి రాక్షసుని చంపటానికి నియోగించు అని చెప్పి పంపుతుంది

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

"ఇట నిట్టటు తడపెవఁగార్త్యము దప్పఁదపడు శ్రీగిరికి నడిన్ జనెమె నతి" (8-70) రాక్షసుడు వెంటబడినాడు మజీకంధరుని చేతికి ఖడ్గమిచ్చి పంపించింది అభినవకౌముది

6. 18 2 ఏ నారాయణుడు లక్ష్మితో "లోకానుగ్రహార్థంబు నేను నిరంతసన్నిధి స్థానంబులుగా సంగ్రహించిన శ్రీరంగ కాంచీ వేంకటాచలాహోబిలం పురుషోత్తమాది దివ్యస్థలంబుల కరిగి" సేవించ లేక పోయినా, ఉన్నచోటనే ఉండి నన్ను కొలిచి ధన్యులవవచ్చు అని చెప్పినాడు (8-258).

6 18 3 ప్రభావతీ ప్రద్యుమ్నం ఈ కావ్యంలో కనిపించే తెలుగు నాడుకు చెందిన ప్రదేశాలు – నదులు నిడుమానూరి కృష్ణరాయ సముద్రం, పింగళి, రాచపూడి, వెలగలేటి, శ్రీగిరి, కృష్ణా గౌతమీ నదులు

6 18 3 1 కవి పిన తమ్ముడు ఎట్టిన గయలోఁ గాశి ప్రయాగ శ్రీగిరి .. పర్వణ క్రియచే తమ తండ్రి కాహ్లాదమున్ గూర్చినాడు (1-8) కవి తన వంశావతారం ఇలా వర్ణించినాడు

6 18 3 2 "గంగఁదనదు పేర గౌతమీ నామ విఖ్యాతి బరఁగఁ జెప్పె "భూతలమునకు.. గౌతముఁడు (1-11) "ఆ గౌతమగోత్రమున గొకనామాత్యుఁడు సద్భోగ క్షేత్ర స్వామ్య సమాగతిఁ బింగళి పురాంకుండై" ఒప్పినాడు (1-13) పింగళి గ్రామమందు చిరకాల మున్నందువల్ల గోకనవంశానికి పింగళి పేరు ఏర్పడింది (1-17)

"గౌతమీ పరిసరంబులఁ గృష్ణ కెలంకులన్ .. పింగళి రామయాదులు... పలనాటను పాకనాటనుం పింగళి గాచయాదులు . పెంపు వహించిన అన్న దాదులు పింగళి గోకమంత్రి యిలు పేరనె వాల ప్రసిద్ధులైనారు (1-18) సూరయ వెలగలేటి యమరనామాత్య సుతన్ అమలాంబన్ .. (1-32) పెండ్లాడినాడు పింగళి అమర మంత్రి రాచపూడి గణపతి సుపుత్రి అయిన అన్నమ్మ కూతురు అంబమ్మను పెండ్లాడినాడు (1-39)

కవి తండ్రి పింగళి అమరన "నిడుమానూరి కృష్ణరాయ సముద్ర ప్రముఖాగ్రహార భోగాతిధేయ నిజ సంతతి ప్రతీతాత్ముఁడు (1-149)

పింగళి సూరన తన రచనలలో తెలుగుదేశ ప్రసిద్ధ పుణ్య క్షేత్రాలైన శ్రీశైలాన్ని తిరుమలను, అక్కడుండే తీర్థాలను, దైవాలను చక్కగా వర్ణించినాడు శ్రీకూర్మం, అహోబలం, సింహాచలం ఈ కవి రచనలలో ప్రస్తావించబడినాయి కృష్ణ, గౌతమి, పాతాళ గంగ, స్వామి పుష్కరిణులను కూడా కవి తన కావ్యాలలో ప్రస్తావించినాడు

6 19 అద్దంకి గంగాధర కవి 'తపతీ సంవరణ' ప్రబంధం అద్దంకి గంగాధర కవి రచించి, ఇబ్రహీం కుతుబ్‌షాకు అంకితమిచ్చినాడు. ముస్లిం ప్రభువుకు అంకితం చేయబడిన మొదటి తెలుగు ప్రబంధం ఇది కవి మొదటి స్థలం నెల్లూరు జిల్లాలోని అద్దంకి కావచ్చు[24]

6 19 1 తపతీ సంవరణ ప్రబంధంలో కనిపించె తెలుగునాడుకు చెందిన ప్రదేశ, నదీ నామాలు – ఆంధ్ర, కాళింగ, కృష్ణా గౌతమీ సరిదంతరం, సాగర గౌతమి సంగమ స్థలం, కంభంబుమెట్టు, కొండపల్లి, పెదకొండపల్లి, కైలాసకోట, కోయ్యలకొండ, గోలకొండ దుర్గం, పానుగల్లు, పొన్నాడ, మెతుకుదుర్గం, సప్తమాడియ మన్నియాలు, అసీతిగిరి/అశీతిగిరి / గౌతమీ తటిని అనేవి

6 9 12 సకల రాజ్యాల భామినులు ఇబ్రహీం కుతుబ్‌షాకు సేవ చేసి నారట అందులో ఆంధ్ర, కాళింగ కన్యకలూ ఉన్నారు "కాళాంగి ధరియించెఁ గాళింగ పుత్రిక . ఆంధ్రభామిని వీణియ నాలపించె" (1-13) అవి ఆ వాక్యాలు

6 19 3 కుతుబ్‌షా కొయ్యలకొండ, పానుగల్లు, కంబంమెట్టు, మెదక్ దుర్గం, ఇవన్నీ ఆక్రమించుకొన్నాడు

> "పదమటను సవాయి బసువనిఁగాఁజేసి యచట గొయ్యలకొండ యావరించెఁ
> దమరి మల్లాఖాను దండనంబునఁగొట్టి, హరియించెఁ బానుగల్లాది గిరులు
> ప్రథమ దిక్కుల యొద్దె పాత్ర సామంతుల ధట్టించి, కంభంబు మెట్టఁగొనియె
> పత్తరంబునఁ బరీదోడి పాఱఁగఁదోలిఁ మెతుకుదుర్గం బాక్రమించి మించె"
> (1-24)

అని కవి కృతిపతి విజయాల్ని ప్రస్తుతించిన పద్యం అంతటితో ఆగని విజయపరంపర క్రింది పద్యంలో వర్ణింపబడింది

> " కటకేశ్వరునిఁదోలి కైవసంబుగఁజేసెఁ గొండంత జయములఁ గొండపల్లిఁ

గంపమొంది ఏతాపఖాపండు గౌతమీ తటిని లంఘించి పోఁ బటమువెట్టె
సాగర గౌతమీ సంగమస్థలమున నడిపంబుఁగడిగెఁ బ్రఖ్యాతిగాఁగ"

అష్టదిగ్గజులను వెట్టికాపుల చేసినాడు కుతుబ్ షా (1-25) కుతుబ్‌షా పెద్ద కొడుకు హైదరుఖాన్ అతడు తూర్పున ఓఢ్రులను జయించినాడు "పెద్ద కొండపల్లి కడ .. వాహినీ పతి చారిస్పంద్రుడు మార్కొన్న హా జీవగ్రాహము గాఁగఁ బట్టి" కొనినాడు (1-28) జంషీద్ "ఒడ గర్వ ఫరం పెంక భాసురంబుగను గ్రైరాప కోట . కట్టించెను" (1-30)

'గోలకొండ దుర్గాధ్యక్షా' (2-140) 'పౌన్నాద సప్తమాడియ మన్నియ నృప మండలీ సమర్పిత మధ్యాచ్ఛన్న సుస్యాద్వీప' . (3-107) 'ప్రతులిత విభవ కృష్ణాగౌతమి సరిదంతరాళ ఘనచతురంతాసీతిగిరి (సీతిగిరి) దుర్గధరిత మహీతల దేవేంద్ర' (4-1) – ఇవన్నీ ఇబ్రహీం విజయాల్ని ప్రస్తుతించే కవి పలుకులు

అద్దంకి గంగాధరకవి కావ్యంలో కృతిపతి పరంపరగా గెల్చుకొన్న తెలుగు దేశంలోని దుర్గాలు, పురాలు కనిపిస్తాయి

6 20 పొన్నిగంటి తెలగన 'యయాతి చరిత్రము' పొన్నిగంటి తెలగన కవి అచ్చతెలుగు కావ్యం ఇబ్రహీం పాదుషా వద్ద ఉండిన అమీన్ ఖానుకు ఈ కావ్యం అంకితం

యయాతి చరిత్రలో కనిపించే తెలుగునాడులోని ప్రదేశాలు – కాసలనాడు, అమినపురము / అమీన్పురము, గోలకొండ, పొన్నిగంటి, పొట్లచెర్ల / పొట్లచెరువు.

6 20 1 అమీనుఖానుడు తన పేరున ఉండే 'అమీను పురం' లో సముద్రం వంటి చెరువు త్రవ్వించినాడు అమీన్ పురం రౌతులకు, బంట్లకు, గాయకులకు, కవులకు పుట్టినిల్లు దర్శించండి ఈ పద్యంలో –

" దురములో ప్రెవారు తుపకలుగా ప్రేయు నట్టి రౌతుల కెల్ల నాటపట్టు
తొడరి బెబ్బులినైనఁ బెడకేలఁ బడద్రోయు పూపుగల్గిన బంట్ల పుట్టినిల్లు
వట్టి ప్రాకుల నిగు ర్వైచెడు పాటలఁబాటిల్లు గాణల పట్టుగొమ్మ
పుట్టఁబుట్టిన ప్రౌఢ పౌల్పునఁజెప్పఁగాఁగలుగు జాణల మొత్తములకు నెలవు
నైన తనపేరఁగల్గు నమినుపురము నందు మున్నిది శోక చేయంగఁజాలు
చెఱువు త్రవ్వించె మిగుల నచ్చెరువు గాఁగ నిండువేడ్క నమీనుఖానుండు
మెఱసి" (1-30)

అమీన్పురము మేలితోటలలోని పండ్లను చూస్తే ముసలివారికైనఁ బసిబిడ్డలకు నైన పండ్లు వస్తాయట (1-37)

6 20 2 మేలు వజ్రాల గమి కొండ గోలకొండను కవి అచ్చతెనుగు పొడిపొడి మాటలతో నిర్మించిన విధం బహుధా ప్రశంసనీయం నాటి గోలకొండ కోట వైభవానికి ప్రతీక ఆ పద్యం ఇది-

" తెలగంటి పొరవాల తెగలఁ దీటిసకోట నిగనిగల్ నలుగడల్ నిండి యుండఁ
దమ్ముల విందు రా కొమ్మల దగడగల్ వేలుపు బ్రోలిర్లు విరియఁ జేయఁ
గొత్తతంబుల కెంపు క్రొత్తడంబుల రంగు నింగికిఁదొపు వన్నియలు నింపఁ
గవలి యొనక చిల్వ పతతి చా లగడిత తెలినీట నే ప్రొద్దుఁ గలసి యుండ
మిసిమి బంగారు మెడల మీది యెడల నిడిన ముత్యాలుఁ జుక్కలు దడబడంగఁ
దెలియ కెల్లరు వెఱగంద నలరు నెపుడు మేలు వజ్రాల గమి కొండ గోలకొండ "
(1-8)

6 20 3 "తామర తంపరై సిరులఁ దార్కొను కొసలనాట సత్యచింతామణి పొల్లు చెర్లను సతంబగుచుండ నమీనుఖానుఁడింపామతలింగ సిల్పఁబోడవై బేడగైన మసీదుఁగాంచి యందె మను వెండికొండ పయి కేగఁదలంపక బేసకంటియున్" 1-31) అందమైన, ఉన్నతమైన ఆ మసీదులోనే ఉంటాడట ముక్కంటి అయిన ఈశ్వరుడు వెండికొండపు వెళ్ళడం ఎందుకులే? అని ఔరా ! కవి చమత్కారం

పొడవుల్లో కెల్లా పొడవైనది "జగంబున కవ్వలయైన వెల్గు నెయ్యేడలఁ బొందుగ వారలకు నెక్కఁగ నిచ్చిన యా మసీము"ను అమీనుఖానుడు నిర్మించినాడు (1-32)

"పొన్నికంటి వంశ్య తెలగనార్య ప్రణీతంబైన యయాతి చరిత్రంబను నచ్చ తెనుగు ప్రబంధంబు" అని ఆశ్వాసాంతగద్యలు

పొన్నికల్లు మంగళగిరి సబ్ తా గుంటూరు జి లో ఉంది దాని ఔపవిభక్తిక రూపం పొన్నికంటి

తెలగన కావ్యంలో నాటి గోలకొండవైభవం, అమీన్పుర విలాసం, పొట్ల చెర్వులో ఉండే మసీదు ప్రస్తుతింపబడినాయి

6. 21 రామరాజు రంగప్పరాజు కవి : 'సాంభోపాఖ్యానం' ఈ కవి

రచన ఈతకాల్వటి బుక్కరాయల వంశంలోనివాడు రాజకవి బుక్కరాజు కొడుకు రామరాజు ఆయన వంశం వాడు కాబట్టి కవికి 'రామరాజు' అనే యింటిపేరు వచ్చింది[25].

6 21 1 'సాంబోపాఖ్యానం' లో కనిపించే తెలుగు నాడు స్థలనామాలు ఆరెవీడు, కొండవీడు, గుత్తి అనేవి

హిమధాముని వంశంలో 'ఆరవీటి బుక్కరాజు రామయ్య' వెలసినాడు (1-18) కృష్ణరాయ రాజ్యలక్ష్మి నిరీక్షణ పక్ష్మంబగు కొండవీడచిఱ కౌక్షేయా... పినకొండ్రాజు. ...గుత్తి తిమ్మరాజు కీర్తింపబడినాడు (1-37)

ఈ విధంగా కృత్యవతారికలో కవి వంశవర్ణనలో కొన్ని ప్రదేశనామాలు మాత్రం కనిపిస్తున్నాయి

6 22 తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు శ్రీ వేంకటేశ్వర వచనములు తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల రచన అన్నమయ్య కుమారుడే ఈయన క్రీ శ 1517 నుండి 1552 దాకా శ్రీవేంకటేశ్వర స్వామికి ఇతర దేవతలకు నైవేద్య ప్రసాదోత్సవాది కైంకర్యములకై 11 గ్రామములను సమర్పించినాడు[26] ఈ వచనాలు 166 ఉన్నాయి

6 2 2 1 శ్రీవేంకటేశ్వర వచనాలలో మనకు కనిపించే తెలుగుదేశ పుణ్యస్థలాలు అహోబిలం, తిరుమల/శ్రీవేంకటగిరి/ శ్రీవేంకటాద్రి/ శేషాచలం, 108 దివ్యతిరుపతులు, మంగళగిరి, శ్రీకూర్మం, సర్పవరం, సింహాచలం అనే ప్రసిద్ధ క్షేత్రాలు, పాపవినాశనం అనే తీర్థం

6 22 2 ప్రతి వచనం మొదట, చివర స్వామి సంబోధన ఉంటుంది మొదటి వచనం 'శ్రీవేంకటగిరి దేవా నాచేరాంబు నీవుండెడి నిత్యనివాసంబు' అని ఉంది (పు 1).

.... "నిన్ను నెలుంగ నలవిగాక తిరుమల వదన వెంటం జని వేంకటాచలం బెక్కి గరుడస్తంభంబు వెంత జనులకు నీవాసగు వరంబులు నూచియుఁ, బాపవినాశనంబనఁ దీర్థంబు నాడువారి పాపంబులు నీరై పోవుటం జూచియు, ఆ కొండమీఁద వృశ్చిక సర్పాదిజంతువులు నిర్గత విషంబులగుటం జూచియుఁ, కోద్యంబు బొంది యచట నీ మూర్తి దర్శించి తొల్లింటి యజ్ఞానంబు విడిచి సందేహంబులు మాని నిదె యెలిక

వనియు నేని ఒంట ననియుఁ దెలిపె శ్రీవైష్ణవుండ నైతి రక్షింపవే • శ్రీవేంకటేశ్వరా :
(పు 19–20)

పై వచనంలో తిరుమలకు వెళ్ళే భక్తజనం, గరుడస్తంభం వద్ద స్వామి యిచ్చె వరాలు, పాపవినాశన మహిమ, తిరుమలకొండ మాహాత్మ్యం ప్రతిపాదింపబడినాయి.

6 22 3 స్వామిని అయా క్షేత్రాలలో దర్శించినా ఒకటే స్వామి దాసులకు సమస్కరించినా ఒకటే ఫలం దివ్య తిరుమల ప్రస్తావన 21 వ వచనంలో ఉంది

"ప్రహ్లాదవరదా • బదరికాశ్రమ నైమిశారణ్య సాలగ్రామ పర్వతాయోధ్యా ప్రయాగ ద్వారావతీ పురుషోత్తమ సింహాచల శ్రీకూర్మాహోబల సేతు కుంభఘోణ తామ్రపర్ణీ శ్రీరంగ కాంచీ నారాయణగిరులు మొదలగు పుణ్యక్షేత్రంబులు, నీ నూట యెనిమిది తిరుపతులు సేవించిన ఫలము, నీ దాసులం గని యొకసారి నమస్కారంబు చేసినం బ్రసన్నుండవై యిత్తువు' (పు 10)

147 వ వచనంలో 108 దివ్య తిరుపతుల్లో 97 టిని పేర్కొనినాడు పెద తిరుమలాచార్యులు వీటిలో అహోబలం, తిరుమల రెండే తెలుగునాడులోని దివ్య తిరుపతులైనా వీటికి మంగళగిరి, శ్రీకూర్మం, సర్పవరం కూడా కలిపి ఐదు చేసినాడు—పరికింపండి

"శ్రీపురుషోత్తమా • శ్రీకూర్మము, లోహార్కము, వైకుంఠము, రంగనాథము, సర్పవరము, కనకగిరి, కనకాంబరగిరి, గోవర్ధనగిరి, యంజనగిరి, హస్తిగిరి, యాళ్వాచలగిరి, పండరంగగిరి, గరుడగిరి, మంగళగిరి, నీలగిరి, రామగిరి, హేమగిరి, వేంకటగిరి, శ్వేతద్వీపము, హిరణ్యాద్రి, అంతాద్రి, వృషభాద్రి, మదనాద్రి, ఘటికాచలము, శ్రీరంగము, ప్రమోదాతము, సత్యలోకము, ఆకాశనగరము శబరీప్రకాశము, ద్వీపాంతరము, పంపాతీరము, ఉత్పలావపము, అగస్త్యాశ్రమము, శరణాగతము, కదళీవనము, క్షీరాబ్ధి, బదరికాశ్రమము, నారాయణాశ్రమము, నైమిశారణ్యము, మహారణ్యము, సుబ్రహ్మణ్యము, బృందావనము, భక్తిస్థలము, కపిస్థలము, పాదస్థలము, శ్రీనివాసస్థలము, అవంతి, వ్రజము, కాశికా హృదయము, గయ గంగాసాగరము, చక్రవర్ధనము, సాగరసంగము, చిత్రకూటము, మణికూటము, హరిక్షేత్రము, కురుక్షేత్రము, అహోబలము, శ్రీవైష్ణవము, హిమవంతము, చూర్ణప్రతీకము, కపిలము, హాటకము, నిఖిలసాగరము, మయూరము, శ్రీమద్ద్వారము, కురుకాయనము, భద్రనంద

6 23 1 దశరథ రాజనందన చరిత్ర ఈ కావ్యం కర్పూరపురి హరికి అంకితం ఇందులో మనం దర్శించె తెలుగు ప్రదేశాలు ఆసూరు, కర్పూరపురం కర్పూరాచలం, కర్పూరా ది/సుకర్పూర (ధాముడు), దేవరకొండసీమ, పద్మ్యారాజు పలిశైలం బ్రహ్మరాజ పురి, సిగరం అనేవి ఇవి గాక అనంతగిరి ఒకటి మాత్రమే అదనంగా శుద్ధాంధ్ర నిరోష్ఠ్యసీతా కల్యాణ కావ్యంలో కన్పిస్తుంది ఈ కావ్యాలలో కనిపించే ప్రదేశాలను సంయుక్తంగానే పరిశీలిద్దాం

6 23 1 1 కవి వంశం పేరు మొదట ఆసూరు వారు తర్వాత 'మరింగంటి వారు' అదనంగా కలిసింది శ్రీ మద్రామానుజుల వారి ఇంటి పెరు కూడా ఆసూరి వారే లక్ష్మణార్యుడు 12000 మంది త్రిదండి సన్యాసులు ... డెబ్బది నాల్గువెల గురుజనము, లక్ష తిరుమణి ధారులు వెంట రాగా శ్రీ వైష్ణవ మత స్థాపన చేసి, శ్రీరంగానికి తిరిగి వచ్చినారు శ్రీరంగేశుడు "కంటిన్ లక్ష్మణ మునివరు గంటిన్ గూరేశదేశికి స్వామిన్ మఱిం గంటినదెవ్వరన, మఱిగంటి మహాన్వయము దనరె గణ్యంబగుమన్" (ద రా నం చ 1-15, 16) అరా స్వామి మఱింగంటిని (ఇంకా చూచినాను) అతడెవ్వరు - అన్నాడు అతడే మఱింగంటి వారి మూల పురుషుడు

ఆ విధంగా ఆసూరివారు మరింగంటి వారైనారు పై కారణం కవి కల్పితం కావచ్చు 'మరికల్లు' అనే గ్రామాన్ని బట్టి మరింగంటి అనే రూపాలు వచ్చి ఉండ వచ్చు మరికల్లు పేరుతో దెవరకొండ, నల్లగొండ, మహబూబ్‌నగర్ తాలూకాలలో గ్రామాలు ఉన్నాయి[28]

6 23 1 2 కర్పూరపుర/కర్పూరాచల ప్రసక్తి ఈ కావ్యాలలో ఇలా ఉంది కర్పూరపుర నరహరికిన్ . (1-40)...కర్పూరాద్రి నృసింహ (2-1, 3-1, 4-1, 5-1) సుకర్పూరధాముడు (1-2) అని కవి సంబోధనలు "కర్పూరాచల లక్ష్మీ నృసింహ వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ సకలైశ్వర్య ధురీణ "అని ఆశ్వాసాంత గద్య (ద రా నం చ )

కర్పూరపుర హరికిన్ (1-57) కర్పూరాద్రి హరి (1-1) కర్పూరాద్రి నరసింహుడు తానగు వెంకటేశ్వరుండు .. (1-11) శ్రీకర్పూరాచల లక్ష్మీనృసింహావతార వేంకటేశ్వర వరప్రసాద లబ్ధ సకలైశ్వర్యధురీణ అని ఆశ్వాసాంతగద్య (శు ని సీ క) దెవరకొండ, పద్మ్యారాజు పలిశైలం, బ్రహ్మరాజపురి - వీటి ప్రసక్తి ఈ క్రింది పద్యాల్లో ఉంది

చెన్నుగ బ్రహ్మరాజపురి చెన్నుఁడు తా నిలవేల్పు గాఁగనా చెన్నుని పేరు బూని సిరిఁబెంపుప దేవరకొండ సీమతో సన్నుత పణ్కరాజుపలి శైలమునన్ మరిఁ గంటి చెన్నుడై యెన్నిక మించె భూజపము లింటను, దొడ్లను మంద పేరిడన్ (ద రా నం చ 1-21)

సిపల దేవర కొండపు చేర్వ పణకరాజు పల్లియ గట్టుపై రాజు చెన్న శ్రమతింగంటి చెన్నదెశిక శశాంకుఁడహహ మతిగంటి చెన్నరాయఁడన వెలసె" (ప సి సీ క, 1-44)

చెన్నయాచార్యులు పుట్టకతో సర్పరూపంలో కన్పించినవాడు పణ్కరాజు పల్లి గుట్టపైన నివాసం ఆ గ్రామం ప్రస్తుతం మిర్యాలగూడ తా లో అడవిదేవుల పల్లికి దగ్గర్లో ఉంది ఆ గుట్టపై దేవళంలో ఉండే పుట్టలో పాలు పోస్తుంటారు ఇప్పటికి మరింగంటి వంశంవారు నేటికీ సర్పాన్ని పూజిస్తారు 29

6 23 2 పద్దాంధ్రనిరోష్ఠ్య సీతాకల్యాణం కావ్యంలో తమ తండ్రి లిరు వేంగళ నాథుడు గురురాయ పట్టణస్థాపకుడై వెలంగిన హరి తీర్థాలను కొన్నిటిని పేర్కొన్నాడు, సింగరాచార్యులు ఈ క్రింది పద్యంలో-

"దాపున నా యనంతగిరి, ధర్మపురీస్థలి, యూరుగొండ, గంగాపురి, బ్రహ్మ
రాయపురి, కర్పర, రేబచె, యండబెట్ట, బాడెపలి యాదియైన హరి తీర్థములన్
గురురాయ పట్టణ స్థాపకుఁడై వెలంగె".. (1-50)

పై చెప్పిన ఊర్లెక్కడెక్కడ ఉండేదీ, దశరథరాజ నందన చరిత్ర పీఠికలో శ్రీరంగాచార్యగారు వివరించినారు (పు 19)

"అనంతగిరి దేవరకొండకు దగ్గరలో - దేవరకొండ - కల్వకుర్తి మార్గంలో ఉంది నాగర్ కర్నూల్ తాలూకా లోని బిజినేపల్లి గ్రామానికి అనంతగిరి అనే పేరున్నట్లు తెలుస్తున్నది

ధర్మపురి కరీంనగర్ జిల్లాలో ఉండే ప్రసిద్ధ నరసింహ క్షేత్రం

ఊరుగొండ రామన్నపేట తాలూకాలో ఉండే ఉర్లుగొండ, మహబూబ్‌నగర్ జిల్లా జడ్‌చర్ల - కల్వకుర్తి మార్గంలో ఊరుగొండపేట - దేవరగొండ తాలూకాలో 'ఊరు గొండ' గ్రామం ఉందట వీనిలో ఏదో ఒకటి

గంగాపురి మహబూబ్‌నగర్ జిల్లా జడ్‌చర్ల తాలూకాలో ఉండే చారిత్రక ప్రసిద్ధిగల గ్రామం ప్రాచీన చెన్నకేశవాలయం ఉంది

బ్రహ్మరాయపురి ఏదైనా తెనుగు పేరునకు సంస్కృతీకరణం కావచ్చు. నాగర కర్నూల్ తాలూకాలో 'బొమ్మరాయపల్లి' ఉంది

కర్పర అడవి దేవులపల్లె వద్ద ఉంది పణ్కరాజుపల్లి, కర్పర పక్కపక్కన ఉండే పల్లెలు కొప్పర అనే పల్లె నాగర కర్నూలు తాలూకాలో ఉంది
రేబలె : నాగర్ కర్నూల్, షాద్ తాలూకాలో ఈ పేరుండే గ్రామాలున్నాయి
ఎండబెట్ల నాగర్ కర్నూలు తాలూకాలో ఉంది 'ఎండవల్లి' నల్గొండ తాలూకాలో ఉంది

బాదేపల్లి నేటి జడ్చర్లకు పూర్వం పేరు

పణకరాజుపల్లి గుట్టపై నృసింహాలయం ఉంది ఆ కొండనే సంస్కృతీకరించి కర్పరాచలం అని కవి చెప్పి ఉండొచ్చు లేదా కర్పర గ్రామం పక్కన ఉండే గుట్ట కాబట్టి కర్పరాచలం అని పలికి ఉండవచ్చు[30]

6 23 3 మరింగంటి సింగరాచార్యుల 'గోదావధూటీ పరిణయ' కావ్యంలో యాదవాకిళ్ళ, వాడపల్లి అనే ఊర్ల ప్రసక్తి ఉంది "సిరులింపొందును వాడపల్లి నగరన్ చెన్నొందుచున్నట్టి శ్రీ నరకంఠీరవు కోవెల స్థలికి స్థానాచార్యులై యుండఁగాన్ (1-37)

'యాదవాకిళ్ళ' ను గ్రామంబు నగ్రహారంబుగా నట నొసంగ (1-38) మరింగంటివారు కనగల్లు నుంచి వాడపల్లికి వెళ్లినారు యాదవాకిళ్ళ హుజూర్‌నగర్ తాలూకాలోను, కనగల్లు దేవరకొండ తాలూకాలోను, వాడపల్లి మిర్యాలగూడ తాలూకాలోను ఉన్నాయి ఇవన్నీ దగ్గర దగ్గరగా ఉండే గ్రామాలే[31]

పై విధంగా మరింగంటి వారి కావ్యాల్లో నాటి తెలంగాణాలోని ప్రసిద్ధ విష్ణుస్థలాలు ప్రస్తావించబడినాయి ఆ విష్ణుస్థలాలు ఆ వంశీయుల నిత్య జీవితంతో పెనవెసుకొని ఉండేవి

6 24 చరిగొండ ధర్మన్న 'చిత్ర భారతము' అనే కావ్యం చరిగొండ ధర్మన్న రచన. ఏకశిలా నగరముం బాలించిన మాన భూపాల చిత్తాంబు ఖానునకు మంత్రియైన యెనుముల పల్లి పెద్దనామాత్యునికి ఈ కావ్యం అంకితం

6 24 1 'చిత్రభారత' కావ్యంలో మనం దర్శించే తెలుగునాడు స్వరూపం ఇది. ఆంధ్ర, కళింగ, ఎనుమలపలి/ ఎనుములపల్లి/ ఎన్మలపలి/ ఎన్మలపల్లి, ఎల

మూరు, ఏకశిలాపురం, ఓర్గల్లు, కురవిపురం, చరిగొండ, ధర్మపురం / ధర్మపురి, పాంచాలీశ్వర ప్రాంగణస్థలి, కృష్ణవెణి అనేవి.

6. 24 2 కృతిభర్త ఎనుముల పల్లి పెద్దనామాత్యుడు ఆ గ్రామం ఎనుముల/ ఎనుములపల్లి/ఎమ్మెలపలి/ ఎమ్మెలపల్లి అని కావ్యంలో పేర్కొనబడింది

ఎనుములపలి మాధవ తనూజాత పెద్ద మంత్రి (2-1) ఎనుముల పల్లి మాద సచివేశ్వరు పెద్దన . (పీ 2) ఎమ్మెల పలి సింగమంత్రి నందనుండు మాధవుండు (పీ 52) ఎమ్మెలపల్లి మాద మంత్రిశేఖరు పెద్దనామాత్యవరుడు (పీ 72) అనే ఉటంకింపులలో ఆ గ్రామ ప్రసక్తి కన్పిస్తుంది,

6 24 3 ఏకశిలాపురం చిత్తాంబుఖాను ఏలుతుండేవాడు ఆ కాలంలో ఆ నగరరాజ వైభవం, పావిత్ర్యం ప్రౌఢంగా చిత్రించినాడు కవి ఈ పద్యంలో.

" అక్షయ క్ష్మాభార దక్ష దక్షిణ భుజా కౌక్షేయక క్షత్రి రక్షితంబు
కూట కోటీ శాత కుంభ కుంభ ప్రభామండితాంభోజాప్త మండలంబు
గంధ సింధుర దాన గంధాంధ మత్త పుష్పంధయ ఝుంకార బంధురంబు
విశ్వవిశ్వంభరా నశ్వరైశ్వర్య ప్రమదాశ్వరత్న వ్రాత శాశ్వతంబు
సతతతోత్సవ తోషిత శంబులింగ సమ్ముఖేందు శిలానంద చారు మంట
పస్థలీ నృత్య దంగనాపాద రణిత నూపురంబగు నేకశిలాపురంబు (పీ 10)

"...మాధ విభు తిమ్మామాత్య ముఖ్యుండు తానెలయూరన్ రజతాచలంబు గతి లక్ష్మీశాలయం బర్థి నిర్మల భక్తి న్విలసిల్లఁజేసె, మఱి పాంచాలేశ్వర ప్రాంగణ స్థలిఁ గట్టించెను
సువర్ణ విలసత్ప్రాధంబు నోర్గంటిలోన్" (పీ 64) అట్టిది అతని భక్తి

6 24 4 "మంత్రి నారయ శ్రీరంగనామాత్యఘనుడు .. రజత భూమిధరంబుతోఁ బ్రతిఘటింప దేవళము గట్టి నృహరి బ్రతిష్ఠజేసెఁ గురవిపురమున వైభవస్ఫురణ మెఱయ" అని కృతిభర్త పూర్వీకుల ప్రశంస

"శ్రీలక్ష్మీ కుచ పారిజాత కలికాశ్లిష్టోరువక్షుండు .. ధర్మపురీశ్వరుండు... పెద్దన ప్రభు సమగ్ర శ్రీయుతుం జేయుతన్ అని కవి ఆశీర్వచనం (పీ 1) శ్రీధర్మ పుర నృసింహారాధన తాత్పర్య బంధు రత్నామణి. పెద్ద మంత్రివరేణ్యుడు (2-1)

6 24 5 కథా భాగంలో ధృతరాష్ట్రుని కొలువులో అంగ వంగ కళింగ బంగాళ నేపాళ చౌళ బర్బర సింధు మాళవాంధ్ర" భూపతులుండినారు (6-12)

చతుర్దనుడనే రాజును కృష్ణునినుండి రక్షిస్తానని అర్జునుడు మాట ఇస్తాడు. పాండవుల సాయంగా వచ్చిన రాజుల్లో కాళింగుడు, ఆంధ్ర భూపతి ఉన్నారు, అంగాధీశుడు ... కాళింగుడాంధ్ర వసుంధరాధిపతి.. నృపుల్ వేవ్కతోన్ అరుగు దెంచిరి (6-40).

కవిని 'చరిగొండ ధర్మ సుకవీ' అని కృతిభర్త సంబోధించినాడు (పీ .18) చరిగొండ కల్వకుర్తి తాలూకా మహబూబ్‌నగర్ జిల్లాలో ఉంది చరిగొండ ధర్మన్న చిత్ర భారతంలో ఏకశిలా నగరాన్ని చక్కగా వర్ణించినాడు ఎమ్మలపల్లి, కురవి పురం, ధర్మపురి వంటి ఊర్ల ప్రస్తావన కూడా ఈ కావ్యంలో ఉంది

6 25 బొడ్డుచెర్ల చిన తిమ్మయ 'ప్రసన్న రాఘవ నాట్యప్రబంధము' ఈ కవి రచన. ఇది సంస్కృత ప్రసన్నరాఘవ నాటకానికి ప్రబంధరూపమైన తెనిగింపు

కృతిభర్త నంద్యాల తిమ్మరాజు, కళాపూర్ణోదయ కృతిభర్త నంద్యాల కృష్ణ రాజు – అన్నదమ్ముల మనుమలు నంద్యాల రాజులను సమగ్రంగా వర్ణించె కావ్యా లలో కళాపూర్ణోదయం మొదటిది ఈ ప్రబంధం రెండవది[32]

6. 25 1 'ప్రసన్నరాఘవ నాట్య ప్రబంధం లో కనిపించే తెలుగునాడుకు సంబంధించిన స్థలాలు – నది అంజనాద్రి, ఆరవిడు, తిరుమలకొండ, నందేల, బొడ్డుచర్ల, గోదావరి.

6 25 2 నంద్యాల రాజులు పూర్వం ఆరవిటివారు వారిలో ఒక వంశం వారు నంద్యాల పాలించినందువల్ల నంద్యాల వారైనారు కృతిపతి వంశ వర్ణనలో . ఆరవీటి పిన్న క్షమాపాలుండు .. (1-8) ఆరవిటి బుక్కక్ష్మాతలాధీశ్వరాగ్రణి (1-9) భూనుతుం డారవీటి పుర బుక్క ధరావరు సింగ ధాపణీజాని" అనే సంద ర్భాలలో 'ఆరవీటిపుర' ప్రసక్తి ఉంది.

"నందెల పురంబు విభవ నాకపురంబు" నరసింగరాజు శత్రుల ఖండించి ఆ పురాన్ని ఏలినాడు (1-16) అంజనాద్రిం దీర్థయాత్రానురక్తిఁగూడె పారిషదుల పెన్నాట మిచట (1-5) ఇందు నందేల తిరుమల ధరావరుండును తిరుమల కొండ నేలు జేజేలరాజుఁబూజించువాఁడై వెడుకం . జనపతులును . . ప్రధాని ధురంధరు లును.. కవి హర్యక్షులును.. కొలువు కూటంబునఁగొలువున్న వాఁడమ్మూర్ధాభిషిక్తు నర్ధాసనంబున బొడ్డుచెర్ల చిన తిమ్మయ మంత్రి కుమారుఁడు...సారవచోనిధి యున్న వాఁడు (1-6,7)

సందేల కృతిపతి వంశీకుల ఇంటిపేరుగా పద్దెనిమిది చోట్ల ప్రస్తావించబడింది (1-1,6, 50, 52, 53, 59, 67, 69, 75, 77, 78, 328, 2-183, 3-172, 4-121, 5-164, 6-145, 7-258) సీతారామలక్ష్మణులు గోదావరీ నదిని చేర బోయినారు ఆనది "సుమన స్స్వమంతినీ గాహిని పార స్ఫార వనీ విహార ముని దంపత్యున్నతోత్సాహిని వారాస్నిర్ధ్యను కూల గేహిని పయో వాహౌఘ సందోహిని క్రూరాన్యేహిత వస్తు దోహని - మహాగోదావరీ వాహిని" ( 5-96 )

6 25 3 ఈ కావ్యంలో గంగా యమున సరయువు గోదావరి, సము ద్రుడు పాత్రలు గోదావరి గంగా, యమునా, సరయువులు సముద్రుడు వీరి పర స్పర సంభాషణలతో రామాయణ కథ సాగుతుంది గోదావరీనది ప్రసక్తి 5-125, 127, 128, 129, 131, 133లలో ఈ నాట్య ప్రబంధంలో వస్తుంది

పొడ్డ నెర్ల తిమ్మన ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధంలో అంజనాద్రి! తిరుమలకొండ, ఒరపేడు, నంద్యాల, పొడ్డుచెర్ల - వీటి ప్రసక్తి అవతారికా భాగం లోను, గోదావరీ నది ప్రసక్తి కావ్య భాగంలోనూ కనిపిస్తుంది

6 26 తాళ్ళపాక తిరువేంగళ నాథుడు (చిన్నన్న) : అష్టమహిషీ కల్యా ణం, ఉషాకల్యాణం తాళ్ళపాక చిన్నన్న రచించిన ద్విపదకావ్యాలు ఇతడు తాళ్ళ పాక అన్నమాచార్యుల తనయుడు. 'అష్టమహిషీ కల్యాణం' లో కనిపించే తెలుగు ప్రదేశాలు తాళ్ళపాక, మండెము, వెంకటగ్రావం అనేవి,

6 26 1 తాళ్ళపాకన్నయార్య తనయ.. (1-1550, 3-4462) తాళ్ళ పాకన్నమార్య తనయు (3-3295) అనే సందర్భాలలో తాళ్ళపాక గ్రామ ప్రసక్తి ఉంది

తిరుమలాచార్యుడు మండెము కోటలో మండలంబెఱుఁగ మండలాగ్రాహతి మండిత పుష్పదామష్ఠ ధర్మాంగద స్థితిఁ బొలిచినాడు (1-99 నుంచి 101)

"వనజాత జాత సర్వసురేంద్ర ముఖులు గనలేని వేంకటగ్రావాధి నాథు పదములు, తనదు పసులు, బహుదేశ పథముల జనులఁగనఁజేసె" నాడు తాళ్ళపాక యన్నయాచార్యుడు (1-52-60)

ఉషా కల్యాణం ఈ ద్విపద కావ్యంలో ఆంధ్రదేశం, తాళ్ళపాక - అనే స్థలాల ప్రసక్తి ఉంది ఉషా స్వయంవరానికి వచ్చిన రాజులలో ఆంధ్రరాజు కూడా

ఉన్నాడు "కేరళ గాంధార కెకయాంధ్రాది ధారుణీశ్వరుల నందఱను జూపుచును' (1-658)

తాళ్ళపాకన్నయ పుత్ర తిరుమలార్యాత్మజ . తిరువేంగళనాథ (1-24 25) ఈ విధంగా చిన్నన్న కృతులలో తాళ్ళపాక, మండెం, వెంకటగ్రావం, ఆంధ్ర దేశంల ప్రసక్తి వుంది

6 27 తెనాలి అన్నయ సుదక్షిణా పరిణయం తెనాలి అన్నయ కావ్యం పులిజాల సోమమంత్రి కృతిపతి అన్నయ తెనాలి రామకృష్ణని సోదరుడు

6 27. 1 సుదక్షిణా పరిణయ కావ్యంలో మనం సందర్శించె తెలుగునాడు లోని స్థలాలు – క్షేత్రాలు, తీర్థం ఇవి , ఆంధ్రరాజ్యం, కంకిపాటిపురం, తెనాలి, పఞ్జువ్వి, పాలగుమి, పులిజాల, పెనుగొండ, శ్రీగిరి వెంకట భర్త వసించుకొండ, శేష శైలం, దేవదేవు దివ్యభవనం, స్వామి పుష్కరిణి అనేవి

6 27 2 సుదక్షిణా దిలీపుల వివాహ సందర్భంలో ఆంధ్ర భూపతి ప్రస్తావన ఉంది దిలీపునికి ఊడిగాలు చేసే రాజుల్లో "లాటగౌళాంధ్ర భూపలలామ కోటి" వున్నారు (5-147)

కోనేటి రామాధిప స్థిర సైన్యాధిపుఁడబ్బ మంత్రి అబ్బమాంబన్ కంకిపాటిపుర వేదామాత్య పుత్రీమణిన్" వరియించినాడు (1-47) తెనాలి రామపండితాగ్రణి సత్పుత్రి నన్నపాఖ్య...(1-14) తెనాలి రామేశ్వర శాశ్వత కృపాకటాక్ష లక్షిత కవితాభిరాముఁడు.. అన్నయ్య (ఆశ్వాసాంతంద్య)

6 27 3 పులిజాల సోమమంత్రి . పఞ్జువ్వి చెన్నకేశ్వర హృజ్జలజాతుడు (1-59) కవి పాలగుమి భీమగురుని సద్భక్తి కొలిచినాడు (1-9)

వేంకటేశుఁడు పులిజాల రామవిభు సోమామాత్యునిం బ్రోవుతన్ (1-1) .. శ్రీగిరీంద్ర విహారి చేత భద్రములు గాంచు పులిజాల సోమ విభుఁడు (1-2) అని కవి ఆశీర్వచనాలు ఇంకా పులిజాల ప్రసక్తి కృతిపతి వంశ వర్ణనలో 12 చోట్ల ఉంది (1-4, 29, 38, 48, 52, 54, 59, 2-1, 202, 3-1, 4-1, 5-1)

6 27 4 శివపార్వతులు అంశుమంతుని అతిథి పూజాతత్పరత పరీక్షించ డానికి కపట విప్రదంపతులుగా వస్తారు నాపేరు శంభుమిశ్రులు . "పెనుగొండ నిలుతుఁడలుచుగ" (2-28) అంటారు పెనుగొండ అంటే ఈ సందర్భంలో కైలాస పర్వతమే పెనుగొండ రాజ్యం అనే అర్థంలో ధ్వని ఉందేమో ? మరి ! /

6 27 5 దిలీపుడు సుదక్షిణ కోసం వెదుకుతూ వచ్చి శేషశైలం దర్శిస్తాడు "లోక లోచన శతకోటి దీప్త మణి సాను విభాసి దిగంతరాళము సనకసనందనాది ముని సంస్కృత విస్తృత పుణ్యశీలము జన జని కర్మ నిర్మథన సౌఖ్య పీఠాలము శేషశైలము" (5-62) మేరు పర్వతాన్ని శివుడు విల్లుగా జేసె వంచినాడు, గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా ఎత్తినాడు కృష్ణుడు వింధ్యాద్రి నేలలో అణగ దొక్కినాడు అగస్త్యుడు కాబట్టి "ఈ వెడవెడ కొండ లీవగునె వేంకట భర్త వసించు కొండకున్" (5-34) అనుకొన్నాడు దిలీపుడు

"ఏతత్కుధర కూటాగ్ర హాటక విమానాంతర చరిష్ణుండగు విష్ణుండు" నీ కోర్కె తీరుస్తాడు స్వామిని దర్శించు అని సఖుడు చెపుతాడు దిలీపునికి

"సౌగంధిక బంధురంబులగు స్వామి పుష్కరిణి వబంధంబులం గాలోచిత కృత్యంబులు నిర్వర్తించి, సాకార కనకగిరి శంకాకారి ప్రాకార పరివృతంబును, ఘన ఘనాఘన చ్ఛాయాపమేయ ధూప ధూమ విలోకన తాండవ త్కుండలి పరిపంథి మండలంబును, సముత్తంభిత చంచత్కేతు పటాంచల కాంచన కింకిణీ కలకలాకులిత జలజహిత రథఘోటకంబును నగు నద్దేవదేవు దివ్య భవనంబు ప్రవేశించి పురోభాగం బున (5-65) వెలిదామరల నవ్వు వెడద కన్నులవాని . పసిమి మీరిన పచ్చ పట్టు గట్టిన వాని .. కలిమెని వెల్వఁగాంచి వందనము సేసి"నాడు దిలీపరాజు "గోవింద గోరూప గోపికావల్లభ . వేదాధారా .. సనకప్రస్తుత . . సుస్వన వేదస్తుత పాద .. సర్వ ప్రియంభావుకా" అని పరిపరి విధముల ప్రస్తుతించినాడు

తెనాలి అన్నయ సుదక్షిణాపరిణయంలో సంస్కృత మూలంలోలేని తిరుమల క్షేత్రాన్ని, తీర్థాన్ని, స్వామిని ప్రస్తుతించడం ఆ కవి విష్ణు భక్తిని ప్రతిబింబిస్తుంది

6 28 తెనాలి రామభద్రకవి 'ఇందుమతి పరిణయము' అనే ప్రబంధం తెనాలి రామభద్రకవి రచించి పాలచూరి కృష్ణ భూపాలునికి అంకితమిచ్చినాడు

6 28 1 ఇందుమతీ పరిణయ కావ్యంలో కనిపించే తెలుగునాటి ప్రదేశాలు ఆంధ్ర, కొండపల్లి, పాలచురి / పాలచురీ / పాల్చూరి / పాల్యూరి / పాల్యూరి, వేంకట భూమి ధరం – అనేవి

6 28 2 .. కర్ణాట లాట చోళాంధ్ర పాండ్య . నృపాల సభల నుతి గాంచినాడు ...కృష్ణశౌరి (1-38) అతడు "కొండపల్లి విభుండు వెంగళ క్షమా ఖండలు కూర్మి పుత్రిక ... వేంకటమాంబెండిలి" అయినాడు (1-41, 42)

6 28 3 కృతిభర్త ఇంటిపేరు పాలచూరి పాలచూరు కొండపల్లికి ఈవలా వలగా కృష్ణా గుంటూరు జిల్లాలలోనె పూర్వం ఉండి ఉండవచ్చును అని దివాకర్ల వేంకటావధానిగారు[33] కృతిభర్త వంశ వర్ణన పాలచూరి ప్రసక్తిలో మొత్తం 28 చోట్ల ఉంది పాలచరి (1-1) పాలచరి (1-27, 32, 48, 49, 55, 62, 63, 67 79, 81) పాల్చురి (1-3, 37, 44, 61, 66, 74) పాల్చూరి (1-5, 6, 50, 73, 84, 89) పాలచూరి (1-18, 32, 51, 3-1) పాల్చూరీ (1-82)

"వేంకటభూమి ధరాధినేత . శౌరి నిత్యమున్ బాలచరీ కృష్ణ నృపాలుఁ బ్రోవుతన్" (1-1) అని కవి ఆశంస

ఇందుమతీ పరిణయంలో కనిపించే తెలుగు ప్రదేశాలు వెళ్ళమీద రెక్కపెట్టేటన్ని మాత్రమె

6 29 దామర్ల వెంగళ నాయకుడు కాళహస్తి ప్రభుపరంపరలోని దామర్ల వెంగళ నాయకునివే తండ్రి కంకితంగా 'బహుళాశ్వ చరిత్ర' రచింపబడింది[34]

6 29 1 బహుళాశ్వ చరిత్ర కావ్యంలో కనిపించే తెలుగు ప్రదేశాలు - పురాలు, నదులు ఇవి ఆంధ్ర ధరా, కళింగ, కొంకణం, త్రిలింగ, ఇరిగెల, ఉత్తర మల్లూరు కొల్లాపురి, కోర్కొండ గడికోట, గూషలాతూరు, తిరుమల, తోపూరు, త్రిపురాంతకం, దక్షవాటం, పాతెంబుకోట, మండువా, వాలూరిపురి, విజయవాటి, మున్నేలిబైళ్లు, వెలిగోడు, శ్రీగిరి, కృష్ణా, గౌతమీ నదులు

6. 29 2 దామెర్ల వేంకటాద్రి కృతిభర్త ఆయన విశేషణాలు పరాక్రమ విశేషాంను తెలిపేవి . వాలూరీ పురపతికిన్ (1-68) గడికోట గ్రమల్ల బిరుదునకు (1-63) ఆంధ్రధరానాధునకు (1-72) కోర్కొండ సింహబిరుదునకు (1-78) అనేవి

వెలిగోటి యాచరాజు విజయాలు ఈ పద్యంలో చెప్పబడినాయి

" ఉత్తర మల్లూరియొద్ద దావల పాప విభునిఁ గొట్టి .
తిరుమల చేరి ధాత్రిని మన్నె రాజులఁ బాఱఁద్రోలి...
పాతెంబు కోట వెల్పట నాజి యతి రాజు జరఁగఁ జేసిన...
మేటి వెలిగోటి యాచని సాటి గలరె " (1-36)

6 29 4 ముస్నలి బైళ్ళను ఎలూరి లింగ భూపిఘనగొట్టె ధీరత గూఢ లాతూరిలో ..శాత్రవబలములసంహరించె గడికోట మల్లి పఘాంకయుతుఁడు.. చెన్న భూవిభు వసుండు (1-55)

6 29 5 కృష్ణాధీశ్వరు కీర్తి చంద్రికలు కృష్ణాగౌతములం బ్రసిద్ధములు కోకీ బాంధవ పోత్రిపృవా కృష్ణాకారాకారణ ప్రకటముగ్ . . (1-34) వేంగిళాదిప పంచపిశిఖ మూర్తి యంగ లాట కళింగ వంగ లాలిత కీర్తి (1-25) అంగ త్రిలింగ వంగ కళింగబులంల వెంగళ విభునికి వదాన్యులు ఈడు జోడు లేరు (1-33)

పై విధంగా దామెర్ల వెంగళనాయకుడు తన తండ్రి తాతల పరాక్రమాల్ని కృత్యవతారికలో విపులంగా వర్ణించినాడు

6. 30 సారంగు తమ్మయ : వైజయంతీ విలాసకావ్యం సారంగు తమ్మయ రచన ఈ కావ్యంలో గోలకొండ, శ్రీవేంకట క్షేత్రాల ప్రసక్తి ఉంది

6 30 1 ఎనబది నాల్గు దుర్గముల నేలిన యేలిక గోలకొండను మహమ్మదుశాహి ఏలుతుండగా తద్దప నగర స్థలిన్ గరణికంబొనరించెడు వాడు తమ్మ మంత్రి (1-31)

6 30 2 దేవదేవి విప్రనారాయణున్తో తాను వెశ్యా ధర్మాన్ని రోసి "నే వేశ్యాత్వంబు మాని యేకాకినై శ్రీ వెంకట పురుషోత్తమ దేవాయతనాది దివ్య దేశము లందున్ (2-92) చరించి" పునీతనౌతాను అంటుంది

'వైజయంతీ విలాసంలో' గోలకొండ, తిరుమల మాత్రమె కనిపిస్తాయి

6 31 శ్రీకృష్ణదేవరాయల యుగ సాహిత్యంలో కనిపించిన విశిష్టాంశాలు కొన్ని ఇంతకు ముందు శతాబ్దాల్లో అంతగా కనిపించని రాజుల విజయ పరంపర-వారికి లోబడిన దుర్గాల - పురాల ప్రసక్తి ఈ యుగ సాహిత్యంలో ఎక్కువగా కనిపిస్తుంది

కాళహస్తి మాహాత్మ్యంలో సూక్ష్మ సూక్ష్మాంశాల్తో శ్రీకాళహస్తి క్షేత్రాన్ని, తీర్థాన్ని, దైవాన్ని కొనియాడడం జరిగింది వల్లభాభ్యుదయం శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్య గ్రంథం బైరవ కవి శ్రీరంగమహత్త్వం, తెనాలి రామకృష్ణుని ఘటికాచల మహాత్మ్యం, పాండురంగ మాహాత్మ్యం కూడా ఈ యుగంలో వెలసిన క్షేత్ర మాహాత్మ్య కావ్యాలే

పొన్నగంటి తెలగన యయాతి చరిత్ర, మరింగంటి సింగరాచార్యుల దశరథ రాజనందన చరిత్ర, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకళ్యాణం అచ్చ తెలుగు కావ్యాలు

హరిశ్చంద్ర నలోపాఖ్యానం, రాఘవ పాండవీయం ద్వ్యర్థికావ్యాలు తాళ్ళపాక కవుల సంకీర్తనలు ద్విపద, రచనలు, కందుకూరి రుద్రకవి సుగ్రీవ విజయ యక్షగానం, తాళ్ళపాక పెద తిరుమలాచార్యుల వేంకటేశ్వర వచనాలు, అందుగుల వెంకయ్య రామరాజీయం వెర్వేరు సాహిత్య ప్రక్రియలకు చెందిన కావ్యాలు

పదహారో శతాబ్దం నాటి కాకుళక్షేత్రం, కాళహస్తి, గోలకొండ, సోమరాజుపల్లి, ఏకశిలాపురం, తిరుపతి, శ్రీశైలం వంటి క్షేత్రాలు నగరాలు–కొండవిడు వంటిదుర్గాలు మన కళ్ళకు కట్టేట్లు కవివరేణ్యులు చిత్రించినారు

విద్యానగర పతనంతో ఆంధ్ర సాహిత్య సరస్వతి తంజావూరు, మధుర, వంటి దక్షిణాది తెలుగు రాజ్య రాజధానులకు వలస పోయింది దక్షిణాంధ్రయుగంలో 'తెలుగునాడు' స్వరూపాన్ని తర్వాతి ప్రకరణంలో పరిశీలిద్దాం

## సూచికలు :

1 కృష్ణదేవరాయలు – నేలటూరు వేంకటరమణయ్య
2 విజయనగర చరిత్రము – నూతలపాటి పేరరాజు, పు 188
3 విజయనగర చరిత్రము, పు 190
4 కృష్ణదెవరాయలు–పు 84, 87
5, ఆంధ్రదేశచరిత్ర–భూగోళ సర్వస్వము ముఖద్వారము పు 232
6 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 34, 297, 109, 241, 106, (పరి) 176, 58, (ప్ర) 6
7 శ్రీకృష్ణదెవరాయలు, పు 85
8 ,, పు 71
9. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 311
10 శ్రీకృష్ణ దేవరాయలు, పు 60
11. పు 81

12 రాజశేఖర చరిత్రము, పీఠిక, పు 77
13 ఆంధ్ర చారిత్రక భూగోళ సర్వస్వము, పు. 246
14 సుగ్రీవ విజయం, మున్నుడి, పు 1
15 కడప ఊర్ల పేర్లు, పు 480
16 కవికర్ణ రసాయనము—ఉపోద్ఘాతము, మోచర్ల రామకృష్ణకవి, పు 15
17 ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పు 30
18 „ పు 326–8
19 పంచతంత్రి—పీఠిక, పు 5
20 శ్రీరంగ మహత్త్వము – పీఠిక, మానవల్లి రామకృష్ణకవి, పు
21 వల్లభాభ్యుదయము, పీఠిక, కోరాడ రామకృష్ణయ్య, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి పు 5–6
22 „ పు 9
23. „ పు 19
24. „ పు 12
25 తపతీ సంవరణం – పీఠిక, పాటిబండ మాధవశర్మ, పు 11
26. సాంబోపాఖ్యానము, పీఠిక పు 11
27 శ్రీ వేంకటేశ్వర వచనములు పీఠిక, వేటూరి ప్రభాకరశాస్త్రి, పు XII - XIII
28 దశరథ రాజ నందన చరిత్ర – పీఠిక, శ్రీరంగాచార్య, పు 6
29 „ అధస్సూచి, పు 7
30 „ పీఠిక, పు 7–8
31. „ పు 18
32 „ పు 17
33 ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధము, ప్రరోచన . వి రామరాజు, పు 2
34 ఇందుమతీ పరిణయము – పీఠిక, పు V
35 బహుళాశ్వ చరిత్రము – పీఠిక, శ్రీ ఎస్ రామచంద్ర వేంకట కృష్ణారావు.



# 7

# దక్షిణాంధ్ర యుగ సాహిత్యంలో తెలుగు నాడు

7 0 క్రీ శ 1600 నుండి క్రీ శ. 1775 వరకు ఉండే కాలాన్ని దక్షిణాంధ్ర యుగంగా ఆంధ్ర సాహిత్య చరిత్రకారులు పేర్కొన్నారు. తెలుగు సాహిత్యం తంజావూరు, మధుర, జింజి, పుదుకోట్ట వంటి దక్షిణ రాజ్యాల్లో పోషింపబడింది కాబట్టే ఆ పేరు వచ్చింది దక్షిణాంధ్రంలోనే గాక ఆంధ్ర దేశంలో కూడా నాడు కవిత్వం మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లింది నేను పరిశీలించిన ఈ యుగంలోని కవులు 31 మంది వారు—

1) తరిగొప్పుల మల్లన, 2) విశ్వనాథనాయని స్థానాపతి, 3) మట్ల అనంత భూపాలుడు, 4) రఘునాథనాయకుడు, 5) చేమకూర వెంకట కవి, 6) కవి చౌడప్ప, 7) దంతులూరి బాపకవి, 8) క్షేత్రయ్య, 9) మారన వెంకయ్య, 10) రత్నాకరము గోపాలరాజు, 11) ప్రౌఢకవి మల్లన, 12) పాలవేకరి కదిరీపతి, 13) కంచెర్ల గోపన్న, 14) బిజ్జల తిమ్మభూపాలుడు, 15) చక్రపురి రాఘవాచార్యులు, 16) కుమార ధూర్జటి, 17) సముఖ వెంకట కృష్ణప్పనాయకుడు, 18) శేషము వెంకటపతి, 19) సారంగపాణి, 20) ముద్దు పళని, 21) వెలగపూడి కృష్ణయామాత్యుడు, 22) అయ్యలరాజు నారాయణామాత్యుడు, 23) కంకంటి పాపరాజు, 24) పుష్పగిరి తిమ్మన, 25) కూచిమంచి తిమ్మకవి, 26) గోగులపాటి కూర్మనాథకవి, 27) ముప్పిరాల సుబ్బరాయకవి, 28) గట్టుప్రభువు, 29) రత్నాకరము అప్పప్పకవి, 30) వెలిదండ్ల వేంకటపతి, 31) అడిదము సూరకవి — అనేవారు

ఈ యుగంలోనే రాయవాచకం, కృష్ణరాయవిజయం, రామరాజీయం వంటి చారిత్రక కావ్యాలు వెలసినాయి విశ్వనాథ నాయకుడు, మట్ల అనంత భూపాలుడు, బిజ్జల తిమ్మ భూపాలుడు వంటి రాజకవులకు ఈ యుగంలో కొదవే లేదు

క్షేత్రయ్య, సారంగపాణి వంటి వాగ్గేయకారులు ఈ యుగానికి వన్నె తెచ్చినారు గోగులపాటి కూర్మనాథకవి వంటి వారు వ్యాజస్తుతి శతకాలను రచించినారు. శుకసప్తతి, హంసవింశతి వంటి కథాసంకలన కావ్యాలు కూడా వెలసినాయి ఇలాంటి విశిష్టత గలిగిన దక్షిణాంధ్రయుగ సాహిత్యాన్ని ఈ ప్రకరణంలో పరిశీలిద్దాం

7 1 తరిగొప్పుల మల్లన 'చంద్రభానుచరిత్రము' అనే ప్రబంధం తరిగొప్పుల మల్లన రచన మాహుర పురంలో వెలసిన దత్తాత్రేయ స్వామికి అంకితం. చంద్రగిరి రాజధానిగా ఏలుతుండిన వేంకటపతి రాయల ఆస్థానంలో ఈకవి 'రాయసం' ఉద్యోగి

7 1 1 చంద్రభాను చరిత్రలో మనకు కనిపించే తెలుగునాడులోని ప్రదేశాలు ఆంధ్ర, త్రిలింగ, తరిగొప్పుల, తిరుమలకొండ / పన్నగసార్వభౌమాచలం, శేషగిరి/శేషభూమిభృద్భాగం / శేషశైలం, తుంబురుకోన, దిగువతిరుపతి, మాహుర పురం, స్వామినగరు, ఆళ్వారుతీర్థం, వామన తీర్థం, స్వామి పుష్కరిణి అనేవి

7 1 2 .. సకల కర్ణాటకాంధ్ర రాజధౌరేయ . ఎంకటపతి క్షితీంద్రమణికి (1-6) అని ప్రయోగం త్రిలింగ శబ్దం దేశానికి,భాషకూ కూడా ప్రయోగింపబడు తున్నది "ఏ మహాత్ములు ముష్వుద నల త్రిమూర్తులట్లు గుటియై త్రిలింగ భాషాహ్వయము యథార్థమొనరించి యలరించిరి" (1-6) అని భాషకు సంబంధించిన ప్రయోగం

7 1 3 కవి యింటిపేరు తరిగొప్పుల తరిగొప్పుల గ్రామం జనగాం తా వరంగల్ జిల్లాలో ఉంది తరిగొప్పులాంకుఁడగు శ్రీమల్ల ప్రధానుండు (1-25) తరిగొప్పుల మంత్రికి (1-26), తరిగొప్పుల మల్ల సుధి తిలకుఁడు (1-27) అని కవి పలుకులు

7 1 4 మాహురపురంలో వెలసిన దత్తాత్రేయుడు కృతిభర్త "మాహుర పురకృత వసతి కనీహనుతోన్నతికిన్ (1-55), శ్రీమాహుర నగరోన్నతి భూమీధర శిఖరనిలయ దత్తాత్రేయా" అని స్వామి ప్రస్తుతులు

7 1 5 తరిగొప్పుల మల్లన దిగువ తిరుపతి, తిరుమలను విస్తారంగా వర్ణించినాడు (5-40 నుండి 62) విజయలోలుడు సాత్యకి కొడుకు ఈ ప్రబంధంలో ఉపనాయకుడు పెక్కుదేశములు గడచి తిరుపతికి పోతాడు "పన్నగ సార్వభౌమాచలేంద్రుఁగొలువ కోటానుకోట్లు" వెళ్తున్నారట అందులో నోరిబిగాలవారు, తలమోపుటిండ్లవారు, శిరసు కోతములవారు, పొరలు దండములవారు, అడుగు దండములవారు ఉన్నారు వీక్షించండి ఈ కవి పద్యంలోనే –

"అనశన వ్రతముచే నతుల కార్శ్యంబునఁ గనుపట్టు నోరి బిగములవారు
మొక్కు దీర్పుటకు నై మూకమూకలు గూడి యేతెంచు తలమోపుటిండ్లవారు

ప్రాణముచే పిడికిటఁబట్టుక యిట్టట్టు దెమలని శిరసుకోడములవారు
దైహికాయహసంబు దలపక దొర్లుచు నడతెంచు పొరలు దండముల వారు
నామటూమట ప్రొక్కువా రడుగు నడుగు
దండములవారు మిగల సందడి యొనర్ప
నడరి పన్నగసార్వభౌమాచలేంద్రుఁ
గొలువఁ గోటానకోట్లు పెనుగూటమరుఁగ' (5–41)

ఆ విధంగా తిరుమలకు వెళ్లే తైర్థికులతో పాటు విజయలోలుడు కూడా "వెగుప తిరుపతికి నేఁగి యాశ్వాసి తీర్థవారిఁ దానములు సల్పినాడు (5–42) ... "వేడ్కఁ బవళించియున్న గోవిందుఁ గొలిచి"నాడు (5–43) "వేంకట స్వామి పూజించు వేడ్క యా మహాధర మెక్కెడి నట్టివేళ" (5–46) లో చేమాకుతాళములచే చెలగ రొండులఁ జేతులుంచి యందర వెక్కిరించువారు .. గంగెడ్లనాడించు కొందుమఁ ద్రోవఁ గూర్చుండి బొంతలు ప్రోలఁ బఱచి పట్టె దండలు మొఱయించి పాడుకొనుచు నలరు దాసళ్ళ వీక్షించి" నాడు (5–45)

ఈ సందర్భంలో ఎంతో శ్రమపడుతూ కొండనెక్కే స్త్రీలను చక్కగా చిత్రించి మన ఎదుట మూర్తిమంతంగా కవి నిలిపినాడు

"అతి మంజుల వంజుల కుంజ మంజరీ, బృంద మరంద బిందులహరీ బహుళీతి సగీతి నందదిందిందర వందితుంది లనుతి ప్రతికూజ దళింద కందరా మంద సరఝరీ ఘుమ ఘుమ ధ్వని జాలము శేషశైలమున్ మందలు గూడ" ఎక్కినారు [5–48]

.. "అమరవర తను కర తను నమిత సుమిత, ముదిత కలరవ కులరవ ముఖర శిఖర, తిలక సురుచిర గళితలలిత, మధుర మధురసపాళి యా కుధరపాళి" [5–15]

"పాపవినాశన మా నగంబు సొంపరయఁగగోరి యే పతితులైన జడాకృతులేఁగు దెంచినన్ సరసత నూర్ధ్వలోకము లొసంగుదు నేనని తెల్పుకైవడిన్.. ఉరుతర కంధరా నిపతితోత్పత దంబు ఝురీ లవంబులన్ ఉద్యగ ఘోషమయి పరఁగు" తున్నది [5–52]

7 1 6 ఇతర తీర్థాలు స్వామి పుష్కరణితో సరి రావు అని విశ్వజనులచే పొగడ్తలందుకుంటున్నది స్వామి పుష్కరిణి ఇతర తీర్థాలు ఎలా సరి రావో సాలంకారికంగా నివేదిస్తుంది ఈ క్రింది పద్యం చిత్తగించండి

"కమలాకరతఁదామ యమరు నింతియ కాని క్రుంకువారికి సిరుల్గూర్పఁగలవె
కువలయోద్ధతిఁ దామ కొలఁలు నింతియ కాని చేరువారికి ధరఁజేర్పఁగలవె
యుత్కళికలఁ దామ యొప్పు నింతియ కాని కనువారికి ముదంబులునుపఁగలవె
యమృత సంగతిఁదామ యలరు నింతియ కాని తలచుఁవారికి ముక్తిఁ
దార్పఁగలవె

యితర తీర్థంబు లెందైన నీ సరంబు పగిది నని విశ్వభూజను లొగడ నన్న
గముఁజెన్నొందు స్వామిపుష్కరిణి.. " (5-53)

విజయలోలుడు స్వామి పుష్కరిణిలో తానమొనరించినాడు వారాహమూర్తికి నమ
స్కారంబు లొనరించినాడు మురహరుని సేవించాలని తలచి ఎదుట చూసినాడు

7 1 7 స్వామి నగరును ప్రాకార ఖచితహీరప్రభలతో, ఇంద్రోపలాలు
కూర్చిన గోపురాల్తో. భక్తలోకైక శరణము, పరమమౌని కలుష సంతాన హర
ణంబు...అయిన వెంకటపతి శరణంబు మురవైరి నగరు దర్శన మిచ్చింది ఆ దివ్య
దర్శనం క్రింది పద్యంలో –

"ప్రాకార ఖచిత హీరప్రభాచయ దేవతాధునీ బుద్బుదత్తారకంబు
గోపురేంద్రోపలాంకూర విభాజాల యమునా రథాంగ దహస్కరంబు
కేతు గోమేధిక ద్యోత సరస్వతీ హ్రదినీ శైవలద్రుశతలము
శిఖరాబ్జ రాగ రోచిఃప్రతాన హిరణ్య వాహోత్పల స్నీలవారిదంబు
భక్తలోకైకశరణంబు పరమమౌని, కలుషసంతాన హరణంబు ఘటిత సుజన
నిచయ సంసృతి తరణంబు నిర్జర శరణంబు వేంకటపతి శరణంబుఁదనరె"
(5-55)

మురవైరి నగరుకు ప్రదక్షిణంచేసి ఆవరణదేవతలకు అభివాదం చేసి, గర్భ
గృహం ప్రవేశించినాడు విజయలోలుడు (5-56) " ఇలఁజూపు వలచెయి వెలిదమ్మి
కనుదోయి జెలఁగువాని. సిందు బంగరు పట్టు, కొండ వంచిన మెట్టు వెలయు
వాని జేజెలు బత్తి నెఱపువాని, సురారులఁ బఱపువాని వేంకటస్వామిఁగనుగొని ...
...సాష్టాంగమెఱఁగి"నాడు (5-57) భక్తులఁబ్రోచు మేలు తెలిదీవిం బొల్చు
పెన్ బోర్లు నిర్మలం బాయని వెల్పుచాలు గల సామిన్ వెన్నుంగొల్చెదన్" (5-58)
అని పరిపరివిధాల కొనియాడినాడు విజయలోలుడు

"గత కల్మషుండయి విజయలోలుడు కోవెల వెల్వడి బిల్వ పాండవాది నిఖిల తీర్థ పంక్తులకీతి త్రివశోదిత రీతి భక్తి మజ్జనమొసరించి"నాడు (5-60)

7 1 8 జగన్మోహనంగా ఉండే తుంబురు కోన డాసినాడు ప్రకృతి సౌందర్యాన్ని తనలో నింపుకొన్న, కనుల కింపునింపే తుంబురుకోనను కవి పద పథాల వెంబడే పోయి దర్శిద్దాం-రండి

" రేక్కా రా జాల మూరినన్ నేఋలై తూం నీరికలైన చోట .
గ్రొత్సుబ్బి సెలలు దాకిన నుర్లు నెత్తాల నలరు కోనల దారు తలిరుగత్తి
జేని బాబా లేత జెక్క సోకుల సారె దలఁకు నీరంబుల నొలుకు తెలిసి
.. రంబుతో దనరనొరలు కన్నెత్రొన్నన తేనెపోసల నసలైన నేలఁ
దొలఁకుకొలఁకుల కెలఁకుల దళుకు గులుకు, నున్న తిన్నెలఁ దరలక నూలు కొనిన
కిన్నెర కలకలంబుల కేకిక చుతు లూనుచుండెడు తుంబురుకోన డాసి"
(5-61)

తుంబురు కోన ప్రాంతాల్లో దట్టంగా తీగెల్లుకొన్న, ఎలమావి గుబుర్లతో నిండి ఉండే తోవవెంట వెళ్ళినాడు ఇంతలో విలాసంగా తిరిగే కన్నె పిల్లలు కనిపించినారు అకస్మాత్తుగా ఒక మదపుటేనుగు వచ్చింది ఆ బాలికలలో ఉండే రాచకన్నె "హస్తి హస్తి" అని ఆక్రందిస్తూ వచ్చి విజయలోలుని కౌగలించుకొంది అతడామె నెత్తుకొని పరుగులిడినాడు ఎదుట వామన తీర్థ తీరం కనిపించింది

"అనివారణ వారణ వారణ షణేచ్ఛా మహిత ప్రవారము, ఉరు సారస సార సంభ్రమోద్దామ తరంగ వారము, సదా నవ దానవ దాన వర్ణిత శ్యామల మూర్త్యుదారము, సభావన భావన భావనారము, వామన తీర్థ తీరము (5-79) ఉత్కళికోజ్జ్వలమై, ఘన రస సంభరితమై, ప్రకంపనయుతమై, వనితామణి చిత్తముగతి ఆ సరసి తనరుతున్నది (5-81)

విజయలోలుడు ఆ రాచకన్నె పొదరింటిలో దాగినాడు పిడి యేనుగు నొకదాన్ని చూసి మదపుటేనుగు అటువైపు వెళ్ళిపోయింది చెలులు వచ్చి ఆ రాచ కూతురును తీసుక వెళ్ళినారు ఆ వనమంతా వెదికి కూడా కనుక్కోలేక పోయినాడు విజయలోలుడు శేషభూమి భృద్భాగము దిగ్గి వచ్చినాడు

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

"అవంతి దేశపతి యౌ ననువిందపుత్రి పద్మినీ కాంత కుముదినితో ... ఒక్కనాడు వార్షికోత్సవంబునఁ గొల్చు హరి గొల్చుటకు శేషగిరికి నేఁగి, యచటి వినోదంబు లరయుచు . తుంబురుకోనఁ జేరి గురివెంద పొదరిండ్ల లీలాకేళిలో తేలుచుండఁగా" హస్తి వచ్చింది

పై విధంగా తఁగొప్పుల మల్లన శేషశైలం, దిగువ తిరుపతి, కొండఎక్కే త్రైర్థికులు ఇంకా వివిధాంశాలను ఎంతో మనోహరంగా, సహజంగా ఉండేట్లు వర్ణించినాడు

7 2 విశ్వనాధుని స్థానాపతి కాశివిశ్వనాథ నాయనయ్య వారి స్థానాపతి రచించిన వచనకావ్యం 'రాయవాచకం' శ్రీకృష్ణరాయల పట్టాభిషేకాన్ని, దైనందిన జీవితాన్ని, విజయాలను వివరంగా వర్ణించే చారిత్రక గ్రంథం ఇది ఈ గ్రంథం రాయలవారి జీవిత కాలంలో గాకుండా క్రీ శ. 1590 – 1602 ల మధ్య రచించ బడిందని సి వి రామచంద్రరావుగారు తెల్పి చెప్పినారు

7 2 1 రాయ వాచకంలో కనిపించె తెలుగునాడులోని ప్రదేశాలు –నదుల ఇవి ఆంధ్రదేశం, ఘట్టంసీను, మెల్నాడు, పెరసునాడు, అద్దంకి, అవుకు ఆప వాసి, ఉదయగిరి, కందూరు, కడప, కాళహస్తి, కొండవీడు, కొట్టిగల్లు, గండికోట, గుత్తి, గుర్రంకొండ, గోలకొండ, చంద్రగిరి, చెయ్యేటిదుర్గం, దంకినీకోట, తిరుపతి / తిరుపతులు/నవతిరుపతులు/ 108 తిరుపతులు, తొరగెంటి, నంద్యాల, నాగార్జునకొండ, నారాయణవనం, పెనుగొండ, బాగానగరం, బెల్లంకొండ, మట్ల, మద్రాసు, రాజ మహేంద్రిం, వినికొండ/వినుకొండ, పెలుకొంటి/ వెలిగోటి, వెంకటాచలం, వోర గంటి, సత్యవేడు, సింహాద్రి/ పొట్నూరి, సింహాద్రి అనే దుర్గాలు – పురాలు , కృష్ణా గోదావరీ నదులు

7 2 2 విద్యానగరమందు వీర నృసింహ్మరాయలవారు. "పెరొలగంపై కూర్చుండఁగాను నూట యెనిమిది తిరుపతుల నుండి తీర్థ ప్రసాదాలున్ను . రాగా యెదురుకొని. . అంజలిచే నందుకొని స్వయం వ్యక్తం శ్రీరంగం శ్రీముష్ణం వెంకటాచలం. ఇది మొదలయిన స్థలాలకు సురక్షితము గలవా అని అడిగి నందులకు ..(పు 2) . నూటయెనిమిది తిరుపతులున్ను నిత్యోత్సవములుగా నడుస్తూ వున్నది అని అయ్యంగార్లున్ను పలికినారు . అరుణాచలేశ్వర కాళహస్తీశ్వర చిదంబరం మొదలైన డెబ్బైరెండు దేవస్థలాలకున్ను .నిత్యోత్సవములు గలిగి వున్న దనేట్టుగా ఆరాధ్యులు" తెలిపినారు (పు 3)

7 2 3 "ఆంధ్రదేశం హయనదేశం మొరసునాడు మెల్నాడు కర్ణాటకం ఘట్టం శీమ...ఆదిగాగల అగ్రహారములకున్ను అవధి ఆటంకములులేక..." సాగుతున్నవని ధర్మాసనం ధర్మయ్య చెప్పినాడు (పు 3)

7 2 4 "శింగిరిభట్లు .. విద్యారణ్యులతోను లక్ష్మీకటాక్షము వల్ల వఖ్కపురం గావించి ఆ నగరమందు అవ్వారిగా సత్రములున్ను దివ్య తిరుపతులున్ను... శివస్థలాల యందున్ను గంగా, యమునా, సరస్వతీ, గోదావరీ .. కావేరి. మొదలయిన మహానదీ తీరాల నున్ను . రేయిపగలు అన్నదానము జేసేటట్టు కట్టడశేయమని మనవి" జేసుకున్నాడు (పు 8)

7 2 5 కృష్ణరాయలవారి పట్టాభిషేకం "ఆర్వీటి బుక్కరాజు . నంద్యాలవారు అవుకు వారు తొరగంటి వారు వెలుకొంటివారు.. మరెన్ని గలిగిన పిన్న పెద్దలు అందరున్ను .. గంగా యమునా సరస్వతీ గోదావరీ . కావేరీ .. మొదలయిన మహానదుల వుదకములున్ను తెప్పించి . అభిషేకము శేయించి" నారు (పు 11-12) (కృష్ణరాయలు). "అంతరంగ వార్తలరశి వచ్చేటట్లుగా విజయాపురం... అహముదానగరం... రాజమహేంద్రం, పెనుగొండ, గోలగొండ, గుర్రంకొండ, మెల్నాడు, మొరసునాడు, ఘట్టం శీమ.. చంద్రగిరి, గండికోట, కడప, నంద్యాల, బెల్లంకొండ ... మొదలయిన స్థలములకున్ను వేగుర్లున్ను నియమించి అంపించి"నారు (పు 21) .. కృష్ణరాయలను ఆదవని, చెయ్యేటిదుర్గం, గుత్తి, గండికోట, చంద్రగిరి, గుర్రంకొండ, మద్దూరు, సోమగిరి, త్రిశిరపురం, పెనుకొండ, ముస్తీదులయిన దుర్గములున్ను, నంద్యాల, శ్రీరంగపట్టణం.. దళనాయకుల సత్యవేడు, కొట్టికల్లు, డంకినీకోట, నారణవనం మొదలయిన వనదుర్గములు గల రాజ్యమున్ను యేలుకొని కొలుస్తా వున్నారు"

7 2 6 గోలకొండవారి ముద్దాపండితులు "సింహాసనాలంటె మూడున్ను సరి ఇందులో సింహాసనాధిక్యములు కలవా?" అని ఆగ్రహపడగా... "బాహుబలేంద్రుని వారి బ్రంహ్మపంతులు . నరపతియే హెచ్చు ... ఆ రాజ్యములోను దేవాలయం, బ్రంహాదాయం, పుణ్యతీర్థములు, నదులు, పుష్కరిణులు కలిగి వున్నది ఇదిగాక విష్ణు ప్రత్యక్షమై వెంకటాచలాన వున్నారు" అని చెప్పినాడు (పు 33)

7 2 7 తురుష్కరాజ్యాలలో శ్రీకృష్ణదెవరాయల గురించి అనుకొనే మాటల్ని వేగర్లు వచ్చి తెలిపినారు . "విజయాపురం అహముదానగరం గోలకొండ

అనే త్రిపురాలకు మూడు సింహాసనాలవారున్ను యెపుడు కనిపించ్చు కొంటా వున్నారు" (పు 41) కృష్ణరాయలు దండెత్తి వస్తే జయాపజయా లెవరికి అని దైవజ్ఞుల్ని శకునజ్ఞుల్ని అడిగినారు మహమ్మదీయ ప్రభువులు .. "కర్ణాటకమున విష్ణు అంశగా నృపతి ఉద్భవించి . అశ్వపతి రాజ్యమున్ను గజపతి రాజ్యమున్ను అంత్తా జయించి జయస్థంభమ. వేయించ్చి మగుడి పొయ్యేటప్పుడు కల్యాణ వేంకటేశ్వరుల దర్శించి నూట యెనిమిని దివ్యతిరుపతులనున్ను . సేవించ్చి. ధనుష్కోటిలో ఖడ్గము కడిగి . అరువైనాలుగు యేండ్లు ..రాజ్యమెలేటట్టు వున్నది"అని చెప్పినారు ఈ విషయాలను "అహముదానగరం గోలకొండలో కన్న విన్నవార్తలు వేగుల అరవ రాముడున్ను, పక్కీరి గోపాజీ .. విన్నపము శేసె"రారు (పు 42)

7 2 8 "ఢిల్లి సురధాణికిన్ని వోరగంటి ప్రతాపరుద్రునికిన్ని గాక పదిహేను సంవత్సరములు పోరాడెను" దుర్గంలోఉన్న ఆహార సామాగ్రి అయిపోగా ప్రజలను వూరకే సంప్పేది ధర్మంకాదని వెలుబడి సమరం శేయగా సుత్రాపుగెలిచి" ఢిల్లీకి పట్టుకెళ్ళినాడు సురఘాణి తల్లిగారు ప్రతాపరుద్రుని రాత్రివేళ చూసి "వోరగంట్టి ప్రతాపరుద్రుండ్డు . రుద్రాంశ త్రిశూల డమరుల తోడట్టువుంన్నాడు నువ్వు పట్టుక రావచ్చునా అంటుంది "నేను నిద్రపొయ్యేటప్పుడు చూడుమా అని చెప్పి అంప్పె" "సురధాణి నిద్రపొయ్యేటప్పుడు మాడంగా శేషశాయిగా ... విష్ణు స్వరూపమై కనుపట్టె ప్రతాపరుద్రుంణ్ణి . బహుమాన సమ్మానములు శేసె వోరగింట్టికి అంప్పితె నీ కీర్తి శాశ్వతముగా వుండ్డును అని తల్లిగారు చెప్పగా . ప్రతాపరుద్రుంణ్ణి వోరగంటికి అంపిరి (పు 46) . "కుతుపన మలక అనే ఆయన గొలకొండ్డానున్న యెలుతా వుండ్డురు" (పు 47)

7 2 9 "రాయల వారనిని వివరం .. విద్యానగర మంద్దునుండి పయన గతుల తర్లి . రాజమహేంద్రం .. కటకము మొదలయినవి పీక్షించ్చి . పురుషోత్తమా నాకు పోతిమి (పు 48)

7 2 10 .. "వోరగంట్టివారి వోబళయ్యాప . గొలకొండ్డవారి గోపాజీ పంత్తులున్ను జాగానగరం బాబోజి పంత్తులున్ను మొదలుగాగల . స్థానాపతుల .. లక్ష్మిచావడిలో కూర్చుండ్డగాను గజపతివారు వచ్చి నవరత్న ఖచితమైన బంగారు పీట మీద కూర్చుండి"నారు (పు 49)

7. 2 11 కర్ణాటకం వారు యేరు దాటి రాకుండా తమ మూడు తెగల కలిమి బలమున్ను కృష్ణ దాటి రాకుండా పాళ్యం దిగి వుండేటట్టు అంపుతు న్నారు" "ఇది పిన్న గజపతులవారు ఆ రీతి అమరిక శేశేమని కొండ్డవీడు, ఉదయగిరి, బెల్లంకొండ, నాగార్జునంకొండ, కందూరు మొదలైన స్థలాదులకు యాది హెచ్చరికలు కలిగి వుండ దగ్గరనేటట్టుగా నామజాదులు పంపినవారై"నారు (పు 51)

7 2 12 "ముకుంద్ద గజపతివారు షోడశ పాత్రులున్ను తామున్ను దినప్రతిన్ని గోదావరీ స్నానానకు పోయి నదిస్నానం జేసే జగన్నాయకులకు పూజానమస్కారములు శేశి" వచ్చేవాడు (పు 52)

7 2 13 "రాయలవారు ... అద్దంకి, ఆదవని ... మొదలైన స్థలాదులకు ఠాణ్యములు వుంచ్చి "సాగగా ఆ స్థలముల వుండేవారు" పారిపోయినారు. "గోలకొండ్డవారి సరదు స్థలాలకై నడవంగా తురకలు లక్షగుఱ్ఱాల తోడట్టును, వెయ్యియేనుగుల తోడట్టున్ను కృష్ణ దాటివచ్చి పాళ్యం దిగినారని ... పెంమ్మసాని రామలింగ్గమ నాయకుణ్ణి బిలిచి తురకలు కృష్ణవేణి దాంటి వచ్చి డెరిజా వేశి పాళ్యం దిగినారట" (పు 54, 59) అని చెప్పినాడు కృష్ణరాయలవారు సేనతో కృష్ణకు ఒక వైపు దిగినారు మరొకవైపు తురకల సేన.. "కృష్ణవేణి వుభయతీరాలున్ను ప్రవాహం నిండి రాసాగెను జగడముఖానకు తురకల యేనుగల మొన చెస్తే గ్రీష్మకాలం యెండ్డచేతను దస్పిన యేనుగులు గనక దగ దప్పిపుట్టి చల్లగాలి చేత కాలుజారి కృష్ణవెణిలో బోయి పడెను"... (పు 60) ..."కృష్ణవెణి యీ సమయాన నిండ్డేరు వచ్చినందువల్ల మ్లేఛులకు అపజయమై నిలువలేక తమ తమ స్థలాలకు పోయిన్నా యను".. (పు 62)

7 2 14 "మ్లెచ్ఛుల రాజ్యానకు కదలి పొయనట్టయినా గజపతివారి శీమలో నుంన్ను, ఉదయగిరి, కంద్దూరు, కొండ్డపీడు, బెల్లంకొండ్డ, నాగార్జునంకొండ్డ, వినుకొండ మొదలైన దుర్గాలలోనున్నవారు మన దండ్డుకు రస్తుసామగ్రిలు రాని కుండా అరికట్టుదురు" అవన్నీ ముందె ఆక్రమిద్దాం అన్నారు రాయలవారు (పు.62)

7 2 15 రాయలవారు ఉదయగిరి మొదలయిన దుర్గాల మీదికి దండెత్తడం . "రాయలవారు బయలు మెరశి గుఱ్ఱంయెక్కి.. సకల దళసమేతుడై గుత్తి కండ్డికోట మార్గముగా ఉదయగిరికి వచ్చిన హుర్మత్తు అనే దుర్గముపై లగ్గమెక్కగా

దుర్గములలోని వారు సమరం శేసి మందుగుండ్లు కలపై .. కొలిచ్చినారు......
కంచూర్కి పోగా డమామిధ్వని విన్న క్షణాన్నె ఆస్థలం వారు వెళ్ళిపోయిరి. కొండ్ల
వీటికి కదలిపోగా . స్థలములు విడిచి పొయ్యేవారున్ను . యీ రీతున కొండ్లవిడుశీమ
కోటలు దుర్గాలలో వున్న వారలు సరాళభ్రిష్టులై తమతమ దొరలున్న తావునుపొసాగిరి
బోయదొరలు పదునెనిమిది కప్పణాలవారున్ను, మూడులక్షలసాయ దళమున్ను,
కొండ్లవీడు, కొండ్లపల్లె వెల్లంకొండ, వినుకొండ్ల, నాగార్జునంకొండ్ల, మొదలయిన
దుర్గాలకు యేలుబడియైన శీమలాద్యంతం నిపాతం శేస్తావున్నారు గనక ఆయా శీమలో
గల ప్రజలందరున్ను సకలమును కొళ్ళయిచ్చి మిక్కిలి అంద్దుపడిఅయిన దుర్గాలు
చేరినారు అని వేగర్లు . . విన్నపంశాయగా'' వారిని తిరిగి ఆయా ప్రదెశాలకు
పంపించినాడు రాయలు

"కొండ్లవీటికి పోయి జగడమియ్యగా కొండ్లవీడు కోటలోనివారు తేశిబోయి
వారు.. దుర్గంలో వున్నవారు వఖటిన్నిర దినం పోరాడి రాత్రి దుర్గం విడిచి" పోయి
నారు .. వినికొండ్లకై నడవంగా ... స్థలం నిర్వహింపనేరమని...వెళ్ళిపోయిరి...
వెల్లంకొండ్లకై నడవగా.. పిరంగ్గినాదంవిని వెల్లంకొంద వారు పారిపోయిరి.. నాగా
ర్జునకొండకై నడవగా ... నాటమన్నాట పొరాడి చేత గాక తమ నాటికి పోయిరి
(పు 63-64)

.. "గజపతి వారి సీమాద్యంత్తం నిపాతం శేసుకపోయి పోట్లూరి సింహాద్రి
వద్ద పాళ్యం దిగిరి (పు. 65) .. పెద్దగజపతివారు వుండేటప్పుడు వారు సేతుయాత్ర
కొరకై కంచ్చి, కాళహస్తి, అరుణాచలం ... మార్గముగా శేతువుకు పొయ్యేటప్పుడు
వెంటవచ్చిన రౌతులు రాణువగాడు రాయలవారి శీమలోగల శివస్థలాదులున్ను విష్ణు
స్థానాదులున్ను హాని శేశి వచ్చి వుందురు కర్నాటకం వారు కనమల దాంటి .
పోట్లూరి సింహాద్రి వద్ద శిబిరం దిగినారు" (పు. 66) .. "కాళహస్తి ఆరభ్యం
జగంన్నాథం పర్యంతం మనశీమ".. (పు 67) అని గజపతి అన్నమాటలు

..."పొట్లూరి సింహాద్రి వద్ద జయస్తంభము శేయించ్చి సుబుద్ధిని విలువ
నంప్పి ... గజపతివారి రాజ్యం గజపతికే నడిపించ్చేము మేమున్ను మా శీమకు
నాగిపొయ్యేము" అని రాయలవారు ఆనతిచ్చినారు (పు 74)

..."గజపతివారు లన కొమార్తె అయిన జగన్మోహినీ అనే కన్యకకు ధార
పొశి యిచ్చే .. తమ కుమార్తెకు పట్టు పరిమెళ పసుపులకని కృష్ణవెణికి దక్షిణపు
దిక్కున నడిచే రాజ్యాలును . దుర్గాలున్ను ఇచ్చి"నారు (పు. 75)

7. 2 16 "కృష్ణరాయలవారు ... శీమకై తిరిగి తిరుపతి రాంగా కల్యాణ, కలుబరిగె కోటలవారు గర్వితులై కోట మీదినుండి కూతలింగ్గా .. కలుబరగ కోట లగ్గబెట్టింది, మూడు ముక్కాలు ఘడియలో కోటసాధించి తిరుపతికి వచ్చి అల మేలు మంగా సమేతులైన కల్యాణ వెంకటేశ్వరుల దర్శనంబు శేశి .. . సకల భూషణములున్ను స్వామికి సమర్పించ్చి ... వుభయ పార్శ్వములా తిరుమలదేవి చిన్నాదేవి సహితంగా వుండేటట్టుగా తాంబ్రాన ప్రతిబింబమున శేయించ్చి స్వామిని యెదురుగా నిలిపి అంద్దుండి కాళహస్తికి వచ్చి స్వామిని దర్శించి . . నవ రత్నాభరణములున్ను సమర్పించి . నవ తిరుపతులకు వచ్చి. . సుమూహూర్తమందలి విద్యానగర ప్రవేశమై" (పు 77, 78, 79) నాడు

రాయవాచకంలో రాయల రాజ్యంలోని ప్రదేశాలు, రాయలు జయించిన దుర్గాలు, రాయలు దర్శించిన పుణ్యక్షేత్రాలు 'తెలుగునాడు' లోనివి దర్శనమిస్తాయి,

7 3 మట్ల అనంతరాజు మట్ల అనంతరాజు 'కకుత్స్థవిజయం' అనే కావ్యాన్ని రచించినాడు ఈ రాజ కవి 1586-1614ల మధ్య వెంకటపతి రాయల సేనానిగా ఉండి మహత్తర విజయాలను సాధించినాడు 1606 నాటికి వెంకటపతి రాయలను సకల హిందూజన సార్వభౌముణ్ణి చేసి తాను మహామండలేశ్వరుడై సిద్ధవటం సీమను పరిపాలించినాడు[1] (మట్ల అనంతరాజు విజయాల్ని, గెలిచిన దుర్గాల్ని పురాల్ని వివరంగా తెలిపేవి మట్ల అనంతరాజు మనుమడు కుమారానంత రాజు 'కుముద్వతీకల్యాణం' సడిమింటి వెంకటపతి (1693) రచించిన అభిషిక్త రాఘవం వీటిలోని విషయాలను 1650 కి తర్వాత ఉండే కవుల సాహిత్యాన్ని పరామర్శించేటప్పుడు చర్చించ బడతాయి)

కకుత్స్థవిజయకావ్యంలో కనిపించే తెలుగునాడులోని ప్రదేశాలు -మట్ల/మట్లి, సిద్ధవటం అనేవి మాత్రమే

7 3 1 మట్లి కడప జిల్లా, రాయచోటి తాలూకాలో ఉంది! మట్లి రాజుల పూర్వం ఇంటిపేరు వంగలివారు "వంగలి కోనమరాజు తమ స్వస్థలం వీడి పైచెప్పిన మట్లిగ్రామంలో స్థిరపడి 'మట్ల' వారైనారు[2] రాజం పేటకు దగ్గర్లో ఉండే అనంత రాజుపేట రాజధానిగా మట్లవారి సీమను ఏలినారు[3]

ఈ రాజకవి వంశనామం మట్ల/ మట్లి అని రెండు విధాల కావ్యంలో ప్రయో గించబడింది

మట్లనంత మహీనాథు మతి సనాధు...(పీఠిక -12), మట్లనంత మహీనాథు (పీ 14) ఇంకా పీఠిక 16, 17, 19, 27, 30 లలో కూడా 'మట్ల' అని ప్రయోగం

మట్లి కోన విభునెల్లా (పీ - 9) మట్ల్యనంత నృపాల మౌళి (పీ 84) వరదాధీశుడు మట్లి వంశమణి (పీ 87) మట్లి యెల్ల ధరానాధ (పీ 91) ఇంకా 1-1, 3-1, లలో కూడా.

పటహీ భూత ష్వేడా - భట జాతీ భూత బాహు ఫలిత కరోరోద్భట ఘటిత సిద్ధవట పటు పుట భేదన" అని అనంతరాజుకు ప్రశంస (పీ 98)

ఈవిధంగా మట్ల అనంతరాజు కావ్యంలో మట్ల/మట్లి, సిద్ధవటం అనే పూర్ణ ఉపసక్తి మాత్రమే ఉంది

7 4 రఘునాథ నాయకుడు (1600-31) తంజావూరి నాయక రాజుల్లో అగ్రగణ్యుడు రఘునాథ నాయకుడు కృష్ణరాయలవలె ఇతడు కూడా వీరుడు కవి పోషకుడు స్వయానా కవి రామాయణం, నలచరిత్ర, వాల్మీకి చరిత్రము ఈయన రచించినవే

7 4 1 వాల్మీకి చరిత్రము వాల్మీకి చరిత్రములో మునుల తీర్థయాత్రా సందర్భం ఉంది దక్షిణ దేశంలో ఉండే ప్రసిద్ధ క్షేత్రాలను మునులు దర్శించినట్లు కవి వర్ణించినాడు (2-3 నుంచి 70) అందులో తెలుగుదేశంలోని పుణ్యస్థలాలు - అహోబలం, తిరుపతి, శ్రీశైలం చేరి వున్నాయి, వాల్మీకి చరిత్రంలోని తెలుగునాటి ప్రదేశాలు-తీర్థాలు ఇవి-అహోబలం, వేంకటగిరి/వేంకటాద్రి / శేషశైలం, శ్రీపర్వతం, భవనాశని, ఆకాశగంగ, తుంబురుతీర్థం, పాండవ తీర్థం, స్వామి పుష్కరిణి

7 4 2 తిరుమల వర్ణన 2-51 నుంచి 58 దాకా సాగింది హరిచందన భూరుహాలతో నిండిన వనాలు, గంధర్వగానాలతో ఘూర్ణిల్లె కొండగుహలు, పక్షుల కిలకిలారావాలతొ ప్రతిధ్వనించే కొండ దరులు మునులకు ప్రత్యక్షమైనాయి పరికించండి

"చని చని కాంచి రంత హరిచందన భూరుహ బారు వాటికా
వని వనితా సహాయ సురవైణిక తల్లజ పాణి వల్లకీ
ఘన నినదానుకారి మణి కందర జాలము(బంచవర్ణ కాం
చన కలవింక చంక్రమ లసద్ధ్వని శీలము శేషశైలమున్" (2-51)

సప్తర్షులు, తిరుమలకొండ మీద ఆకాశగంగ, పాండవతీర్థం, తుంబురు తీర్థం, స్వామి పుష్కరిణి వంటి పుణ్యతీర్థాల్లో గ్రుంకులిడినారు ఆ యా తీర్థాల సుగుణాల్ని, స్వభావాల్ని ఆ రాజకవి మాటల్లోనే విందాం –

"కనుంగొని యవ్వేంకట మహీధరంబున విశంకటమణి తటంబులం దమకు గ్రమోసినగతి
దుముకు నాకాశగంగాతరంగిణి నంగంబులు చొలంచి, యభంగ భంగ తాండవంబులం
బెరయు పాండవతీర్థంబులం దానంబులం గావించి, తట మహీరుహ కదంబక ప్రసవ డంబరం
బులం గదంబించు తుంబురు తీర్థంబునం గ్రుంకలిడి, మఱియు నఘాపనోదన సమర్థంబు
లగు ననేక తీర్థంబులాడుచు వచ్చి, మజ్జనపర నమజ్జన పుష్కలాయుష్కలాయుష్కాంక్షీయుం
జాపిజన పాప కళంక దుష్క్రియా పంకజ కరిణియునగు స్వామి పుష్కరిణి తీర్థంబునాడి" (2-52)

భూమి మెద ఇది వైకుంఠం రండి అని చేయి చూపిస్తూ "స్వామి పుష్కరిణి తీర భూమి నలరు వెంకటాచలనాథు సేవించినిలిచినారు" (2-53) మౌనివరేణ్యులు

"మణికిరీటంబు సంపదలు, ముత్తియపునామమ్ము, మందహాసంబుల యందంబు . బంగారు పచ్చడంబు పసిండి కటారి ఇవన్నీ ఉండే ఉచితశృంగార మీ స్వామికి ఒప్పుగా ఉంది "ఈ వేంకటాచల వల్లభునకు యోగిపురుషులు వలతురు" అని స్వామి పక్కందనానికి మునులు మిక్కిలి వొక్కి "శశాంక రవి లోచన. . సురాహిత భయంకర వెంకటగిరీశా" అని (2-54, 56) స్తుతించినారు

నిద్దైన గొప్పదయచేత "సంకటము లెల్లఁ బోలఁగ వెంకటగిరి నిలయ" అని వెంకటాద్రిపనభిసుతింపినారు (2-57)

7 4 3 మునులు ముందుకు సాగి "అంచితానంత తీర్థసమర్థన సుమహా బలంబగునట్టి యహోబలంబు కాంచి నరపంచాననను .. భజియించి నారు (2-58, 29) హరి యిక్కడ నరహరి అయి హిరణ్యకశిపుని వాడి గోళ్ళతో చీల్చి చంపినాడు పక్షీంద్రుడు.. తపంబొనరించి విష్ణువాహనత వెందినాడు గంగ నిర్ఝరులు దిగ్గంగ

జేయంగ నిండు భవనాశనీ ప్రభ వహించింది హరి యిక్కడ గున్నమామిడి చెట్టు దీనాళికి అమృతఫలాలు ఇచ్చినాడు అని ఆ క్షేత్రమహిమలు అభినుతిస్తూ "అక్కాండ గల తీర్థకుండములకు దానములు సేసి" ముకుముందుకు సాగినారు మునులు (2-60)

7 4 4 శ్రీపర్వతం చేరినారు ఆపర్వతం మీద కాష్ఠజ్యోతి, వాలుకా జ్యోతి వెలుగుతున్నాయి మల్లికార్జునుడు పరంజ్యోతిగా వెలుగుతున్నాడు ఆ జ్యోతి వెలుగులతో మన హృదయాలను కాంతిమంతంచేసే ఆ పద్యం ఇదే

" రవణిల్లు నెచట గాష్ఠజ్యోతి విద్యోతితారణ్యనివహమై యహరహంబు
నొనరు నెచ్చటఁ దృణజ్యోతి ఖద్యోతిత కీటమై ఘన గుహా గేహములను
గ్రాలు నెచ్చట వాలుకా జ్యోతి సద్యోతి మోహిత శబరసమూహమగుచు
నుండు నెచ్చట శిలాజ్యోతి యుద్యోతిత శృంగంబులను రత్నభంగి నెపుడు
నలరు నెచటఁ బరంజ్యోతి యతి విశుద్ధ తరణి మణిబద్ధ బిల ధగద్ధగిత భాగ
యోగ సన్నద్ధ బహు సిద్ధ యోగి మతుల సట్టి శ్రీపర్వతమునకు నరిగి
యంత" (2-61)

మునులు గంగాది తీర్థ జలముల నంగంబులు దొలిచి, మల్లికార్జునిని గిరి మల్లికలు, అర్జున పుష్పాలతో పూజించినారు భ్రమరాంబికన్ సందర్శించినారు స్వామిని వినుతించినారు చుక్కల చౌర యొకించుక నిక్క శిరసునఁ బది నూలు చుంగలఁజుట్టి తళుకు నెమ్మోముపై తొలుపల్కు లీనెడు తొడవు వెట్టి కేళ్ళఁబుకు ముత్తియపు కాయ గిబ్బనెక్కి. ధారుణీధర రాజ నందనయుఁ దాను నమ్మువీందుప్రిల మోప్రిల ప్రత్యక్ష మైనాడు మల్లికార్జునుడు (ద్వి 62-65)

"మౌనివరులార ! నన్నెవ్వరేని ఎంతమాత్రంబు నుతియింతు రంతలోనే యీగిరి మహిమవలన వారికి నేను అభీష్టంబు లిత్తును" (2-67) అని చెప్పి స్వామి లింగమధ్యంలో లీనమైనాడు మునులు శ్రీపర్వతాన్ని వీక్షించినారు సంభ్రమం, ఆశ్చర్యం పెనగొనగా జింక పిల్లలు కామధేనువు పాలు త్రాగుతున్నాయి చెంగున ఎగిరే లేడిపిల్లల వెంట మునిబాలికలు పరువు లిడుతున్నారు పవిత్ర హోమధూమాలు ఎగుస్తున్నాయి బంగారు ఈకల కోసం భిల్ల స్త్రీలు బంగారు పక్షుల్ని వల్లల్లో వేటాడగా, వాటి తల్లులు పక్షుల సంజీవకరణి తెచ్చి బ్రతికించుకొంటున్నాయి యోగ బలంతో ప్రాణవాయువును నిరోధించి శిలలవలె యోగులు నిశ్చలంగా ఉన్నారు ఇలాంటి అతిలోక సుందర పవిత్ర దృశ్యాల్ని కవి మాట బాటలలో పయనించి దర్శిద్దాం-రండి.

"అని పలికి భుజంగకంకణుం డా లింగమధ్యంబునం బ్రవేశించె, నంత నక్కాంచనాచల చాప స్వరూపావలోకంబున నానందంబు నొందుచుఁ నభిజ్ఞానవాసనా నిస్తంద్రులగు నమ్మునీంద్రులుం) గుటజ ప్రసూనవాసితంబులగు నుటజ ప్రఘాణంబుల నేణ డింభంబులు సంభ్రమంబున నక్కడక్కడ జాతి పరికొను కామధేనూధస్య ధారాసారంబులు చవిగొని త్రుళ్ళగింతలిడ వాని వెంబడిం బరువులిడు ముని బాలికల కేళికలు, విలోకించి, తదంగణంబుల మునిగణంబుల పవిత్రతధవిత్రంబుల (నెగయు) హోమధూమంబుల నతి శ్యామాభిరామంబులగు తపస్తోమంబు లంబుద కదంబంబులని మనంబులం బ్రేమయూర నాడు మయూరార్భకంబులఁ గొను నశ్మగర్భ రశ్మిచ్ఛురితంబులగు భూములం గనుగొనియుం, గనకపత్రస్థానంబులం గానన శిధుకాననలగు భిల్ల పల్లవాధరలు భల్లంబులం దెగ్గిళ్ళ నేసిన తమ నిసువులం జూచి సంజీవకరణిం దియుగ బ్రతికించి వానితో గూడి సంచరించు కాంచన గరుల్లక్షితంబులగు పక్షుల నీక్షించియుఁ, దత్ప్రాంతంబుల నతి శాంతంబులగు శశికాంత శిలాతలంబుల కేవలం గుంభక ప్రభావంబున శిలాంతరబంధులు బోలె నిశ్చలత్వంబు నెనపి భస్మభసితోద్ధూళితాంగులగు మహాయోగుల బాగులు దర్శించియుం దత్పర్వత మహత్త్వంబునకు నందంద డెందంబున నానందింపుచు" (2-88)

అలాంటి సుందర దృశ్యాల్ని చూస్తూ మునులు వింధ్యదాటి, నర్మదలో, గ్రుంకి, కాశికాపురానికి వెళ్ళినారు

రఘునాథనాయకుని వాల్మీకి చరిత్ర కావ్యంలో తిరుమల, అహోబలం, శ్రీశైలం, ఆయాక్షేత్రాల్లో ఉండే పుణ్యతీర్థాలు పవిత్ర సుందరంగా వర్ణించబడినాయి

7 5 చేమకూర వేంకట కవి దక్షిణాంధ్ర యుగంలో పేరెన్నికగన్న కవి చెమకూర వెంకటకవి రఘునాథనాయకుని ఆస్థానకవి సారంగధర చరిత్రం, విజయవిలాస కావ్యాలను రచించినవాడు

సారంగధర చరిత్రంలో తెలుగునాడుకు సంబంధించిన ప్రదేశాల జాడ కనిపించదు

7 5 1 విజయవిలాసం ప్రతిపద్య చమత్కృతిగా ఉండేట్లు రచింపబడింది ఈ కావ్యంలో మనం సందర్శింపగల తెలుగునాడులోని క్షేత్రాలు, తీర్థాలు ఇవి అంతర్వేది, అహోబలం, కాళేశ్వరం తిరుమల / శ్రీవేంకటనగం, ద్రాక్షారామం, శ్రీకాళహస్తి, సాగరసంగమం అనే తీర్థాలు, కృతిభర్త అయిన రఘునాథుని "శృంగార రసాధ్య వేంకటనగ స్థిరవాసుఁడు పూర్ణదృష్టి"తో రక్షిస్తాడు (1-3) అని కవి ఆశంస

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

7 5 2 అర్జునుడు తీర్థయాత్ర వెళ్ళడం ఉలూచి, చిత్రాంగద, సుభద్ర లను వివాహమాడడం అనే అంశాలు ఆధారంగా విజయవిలాస కావ్యం రూపు దిద్దుకొనింది

అర్జునుని తీర్థయాత్రా పథాన్ని నన్నయ చేమకూర కవి కంటె ఐదువందల ఏభై ఏండ్ల ముందుగానే మార్చినాడన్న సంగతి మనకు తెలిసిందే ఆయన అర్జునున్ని 'వేంగిదేశ మహాగ్రహార' విభవం, దాక్షారామం, శ్రీశైలం వంటి పుణ్యక్షేత్ర పావిత్ర్యం దర్శింపజేసినాడు చేమకూర వెంకటకవి అంతర్వేది వంటి క్షేత్రాలు కూడా అర్జునునికి చూపించినాడు

మంచుకొండతో మొదలైన అర్జునుని తీర్థయాత్ర ఉత్తరదేశంలోని పుణ్యక్షేత్రా లను చుట్టుకొని, శ్రీపురుషోత్తమం వరకు సాగింది ఆ తర్వాత తెలుగునాడులో కొనసాగింది గౌతమి నదిలో గ్రుంకినాడు దాక్షారామ భీమేశ్వరునికి జోహారులు చేసినాడు అంతర్వేది నృసింహుని సేవించి, సాగరసంగమంలో తీర్థమాడినాడు కృష్ణవేణి ఆదిగా గల పుణ్యనదులలో మునిగినాడు శ్రీపర్వతానికి ప్రణమిల్లి స్వామిని ప్రణుతించినాడు అహోబలేశుని భజించినాడు శ్రీవెంకటేశ్వరునికి నమస్కరించి నాడు కాళహస్తి లింగాన్ని దర్శించినాడు ఇంతవరకె తెలుగునాడు సరిహద్దులు తర్వాత కంచి ద్వారా తమిళదేశంలో ప్రవేశించినాడు వెంకట కవి సాలంకారిక వచన రచనలో దర్శించండి తెలుగునాడు క్షేత్రాలన్నీ

. "గౌతమితటినీ తోయస్నాతుండై, జగన్మోహన మనోజ మనోవశీకరణ కారణ కళాప్రావిణ్య లావణ్య హావ భావ ప్రకట నటన రేఖా శ్లాఘాదూరీకృత రంభోర్వశీ రంభోర్వ శీత కిరణ కిరణ నిభ విభారంగ న్మణిరంగ మంటపోజ్జ్వలాసికాకృత లక్షణ లాసికాకృత లక్షణ కటాక్ష వీక్షణ సుధారస ధారాసేచన కాసేచితాసేచనకాంగుండై, పాపాటవీ విపాటన పాటవ సంసూచన దీక్షారామ పరమేశ్వరుండగు దాక్షారామ భీమేశ్వరుం జేరి జోహారులు నుపహారంబులు సమర్పించి, సంతతానంత కాంతి రంహుండగు నంతర్వేది నృసింహు సేవించి, యందు భవసాగర తరణియగు సాగరసంగమంబున దీర్థంబాడి, కృష్ణవేణ్యాది పుణ్యతరంగిణుల మునింగి, యుత్తుంగ శృంగ విలోకిలోకి సాత్కృత సుపర్వ పర్వతం బగు శ్రీపర్వతంబు లోచనపర్వం బుగాఁజూచి ప్రణమిల్లి, మల్లికార్జును సమ్మోదమునఁ బ్రణుతించి, తన్మనోబ్జ భ్రమరీ విభ్రమ రమ్యయగు భ్రమరాంబం బ్రశంసించి, భక్త శోధన పరంపరా సంపాదక

పాదకమల రజోలేప నహోబలేవ భజించి, నిజ భజన రత జన ప్రతిపాదితానశ్వర పదంబులగు శ్రీవేంకటేశ్వరపదంబులకు నమస్కృతులు విస్తరించి, మస్తరాంహస్తూలికా సందోహ దాహ దోహళ నిజాహ్వాయ స్మరణ విస్ఫులింగంబగు శ్రీకాళహస్తీ లింగంబు నంతరంగంబున హర్ష తరంగంబు లుప్పొంగం గాంచి.. "(1–128)నాడు

7 5 3 "ఘనా వేళ గరిష్ఠ దాన పదవీ పరీతోషిత కాళ, గౌతమీ, హోళకవి ద్విజస్తుతి వచోంగ". .(3–238) అని కృతిభర్త వదాన్యతపై కవి ప్రశంసావాక్యాలు పై మాటలో 'కాళ' అనేది కాళేశ్వర క్షేత్రాన్ని తెలుపుతుంది

పై విధంగా చేమకూర వేంకట కవి తన కాలంనాటి తెలుగునాడులోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు, తీర్థాలను అర్జునునికి సందర్శింప జేసినాడు

7 6 కవి చౌడప్ప కవి చౌడప్ప మట్ల అనంతరాజుకు, రఘునాథనాయకునికి సమకాలికుడు వారిని గొప్పగా స్తుతించినాడు దాదాపు 200 పద్యాలు కవి చౌడప్ప పేరు మీద ఉన్నాయి

7 6 1 కవి చౌడప్ప పద్యాల్లో కనిపించే తెలుగునాటి ఊర్లివి –ఉల్లురు కుందవరం / కుందరం, తిరుపతి, మట్ల అనేవి.

శ్రీపతి వుల్లురి పట్టణ గోపాలుఁడు... కుంతీ సుతులన్ గాపాడినటుల (పద్యం–2).. గోపాలుండగు వుల్లురి వాసుఁడు (పద్యం–4)

ఊటుకూరు కడప జి కడప తా లోగాని, రాజంపేట తాలూకాలో గాని ఉండే గ్రామం మెకంజీ కైఫీయతులలో వూటుకూరు/వుట్కూరు అని రాజంపేట తా లోని గ్రామానికి రూపాంతరాలున్నాయి వ్రాతలో 'వుల్లురి' అయి వుండవచ్చునేమో ,

7 6 2 'కుందవరపు కవి చౌడప్పా' అని చాలాపద్యాలకు మకుటం కుందరాన్వయ హాస్యకవి జాణవర్య (పద్యం –44)...కుందరాన్వయుండు (పద్యం–45) అని 'కుందవరం' పదానికి రూపాంతరం 'కుందరం'

మట్లనంత భూపాలుని ఆస్థానోద్యోగి ఘంటన "మట్లనంత ధరపాలునిఁ గొల్చి మహానుభావుపై వన్నెకు నెక్కి నట్టి గుణవంతులు ఘంటన".. (పద్యం–32) అని కవి ప్రస్తుతి.

దెనికెది పస' సమాధానం చెపుతూ కవి "తిరుపతి కేకాంగులు పస" అన్నాడు (పద్యం–50) విరక్తులైన విష్ణుభక్తులు ఏకాంగులు

ఈ విధంగా కవి చౌడప్ప పద్యాలలో ఉల్లుచ, కుందవరం, తిరుపతి, మట్ల అనే గ్రామనామాలు ప్రస్తావించబడినాయి

7 7 దంతులూరి బాప కవి : 'మూర్తి త్రయోపాఖ్యానం' దంతులూరి బాపకవి రచన క్రొత్తలంక మృత్యుంజయ కవి ఈ కావ్యాన్ని రచించి దంతులూరి బాపరాజుకిచ్చి, ఆయనపేరు మీద లోకానికి చాటినాడని సాహిత్య విమర్శకులు నిర్ణయించినారు[1]

7. 7. 1 మూర్తి త్రయోపాఖ్యానంలో కనిపించే తెలుగునాటికి సంబంధించిన ప్రదేశాలు ఆంధ్ర, కళింగ / కాళింగ, తాడివాడ, దంతులురు / దంతులూరు, ధాన్య వాటీపురి, శేషభూధరం – అనేవి

7 7 2 దంతులూరి లింగరాజు వంగ కురు .....కాళింగ కాంధ్ర .. సింధురాజ సారంగ విలోచనా కచభర స్ఫుట మౌక్తిక తుల్యకీర్తులన్" ఒప్పినాడు (1–75) సింగరాజు, బాపరాజు, చిట్రాజు, వేంకటరాజు "అంగ కళింగ ఘూర్జర శకాంధ్ర ముఖాఖిల దేశరాట్యభారంగ నటీభవ ద్భువ రాజిత కీర్తివహించి" నారు (1–134)

7 7 3 దంతులూరి గన్నరాజు 'అహిత దుర్గాధ్యక్షులందఱు భయమందఁ గ్రీడి కైవడి నిల్చెఁ దాడివాడ' అని కవి ప్రస్తుతి (1–60)

7 7 4 దంతులూరు కవి వంశనామం. దంతులురు/దంతులూరు అని రెండు విధాల ప్రయోగింపబడింది ఛందో నిర్బంధం వల్లనే 'దంతులురు' అని కవి వాడి ఉంటాడు

దంతులూరి బాప నృపాలక (1–20) దంతులూరు ఇంకా 1–60, 86, 116, 118 పద్యాల్లో గూడావుంది. దంతులురు తిమ్మ ధారుణీధవ వరేణ్య .. (1–85) దంతులురు ఇంకా 1–123, 331, పద్యాల్లో ప్రయుక్తమైంది

7. 7 5 దంతులూరి హరిసీమ కృష్ణుడు "శ్రీధాన్యవాటీ పురీ చిర సామ్రాజ్యరమా సమాశ్రయ మహా సింహాసనుడై.. బహు ధాన్య వర్ష మఖిల క్షోణి ప్రదేశంబులన్ కురియించి" నాడు (1–56)

7 7 6 దంతులూరి రామరాజు "ఫణి కులోత్తమ శిరః పరిధృత

శేషభూ (దరముకన్న) అన్యంబు ఘరియింపఁడు" (1-93) అంటే వేంకటేశ్వరుని తిరుమల కొండకు తప్ప మరెవ్వరికీ తలవంచడని భావం

పైరీతిగా మూర్తి త్రయోపాఖ్యానంలో ఆంధ్ర, కళింగ, రాజ్యాలు, తాడివాడ, చంతులూరు, ధాన్యవాటీపురి, శేషభూదరం అనే ఊర్ల పేర్లు కనిపిస్తున్నాయి

7 8 క్షేత్రియ్య క్షేత్రయ్య 17వ శతాబ్దంలో కృష్ణా జిల్లా, కూచిపూడి గ్రామం చేరువలో ఉండే 'మూవ' గ్రామంలో పుట్టి పెరిగినాడు మొదట అతని పేరు వరదయ్య మధుర, తంజావూరు.. మన్నారుగుడి వంటి నగరాలకు వెళ్ళినాడు. వివిధక్షేత్రములకు పోయి ఉండుటచేత 'క్షేత్రయ' అనే పేరు వచ్చి ఉంటుంది. రఘునాథనాయకుని కాలంలో తంజావూరు ఆస్థానానికి వెళ్ళినాడు విజయరాఘవ నాయకుని ఆస్థానంలో (1633-73) నే నిలిచిపోయినాడు[2]

క్షేత్రయ పదములు అనే గ్రంథంలో 330 క్షేత్రయపదాలు, 25 క్షేత్రయ పేమో అని సందేహించదగినవి, 23 ఇతరుల పదాలు సంకలనం చేయబడినాయి

7 8 1 క్షేత్రయ పదాల్లో కనిపించే తెలుగునాటి ప్రదేశాలు ఇవి – ఇన పురం, కడప, గోలకొండ, చిరుతని, చెల్లవరం, తుముకూరు, మువ్వ /మువ్వపురి, పెణంగి, శ్రీశైలం, సంగటి కొంత, సత్యపురి, హేమాద్రి అనేవి

క్షేత్రయవి కాని పదాల్లో కనిపించే ఊర్లు, పద్దులి, వెలుగోటి, ఎణంగి, సింహనగరం / సింహపురి / సింహపురం అనేవి

" చక్కని మా యినపురసామి మువ్వగోపాలా" (I-102)

"ఇందుకేమిసేతునమ్మా ఎవరు తోడి తెచ్చేదరమ్మా
ఇందువదన కడప వెంకటేశు డెంతదూరాననున్నాఁడు
పడతిరో మువ్వగోపాలుడైన కడప వెంకటేశుని గూడి
యెడబాయక యుందునని యెంచుకొంటి" (I-49)

" మామువ్వగోపాలుడు మధురతిరుమలేంద్రుడు
తంజాపురి నెలకొన్న విజయరాఘవుని
బలవంతుడే గొలకొండ పాదుషా
బహుమానమిచ్చి తులసిమూర్తితో వాదు దలదెనావేళ" (III-93)

" చిరుతని వాసుడై యున్నాడు" (IV-17)
"చేరి పెంచు చెల్లి వరము చెప్పగా రమ్మని నిన్ను" (II-27)
నే సంతరించిన తూముకూరి సన్నబియ్యమున్నవి" (IV-12)
"బాగాయె మువ్వగోపాలా నీవగల్లా (I-1)
..."మా మువ్వగోపాల రాయని" (I-4)
"మువ్వగోపాల తగవా శ్రీమువ్వపురి నిలయ మువ్వగోపాల"
(III4-8)
"నెరజాణ వెణంగి నిలయుడా ననుగూడి" (IV-18)
"గోపాలునకు.. ...వెలమి శ్రీశైలనిలయుడు
సఖుడగడు వెలసిన మువ్వగోపాలుడు వాడౌట" (III-75)
"సఖియ నీ చక్కవలు సంగటి కొండలందురు గాసి" (II-63)
"మువ్వగోపాలుడు సత్యపురి వాసుదేవుడు" (1-180)
"సరసుడే మా హేమాద్రి స్వామి మువ్వగొపాలుడు" (1-94)

7 8 2 ఇతరుల పదాలు

"పెద్దలు విని చూచిరన్న ఇద్దరికిని మోసమగును
పద్దులి నరసింహ నగర వాసుడ, రంగేశుడ, "
"సాటిలేని నృప కోటిలో మేటియౌ వెలుగోటి
బంగారేచంద్ర కిరీటిపై మదినాటియున్నది" ( 19 )
"నీరెప్పలపై పేరిన కాటుక కన్నులు వెణంగి రాయ
రారా యేటికి సిగ్గులు
..... నిక్కము వెణంగి నిలయుడ ననుగూడి యెక్కడ
పోనంటివి" ( 12 )
"సూనశరు సంగరములో నిను సొక్కచేతుర సింహపురవర" (14 )
"సింహపురి రంగధామ పోసిమ్మంటినా" (7,18)

7 8 3 వాగ్గేయకారుల్లో ఒక దైవం ప్రధానంగా కీర్తింపబడడం ఉంది, ఇతర దేవతలను స్తుతించేటపుడు తమ ప్రధానదైవంతో అభేదం చెప్పడం సర్వసాధారణం అన్నమయ్య వేంకటేశ్వరునితో, క్షేత్రయ మువ్వగోపాలునితో, అభేదం చెప్తాడు తక్కినదేవుళ్ళను స్తుతించేటపుడు. 'క్షేత్రియ పదాలు' అనే గ్రంథంలో

క్షేత్రయ్య పదాలు మూడు భాగాలుగా విభజింపబడినాయి క్షేత్రయ్యవేమో అన్న పదాల్ని నేను నాల్గవ భాగంగా పరిగణించినాను వాటికే వరుసగా I, II, III, IV సంఖ్యలివ్వడం జరిగింది)

ఈ విధంగా క్షేత్రయ మువ్వగోపాలుని ప్రధాన దైవంగా పదాలు గట్టి పాడినా, ఇతర స్థలాలలో ఉండే దేవుళ్ళని కూడా పాడినాడు తమిళదేశంలోని కంచి, తిరుక్కోవలూరు, వంటి క్షేత్రాలలోని దైవాలు క్షేత్రయ పదాలలో చోటు చేసు కున్నారు చిరతని మొన్నటి దాకా తెలుగునాడులో ఉండిన తిరుత్తణి

7 9 మారన వెంకయ్య భాస్కర శతకం మారన వెంకయ్య రచించిన ప్రసిద్ధ శతకం. భాస్కర శతకంలో 'గౌతమీ' నది ప్రసక్తిమాత్రమే కనిపిస్తుంది క్రూరమనస్కులైన రాజుల కొలిచిన మంచివారికి కూడా చెడ్డ బుద్ధులే అలవడు తాయి అనేందుకు ఉపమానంగా "మాధురీ జలోదారలు గౌతమీ ముఖ మహానదు లంబుధి గూడినంతనే క్షారము చెందును "అని చెప్తున్నాడు కవి (పద్యం-35)

7 10 రత్నాకరము గోపాలరాజు 'సౌగంధిక ప్రసవాపహరణం' అనే ద్విపదకావ్యం ఇతనిరచన కృతికర్త రావిళ్ల లింగభూపాలుడు రావిళ్లవారు విజయ నగరరాజుల సామంతులు[3]

7 10 1 సౌగంధిక ప్రసవాపహరణం కావ్యంలో మనకు కనిపించే తెలుగు నాడులోని ప్రదేశాలు - ఆదవని దుర్గం, కందెన యోలు/కందెనవోలికోట, గుడిపాటి కోట, తిరుమణికోట, పెన్గొండ, రావిళ్ళ, వెల్లుట్ల అనేవి.

7 10 2 రావిళ్ళ లింగ భూరమణ శేఖరుఁడు (పీఠిక 13-20) వెల్లుట్ల గోత్ర పావనుఁడు (పీ 78-85)

"రావిళ్ళ మల్లభూపాలుఁడు . . . . .కొమరొందు గడిపాటి కోట చెంగటను. . . గుతుబుసాహు బలంబు ఘోరించి నరెకె"నట (పీ 352-359)

7 10 3 రావిళ్ళ తిమ్మభూపాలుడు "మొనసి కందనవోలి ముట్టడి యల్ల మునుమున్నె విడిపించి. యెదురు పఠాణీల నెల్ల మాట్లాడి... కల దక్కనీలఁ జీకాకుఁగావించి. కందనవోలి కోట యనురాగమున సొచ్చి" . కుంతలాధిపులెల్ల కూర్మితో మెచ్చ ధరణి పేరైన యాదవని దుర్గంబు సురతాణి లగ్గగా చూరలాడించి . . . . . పొగరు తురుష్కుల పోనీక తుర్రించి . ఎల్ల మహిస్థలి నేలుచునుండె"ను (పీ 415-29)

రావిళ్ళ లింగభూపాలుఁడు. ."అఖిల క్షాత్రవులఁదోలి పెన్గొండకు ద్రోవలు సూపి.. ప్రబలుచునుండె"ను (పీ 610–620).

తృతీయాశ్వాసాంతంలో–ఇదే కావ్యాంతం కూడా "గురుతర వెల్లట్ల గోత్రుని పేర...కలితాదవని దుర్గ గర్వ విభాళ . రావిళ్ళ కొండ భూరమణుని లింగ భూవరాగ్రణి పేర.. నంకితంబుగ" అని ఉంది

సౌగంధిక ప్రసవాపహరణంలో రావెళ్ళవారి విజయాలు, వారు గెలిచిన కోటల పేర్లు ఉన్నాయి

7 11 పౌత్రిక కవి మల్లన 'రుక్మాంగద చరిత్రము లేక 'ఏకాదశీమాహాత్మ్యము' అనే కావ్యాన్ని రచించినాడు పౌత్రికకవి మల్లన

7 11 1 ఈ కావ్యంలో కనిపించే తెలుగునాడుకు చెంది ప్రదేశాలు–తీర్థాలు ఆంధ్ర, అంతర్వేది, అహోబలం, ఏకచక్రపురి, కొల్లాపురం, దక్షపురి, /దక్షవాటం/ దక్షవాటి / దక్షవాటికా, దాక్షారామం, ద్రాక్షారామం, పీఠ, పంచారామాలు, శ్రీగిరి / శ్రీశైలం, శ్రీధాన్యకటకం అనే ప్రదేశాలు, కృష్ణ, గౌతమి, తుంగభద్ర, బాహుద సప్తగోదావరం, సాగర సంగమం అనే తీర్థాలు

7 11 2 "కాశ్మీర మగధాంధ్ర కాంభోజ కరహాట . వివిధ దేశములఁ గలుగు పట్టణ వ్రాతములలో . జగతి పొగడొందఁదగు విదిశాపురంబు" అని కథ ప్రారంభం రుక్మాంగదుడు మందర నగమున మోహినిని వరించి దివ్యలింగమును సేవించి తన పురానికి "ఉభయ పార్శ్వముల గౌళోత్కళ మగధాంధ్ర ఘూర్జర బలములుగూడి నడవ"గా పయనించినాడు (4–3)

7 11 3 బ్రహ్మదేవుడు యమధర్మరాజుతో అంటున్నాడు "కాంచి స్థానము. అంతర్వేదియున్ మాయయుం, బంచారామము లయ్యహోబలము . దర్శించంగల్గిన వారు నినగర మీక్షింపంగ రారెన్నడున్". "శ్రీశైలమున్ సాకేతం బును జూచి మూడవ మనుష్యశ్రేణి నిన్ సూర్యజా" (2–84, 85) అని అంటే ఈ పుణ్యక్షేత్రాలను దర్శించినవారు నరలోకానికి పోరు అని భావం అంతేకాదు ఈ చెప్పబోయె తీర్థాలలో గ్రుంకినవారు కూడా యముని మొగం చూడరు

" సరయువునందు వేగవతి జాహ్నవి తుంగభద్ర .
...గౌతమి బాహుద కృష్ణ గండకి సాగరసంగమంబులన్

బురుషుఁడు తీర్థమాడి నిసుఁబూని కనుంగొనఁదర్కనందనా (2–87) అని వివరించాడు విధాత యమున్తో

యేయే క్షేత్రాలలో శక్తి ఏమని పిలువబడుతుందో చెప్తుంది ఈ పద్యం

" . వింధ్యశైలంబున వింధ్య వాసిని కాంచి కామకోటి . . .
శ్రీగిరి భ్రమరాంబ. ఏకచక్రపురిన నేక వీర
పీరను గోల్పురి పీరలక్ష్మి, కొల్లాపురమ్మున కోమలి శ్రీదెవి"

ఈ విధంగా వీర అంటే పిఠాపురం ఏకచక్రపురి ఏకశిలా నగరమా?

7 11 4 'రుక్మాంగదుని రాజ్య పాలనలో శ్రీధాన్యకటకమై చెన్నొందె దెశంబు' (1–136) ఇక్కడ ధాన్యకటక నగరం ధ్వనిస్తోంది

7 11. 5 రుక్మాంగద చరిత్ర కృతి భర్త దక్షవాటీ భీమయలింగము. దక్షపురి/దక్షవాటం, దక్షవాటి/దక్షవాటికా దాక్షారామం/ ద్రాక్షారామం అనే రూపాంత రాలు ఈ కావ్యంలో ప్రయుక్తాలు

దక్షపురి భీమెశా ' అని ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమాశ్వాసాది పద్యాలలో ప్రస్తుతింపబడినాడు కృతిభర్త "పులితోలు రెంటెంబు వెలిపట్టు గెంటెంబుఁ గటి మండలంబున గరిమఁదనర ...భసితాంగరాగంబు బహు గంధ యోగంబు . అర్ధనారీశ్వరస్వామియై తనప్పు దక్షపురి భీమలింగంబు " కవికి కలలో ప్రత్యక్ష మైనాడు (1–29)

కవి "తాపస స్తోత్ర వా చోట దక్షవాట భీమశివలింగ హాటక స్తోమ పాట" (1–30) అని స్వామిని స్తుతించినాడు చతుర్థా శ్వాసం చివర్లో కవి "దేవ దానవార్చి తాంఘ్రి దివ్య పద్మ సప్త గోదావరీ జలావగాహ దక్షవాట పట్టణ శ్రీవిహార" అని ప్రస్తుతించినాడు (4–143)

కవి అంటున్నాడు "నేరుక్మాంగద భూవరు చరితంబు చెప్పఁబూనితి మొదలన్ దెవుని దాక్షారామ శ్రీ విభవ విశేష మహిమ చెప్పఁగ వలయున్" (1–37) అని దక్షవాటి ఎలాంటిదో అంత్యాను ప్రాసతో వర్ణిస్తున్నాడు కవి సీస పద్యం, గీత పద్యంతో కలిపి ఎనిమిది పాదాలలోను దక్షవాటిని దర్శింప జేస్తాడు ప్రౌఢ కవి మల్లన

సీ కామ్యార్థఫల సమత్కార కల్ప తరువాటి దళిత పాతకకోటి దక్షవాటి
ప్రఙుత కల్యాణైక గుణమణి వ్రజవేటి ధాత్రీకదేశాటి దక్షవాటి

పమ్మసీందాక్షారామ సస్యమేఘ స్ఫోటి దమితరోగ నిశాటి దక్షవాటి
రథ విసూనాతపత్ర పతాక గజఘోటి తాపాద్రి శతకోటి దక్షవాటి
దర్పితాశాలతా రోటి దక్షవాటి దనరు నిగమావిపురి చేటి దక్షవాటి
ద్వార సేవిత కర్ణాటి దక్షవాటి రచితెందుకిరీటి శ్రీదక్షవాటి" (1-38)

తృతీయాశ్వాసాంత పద్యంలో 'ద్రాక్షారామ విహార' అని స్వామిని కవి సన్నుతించి నాడు

పై విధంగా పౌరాణికకవి మల్లన కథలో సందర్భంలేకున్నా కత్యవ తారికలో తన కృతిని అంకితమిచ్చే దేవుని నివాసాన్ని సాలంకారికంగా వర్ణించినాడు, అంతర్వేది, అహోబలం, శ్రీశైలం, పంచారామాలు వంటి క్షేత్రాలు తుంగభద్ర కృష్ణ, గౌతమి వంటి నదులు కావ్యంలో చోటు చెసుకున్నాయి

7 12 పాలవేకరి కదిరీపతి 'శుక సప్తతి' పాలవేకరి కదిరీపతి రచన ఈ కథా సంకలన కావ్యంలో కనిపించే తెలుగునాటి ప్రదేశాలు – నదులు ఇవి ఆంధ్ర, ములికి నాడు, ఏలా నగరం, ఖాద్రి, తఱిగొండ, తాడిగోళ్ళ తామ్రపురం, తిరుపతి, నెల్లూరు, బొప్పిలి, శ్రీధాన్యకటకం, శేషశైలం అనే ప్రదేశాలు, కృష్ణ / కృష్ణవేణి, గోదావరి, తుంగభద్ర, భవనాశని, భీమరథి, మలాపహం అనే నదులు

7 12 1 ఒక ఎఱుకత రాజుతో అంటుంది అన్ని దేశాల కన్యలను చూసి నాను అందులో "కుందనంపు సలాకల యంద మొందు నంధ్ర కన్యల వ ...కను గొంటిని" (1-105) అని

"ఎజయభవనమను పేడవనిఁ గలదు ములికి నాడను సీమఁగోమలుల చూపు ములికి నాటిన మరుఁడు దా మూర్ఛనొంద" (1-349) ములికినాటిని శ్లేషలో కథానుగుణ్యంగా మలుచుకొన్నాడు కవి.

"ఏలానగరంబున గొపాలుం డొకఁడమరు విష్ణుభట్టుఁడు తంత్రీపాలుండను వాఁడు" (2-545)

"క్రోడుగల్మొదలైన సురుతర గ్రామము ల్మహిమ జెన్నగు భోగమండప ములు . కట్టాణి ముత్యాల గట్టి వౌకట్ల వాడపుదైన నవరత్న హార లతలు ... మొదలుగాఁగల కైంకర్యముల నమర్చె శ్రీకరుండైన ఖాద్రి నృసింహామూర్తికి ... పెదయౌబళేంద్రుండు" (1-25)

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

నేటి అనంతపురంలో ఒక తాలూకా ముఖ్య పట్టణంగా ఉండే 'కదిరి' లన నృసింహస్వామి దేవాలయం చాల ప్రసిద్ధి గన్నది అసలు కవి పేరే 'ఖదిరీపతి' గదా!

7 12 2 కవి పూర్వులలో మొదటి చారిత్రక పురుషుడు పాలవేకరి పెద ఔబళరాజు ఈతడు తాడిగోళ్ళ పురధాముడు కాబట్టి పాలవేకరితో పాటు 'తాడిగోళ్ళ' అనే గృహనామం కూడ చెల్లుతున్నది[4] తాడిగోళ్ళ కోలారు మండలం శ్రీనివాసపురం తాలూకాలోనిది అని నిర్ణయించినారు[5]

.. "మహోన్నతి నేరె భోగ సుత్రాముఁడు తాడిగోళ్ళ పురధాముఁడు శ్రీ పెద యౌబళుండిలన్" (1-21) 'తాడిగొళ్ళ' కవి వంశానికి గృహనామంగా, పెక్కు చోట్ల అవతారికలో పేర్కొనబడింది (1-23, 25, 32, 36, 39, 41, 49, 50, 66, 68, 69, 70, 71, 74, 75)

7 12 3 ఎఱుకత మూలికలు తెచ్చి చూపించి రాజుతో "ఇది దారి కట్టు, మొనకట్టది, కాంతావశ్య కరణమిది...సింగం దల్ల తఱిగొండ దరిన్ దల మోచి తెచ్చినవి" అంటుంది (1-101)

7 12 4 అంబుధి మోహపు రాణివాసమై తనరెడు కృష్ణతీరమునఁ దాక్షపురంబను కాపుటూరు" (2-405) ఉంది ఆ ఊర్లో ఉండే ఒక రెడ్డి మొదటి భార్య 'సుకేశి' రెండవ భార్య గుణవతి "తిరునాళ్ళకై పోయి తిరుపతిలోఁ గొన్న నొక్కు పూసల పేరు బెక్కు సూప" అలంకరించుకొనేది (2-411)

7 12. 5 ఒక చిలుక వేశ్య నొకదాన్ని గర్వం పోగొట్టి, దరిదర్పినుచేసి, అవమానం పాల్జెస్తానని ప్రతిజ్ఞ బూని నెరవెర్చుకుంటుంది కామసిద్ధికోసం వేశ్య, దాని కూతురు గుండు కొట్టించుకొన్నారు ఆ సందర్భంలో వారి స్వరూపవర్ణనలో కవి చక్కగా "తిరుపతి కొప్పులందముగఁ దీర్చిన బూడిద బొట్లు" అని వర్ణించినాడు గుండు కొట్టించుకోవడానికి జాతీయంగా తిరుపతి కొప్పులు అన్నాడు కవి (3-91).

7 12 6 ప్రభావతి ఒక వైశ్యుని ఇల్లాలు భర్త వ్యాపారం కోసం దూరదేశాలు వెళ్తున్నాడు అప్పు డంటున్నది "నీకు అంగడగత్తెలు సరసానికి లభిస్తారు" - అని ఆమె చెప్పిన అంచగత్తెల్లో మధుర, శ్రీరంగ, కాంచీ పురాల వారున్నారు నెల్లూరు నారీమణులు కూడా "చేరఁబో నెల్లూరు నారీమణుల కెంపు పస మించు టడుగు నీ నొసటి మీఁద" - అని ప్రభావతి పలుకులు

"పెద్ద మట్టెలు, మట్టి పిల్లాండ్లు బొబ్బిలికాయ లొత్తులతోడి కడియములును" బొబ్బిలికాయలు బొబ్బిలి పేరుతో ఉండే ఆభరణాలేమో.

7. 12 7 ధృష్ట బాహుడనే బాటసారిని ఒక మాస్టిని యిల్లాలు "నీ ఊరూ పేరూ ఏమి ? అని అడుగుతుంది వాడు చెప్పినమాటలు "మధురాపురంబు నారాణ యాచి కాంపురంబు తామరతంపర మదీయ గృహంబు శ్రీధాన్యకటకంబు మద న్వయంబున కాకరంబు కంబుధర పాదాంబురుహంబు వెచలతాలవాలంబనగు శేష శైలంబున కరిగి క్రిమ్మఱి వచ్చు వాఁడను" అంటాడు ఈ సందర్భంలో ధాన్య కటకం, శేషశైలాల ప్రసక్తి వచ్చింది

శ్రీముష్ణంలోని 'నిత్య పుష్కరిణి భారతదేశంలో ఉండే అన్ని పవిత్ర నదుల సంగమం "పూర్వ భాగమున నద్భుతలీల జాహ్నవి గోదావరీ నదుల్ గొండ్లి సలుప పశ్చిమంబున తుంగయు, భద్రియును, సమీరు నెడఁగృష్ణవెణి, కుబేరదిశ మలాపహాయు, భీమరథియు, హరాశ రసయు నెలమి భవనాశనియు నిల్వ నిది నెలంగు (4-187) ను. మలాపహ - మలాపహారిణీనది.

పై విధంగా పాలవెకరి కదిరిపతి కావ్యంలో తెలుగునాడులోని ముఖ్యనదులు, పుణ్యక్షేత్రాలు, శృంగారపురాలు కథానుగుణంగా తెలుపబడినాయి

7 13 కంచెర్ల గోపన్న భక్త రామదాసుగా ప్రసిద్ధికెక్కిన కంచెర్ల గోపన్న 'దాశరథి శతకము, పేరుమోసిన భక్తి శతకాల్లో ఒకటి

దాశరథీ శతకంలో కనిపించే తెలుగునాడు ప్రదేశాలు - నది కంచెర్ల, భద్రి గిరి/భద్రనగం/ భద్రశైలం, గౌతమీనది అనేవి

7 13 1 "భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ" అనేది మకుటం ఈ భక్తకవికి విరజానదీ గౌతమీనదులకు, వైకుంఠం భద్రనగానికి అభేదం శ్రీరమాదేవి సీత సేవకులు వైష్ణవులు రాముడే శ్రీమహావిష్ణువు తిలకించండి.

"శ్రీరమ సీతగాఁగ, నిజసేవక బృందము వీర వైష్ణవా
చార జనంబు గాఁగ, విరజా నది గౌతమిగా, వికుంఠము
న్నారయ భద్రశైల శిఖరాగ్రముగాఁగ, వసించు చేతనో
ద్ధారకుడైన విష్ణుఁడవు దాశరథీ | కరుణాపయోనిధీ" (పద్యం-20)

"కంటి నదీ తటంబుఁ, బొడగంటిని, భద్రనగాధివాసముం గంట నిలాతనూజ

నుర కార్ముక మార్గణ శంఖ చక్రములన్ గంటిని" (పద్యం-21) అని భక్తిరస ప్రవాహంలో తలమునలుగా తేలియాడుతున్నాడీ భక్త కవి

"కంచెర్ల కులోద్భవుఁడస ప్రసిద్ధుఁడనై.. గోపకవీంద్రుఁడన్" .. అని చివరి పద్యంలో తన పేరు చెప్పుకొన్నాడు కవి
ఈ విధంగా దాశరథి శతకంలో కంచెర్ల గౌతమి, భద్రగిరి ప్రస్తావింపబడినాయి

7 14 బిజ్జుల తిమ్మ భూపాలుడు మొదట అలంపురం, తర్వాత ప్రాకటూరు రాజధానిగా అలంపురంసీమను ఏలిన రెడ్డిరాజులు బిజ్జుల వంశంవారు[6] బిజ్జుల తిమ్మ భూపాలుని రచన 'అనర్ఘరాఘవ' కావ్యం

7 14 1 అనర్ఘ రాఘవ కావ్యంలో కనిపించే తెలుగునాడులోని ప్రదేశాలు-నదులు అలంపూరి సీమ/దక్షిణ కాశికాక్షేత్రం, కందనవోలి దేశం, కృష్ణానదీతీర సీమ, చింతకుంట, ప్రాకటురు / ప్రాకటూరు / ప్రాగటూరు, మొటవాడ, కృష్ణానది / శ్రీకృష్ణా కల్లోలిని, తుంగభద్రానది

7 14 2 ఈ రాజకవి పితామహుడు బిజ్జుల పెదతిమ్మ భూపాలుడు అతడేలిన సీమ, పొందిన గౌరవాలు క్రింది పద్యంలో చెప్పబడినాయి

" కమనీయ దక్షిణ కాశికా క్షేత్రంబు రహి మించ నెవ్వని రాజధాని
తుంగాఖ్య గంగాతరంగ రంగన్మౌళి బ్రహ్మేశుఁడెవ్వని పాలివేల్పు
పాదుశా దత్త శుంభద్దంతి హయ ముఖ్య వస్తు లెవ్వనియింట విస్తరిల్లు
ధర వంత కెక్కు కందనవోలి దేశంబు గణుతింప నెవ్వని కాణయాచి
సిరుల నొప్పు నలంపూరిసీమ కెల్లి 'నాడగౌడును, దేశాయి, నాడకరణ
మనెడు విఖ్యాతి యెవ్వాని కలరె నతడు వొప్పె బిజ్జుల పెదతిమ్మ భూవి
భుండు (1-78)

విజయనగర సామ్రాజ్యపతనం తర్వాత బిజాపూరు పాదుషా కర్నూలు, బళ్లారి జిల్లాలలోని కొన్ని ముఖ్యప్రాంతాలను ఆక్రమించి పరిపాలించినాడు ఆ దండయాత్రలో బిజాపూర నవాబు అభిమానం సంపాదించి బిజ్జుల పెదతిమ్మ భూపాలుడు అలంపూరు, కందనోలి (కర్నూలు) సీమలకు సర్‌నాడగౌడు, సర్‌దేశాయి పదవులను సంపాదించి పాలకుడుగా ఉండినాడు ఇలా జమీందారీగా 1653 లో వీరికి ఈ ఈబడినట్లు ఆ వంశం వారిదగ్గ ఉండే రికార్డువల్ల తెలుస్తున్నది[7]

7 14 3 ఈ కావ్యం ప్రాకటూరి రామేశ్వర స్వామికి అంకితం కవి తమకు "ప్రాగటూరు నగరీ రామేశుడిచ్చున్ సిరుల్" అని కోరుకుంటున్నాడు

"జడలఁదెంపగు జాలు, నొడలి కింపగు దాలు, పొడల సొంపగు కాలు వడరువాఁడు, చలువ నించిన సొమ్ము, కలువ వంచిన హమ్ము, చిలువ నుంచిన తొమ్ము గలుగువాఁడు . అమరులకు బ్రోచు మహిమచె నమరువాఁడు, ప్రాకటూరి పురిపఁడై ప్రబలువాఁడు, శాశ్వతైశ్వర్యకరుఁడు రామేశ్వరుఁడు." కవికి కలలో కనిపించినాడు (1–13)

7 14 4 "వారు కృష్ణానదీ తీర సీమారామ కమనీయ కల్పక కందళంబు పాకడూరీ ధరా పదక మధ్యస్ఫుర న్నవ్యముక్తాఫల నాయకంబు నైన రామేశ్వర స్వామి యుపమోత్సవైక సంరంభమునకు సమస్త దేశ విద్వత్కవి పరిష్కృతి ప్రశస్త ఘన సజనంబు" వచ్చి శోభాయమానంగా ఉండినారు (1–18). వారంతా కవిని అనర్ఘ రాఘవం రచించమన్నారు.

7 14 5 కవి వంశావతార వర్ణనలో "గంగకుఁదోఁబుట్టు వగుచు చతుర్థ జాతియందు నితాంత విఖ్యాతిఁదనరుచున్న మొటవాడ కులమున నొప్పు పీతె... విజ్జుల దాద భూపాలమౌళి (1–36) రెడ్డి కులంలో మొటవాడ• తెగ ఒకటి అన్నాడు

ప్రాకటూరి ప్రసక్తి ఇంకా "ప్రాకటూరి రామేశునకున్ (1–141) ప్రాకటురీ రామలింగ (3–1) ప్రాకటురీశా (4–1, అనే చోట్ల కూడ కనిపిస్తుంది

7 14 6 "శ్రీకృష్ణా కల్లోలవతీ కవచాభాపగా ధృతి స్ఫురిత జటాళీ కల్పక లతికా రాజీ కుసుమత్తారకేశుఁడు రామేశుఁడు" (5–1)

అలంపూరుకు పడమరగా రమారమి 10 మైళ్ళ దూరంలో కృష్ణానది ఒడ్డున ఉంది ప్రాగటూరు

పై విధంగా అనర్ఘ రాఘవకావ్యావతారికలో విజ్జుల వంశానికి చెందిన అలంపూరు, కందనోల్పిమలు, ప్రాకటూరు, కృష్ణా, తుంగభద్రా నదుల ప్రస్తావన ఉంది

7 15 చక్రపురి రాఘవాచార్యుడు 'నలచరిత్రము' ద్విపదకావ్యం చక్రపురి రాఘవాచార్యుని రచన శ్రీ ఘటికాచల నృసింహస్వామికి ఈ కావ్యం అంకితం

నలచరిత్ర కావ్యంలో కనిపించే తెలుగు ప్రదేశాలు ఆంధ్ర, కాళింగ, చక్ర పురి అనేవి

7 15 1 దమయంతీ స్వయంవరానికి నిషధేశుడైన నలచక్రవర్తి వస్తున్నాడు వివిధదేశాల రాజులు వెంట వచ్చినారు అందులో ఆంధ్ర, కళింగ రాజులున్నారు

"కుంతల బర్బర కోసల పాండ్య, మాళవ ద్రవిళాంధ్ర మగధ కాశ్మీర కాళింగ కాంభోజ కర్ణాట లాట, చోళాధినాథులు సుముఖులై కొలువ" గా నిషధేశుడు ఏతెంచినాడు (ప్ర 1220–8)

7 15 2 "పొలుపు మీఱిన చక్రపురి విహారుండు .తిరువేంగళార్యుండు .. ఆతని పుత్రుఁడు . రాఘవాహ్వయుఁడ" అని కవి స్వవిషయం చెప్పుకొన్నాడు (ద్వి – 870–91)

నల చరిత్ర కావ్యంలో ఆంధ్ర, కళింగ, చక్రపురి అనే ప్రదేశ నామాలు కన్పిస్తున్నాయి

7 16 కుమార ధూర్జటి 'కృష్ణరాయ విజయము' కుమార ధూర్జటి రచించిన చారిత్రక కావ్యం విశ్వనాథనాయని స్థానాపతి రచించిన 'రాయవాచకాని'కి పద్యానుసరణ ఈ గ్రంథ రచనకాలం 1705–10 ల మధ్య ఉంటుంది అని చరిత్ర పరిశోధకులచే నిర్ణయింపబడింది 9

7 16 1 'కృష్ణరాయ విజయంలో' రాయవాచకంలో చెప్పబడిన తెలుగు నాడు ప్రదేశాలె ఉన్నాయి కృష్ణా, కావేరీ మధ్యస్థిత దేశం, పాకనాడు, ఆదవని, ఆరవీడు/ఆరువీడు/ఆర్వీడు, ఉదయగిరి, ఓరుగంటి, ఔకు, కందుకూరు, కాళహస్తి, కొండపలి, కొండవీడు, గొలకొండ, సండెల, పొట్నూరి – సింహాద్రి, రావెల, వినుకొండ, వెలుగోటి, వెంకటాద్రి / శేషశైలం / శేషాచలం, శ్రీశైలం అనే దుర్గాలు – పురాలు, కృష్ణ/కృష్ణవేణి/కృష్ణా, గోదావరీ/గౌతమీ నదులు

7 16 2 ఆర్వీటి వినవెంకటరాయలకు ఈ కృతి అంకితం కుమార ధూర్జటి 'పాకనాటి వెలనాటి వంశ ప్రసిద్ధుడు ధూర్జటి పౌత్రుడు "శ్రీకాళహస్తి నిలయ చిత్రసూనాంబికా త్రికరానుగ్రహాసాంత కవితా రసజ్ఞహృదయుఁడు" (1–28)

కృతి భర్త ఇంటిపేరైన 'ఆరవీడు' అనే గ్రామనామం కృతి భర్త వంశ వర్ణనలో పలుచోట్ల ఆరవీటి/ఆరువీటి/ఆర్వీటి అనే రూపాల్లో కనిపిస్తుంది " ఆరవీటి

చిన్న వెంకటరాయని పంపాతటమున నిలుచువాఁడు శ్రీ విరూపాక్ష శివుఁడు రక్షించుత" (1-2) అని కవి ఆరంభ ఆర్వీటి చిన వేంకటావనీంద్రు (1-18, 3-59, 4-1, 4-118 లలో), ప్రవిలసదారవీటి కులావిర్భావ చినవెంకటాధిప రక్షా (2-1) అని ప్రయోగాలు ఉను వంశీయులను "సద్విద్యా మహిమనిచ్చే సంపద్వైభవు గాళహస్తి పతి నుతియింతున్" (1-5) "అమ్మా జ్ఞానమ్ము శ్రీ కాళహస్తి విభుని కొమ్మ సతాంత సాహిత్య నియతి నొసఁగు" (1-6) అని కవి కాళహస్తీశ్వరుని, జ్ఞాన ప్రసూనాంబను కొలిచినాడు

"శ్రీమదొరుగంటి కాకపతి సద్గుణ రాజయోగీంద్ర చరణారవింద మనోవిహార నిరంతరానందపరుఁడు కుమార ధూర్జటి" (ఆశ్వాసాంత గద్య)

7 16 3 శ్రీకృష్ణరాయలు "శ్రీరంగస్థల శేషశైల ముఖ లక్ష్మీనాథ దివ్యస్థలుల్ శ్రీ రంజిల్లఁగ వైభవోన్నతులకై యెన్నొప్పునే (2-8) అని వైష్ణవ భక్తులను పృచ్ఛించినాడు. జానన్నాదు వారు రాయలవారు అడగ్గా "కాళహస్తీశ్వరునకు సల విదంబు నకు సెత్కులపునను" శివభక్తులు నివేదించినారు

7 16 4 రాయల పట్టాభిషేకానికి. "ఘనసురోత్తములు కృష్ణా గౌతమీ జాహ్నవీ వరణా సూర్యసుతా కవేరతనయా వారాశి ముఖ్యాంబువుల్." తెచ్చినారు 2-42 )

. ఆర్వీటి బుక్కరాజు గొబ్బూరివారు. నందేలవారు. వెల్గోటివారు. బూదహాళివారు మొదలైన భూమిపతులు కొలువఁ బట్టాభిషిక్తుఁడై చెలువు మీరె" నాడు. "రమ్యగుణపాళి శ్రీకృష్ణరాయమౌళి" (2-44) "నిజాముశాహ . గోలకొండ . మంత్రులన్ గజపతినాథు పేరు కాగదమ్ము లంపుమన్ విజాపురమ్ము లోనగాదితి (2-111) సంహృత దుష్కులంతఁ ఏ సంహో వాడుఁడైన వెంకటాద్రిప కృపన్" రాయలుండినాడు (2-114) ఏదులశాహ. పెగ్గడీలును జాలింపించె గోలకొండకుని కామురాజునకు స్పృహి" (2-120) అని విజాపుర వార్తలు చెప్పిన విగత్తు చెప్పినారు

కొండపు రాయలు "కళింగదేశ వసుధాపతి వర్తమాన మంతయున్ . గాంచి వచ్చితిమి" (2-126) అన్నారు గొడాపరి వారి పూర్వ పద్మతారామ సర్వసమ్యోభి రామ సద్గుణధాము యశ జగన్నాథ సీమ కన్నుల వింపొసన్నప్" తున్నదట

నిజాంశాహు గజపతితో అంటున్నాడు "కృష్ణరాయ నృపశేఖరుడు... గోల కొండయు విజాపురమున్ బెదరన్ .. దాడి వచ్చు"నని అందరూ అనుకొంటున్నారు అని

7 16 5 "గజపతి గోదావరీ స్నానార్థం బరుదెంచు వేగు గని కొండం గల్లు పాశ్చాత్య పీఠానీకంబులు జుట్టుముట్టినారు" నల్గురు క్షత్రియులు ఆ మూకలను పాల్చివేసినారు (2-136)

7 16 6 "అదవని ముదుగల్లు రాచూరు మొదలైన మహా స్థలంబుల నిజ బలంబులుంచి గొలకొండ పురంబుపై . భట ప్రకాండంబులతో" రాయలు ఉర్వడిం చినాడు (3-9) ఆగర ఆముదానగరి యందు విజాపురి గొలకొండలోన్" కలకలం చెలరేగింది (3-10)

7 16 7 "మూడిండ్ల తురక దొరలు కృష్ణవేణికి నీవలఁ గృష్ణరాయనృపున కెదురుగఁజన దెంచి నిలిచి" నారు (3-11)

.. "కృష్ణయు నిండె నెంతయున్ (3-41) కృష్ణ రాఁదొడంగె, కృష్ణ రాయలివలఁ దఱుమఁజొచ్చె (3-43) కృష్ణ దాటి పసపదమని వచ్చి యొక్క పున్నెవాని కోర్వలేక తిరిగి నట్టులయ్యె" (3-44) -ఆ విధంగా తురకలు ఓడి పారి పోయినారు

7 16 8 అహిత కువలయపర గర్వమణఁగ నుదయగిరికి వేవేగ నయ్యెనుం డరుగ దెంచినాడు ఇక్కడ సూర్యోదయం, రాయలజయం శ్లేషలో సూచింపబడింది "ఉదయగిరి చెంత నుదయించె నొక్క వింత యనుచు దుర్గములో మంది యళుకు నొందినారు". రాయల దళాన్ని చూచి (3-55) దుర్గమమగు నా దుర్గము గెలుచుటకు నానా విధముల పోరినారు (3-57) ఆర్వీటివారు తొరగంటివారు, గొబ్బూరివారు . నంద్యాలవారు తుళువ దొరలు బోయలు ఘోరమౌ రణ మొనర్పఁగా గజపతి బలములు కలిచి పోరాడినవి (3-58) ఔకువారును, వెలుగోటి వారలు . రావెలవారు రాత్రింబగళ్ళు చతురంగ సేనలతో పోరాడి గెలవలేక పోయి నారు రాయలు స్వయానా ప్రతిజ్ఞబూని ఒకదినంలోనే దుర్గాన్ని గెలిచినాడు (3-59 నుంచి 62)

రాయలు జైత్ర యాత్రకు ముందుకు సాగినాడు కందుకూరు, కొండవీడు, కొండపలి, వినుకొండ గెలిచినాడు ఈ పద్యంలో ఆ విషయం ప్రతిభావంతంగా వర్ణించబడింది

"ఆట కందుకూరు వెట్టదిరె రాహళ శంఖ భేరీ విరావముల్ భోరు కలగ
అవల కొండవీడలరె దిక్కట సటత్సేనా రజోధ్వజ ప్రేంటు వెలయ
మఱి కొండపలిఁగలంగె రటన్మదేభేంద్రు ఘంటికా ఘణఘణంఘణలు జెలగ
ఆమీద వినుకొండ యల్లాడె భట సముద్భట సంహరప మహార్భటులు దసర
వెండియును గల్గు కోటలు ఒవిధ దుర్గతతులు తమ దామె విడిచి కొండలఁదరె
రచటి గజపతివారి సైన్యాధినాధులలన్నపాలుసు ధాటికి నిలువలక (3-63)"

అంతటిది రాయల ప్రతాప ధాటి అముదానగరాన్ని ఓడించి జయ ధ్వజం వెట్టించి
నాడు రాయలు

తర్వాత కళింగ ధరాంగణమున రాయలు అద్భుతమతిమై నిలిచినాడు (3-72)
పొట్నూరి సింహాద్రి కరుగుదెంచి పాళెమిడియించినాడు (3-74) గజపతి తన కుమా
ర్తెను రాయల కిచ్చినాడు "అరణముగా గజపతి వారరుదారం గృష్ణ కవలి యచ్ఛ
స్థలముక్ సరసత నొసఁగంగైకొని"నాడు రాయలు

కల్బరగి కోట నోడించి తన రాజ్యమునఁగల్గు మంచి వెపస్థలంబు లక్షింప
నెంచి (4-110) రాయలవారు "శ్రీశైల కాళహస్తి చిదంబరాదిక రమణీయమైన
స్థలములు జూచి, శ్రీరంగ కాంచికా శేషాచల ప్రముఖమ్మైన విష్ణుస్థలములఁ జూచి,
విలసితోత్సవములు చాల వెలయఁజేసి విజయపురి గోలకొండ వార్వెఁగపడఁగ
ప్రజలు వర్ణింప శ్రీ కృష్ణరాయ నృపతి. విజయనగరంబు దిగ్విజయలీల" జేరినాడు
(4-141)

ఈ విధంగా కుమార ధూర్జటి 'కృష్ణరాయవిజయ' కావ్యంలో రాయలు
జయించిన దుర్గాల్ని పురాల్ని, సందర్శించిన పుణ్యస్థలాల్ని వర్ణించినాడు

7 17 సముఖ వెంకటకృష్ణప్ప నాయకుడు అహల్యాసంక్రందనం,
జైమినిభారతం సముఖ వెంకట కృష్ణప్ప నాయకుని రచనలు జైమినిభారతంలో
తెలుగు నాడుకు చెందిన ప్రదేశాల ప్రసక్తి కనపించదు

అహల్యాసంక్రందన కావ్యంలో నల్లూరు/నెల్లూరు, వెంకటాచలం అనే రెండు
తెలుగుప్రదేశాల ప్రస్తావన ఉంది

7 17 1 కవి తండ్రి పినాషయ నృపతి అతడు "మృష్టాన్న
సత్రముల్ పెట్టె సేతు బాట నల్లూరు లోపల, తేట తీయ నీట పెటి తరాంబుసిధి

గొనర్చి"నాడు నల్లూరుకు నెల్లూరి అనే పాఠాంతరం ఉంది అది తెలుగువాళ్ళ నెల్లూరేనా ?

మీరాషయ నృపతి భార్య అలమేలమ్మ "ఆ రామామణి మీన భూవిభుఁడు, దా మత్యంత భక్తిన్ సదా శ్రీనాజల్లగ వెంకటాచలపతిన్ శ్రీకృష్ణసిం గొలువగా" ఈ కవి వేంకట కృష్ణప్పనాయకుడు జన్మించినాడు

పై విధంగా అహల్యాసంక్రందన కావ్యంలో నల్లూరు/నెల్లూరు, వేంకటాచలం ప్రసక్తిలో ఉన్నాయి

7 18 శేషము వేంకటపతి 'శశాంక విజయ' కావ్యం శేషము వెంకట పతి రచన "వెంకి వేంకటనృపతి సాచివ్యకారి కీర్తి గుణహారి వెంకట కృష్ణశౌరి" కృతిభర్త

7 18 1 ఈ కవి "రామానుజ దివ్యచరిత్ర ప్రబంధ సాహితీ మోహితా నల్ప సంతోష విసంకట వేంకట నగాధీశ్వరుండు"

కురు కరహాట కమాళ వరాటక కోసల భోజ కళింగ మహీవర నుత హాటక రత్నకవాటకుఁడు (చతుర్థ ఆశ్వాసాంతపద్యం) కృతిభర్త

ఈ విధంగా శేషము వేంకటపతి కావ్యంలో కళింగ, వేంకటాచలం అనే ప్రదేశాల ప్రస్తావన ఉంది

7 19 సారంగ పాణి కార్వేటి నగర సంస్థానాధీశుల కొలువులో అష్ట దిగ్గజాల్లో ఒకడు [10] క్షేత్రయ్య త్యాగయ్యల మధ్యకాలంలో ఉన్నవాడు (1680-1750) [11] సారంగపాణి పదాలు రెండువందలు ఒక గ్రంథంగా అచ్చయినాయి

సారంగపాణి కార్వేటినగర వేణుగోపాలస్వామిని చాలా కీర్తనల్లో పాడినాడు ఇతరదేవతల ప్రస్తాపన కూడా ఉంది కార్వేటినగర ప్రాంత పరిసరాలలో ఊర్ల పేర్లు చాలా ఈ పదాలలో చోటు చేసుకున్నాయి ఆయా ఊర్ల పేర్ల పేరుమీదుగా వస్త్రాలు, ఆభరణాలు, ప్రసిద్ధిపొందినట్లు ఈ పదాలే మనకు సజీవ సాక్ష్యం

7 19 1 సారంగపాణిపదాలలో మనకు కనిపించే తెలుగునాడులోని సీమలు- ప్రదేశాలు ఇవి పడమటి సీమ/పరమటి శీమ, పై సీమ మట్లవారి సీమ, ఉక్కేరి, ఉదయాద్రి, ఒంటిమిట్ట, ఓరుగల్లు, కడప, కదిరి, కానాల, కార్వేటి/కార్వేటి నగరం, కొండ/కళింగ్గ వైకుంఠం తిరుమల కోనసముద్రం,గోదారి, గోలకొండ, చంబాటి,

చిత్తూరు/శిత్తూరు, చిత్రగంటి, చీటిపాటి, తడుకు, నందేల, నగిరి, నాగపూడి, నాచేరి, నానారం, నారగంటి, నారాయణవనం, నిందవాడ, నెమిలోనం, పళిగొండ, పళ్ళిపట్టు, పెనుకొండ, పేరూరు, బంకాపురం, బండరు, బాజుపరం, మునిమడుగు, యేమాల, సేపుడూరు, సొమెశ్వరుని కొంత అనేవి.

7 19 2 " ఇంతకంటె యింకా యెవడిచ్చునే యేమిటికే గౌణిగేవు...
పడమటిసీమ గురువుల వారికి పల్లకి యొకటాయె" (102)
" మందలు గదిసె పరమటిశీమ కెగబడి కందులేటిగా
శెక్కర్రాక్కు" (142)
" పదిమంది కొడుకుల గన్నదాని చెతికి
పైకమిచ్చి వత్తురా యింత... ...
... ... . ...
ఒకడు పై సీమ కడకు దూడి పేరము
యొకసి పంచించి పెరొకసికి మనసిచ్చి" (95)
" మట్లవారి సీమ చీర నిను పడి మాట్లడిగిన లేదంటివి" (15)

7 19 3 "వుదయాద్రి మంగకు దుంగర మంపలేదా" (89)
"ఒకడు బిడ్డల తండ్రి 'ఒటిమిట్ట'లొ రాణ
యొకడు కొత్వార్ గిరి 'వోరుగంటి' కాడ" (95)
"అవటి కండా పాపపు చెవుడ బోయ
కదిరిగాని వలె నేమైన" (139)

'కదిరి' స్థలనామం పేరుగా ఉండే వ్యక్తి 'కదిరి గాడు'
"కానాలగాడ తండ్రి గాడి గాజులు యేపించతానే" (151)
" . శ్రీసాళువ మాక రాజ కార్వేటి రాజేంద్రా" (60)
"మాక రాట్కార్వేటి రాజా'' (61)
''మాక రాజ వీర కార్వేట్రాజేంద్ర'' (62)
"కార్వేటినగర వేణు గోపాలా" అని 18 కీర్తనల్లో ఉంది

కార్వేటి నగర ప్రసక్తి లేకుండా 'వేణుగోపాలా' అని చాలా పదాల్లో సంబోధన ఉంది

" నగరా చెలులు శ్రీ కార్వేటి నగరా వేణుగోపాల" (19)
" నాణ్యమౌ కార్వేటి నగరాన వుండేది నాళ్లగ యెరుక లేవా" (89)
పరమాత్మ వేణుగోపాల .. హాటమైన పరము వదలి
కార్వేటి నగరమున వెలసితివి (162)

ఇంకా 34, 36, 48, 51, 55, 66, 89, 123, 158, 162, 175, 185, 187, 196, 197, 198, 199 సంఖ్య గల పదాలలో కూడా కార్వేటినగర ప్రసక్తి ఉంది

"కొండ సుట్టొచ్చేరంట నారాల తూరి
...గారడా జంటుందామా కళ్గె వైకుంఠమేనె" (144)

"నరహరి భట్ల వెలిఉంగరాలు యెరువు దీసికోని
తిరుగ అడుగు బొతే నెత్తిన తిరుమల కొప్పు
బెట్టించిన వేణుగోపాలా" (92)

కొండ అంటే ఈ సందర్భంలో తిరుమల కొండే కలియుగ వైకుంఠంగా నాటికీ నేటికీ వెలుగొందుతూనే ఉంది తిరుమల కొప్పు అంటే గుండు కొట్టించడం మోసం చెయ్యడం అనే అర్థంలో ప్రయోగించిన తెలుగు జాతీయం

"కోన చముద్రం గుంట కొనను నల్బడి సూడె
నానాదించింగల్లె నానారం చంతొలె
యేసు గోపాలుడు యెటుల గాయించెనె" (152)

"గోదారైతే గుడ్లెల్లిందే మీద గొండ పొమ్మను
పిండొల్నంటే నాచెంబ సంగ నాయకమను" (147)

గోదావరినుంచి వచ్చినా బ్రాహ్మణులకు ప్రత్యేక గౌరవం చూపి బియ్యం దానం చెయ్యాలే మంటున్నారు పల్లీయులు

" కడప దాటి రానీయకే
అలవాని మాయగంటి వాకిలి దీయకె ॥పల్లవి॥

పల్లవి॥ పడతిరో ఇక్కేరి పడుచుల జేరె నన్ను
పడనాడి పొమ్మనిన వేణు గోపాలుని" ॥కడప॥

ఇంతగ నారుతూరై ఏమి మోడి గట్టుకొంటి
అంతరంగ మిద్దరికి అయి రాలేదె

పంతగించి నాపై లేని పగగొండ గావించి
జంతులు జేసి యనురసిపించిం దెలుగ వేమె ॥కడప॥
కోరి యుంటినే గోలకొండగ యెంతో నమ్మి
ఈ రేడు జగముల నిది వరపు
కూరిమితో నన్ను ఇత్రకూటమున కూడి పాడి
పేరు చెప్పిన ముందర ఆ పెనుగొండను భాషించెడపు ॥కడప॥

ఇల్లు మల్లు కడిగి వెట్టితి చై విడువ నని
యీ చంబాటి శివుని ముట్టితి కంచి
నల్లేరయ్యంగారి వెంట నాగపూడి తిరునాళ్ళకు
తెల్లవారే పైన మంట...
నాపెరీ చెన రాజేమో పడవేటి
దాతరంపొతే మూట మనిషికంటే తాను
ముందుగ బోయి సిలిచెనటు

సోమెశ్వరుని కొండ మీద
రామాయణము వినబోయి రాత్రి
గ్రామ పెక్క వ్రాశే పిళ్ళకు గర్భము ధరియించెనట"...(100)

" వెలయాండ్లకు జీవన మేమిక
కులకాంతలు విడిబడి నలుదిక్కుల చెలరేగిరిడేటి పాపమో
తెగువ చేసి రాణాలు గడచి తగుదుననుచు సిగ్గు శరము విడిచి
అంత పనికి రేవిణి చిత్తూరని చింత లేదు హూణుల దరబారను" (138)

" గొంటుకాయై తిరిగే వేణుగోపాలు దలివేణుకు తురి
గంటీలు టొంగిలించి చిత్రగంటి చీమ చేరెనట " (65)

" చీచిపాటి సొమ్ములు కరగించి చే సరాలకని బంగారిచ్చితె
వాటిలోనె మైరాపురి మంగకు వజ్రమణుల కమ్మలు సేయించితె
వేణుగోపాలుడు ననుగూడి వేలి వుంగరాలిట్లా తెమ్మని
బాణవరము రంగి మనమరాలికి పీణుగా ధార బోసి వచ్చితె" (107)
"ఇంతకంటె యింకా ఎవడిచ్చునె యేమిటికే గొణిగేవు

కడప వైద్యునికి నీ చై పిదిగ కావలసినదాయె
తడుకు సర్వ దుంబాలగ నాడే ధారబోశాయె గూడితే" (104)

"వేణుగోపాలునికి
ఇందుకే సటె బంగారం దలమ్మలో బెట్టి
సందేల దొర నిన్ను సజయ బంపినది" (41)
"అనాడు నగిరిది అరవై రూపాల తాను పెట్టెలో వుంచి
నేనట్లే రాగనే ఆ తాను పావడ
గూర్చి ధరియించు కోవచే" (102)
"పేరూరి మంగకు సూరి మొక్కుకుంటె
తేరు నడిపించలేదా నిన్ను
నారగంటి మద్దెల నరికికి దోపిందో
తేరజేసి తలుపువార కువాదిగేవు" (89)
"నారాయణ పనము ఓరగట్టుకొని
నగిరి వద్దికి మన నాయకురాలివవె. . (121)
వేణుగోపాలుడు • గూడ కంబకి నిందవాడ ఓయ్యేము-వేణుగోపాల" (134)
శిరతని పచ్చుత్రంవాయ్యేనంటి, శిన్నొన్నెసుకొని
ొరుగులు గొరుకుంటూ నెమలో నమ్మిన
నెమలిపనం ఒక వనం పేరేమో ;
"పట్టుచీరకు పన్నెపట్టు వరహాలయిదు
పట్టుమనుచు నా చై పట్టుకొని" (14)
"పేరూరి గంగకు సూరి మొక్కుకుంటె
చేప నడిపించలేదా నిన్ను" (89)
"కత్తెర బావిలి డుచుకొని సరిగ పయిట కొంగున తేలుగట్టి
భావించినపుడె సపుడాపు బంగారపురము కడిపెచట" (65)
పెడుక లెడ పెల్లపు వేణుగోపాల నాసామి ||ఆవకే ఏ౦నా
చీటి బంపించని బందరు చీటి బంపిందే మ యవకో
వెళవెళకు సొగసు వింత వింత చీరలు
తాళీలు రవల బందరు కమ్మలు (118)

తీర్థాలు పలనాటిసీమ పలినాటిసీమ/పల్నాటిసీమ, అహోబలం, ఏలూరు, కారెమ్ర్శిపురి, కాళహస్తి, కూర్మం, కొదమగుళ్ళ, క్షేమామరేశం, చింతపల్లె, తిరుమల, ద్రాక్షామహారామం, నరమాల పాటి నగరి/నర్మాల పాటిపురి, పట్టిసం, బొప్పూడి, భద్రాచలం, మంగళగిరి, రాజమహేంద్రం, వెలగపూడి/వెల్లపూడి, శ్రీకాకుళం, శ్రీశైలం, సింహాద్రి అనే ప్రదేశాలు కృష్ణానది, గోదావరి, చంద్రరేఖానది, నాగులేరు గంగధారమడుగు, సప్తగోదావరి అనే తీర్థాలు

7 21 2 వెలగపూడి ఒంగోలు తా లో ఉంది వెలగపూడి / వెల్లపూడి అనే రెండు విధాలుగా ఈ ఊరిపేరు ప్రయుక్తమైంది

సద్వెలగపూడి నరపూరి సద్వరుండు (1-68) వెలగపూడి వారి వంశ వృత్తాంతం ఇలా చెప్పబడింది విశ్వామిత్ర పౌత్రుడు లోహితుడు. లోహితగోత్రంలో 'శ్రీ వెల్లపూడి యన్నయ జన్నావుల వారి మంత్రిమణియై' అలరినాడు గాదె ఔబళార్యుడు, చింతపల్లె, ఎఱ్ఱమంత్రి, వెల్లపూడి రామమంత్రి, పిడుగు గోపన అన్నయ మంత్రి పుత్రులు (1-48) చింతపల్లి పీడు స్వంతంబుగా నేలుకొనుచు నెఱ్ఱమంత్రి అతని సంతతివారు చింతపల్లి వారలైనారు (1-50)

'వెల్లపూడి' పట్టణ మిల తొలికాణాచి యగుట, ఇంపున నచటనే నెలకొనుట' వల్ల రామనార్యుని సంతతి వెల్లపూడి వారైనారు (1-51) వెల్లపూడి అన్నయకు సీతిరాజు, రామరాజు కొడుకులు (1-54) అన్నయ పౌత్రుడు గౌరమంత్రి పలినాటి దేశపాండ్యుడైనాడు రామరాజు ఆ సీమకు తాసీషాదె ముఖ్య దేశముఖు అయినాడు (1-55) రామలింగమంత్రి 'పలనాటిసీమ' లో పేరొందినవాడు (1-60) 'దరిసి' కుమార యాచ వసుధా వరకుంజరుడు ఆప్తమిత్రుడు కాగా, దేశ పాండ్య ముఖిగా పలనాటి సీమల నృసింహుడు విక్రమ నారసింహుడై ఉండినాడు (1-61)

అన్నలమిన్నగు నేలూ రన్నయ సుతయైన నారణమ్మకు పతియైనాడు నారసింహయ (1-62)

గురు కొదమ గుళ్ళ పుర శంకర మేధా కరణ లంచికాగతి కృతి, నరమాల పాటి నగరీ వర మధ్యస్థాన వీరభద్రా కృతికి .. దక్షిణామూర్తికి ఈ కావ్యం అంకితం

7 21 3 ఈ కావ్యంలో నాయకుడు భానుమంతుడు అతని తీర్థయాత్ర కావ్యంలో తృతీయాశ్వాసంలో ఉంది

త్రివేణీ సంగమం, కాశీ, మణికర్ణికా, అయోధ్య, కురుక్షేత్రం ఇవన్నీ దర్శించినాడు. నీలాద్రి జగన్నాథునర్చించి తెలుగనాడులో ప్రవేశించినాడు. అతడే యే క్షేత్రాలు దర్శించింది, తీర్థాలాడింది కవి దండకంలోనే చూద్దాం

. "దివ్యాది కూర్మంబునన్ గూర్మరాజంబునున్ సన్నుతుల్ జేసి, సింహాద్రికిన్ వచ్చి పై గంగధారన్ సుధా సారధారన్ వడిం గ్రుంకి యా నారసింహుం బ్రశంసించి ... శ్రీకాకుళం బాదిగాఁగల్గు నారాజమహేంద్ర సత్పట్టణాలిన్ మహారాజ హాళిన్ నిరీక్షించి, గోదావరిం జేరి భద్రాచలోత్తుంగ శృంగాభిరామున్ పఖోద్దామున్ బ్రశంసించి, యా సప్త గోదావరి తీర భూమండలిం బట్టిసావాస కృద్వీర భద్రున్, దయా రాజిశ్రీ సముద్రున్ విసిద్రిం దగన్ గొల్చి, ద్రాక్షామహారామ భీమేశ్వరుం జూచి కృష్ణానది తీరముంజేరి, తద్వాహిని స్నానముంజేసి, హేమామరేశాది దైవస్థలంబుల్ మతిన్, బానకాల్నారసింహున్ నిరీక్షించి

పల్నాటి సీమం బ్రవేశించి, యా చంద్రరేఖా నదీస్నానముంజేసి, యా యిష్టకామేశ్వరుం గొల్చి, సున్నారలం బాయ నా నాగులేటిం జెలంగెటి మెటిన్ సదా ధారయౌ గంగధారం గృతస్నానుడై, శ్రీకరిన్ గారెమ్మ్రపుర్ పీర లింగంబులన్ గేశవస్వామి నంకమ్మసున్ శంకరున్ భక్తితో మెక్కి, శ్రీ వెల్గపూడన్న యామాత్యు బౌత్రుం బవిత్రీకృత శ్రీచరిత్రిన్, సదాలంపికామ ర్గ కామిన్ యమిన్ శంకరస్వామి నర్చించి, నర్మాల పాటీ పురిన్ వీరభద్రున్ స్వపాదాబ్జ భక్తిస్ఫురద్భక్త భద్రిన్ నిరీక్షించి పూజించి, శ్రీశైల శృంగోల్లసన్మల్లికేశున్, సభోదార కేశున్, మహాహోబలేశున్, దయావేశు శ్రీవేంకటేశుం బ్రసన్నాత్మ పద్మ ప్రకాశున్ నుతుల్ జేసి, జ్ఞాన ప్రసూనాంబికాధీశ్వరుం గాళహస్తీశ్వరున్ గొల్చి యా పిమ్మటన్" ... కంచి ద్వారా తమిళదేశంలోకి ప్రవేశించినాడు – భానుమంతుడు

కథా సందర్భంలో "నేటి దినమందు సింహాద్రి నెగడు నట్టి యిష్ట దానాన్న సత్రింబు నింపుమీఱ జేర వచ్చెను .. ఒక విప్రవరుడు" (3–185) అని చెప్పబడింది

పైవిధంగా వెలగపూడి కృష్ణయామాత్యుడు తన కావ్యంలో తెలుగునాడులోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాల్ని, పురాల్ని, తీర్థాల్ని భానుమంతుని చేత దర్శింపజేసినాడు

7 22 అయ్యలరాజు నారాయణామాత్యుడు పాల్కురికి సోమన తర్వాత కావ్యాన్ని విజ్ఞాన సర్వస్వంగా సృష్టించిన వారిలో అయ్యలరాజు నారాయణా

మాత్యుని పేరు ప్రత్యేకంగా చెప్పుకోవాలి కొండలపేర్లు, నదుల పేర్లు, ఊర్ల పేర్లు, క్షేత్రాలపేర్లు, నృత్యాలు, రాగాలు, వాశీతి బంధాలు, వశీకరణ ఔషధాలు, పిండి వంటలు, ఇలా ఒకటేమిటి అన్నీ తన కావ్యంలో పట్టికలుగా ఇచ్చినవాడు నారాయ ణామాత్యుడు 'హంసవింశతి' అనే కావ్యమె ఆయన రచించిన కావ్యం

7 23 1 హంసవింశతి కావ్యంలో తెలుగుదేశానికి సంబంధించిన ప్రదేశాలు, క్షేత్రాలు నదులు ఇవి ఆంధ్ర, కళింగ, పలునాడు, పాకనాడు, పులుగులనాడు, పొత్తపినాడు, ములికినాడు, రెనాడు, వెలనాడు, వెగినాడు, వంటి రాజ్యభాగాలు

అమరపీడు, అహోబలం, గపుశాద్రి, ఉరుబంత, ఉదయగిరి, ఏలూరు, ఓరుగల్లు, ఔకు, కంగొంది, కందనూరు కందుకూరు, కంటము, కడప, కడవనెత్తం, కదిరి, కనిగిరి, కలువాయి, కల్లూరు, కళింగ, కాండూరు, కాళహస్తి, కుందిర్పి, కుందుర్తి కూటాగుళ్ళు, కొండవీడు, కొండాపురం, కొండూరు, కొక్కెల్లు, కొత్తకోట, కొమ్మూరు, కోటకొండ, గంగెరు, గండికోట, గద్వాలు, గండవరం గుడిబండ, గుత్తి, గొలుకొండ, గమిలేనిపాలెం, గొబ్బూరు, చదమూరు, చాదుకొండ చింతకుంట, చిత్తూరు, చిని (పల్లె, జట్ప్రోలూరు, జూటూరు, తంగిళ్ళ, తనకొండ తంగొండ, తపిరు, తాడిగోళ, తాడిపర్తి, తాళూరు, తిరుపతులు / 108 తిరుపతులు, తిరుమల, దర్శి, దామెన చెర్వు, దువ్వూరు, దూపాడు, దూపి, దెవరకొండ, దొనకొండ ధర్మపురం, ధర్మవరం, నందవరం, నంద్యాల నడిగల్లు, నిజాంపురి, నాముకొండ, నెల్లూరు, నేలకొండ, పల్లి, నొసుము, పాకాల, పాగొండ, పాల్వంచ, పుంగనూరు, పుల్లూరు, పుష్పగిరి, పెడగంటి, పెదవలి, పెరపలి, పెనుగొండ, పొదిరె, పొరుమామిళ్ళ ఒంపరు, బనగాపల్లె, బెజవాడ, బెల్లముకొండ, భద్రాచలం, భువనగిరి, మంగళగిరి, మచిలి, మల్లూరు, మాచర్ల, మానుకొండ మారకపురి, మునిమడుగు, యాదవపర్వతం, రత్నగిరి, రాచకొండ, రాచర్ల, రావపీడు, రాజవోలు, రాపర్తి, రామచంద్రాపురం, రామయపట్నం, రామళ్ళకోట, రామసముద్రం, రామాపురం, రాయదుర్గం, వావిలి, వినుకొండ, వెలిగొడు, వెల్లటూరు, వెల్లాల, వెంకటగిరి, వెంపల్లి, శ్రీకాకుళం, శ్రీపార్వతస్థలి, సింహాద్రి, సిద్ధవటం, సీర్పి సూగూరు అనె ఊర్లు, కృష్ణా / కృష్ణవేణి, చంద్రభాగ, తుంగభద్ర, స్వామి పుష్కరిణి అనే తీర్థాలు, 'హంసవింశతి' కావ్యంలో ప్రసక్తాలు

7 23 2 ఉజ్జయినీ పురిరాజు చిత్రభోగుడు ఒక యోగిని వచ్చింది

శృంగార కళాప్రాయులగు రూప రేఖా శ్రీయుతి గల కన్నెలెక్కడున్నారు ? అని అడిగినాడు రాజు ఆమె ఇలా చెప్తున్నది-

డెబ్బదిరెండు పాళెముల రీవి దనర్చు సమస్త దుర్గముల్ . పట్నములు. .. పేటలు, పాతకంబు పొ దొర్పెడు జాల్ తిరుపతుల్ కనుగొంటిని . చక్కని చక్కని గుబ్బ గుబ్బెతలుంటారు - ఆయా ప్రదేశాల్లో (1-52) అని

"వెలనాడు వేగినాడును బులుగులనాస్త్ర కనాడు పొత్తపినాడులన్ గల ములికినాడు రేనా డలయక కనుగొంటి నచటి యబలలఁగంటిన్" అంది యోగిని ( 1-53 )

"లాట కర్ణాట మరాట వధూటుల.. బంగాళ వంగ కళింగ లతాంగుల. కోసలాంధ్ర వరాట కుంతల స్త్రీలను.. మగధ కొంకణ టెంకణ మానినులను. . చూచినాను'' (1-54) అని చెప్తుంది యోగిని

7 22 3 విష్ణుదాసు వైష్ణవుడు అతని భార్య హేమావతి అతను పర ప్రయాణం వెళ్తున్నాడు ఆమె అంటుంది కంచి వాల్గంటులు, నెల్లూరి కొమ్మలు వెన్నపట్నంబు వారిజేక్షణలు నీకు సరసానికి లభిస్తారు హా అంటుంది ఆ సందర్భంలో "ని వాలు గన్నుల నెయ్యుఁడో నెల్లూరి కొమ్మల కపురంపుఁదమ్మ రసము" అని ఆమె పలుకులు

విష్ణుదాసుడు చెప్తున్నాడు "ఈడను వరంప బందర యింగిలీసు కళము మొదలైన పేటలు గౌరపెల్లి సౌరభద్రవ్యములు పేర సార మాడ" పిలువనంపినారు ( 1-102

7 22 4 యాదవ ఇల్లాలు, ఆమె భర్త పుత్రవాంఛతో "తిరుమల కంచి పుష్పగిరి తీర్థములం జని కొంగుముళ్ళతొ పరము దంపతుల్ వడ యవారి కాన్కలు వైచి" ఏవేవో పూజలు చేసినారు కాటమరాజు కథలు చెప్పను సుద్దుల గొల్లలు వచ్చినారు ఫెళఫెళ పిరజాన్ ఎత్తిపెట్టి వాయింది పాటు వా గొమ్మలు నాట పాడి, దానకొండ గంగను వాలుత సన్నుతి చేసి కృష్ణన కతిభక్తి కెయి మోడ్చి వీరులను గొల్వ"(డని ఆ దంపతులకు తెల్పినారు (2-89)

7 22 5 ఒక ఊర్లో రామచంద్ర పెరుమాళ్ళ తిరునాళ్ళ జరుగుతుంది ఆ తిరునాళ్లకు వచ్చినవారితో "జంగాలు పెద్దెను వాండ్రడు తెల్లకోకల ఖద్దులు

వసత్తులు . పలునాటి వీరులు పరిహాసకులు . కొమ్మూరి దాసళ్ళ తపిరు దాసళ్లు,సి కోణంగులు. పరాసులు వశందులు" ఉన్నారు (3–29)

7 22 6 ఇంకొక కథలో "సుధానిధి యను పేరున గృష్ణా తీరమందు మణిరోన్నత కాంచన గోపురాథరీ కృత ఘనగోపురమైన పురము" ఉండినట్లు చెప్పబడింది (3–58)

7 22 7 "కళింగ భూమిని .. సుంగబంధురంబను పురముల్లసిలు"ను ఆ ఊర్లో శివభక్తయోగి ఉంటాడు అతడు ఏటేటా శ్రీశైలం యాత్ర వెళ్ళివస్తుంటాడు ఈసందర్భంలో కవి శ్రీశైలానికి వెళ్ళే శైవభక్తులను చక్కగా వర్ణించినాడు కవి మాటలలోనే చూదాం

" అయ్యావళే ముఖ్యమై తనరాలేడు మిండ జంగంబులు మెఱసి నడువ
గౌరషే మల్లప్ప గంగకుఁ జను కంచి కావళ్ళ వారును గలిసి చనగ
గుమ్మెతల్ కిన్నెరల్ గూడి వాయించుచు భైరవ జోగి వెంబడినె కదల
బసవ గంటలు బృహత్పటుశంఖములు మ్రోయ శివరాత్రి జంగాలు చేరి కొలువ
లశున తిలపిష్ట చూర్ణ భాగశన మసెమి యుల్లి పచ్చళ్ళు పులిదోసె లూరుబిండ్లు
మూట జోరెలు చిటిగాళ్ళు మోసి తేఁగ నాతఁడేటేట శ్రీశైల మరిగివచ్చు"
(3–189)

7 22 8 కవి ఒక సందర్భంలో భారతదేశంలో ఉండే రాజ్యాలను గురించి చెప్తాడు అందులో ... "సౌరాష్ట్ర చోళాంధ్ర శబర పాండ్య" రాజ్యాలున్నాయి (4–14).

7 22 9 ఒకచోట రేడ్లలో తెగలను చేపుతాడు కవి 'పంట మోటాటి పెడకంటి పాకనాటి యర వెలమ లాది కొండారె మొఱుసు గోన కొణిదె కాపులు .. మొదలగునవి ఆ తెగలు (4–136)

7 22 10 తీర్థాల గురించి చెప్పే సందర్భంలో తిరుమలలలోనున్న స్వామి పుష్కరిణి ప్రసక్తి వచ్చింది "స్వామి పుష్కరిణిలో స్నానంబు గావించి," (4–208) అని కవి పలుకులు

7 22 11 నూట ఎనిమిది తిరుపతులను మంజులగతి రగడలో వర్ణించి నాడు కవి దివ్యతిరుపతి పేరు, అందులో ఉండే స్వామిపేరు చెప్పడం విశేషం

భక్తుడొకడు 'అర్ద్రవస్త్రంబు లంగంబులంట, వడకికొనుచు నమ్రత నడుగ డుగునకుఁబెద్ద మాట 'గోవింద' యనుచును నూట యెనిమిది తిరుపతులలో స్వాములఁ దెలియఁ జూచ" (4-211) తెలుగునాడులో ఉండే తిరుపతులేవో పరిశీలిద్దాం.

"వేంకటగిరిపై వెలసిన తిరువెంగడముడయానఁ(లగని) కానుకలిడి, యాదవ పర్వతమందలి నారాయణునకు జయజయ లావర్తింపు . శ్రీకూర్మస్థలిఁజెకొను కూర్మస్వామికి పుష్పాంజలు లర్పించుచు . సింహాచలమునఁజెందిన నరసింహ కాంతునకు జోహారులు సెప్పుచు ధర్మపుర క్షేత్రము యోగానందస్వరూపునకు దాస్యము సలుపుచు, శ్రీకాకుళమున సిస్తుగ దోచిన యాంధ్రనాయకునకర్చన మను చును, ఘనతనహోబల గరుడాద్రి హిరణ్యాసురవధునకు నలి జోహళ్ళని . (4-213) ఇందులో ఆరు తిరుపతులున్నాయి యాదవ పర్వతం అంటే యాదగిరి గుట్ట కావచ్చు

."శ్రీశైల మల్లి చక్రేశ్వర .. ఈశ్వరులను సేవించి" అని ఒక కథా సందర్భం (4-218)

7 22 12 రూపసేన అనే స్త్రీ వర్ణనలో కవి నదులను మేళవించడం వింతగానే ఉంటుంది "చంద్రభాగ నిరూఢి సతి మోము రాణించు నెఱికొప్పు కృష్ణవేణి గతిఁగాంచు ... స్తనములుత్తుంగ భద్ర సుడిల దర్పించు .. "ను అని చెప్పబడింది (5-20)

7 22 13 భారతదేశంలోని వివిధగ్రామాలను ఒక సీసమాలికలో కవి కూర్చినాడు. అందులో తెలుగునాడు గ్రామాలు అనుకున్నవి వుండే పద్య పాదాలు క్రింద ఇస్తున్నాను

" రాయదుర్గము గుత్తి రాయవేలూ రానె
గొంది మాహురి కాశి గోలకొండ
ముంగిపైఠిణి ఢిల్లి మునువాయ రాయిరా
కాదు మక్కా మహామూడు మచిలి
బందరు సూరతు బెందరు గోవేరు
నాదవని కళింగ మామూరు వినుకొండ
కొండవీడును నేలకొండపల్లి
పొదిలి తంజాపురం బుచిగిరి కైసూరు

నొత్తూరు చెత్తూరు హంపి తిర్చనాపల్లి
రాజవోల్ గద్వాల రాచనగరు

తిరుతని కాళహస్తి సిసాప మధ్యార్జు
నము తిరుమల నాముకొండ
పాకల పావెరిపాడ మోహనగిరి
చదుహూరు మల్లూరు చాడుకొంత
పొగొంత పాలెం నాగోలు తాళ్ళూరు
మైలాపురము పెద్దమంగళంబు
రామసముద్రంబు రామాపురము జడి
పోర్లిలూరు పెన్నాలి ఘనసరియు
పార్వణహల్లి కొండాపు
శము గౌరి మాయలూ రమరపడు
సంగల్లు కొక్కల్లు వడవకొలను రత్న
గిరి వెలిగోడు తంగెళ్ల దర్శి
కంగొంది తరిగొంత గవవనెత్తము కాశి
శివగంగ కల్లవంది సింహళంబు
ధర్మవరంబును దాడిగోళ్ళ
వామూరు కనిగిరి పాలువాయి
రామచంద్రపుర మాపూరు బెజవాడ
కొండూరు కాంతూరు కోటకొండ" (5-350)

'ఇందరు చీటి' వస్త్రాలు నాడు ప్రసిద్ధి (5-350)
ఈ విధంగా హంసవింశతి కావ్యంలో తెలుగునాడులోని చాలా గ్రామాల పేర్లు, పుణ్య క్షేత్రాల, తీర్థాల పేర్లు ఇవ్వబడినాయి

7 28 కంకంటి పాపరాజు ఉత్తర రామాయణము, విష్ణుమాయావిలాస యక్షగానం కంకంటి పాపరాజు రచనలు ఉత్తర రామాయణ కథా భాగంలో తెలుగు నాడులోని ప్రదేశాల ప్రసక్తి కనిపించదు కృత్యవతారికలో పుష్పగిరి, చిదురూషి అనే ప్రదేశాల ప్రసక్తి మాత్రం ఉంది

7 23 1 కంకంటి పాపరాజుకు కల వచ్చింది హనుమద్భక్తుడు అనే కాంధ్రికృతి ప్రకల్పన సమర్థుం బుష్పగిరి తిప్పనాఖ్యుని సత్పుత్రుని దిమ్మనాఖ్య కవి చంద్రున్ మత్సహశ్రోతఁ బొడ్డనసే పిలిపించి కల విషయం చెప్పినాడు కంకంటి పాపరాజు పుష్పగిరి తిమ్మన ఈ కవికి సహశ్రోత

'కంకంటి అయ్యప్ప . ఓదురూరి సరసయకు దిమ్మమకున్ దనుజామణియై గుణములఁ బెంపొందిన సరసమాంబ బెండిలి' యైనాడు (పీ 38) వీరే కవిని కన్న తల్లిదండ్రులు

'విష్ణుమాయావిలాసం'లో తెలుగు ప్రదేశాల ప్రస్తావన లేదు

7 24 పుష్పగిరి తిమ్మన్న కంకంటి పాపరాజుకు సమకాలికుడు, సహ శ్రోత, పుష్పగిరి తిమ్మన ఇతని కృతి సమీరకుమార విజయం ఈ కవి నెల్లూరి మండలంలోని మోడెగుంట (కొవ్వూరు తా) అయినట్లు నెల్లూరి మండల చరిత్ర సంగ్రహంలో వ్రాయబడిందట 16

సమీరకుమార విజయంలో కనిపించే తెలుగు ప్రదేశం కవి యింటిపేరైన పుష్పగిరి ఒకటే కడప జిల్లాలోని పుష్పగిరి కావచ్చు

'అల పుష్పగిరి యప్పనార్యున కొబళాంబరుసు సుపుత్రుండు సరసగుణ యుతుండు వరతిమ్మ నాహ్వయుడ' (1-12) అని కవి స్వవిషయం చెప్పుకొన్నాడు

7 25 కూచిమంచి తిమ్మకవి కూచిమంచి తిమ్మకవి బహు కావ్యకర్త ఆ కావ్యాల్లో అచ్చతెనుగు రామాయణం, కుక్కుటేశ్వర శతకం, నీలాసుందరి పరిణయ కావ్యం ఉన్నాయి

అచ్చ తెనుగు రామాయణంలోనూ, నీలాసుందరీపరిణయంలోను, అవతారికా భాగంలో దెందులూరు, కూచిమంచి అనే గ్రామాల ప్రసక్తి మాత్రం కనిపిస్తుంది కుక్కుటేశ్వర శతకంలో పై రెండు గ్రామనామాలతో పాటు అహోబలం, కాళహస్తి, పీఠికాపురం, భద్రగిరి, భీమేశ్వరం, వేంకటాచలం, శ్రీకూర్మం, శ్రీశైలం, సింహాచలం అనే క్షేత్రాల ప్రసక్తి ఉంది.

కవి స్వస్థలం చంద్రమపాలెం గోదావరి జిల్లాలోని పీఠికాపుర సంస్థానంలోని 'కందరాడ' గ్రామానికి కరణంగా ఉండి, అక్కడే కాపురముండినాడు కవి వంశీయులు ఇప్పటికీ చంద్రమ పాలెంలో ఉన్నారట12

లోపాలను హేళన చేస్తూ చెప్పే సందర్భంలో "అబ్బబ్బా కిందపడప్పయ్య తీర్థాన
లింగము కిస్తి పోరెదుప్పు" (పద్యం-25) అన్నాడు అప్పయ తీర్థం అంటే
సింహాద్రి అప్పని తిరునాల కావచ్చునేమో!

ఈవిధంగా కూచిమంచి తిమ్మకవి కుక్కుటేశ్వర శతకంలో నేటికీ పుణ్య
క్షేత్రాలుగా ఖ్యాతి కెక్కిన కొనియాడబడే శైవ, వైష్ణవ క్షేత్రాలను తెలిపినాడు

7. 26 గోగులపాటి కూర్మనాథకవి ఈ కవి రచించిన 'సింహాద్రి
నారసింహ శతకం' వ్యాజస్తుతి శతకాల్లో శ్రేష్ఠమైనదిగా కీర్తిగడించింది 'వైరి వర
రంహ సింహాద్రి నారసింహా' అని శతక మకుటం

ఆంధ్ర దేశంలో సింహాచలం ప్రసిద్ధ నృసింహ క్షేత్రం తురకదండు ఆంధ్ర
దేశంపై దాడిచేసి అల్లకల్లోలం చేస్తూ పొట్నూరు, భీమసింగి, జామి, చోడవరం మొద
లైన గ్రామాలలోని దేవాలయాల రూపుమాపి సింహాచలాన్ని ముట్టడించింది ఆలయ
మండపాల్లో గోహత్యలు గావించడం, బ్రాహ్మణాదులను, స్త్రీలను అవమానించడం
విచ్చలవిడిగా చేసినారు కూర్మనాథకవి ధర్మ సంరక్షణకు సిద్ధం కమ్మని సింహాద్రి
నారసింహస్వామిని చురుకుమాటలతో ప్రోత్సహించి, నిందించి, కటూక్తులాడి గుడి
ముందు ఒంటికాలిపై నిలిచి 68 పద్యాలను చెప్పినాడు నృసింహస్వామి కందిరీగల
తుట్టెను లేపినాడు తురకలు చెల్లాచెదురై పారిపోయినారు 68 పద్యం మొదలుకొని
స్వామిని స్తుతిస్తూ పద్యాలు చెప్పినాడు కవి[14] సింహాద్రి నారసింహశతకంలో కనిపించె
తెలుగునాటి ప్రదేశాలు తీర్థం కవి – అంతర్వేది, గోగులపాడు, చోడవరం జామి,
పడమల / శేషాద్రి, తుమ్మెదలమెట్ట పొట్నూరు, భీమసింగి, వైశాఖపురం కొండ
సింహగిరి / సింహాచలం / సింహాద్రి, గంగాధారాతీర్థం అనేవి

7 26 1 పొట్నూరి కోదండరాముడు, భీమసింగిగోపాలుడు, జామి జనా
ర్దనుడు, చోడవరం, కేశవుడు ఎక్కడో పోయి దాక్కున్నారు నీవు దాక్కో
స్వామి! అని హేళన చేస్తున్నాడు చూడండి – కవి ఈ పద్యంలో

"పొదంలో డాగెనో పొట్నూరులో నున్న రమణీయ కోదండ రామమూర్తి
యెక్కడి కేగెనో యెఱుగంగ రాదుగా వసు భీమసింగి గోపాలమూర్తి,
సాధ్వసోద్వృత్తి నెచ్చటి కేగి యుండునో జామి జనార్దనస్వామి మూర్తి
యెన్నిపాట్ల బడుచున్నాడో చోడవరంబులో గేశవరాయమూర్తి,

నిపిడ యవనుల భయ శంక నీవు నింక బయల కగపడకుండుమీ ప్రక్కనున్న
గాయ మిప్పటికిని మానదాయె నయము, వైరి. " (పద్యం-7)

7 26 2 "నీవు ఆలస్యం చేస్తే తురకలు నీకొండెక్కి భక్తుల్ని మర్దిస్తారు గాంగధారా తీరంలో ఉండే మంటపాల్లో కల్లు సారా తాగుతారు నీ వంటశాలలో మాంసం వండుకొని ఉంటారు నీ గుడిలోనే స్త్రీలను అవమానిస్తారు పౌరుషంతో తురకల్ని పార దరుము!" అని ఉద్బోధిస్తున్నాడు కవి ఈ పద్యంలో

"నీ కొండపై నెక్కి నియతు లౌ భక్తులఁగొట్టి నానావస్థఁ బెట్టకుండ
గాంగాధరా తెరకిలిత మండపముల మద్యపానము జేసి మలయకుండ
నీ వంట శాలలో నిశ్శంకతో మాంస ఖండము వ్రేండుగా వండకుండ
నీ గుడిఁ జొచ్చి దుర్నీతిఁ గామాంధులై పరవధూటుల భంగపఱుపకుండఁ
బౌరుషంబున దురకలఁ బారఁదరుము పోటరాడిల మొత్తని నేఁ లేని
మూడు కాళ్లను నడుమ నిర్మూలితాంహ వైరి ." (9 వ పద్యం)

7 26 3 ఓ స్వామీ! తళతళలాడే కంబాలతో, పంకశిఖరంతో, చక్కని బొమ్మలతో గుళ్ళు గోపురాలు, గంగధారా అమృతజలాలు ఎంతో శ్రమపడి సృష్టించుకున్నావు ఊరుకున్నావా నీ యిల్లు నీవే చెడగొట్టుకుంటావు అని హెచ్చరిస్తున్నాడు ఈ పద్యంలో దేవాలయ శిల్ప సౌందర్యం గోచరిస్తుంది ఇదే పద్యంలో—

"దర్పణాకృతి తళతళలాడు కంబాలు పంచై చెలంగు దేవా హారంగు
చెప్పఁజూపఁగ రాని యొప్పైన సుప్పరం బప్పళించెడు పంక కొప్పు దొప్ప
చిత్రవిచిత్రమౌ చిత్రంపుబొమ్మలఁగలుగు చక్కని గుళ్లు గోపురములు
నమృతోపమానమై యలరారు గాంగధారాముఖ్య సకల ధారాజలంబు
నెంత ముచ్చటపడి సృజియించినావో స్వామి యిల్లు చెడగొట్టుకొనకు
నన్నేలినయ్య
ఘన తురుష్కులఁ బడగొట్ట మనసుఁబెట్టు వైరి " (12 వ పద్యం)

7 26 4 ఓ సింహాద్రి నారసింహా! నీవు శత్రువులను కొట్టకుంటా 'సింహగిరి' గుహాలో దాగితే పిరికివాడనుకుంటారు నీలాద్రికి వెళ్ళిపోతే మండి పాతంటారు (జగన్నాథస్వామిని మొండి జగ్గడంటారు) భక్తులను పోషించలేక వెంకటాద్రికి వెళితే లోభివంటారు అంతర్వేదికి వెళితే ఉండవిడివి అంటారు ఆ నిందలు పడకుండా శత్రువులను తరిమివెయ్యి స్వామీ అంటున్నాడు ఈ భక్తకవి

అచలఁగొట్టక సింహగిరి గుహ డాగిన నవని నిన్ ఏటికివాఁడందురయ్య
నీవు రక్షింపక నీలాద్రి కేగిన నవని సిన్మోండివాఁడందురయ్య
పోషింపఁగా లేక శేషాద్రి కేగిన నతి లోభివనుచు నిన్నందురయ్య
లగ నాదరింప కంతర్వేది కేగిన సత్యాగ్రుఁడంచు నిన్నందురయ్య
నాధ ! యిటు లోకనటనంబౌనయ్య నీకు నహహా నిందలు వచ్చును
నవియు విడిచి

మొడ్డుకొనబోకు వెసఁబ్రోవు మూర్విజపల వై" (పద్యం-50)

తురకదండు ముంచుక వస్తున్నది అందుకే "భవదచల పాదగతులైరి యవనుల యయొ" అని బెంబేలు పడుతున్నాడు కవి ఇంకా ఆలస్యం ేయకు మహాప్రభో! అంటూ (పద్యం-55)

7 26 5 స్వామి కారుణ్య దృష్టితో పంపగా "పారశీకుల దండుపై కొండలోనుండి గండు తుమ్మెదలు . కల్పాంతమున మిన్ను గప్పి భీకరమైన కాఱు మెఘంబులు గవిసినట్లు దాకి భోషన రక్తధారలు గుయఁగాఁగఁ అవి నెత్తురు పీల్చి కండల్లె నూడిపడనుక్కు మీూతుల చింపి చెంకాడి వధియించి"నాయి (68వ పద్యం)

అచల పరిమార్చి వైశాఖపుర సమిపగిరి బిలంబున డాగె బంధరములెల్ల అది మొదల్ తుమ్మెదలమెట్ట యండ్రు దాని" (70వ పద్యం) అని కవి వివరిస్తున్నాడు

7 26 6 " కవితిరుమల పెద్దింటి ధర సంపత్కుమారార్య
సద్వేంకటాచార్య శిష్యుడు గోపలపాటి కులజ
గౌరమాంబికాశ్రిత బుచ్చనామాత్య వరపుత్రుకూర్మదా
సాఖ్యుఁడ'అని స్వవిషయం చెప్పుకొన్నాడు (103వ పద్యం)

పై విధంగా గోగులపాటి కూర్మనాథకవి సింహాద్రి నారసింహాశతకంలో యవనులు చేసిన దుండగాల్ని, నాటి దేవాలయాలు పడిన భంగపాట్లను వర్ణించినాడు

7 27 ముప్పిరాల సుబ్బరాయకవి ప్రద్యుమ్న చరిత్రము, ముపిరాల సుబ్బరాయకవి రచించిన ప్రబంధం ఈ కావ్యం 1730-70ల మధ్య రచింపబడిం దని నిర్ణయించడమైంది ఈయన నెల్లూరు నివాసి15 ఈ కావ్యంలో కనిపించే తెలుగునాటి ప్రదేశాలు ఆంధ్ర, ముప్పిరాల

7 27 1 రుక్మవతీ స్వయంవరానికి వచ్చిన రాజులలో ఆంధ్రదేశపు రాజు కూడా ఉన్నాడు ఒకవాణి పరిచయం చేస్తున్నది రాజులను రుక్మవతికి "హరిబలో ద్గ్రుడీత దంధాళిశనేత ధైర్య హేమాద్రి యీతడు ద్రవిడ భర్త" (6–14) అని "శ్రీకర ముప్పిరాల కులబంధు సుధాకర సుబ్బరాయ కృత సూత్న సుపద్య వస ప్రసూన శాస్త్రోక మరందబిందువులు సూరి జనాళులు తృప్తి మీరగా నాలి తీర గ్రోలుడు" (1–1) అంటున్నాడు కవి

ఈ విధంగా ప్రద్యుమ్న చరిత్రకావ్యంలో ఆంధ్ర, ముప్పిరాల అనే తెలుగు ప్రదేశాల ప్రసక్తి మాత్రం ఉంది

7 28 గట్టు ప్రభువు 'కుచేలోపాఖ్యానము' గట్టు ప్రభువు రచన 16వ శతాబ్దంలో ఉండిన వాడు నెల్లూరు మండలవాసి 16 కుచేలోపాఖ్యాన కావ్యంలో కనిపించే తెలుగు ప్రదేశం 'గట్టు' శ్రీపర్వతం (శ్రీశైలం) అనే ఒకటి మాత్రమే

"భ్రమరాంబికావర ప్రవర దివ్యకవిత్వ విద్యా ప్రవీణత వెలసినాడు". . . . . . "శ్రీకంధర మల్లికార్జున శ్రీపదాబ్జ మత్త భృంగాయమాన స్వాంతసుందర గట్టు ప్రభు నామధేయ విఖ్యాత యశుడ" అని కవి స్వవిషయం చెప్పకొన్నాడు గట్టు ఒక గ్రామం పేరే

గట్టు ప్రభువు కావ్యంలో కవి ఇంటిపేరు గ్రామనామం కవి భజించిన శ్రీశైల వాసుని ఆ రెండు పేర్లు కావ్యంలో కనిపిస్తాయి.

7 29 రత్నాకరము అప్పప్పకవి : 'శశిరేఖా పరిణయము' రత్నాకరము అప్పప్పకవి రచన ఈ కావ్యంలో ప్రసక్తికి వచ్చిన తెలుగు ప్రదేశాలు రెండు ఆంధ్ర, పెనుకొండ అనేవి

శశిరేఖాపరిణయానికి వివిధ రాజ్యాల రాజులు విచ్చేసినారు అందులో 'ఆంధ్ర రాజు కూడా ఉన్నాడు "వత్స మత్స్య కరూశాంధ్ర వసుమతీ - లవని గాంచింప వచ్చిరా హస్తిపురికి ?" అని కవి వాక్కులు

ఘటోత్కచుడు శశిరేఖ రూపుదాల్చినాడు నిజమైన శశిరేఖకంటె ఎక్కువగా సిగ్గులు ఒలకబోసినాడు ఆ సందర్భంలో "పెనుకొండ తలమీదబెట్టిన చందాన శిరమెత్త నేరవా సరసిజాక్షి" అని కవి చమత్కారంగా అన్నాడు ఇక్కడ ఆంధ్ర దేశంలో ప్రసిద్ధమైన పెనుగొండ ధ్వనిస్తున్నదేమో • మరి

రామలింగేశ్వరస్వామితోపాటు 'శేషకుధర' ధారుణి నిలయుడైన శ్రీవేంకటేశ్వరున్ని స్తుతించినాడు ప్రథమాశ్వాసాది పద్యంలో "శ్రీరామా కుచమండల సారతర పటీర పంకచర్చిత వక్షా కార సుదారి సితచ్ఛద ధారాధర ధారుణి నిలయా" అని కవిస్తుతి

7 31 3 రామలింగేశ శతకం 'రామలింగేశ రామచంద్రపురవాస' అని ఈ శతకమకుటం ఈ శతకంలో కొండ, రామచంద్రపురం అనే తెలుగు ప్రదేశాల ప్రసక్తి ఉంది తనదు చెల్లెలి వొద్ద భూదపునికిచ్చి యతనిపలన సిరిగాంచునంత కంటె సారమై రామ కొండ దాసరితనంబు అంటున్నాడు కవి 'రాజులకిచ్చినా ఒకచే రాళ్ళకిచ్చినా ఒకచే – అని నామెత కూడా ఉంది 'కొండ' దాసరి అంటే ఇక్కడ తిరుమలకొండ దాసరే కావచ్చు ప్రతి పద్యం చివర రామచంద్రపురవాస అనే మకుటంలో రామచంద్రపుర ప్రసక్తి ఉంది

పై విధంగా తిరుమలకొండ, రామచంద్రపురం అనే రెండు పదేశాలు మాత్రమే ఈ కవిలో చోటుచేసుకున్నాయి

7 32 దక్షిణాంధ్ర యుగ సాహిత్యానికి సంబంధించిన కొన్ని ముఖ్యాంశాల్ని ఇక్కడ చెప్పుకొందాం

కృష్ణరాయల విజయాల్ని, గెలిచిన దుర్గాల్ని తొడ్పడిన సామంత రాజులేలే ప్రదేశాలను వివరంగా 'రన్నింగ్ కామెంటరీ' లాగా 'రాయవాచకం' వర్ణించింది కావ్యానికి అవసరమైన అలంకారాల్తో అదే విషయాన్ని 'కృష్ణరాయ విజయం' తెలుపుతుంది అలాగే అండుగుల వెంకయ్య 'రామరాజీయం' కూడా రామరాయల విజయాలను విరుదాలను చెప్తుంది అందులో ఎన్నో తెలుగుదేశ స్థలాల పేర్కొనబడినాయి

సారంగపాణి పదాల్లో పరిసర ప్రాంతాల ప్రాధాన్యం స్పష్టంగా కనిపిస్తుంది కవి కాలంలో ఏయే ఊళ్లు దేనికి ప్రసిద్ధో తేటతెల్లంగా తెలుస్తుంది

రఘునాథనాయకుడు 'వాల్మీకి చరిత్రలో' సప్తర్షి తీర్థసంచర్యన నెపంతో దక్షిణ దేశంలోని ముఖ్య క్షేత్రాల పవిత్రతను, ప్రకృతి సౌందర్యాన్ని ప్రతిబింబించినాడు కథలో అవసరం ఉన్నా లేకున్నా ఆంధ్రదేశ ప్రసక్తి తీసుక రావడం తెలుగు దేశంలోని పుణ్యక్షేత్రాల్ని కవి మాహాత్మ్యాలకు మాపించడం సాధారణమైపోయింది

## ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

అయ్యలరాజు నారాయణామాత్యుని వంటి వారు తెలుగునాడులోని ఎన్నో ఊర్లను, ఏర్లను, క్షేత్రాలను, తీర్థాలను కావ్యంలో పేర్కొన్నారు

గోగులపాటి కూర్మనాథకవి వంటివారు నాటి తురకల దాడిని, దేవాలయాలకు హిందువులకు పట్టిన దుర్గతిని ప్రతిభావంతంగా చిత్రించినారు

## సూచికలు:

1. కకుత్స్థ విజయము, పీఠిక, డా॥ జి నాగయ్య, పు XIX
2. ,, ,, పు II
3 ,, ,, పు XX
4 మూర్తిత్రయోపాఖ్యానము, పీఠిక, తిమ్మావజ్ఝల కోదండరామయ్య, పు 15,23
5 క్షేత్రయ పదములు – సంపాదకుడు గిడుగు వేంకటసీతాపతి, పు
6 సౌగంధికా ప్రసవాపహరణము, ఉపోద్ఘాతము, కుందూరి ఈశ్వరదత్తు, పు 9
7 శుకసప్తతి, చిలుక పలుకులు, డా॥ బి రామరాజు, పు XXIX
8 ,, ,, పు XXXII
9 అనర్ఘరాఘవము, ఉన్మేషము – కేశవపంతుల నరసింహశాస్త్రి, పు 1
10 ,, పు. XVI-XVII
11 ,, పు 1
12 కృష్ణరాయ విజయము, ఉపోద్ఘాతము, డా॥ సి వి రామచంద్రరావు
13 ఆంధ్ర సంస్థానములు–సాహిత్య పోషణము డా॥ తూమాటి దొణప్ప పు 86
14 సారంగపాణి పదసాహిత్యం, డా॥ యస్ గంగప్ప
15 సీతాసుందరీ పరిణయము పీఠిక, మునిగోష్టి రామన్న
16 పక్కిపేశ్వర శతకం, పీఠిక
17 సింహాద్రి నారసింహ శతకము, పీఠిక, శేషాద్రి రమణకవులు, పు 211-212
(భక్తి రస శతక సంపుటము)
13. ప్రద్యుమ్న చరిత్రము, ఉపోద్ఘాతం, డా॥ జీరెడ్డి చెన్నారెడ్డి, పు VII
19 కుచేలోపాఖ్యానము, పీఠిక, III, IV
10 రాధామాధవ సంవాదము, పీఠిక, పు 1
21 ఉపోద్ఘాతము – మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, పు 4

# 8

# ఉపసంహారం

8 క్రీ శ 1053 ప్రాంతం నుండి 1775 వరకు రచింపబడిన వందాశరవై ఆరు కావ్యాలలో పరిశీలించగా లభించిన స్థలనామాల ఆధారంగా ఈ గ్రంథం రచిత మైంది ఈ పుస్తకంలోని స్థలనామ పరిశీలనలో నేను ముఖ్యమైన వనుకున్న కొన్ని అంశాల్ని కింద పొందుపరుస్తున్నాను

8 1 కావ్యాదిన శ్రీకారముంచడం శుభప్రదమని నన్నయ ఏ సుముహూర్తాన "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ .." అని పలికాడో గాని అప్పటినుండి శ్రీకారం ఆదియందుంచని కావ్యం అరుదంటే అతిశయోక్తి కాదు ఆ కారణంవల్లే కావ్యాల లోని దైవ, వ్యక్తి నామాలకే గాక స్థలనామాలకు కూడా 'శ్రీ' మొదట చేర్చడం జరిగింది అలా 'శ్రీ' మొదట చేర్చిన స్థలాల పేర్ల పట్టి ఈ క్రిందిది

శ్రీకాకుల / శ్రీకాకుళ, శ్రీ కాక్వేటి నగరము, శ్రీకాళద్వీప / శ్రీకాళహస్తి / శ్రీకాళహస్తిగిరి ప్రదేశము, శ్రీకుధరము / శ్రీకుల్యాము, శ్రీకూర్మము, శ్రీగిరి, శ్రీతెనాల్యాగ్రహారము, శ్రీదక్షవాటి, శ్రీ దూపూరు, శ్రీధాన్యకటకము / శ్రీధాన్యవాటీపురీ, శ్రీనగము / శ్రీపర్వతము / శ్రీభూధరము, శ్రీమగచల, శ్రీమటింగంటి, శ్రీమల్లికార్జున పురము, శ్రీ మహానగము, శ్రీమాహురనగరము, శ్రీముప్పపురి, శ్రీయహోబలము / శ్రీయౌబలము, శ్రీరాజమహేంద్రి, శ్రీరామచంద్రపుర / శ్రీరామాచల, శ్రీవీరతిరుపతి, శ్రీవెల్లఘూడి, శ్రీవెంకటగిరి / శ్రీవెంకటాచలము / శ్రీవేంకటాద్రి, శ్రీశైలము శ్రీసప్తగోదావరంబు, శ్రీసర్పపురము, శ్రీ సింహాచలము

మల్లికార్జునుడు, వెంకటేశ్వరుడు వెలిసి వుండేది కొండలపైనే శైవులు 'కొండ' అని శ్రీపర్వతాన్ని, వైష్ణవులు 'కొండ' అని తిరుమలను పిలుస్తారు శ్రీశైలానికి కుధరం, గిరి, పర్వతం / ప్రబ్బతం అని పేర్లున్నాయి తిరుమలకు 'కొండ' అని పేరు వాటికి పవిత్రతను ఆపాదించేందుకే శ్రీ, దాని సమానార్థకం 'తిరు' చేర్చబడినాయి శ్రీనగం, శ్రీపర్వతం, శ్రీశైలం, తిరుమల తిరుకాళత్తి, తిరుకాళహస్తి

8. 1. 1 'శ్రీ' కి మతుప్ ప్రత్యయం 'మహ' / 'మహా' 'వీర' అనే విశేషణాలు స్థలనామాల ముందున్నాయి శ్రీమదహోబలము, శ్రీమదోరుగల్లు; శ్రీమద్దక్షిణ కాశికాపురము, శ్రీమద్వేల్లముకొండ, శ్రీమన్మల్లికార్జున ముఖమండపంబు శ్రీమహా మల్లికార్జున నగర భూషిత ప్రాసాదము, శ్రీమహానగము

8 1 2 స్థలనామ మధ్యంలో 'శ్రీ' కలపడం ఉదా—॥ కారెమ శ్రీపురి

8 1 3 'శ్రీ'కి తద్భవం సిరి 'సిరి' స్థలనామం మొదటవుండే సందర్భాలు సిరికాకుల, సిరిగిరి 'సిరి' తమిళంలో 'చిరి' అవుతుంది 'చిరిగిరి' అని తమిళ ప్రయోగం.

8 1 4 'సిరి' కి బహువచనం 'సిరులు' 'సిరుల' అనే విశేషణం 'దేవర కొండ'కు మరింగంటి సింగరాచార్యులు కలిపినాడు ఇలాంటి ప్రయోగం ఇదొక్కటే

8 2 శ్రేష్ఠతా వాచకాల్ని, దివ్యత్వాన్ని బోధించేపదాలు స్థలనామాలముందు లేదా చివర చేరినాయి దివ్య, సత్, వీర, ఇంద్రము, వరము అలాంటి విశేషణాలు దివ్యాది కూర్మంబు, నూటయెనిమిది దివ్య తిరుపతులు, సద్వేలగపూడి, వీరమెడపి, శ్రీ గిరింద్రంబు / శ్రీనగేంద్రంబు, పక్షవాటిపురవరము

8 3 ఒకే పేరుతో ఉండే తీర్థం పలుక్షేత్రాలలో ఉన్నట్లు వేర్వేరు కవులు చెప్పినారు పాపవినాశనం అనే పేరున్న తీర్థం శ్రీశైలం (పు 37), త్రిపురాంతకం, సిద్ధవటం (పు 42) అలంపురం (పు. 46) తిరుమల (పు 182) క్షేత్రాలలో వున్నట్లు వర్ణితమైంది

8 4 తెలుగునాడులోని శివక్షేత్రాలను 'కాశి' తోను, కైలాసంతోను సమానంగా కావ్యాలలో చెప్పడం ప్రసిద్ధం

శ్రీశైలం దక్షిణ కైలాసమని సోమన (పు 24,25), శ్రీ కాళహస్తి వద్దనున్న కొండ దక్షిణ కైలాసం, దక్షిణ కైలాసగిరిగా ధూర్జటి (పు 204,205) వర్ణించినాడు

పలుచోట్ల ద్రాక్షారామాన్ని దక్షిణ కాశిగా వర్ణించిన శ్రీనాథుడే ఒకచోట కాళహస్తిని 'శ్రీమద్దక్షిణ కాశికాపురం'గా చెప్పడం విశేషం అలంపురం సమీపంలో కృష్ణాతీరాన ఉన్న 'ప్రాతకూరు' ను దక్షిణ కాశిగా పెద్దల తిమ్మ భూపాలుడు వర్ణించినాడు

8 5 తెలుగునాడులోని వైష్ణవక్షేత్రాన్ని ద్వితీయ వైకుంఠం లేదా తిరుపతిగా కవులు చిత్రించినారు అహోబలం ద్వితీయ వైకుంఠం (పు 79) నూటెనిమిది తిరుపతుల్లో అహోబలం, మంగళగిరి, వెంకటగిరి, శ్రీకూర్మం, సింహాచలం (పు 246 247) వున్నాయి

8 6 భారతీయులకు గంగానది అంత పవిత్రమైన నది మరొకటి లేదు గంగానది మందాకినిగా స్వర్గలోకంలో భాగీరథిగా భూలోకంలో భోగావతిగా పాతాళ లోకంలో ప్రవహిస్తూ త్రైలోక్య పావిత్ర్యతను సంతరించుకొనింది గంగానదీ పావనత్వాన్ని ఆరోపించేందుకు తెలుగునాడులోవుండే నదులకు, మడుగులకు గంగతో సారూప్యం చెప్పడమో గంగానదే అనడమో స్వర్గంగ దిగివచ్చి ఈ నది అయింది అని వర్ణించడమో కావ్యాల్లో కనిపిస్తున్నది

గోదావరిని 'గౌతమగంగ', 'గౌతమీ గంగ', 'గంగ' 'గంగమ్మ' అని, వృద్ధ గౌతమిని, 'వృద్ధగంగ' అని సువర్ణముఖిని 'సువర్ణముఖరీ గంగానదరత్నము' అని నాగులేటిలోని ఒక మడుగును 'ఘనగంగ తా వచ్చి కలసిన మడుగు', 'గంగధార' 'జాహ్నవి మడ్గు' అని, సింహాద్రి మీద తీర్థాన్ని 'గంగధార', అని కవులు వర్ణించినారు

శ్రీముష్ణంలోని నిత్యపుష్కరిణిలో తూర్పుభాగాన 'గంగ' వున్నదని శ్రీశైలం వద్ద నదికి 'పాతాళగంగ' అని, తిరుమలమీది ఒక తీర్థానికి 'ఆకాశగంగ' అని, నరసింహుని పాదసేవ కోరిన మందాకిని దివినుండి భువికి అవతరించగా స్వామి 'భవనాశని' అనే పేరుంచినాడని కావ్యాలు చెబుతున్నాయి

శివుడు పంపగా బ్రహ్మ వెంట "సువర్ణశోభా విభవంబుతో బహుళ భంగ మహా ముఖరత్వ సంపదన్ దేవనది స్ఫురంబు" చనుదెంచింది అదె సువర్ణముఖరీ నది

8 7 తెలుగు స్థలనామాల్ని సంస్కృతీకరించడం వాటికో గొప్పతనాన్ని ఆపాదించడంగా కవులు భావించినారు తెలుగు సంస్కృత పదాల అర్థాలకు ఒక్కోసారి పొంతనగూడా లేకపోవచ్చు

ఇసుక పట్నం వైశాఖపురం, ఏలేరు=హేలాసాని, ఓమూరు=ఓంకారము/ ఒంకారపురము | ఓంకారపురి, ఓరుగల్లు=ఏకచక్ర నగరం | ఏకశిలానగరం, కందు

కూరు / కందూరు / కంద్దూరు = కందపురం / కంచసం| శితాచలం / తారభూమి ధరం/ కొండపల్లి దుర్గం = ధరణి ధృద్దుర్గం, గోదావరి = గౌతమగంగ / గౌతమి, చంచవోలు, సనదప్రోలు = ధనదప్రోలు / ధనదపుర^ / ధనదుపురం, వెయ్యేరు = బాహుద, దేశంబు తెన్గు = త్రిలింగదేశం, నల్లూరు / నెల్లూరు = విక్రమసింహ నగరం / సింహపురం / సింహపురి / సింహవిక్రమ నగరం, నాగులేరు = సర్పాఖ్యతటిని, పలివెల = పల్వాల పురం / పల్వాలపురి, పాలకొల్లు = క్షీరారామం, పాలేరు = క్షీర తరంగిణి, పెన్న = సుప్రయోగ, బొమ్మరాయపల్లి = బ్రహ్మరాయపురి మొగలేరు = కేతకీనది, సంపర = సాంపరాయ / సాంపరాయణ గ్రామం / సాంపరాయ పురం

8-8 సంస్కృతంలో వుండే పేర్లను తెలుగుచేయడం మరోవిశేషం ఉదా॥ శ్రీశైలాన్ని 'కలిమి కొండ'గా కొరవి గోపరాజు తెనిగించినాడు

8-9 ఆయా స్థలాలకు ఆ పేర్లు ఎలావచ్చినాయో కవులు వర్ణించినారు వాటిలో కొన్ని

8-9-1 నదిలోని ఇసుక బంగారు వర్ణంలో వున్నందువల్ల స్వర్ణముఖి అనే పేరు వచ్చిందని ఒక అభిప్రాయం "సువర్ణ శోభావిభవంబుతో బహుళ భంగ మహా ముఖరత్వ సంపదన్ దెవనది ఝరంబు" దిగివచ్చి నందువల్ల 'సువర్ణముఖరీ' అనే అనే పేరుంచినాడు బ్రహ్మ 'స్వర్ణముఖి' అని కూడా కవి ఒకచోట ప్రయోగించి నాడు నిజానికి నది గట్లవెంబడి మొగలిపొద లెక్కువగా వున్నందువల్ల 'మొగలేరు' అనే పేరు వచ్చింది దాని సంస్కృతరూపం 'కేతకినది' రాయలసీమలో చాలా మటుకు పెద్దనదులు లెనందువల్ల 'ఏర్లు' గానే పిలుస్తుంటారు ఉదా॥ వెయ్యేరు పెన్నేరు, మొగలేరు-ఇలా వాటిని సంస్కృతీకరించినపుడు బాహుదానది, సుప్రయోగనది కేతకినది అయినాయి

8 9 2 గోదావరి ఏడుపాయలుగా చీలి ఆపైన సముద్రంలో కలుస్తుంది అందుకే సప్తగోదావరం అనే పేరు వచ్చింది భీమలింగ ప్రతిష్ఠకోసం సప్తర్షులు గోదావరిని తెచ్చినారు కాబట్టి సప్తర్షి మునిసంధువు, సప్తతాపస వాహిని, సప్త గోదావరి అయిందని శ్రీనాధుని పలుకులు

8 9 3 పర్వతుడు తపస్సు చేసి శంకరుని తనమీద నెలకొమ్మన్నాడు ఆ పర్వతుడే శ్రీపర్వతం' అని సోమన నిర్వచనం

8 9 4 క=బ్రహ్మచేత, ఆకుల=పరివ్యాప్తమైనది కాబట్టి కాకుల/కాకుళ అయిందని వివరణ ఆకులమైన చిత్తంతో బ్రహ్మ చూచిన ప్రదేశం కాబట్టి కాకుల మైనది అని భట్ల పెనుమర్తి కోదండకవి వర్ణన. (పు 228-9)

8 9 5 శ్రీరంగనాథుడు "లక్ష్మణ మునిని చూసినాను. కూరేశదేశిక స్వామిని చూచినాను మఱింగంటిని (ఆతర్వాత చూస్తిని) పిలెవ్వ"రనగా ఆ వ్యక్తికి 'మఱింగంటి' అనే ఇంటిపేరు వచ్చింది ఆయన మఱింగంటి సింగరాచార్యుల మూల పురుషుడు అంతకు ముందు వారి యింటిపేరు ఆసూరివారు 'మరికల్లు' అనే పేర్తో మూడు గ్రామాలున్నాయి 'మరికల్లు' ఔప విభక్తిక రూపం 'మఱిగంటి' అయ్యే అవకాశం వుంది.

8 9 6 నరసింహస్వామి హిరణ్యకశిపుని చంపినపుడు "అహో! బలమ్" అని దేవతలు ప్రశంసించినారు అందువల్ల నరసింహస్వామి ఆ క్షేత్రానికి 'అహో బలమ్' అనే పేరుంచినాడని ఎఱ్ఱాప్రెగ్గడ వివరణ

8 9 7 రాజా మల్లన కీర్తిచంద్రికలు వ్యాపింపగా పొంగి, దానామృత శ్రేణిచే పెముగల్లుకు 'త్యాగసముద్రం' అనే పేరు వచ్చిందని కొరవి గోపరాజు వర్ణన

8 9 8 ఖ=విష్ణుపాదం, అద్రి=కొండ, విష్ణుపాదముండే కొండ 'ఖద్రి', ఖదిర వృక్షాలు ఎక్కువగా వున్నందువల్ల 'ఖద్రి' అయింది (పు 283)

8. 10 చెరువుల్ని, బావుల్ని త్రవ్వించి, సముద్రం అనే విశేషణం తగిలించడం, లేదా పెద్ద సరస్సుల్ని సముద్రం అనడం

ఉదా॥ రుద్రసముద్రంబు అనుపేరు. బావియును గాడియును గల్పించి (పు 172), చిలక సరస్సు=చిలక సముద్రం (పు 126)

8 11 అర్థాల్లో మార్పు వచ్చినా లెక్కచెయ్యకుండా పేర్ల మార్పుచేయడం సిద్ధవటంబు, సిద్ధపట్టణము సిద్ధాచలం, భీమనది, భీమరథి ఏకశిలానగరం, ఏకచక్ర పురం, సువర్ణముఖరి=సువర్ణముఖి

8 12 క్షేత్రాల పేర్లు ఎడ్లకు రైతులు పెట్టుకొన్నారు పెంజెల్ల పెద్ద ఇప్పగిరిశ, మహానంది నాథ, మలవరపు గిత్త (పు 137)

8 13 పేరులో కొంతభాగమే చెప్పడం మచిలి (మచిలీ పట్నం) పు 303, నర్మాల (పు 135) నర్మాలపాడు (పు 298)

8 14 ఒకే పేరును పెక్కు నగరాలకు ప్రయోగించడం ఆంధ్రనగరంబు= వేంగి (పు 63) ఆంధ్రనగరం=ఓరుగల్లు (పు 143)

8 15 ఆంధ్ర భాషను 'ఆంధ్రజగతిభాష' అని శ్రీనాథుడు, 'ఆంధ్రదేశ భాష' అని విన్నకోట పెద్దన అన్నారు

8 16 'ఓరుం తెల్గు' అని కృష్ణరాయలు అన్నాడు శ్రీ పర్వతం, కాళే శ్వరం, దాక్షారామం త్రిలింగాలను ఆకరమైనందువల్ల ఆంధ్రదేశం 'త్రిలింగదేశం' అయిందని విన్నకోట పెద్దన (పు 189)

8 17 తరుణి అంగాల్ని తమ ప్రాంతాలలోని కొండలతోను, కనుమలతోను పోల్చడం వాగ్గేయ కారుల విశిష్టత

అన్నమాచార్యులు రమణి వదనాన్ని 'సోమశిల కనుమ'గా పిలుదును 'గద్దె గాలి కనుమ'గా, కెమ్మోవిని 'ఎఱ్ఱాల కనుమ'గా, చిత్తాన్ని 'చెంగలసాని కనుమ'గా గుబ్బలు 'గుబ్బలి కొండ కనుమ'గా, 'మంతనాలకనుమమ'గా (?) పోల్చినాడు క్షేత్ర యది కాని ఒకపదంలో సఖియచన్నవలు 'సంగటి కొండలు'గా వుపయించబడినాయి

8 18 వస్త్రాల్ని, భూషణాల్ని ఆయా ప్రాంతాల పేర్లతో కలిపిచెప్పడం, ఆనాడు ఆ ప్రాంతాలయందే ప్రసిద్ధిని తెలుపుతుంది

కామ వరంబులు, సూరవరంబులు=వస్త్రాలు (పు 168) మట్లవారి సీమచీర (పు 254) నారాయణ వనము చీర (పు 296) బందరుచీటి (పు 296, 303) ఉుసి మద్దురవికెలు (పు 305) వొబ్బిలికాయలు (పు 285) బందరు కమ్మలు (పు 296-7) పక్కి పట్టువరహాలు (పు 296)

8 19 వ్యక్తి పేరును సమానార్థక పదాలతో సంబోధించడం విరూరి వెద్రాద్రి, వెదగిరి / వెదాచలమంత్రి (పు 203)గా పిలువబడినాడు

8 20 ఊర్ల, నదుల పేర్లను వాతియాలుగా ప్రయోగించడం ఒక విశేషం కల ప్రశస్తతను "కులము గోదావరి గలిపి" అని ప్రయోగం బోడిగుండ్లు అనడానికి 'తిరుమల కొప్పులు' (పు 284, 294) అని చమత్కారం

8 21 హ్యూయాన్ త్సాంగ్ వర్ణనలో మహాంధ్రదేశానికి 'ధనకటకం' రాజ ధానిగా చెప్పబడింది అదె ధాన్యకటకం "ధరయెల్ల శ్రీ ధాన్యకటకమయ్యె" అని నేతన, "శ్రీ ధాన్యకటకమై చెలువొందె రాష్ట్రంబు అని పింగళిసూరన, "శ్రీ ధాన్య కటకమై చెన్నొందె దేశంబు" అని ప్రౌఢకవి మల్లన వర్ణించినారు ఈ అన్ని సంద ర్భాలలోనూ 'ధాన్యసమృద్ధిగల నగరం' అర్థంలో ప్రయోగించబడినా 'ధాన్యకటకం' పేరు గూడా స్ఫురిస్తున్నది

# I ప్రాచీనాంధ్రదేశ విభాగాలు

క్షితి, క్షోణి, ధాత్రి, గడ్డ, భూమి, భూమండలం, దేశం, నాడు, మండలం, రాజ్యం, రాష్ట్రం, విషయం, సీమ అనేవి ప్రాచీనాంధ్రదేశ విభాగాలుగా చెప్పబడి నాయి ఇవన్నీ దాదాపు సమానార్థకాలు వేర్వేరు కాలాల్లో ప్రచారంలోకి వచ్చినవి ఏయే విభాగాలు ఏ పేర్లతో పిలవబడినాయో క్రింది పట్టి తెలుపుతుంది

1 క్షితి, క్షోణి, ధాత్రి, గడ్డ భూమండలాలు భూమి (9) కృష్ణా సేతు మధ్యక్షితి, త్రిలింగక్షోణి, పల్లెధాత్రి, పల్నాటిగడ్డ, త్రిలింగ భూమండలం, తెలంగాణ భూములు, తెలుగు భూమి, శ్రీశైల భూమి, శ్రీ స్వామి పుష్కరిణీ తీరభూమి (ఇది మాత్రం రాజకీయ విభాగం కాదు)

2 దేశం/సుదేశం (13) పంచనవాలిదేశం, కడమ యిల్వాలిదేశం, కోంగదేశం, కుడువాటికాదేశం, కృష్ణాకూలదేశం, కృష్ణాతీరదేశం, దేశంబు తెలుగు, పల్లెదేశం, పాకనాడుదేశం, వేంగీదేశం, శ్రీగిరి తూర్పుదేశం, శ్రీ మధ్యాంధ్రసుదేశం

3 నాడు (15) అంజినాడు, ఏరువ/ఏరువ, కమ్మనాడు, కాసలనాడు/కాసన్నాడు, జంతున్నాడు, పొప్పనాడు, పలనాడు, పలినాడు/పలునాడు/పల్నాడు/పల్లెనాడు, పాకనాడు, పులుగులనాడు, పొత్తపినాడు, ములికినాడు, మొరసునాడు, వెలనాడు, వేంగినాడు, సబ్బినాటిరాష్ట్రం

4 మండలం (2) ఓర్గంటి మండలం, కొండవీటి మండలం/కొండవీడు మండలం

5 రాజ్యం (7) ఉదయగిరి రాజ్యం, కళింగరాజ్యం, కృష్ణవేణికి దక్షిణపుదిక్కు నడిచే రాజ్యాలు గజపతివారి రాజ్యం, చంద్రగిరి దుర్గరాజ్యం, ధర్మవర రాజ్యం, రాజమహేంద్ర భూభువనరాజ్యం

6 రాష్ట్రం (2) కళింగరాష్ట్రం, సబ్బినాటి రాష్ట్రం

7 విషయం (2) పల్లెవిషయం, వేంగీ విషయం

8 చీమ/శీమ/సీమ (15) అలంపూరుసీమ, కృష్ణానదీతీరసీమ, కొండపీడు శీమ, గజపతివారి శి(సీ)మ, ఘట్టం సీమ, చిత్రగంటి సీమ, జగన్నాథసీమ, దేవరకొండ సీమ, పడమటిసీమ, పలనాటిసీమ/పల్నాటిసీమ, పుట్టపల్లె సీమ ములికినాడు సీమ, రాయలవారిసీమ, వెలనాటిసీమ, సింహాద్రిపర్యంత సీమాంధ్రదేశ

# II. స్థలాల నామాంతరాలు

1 అంధ్రదేశం (22) అంధ్ర, అంధ్రక్షమామండలం, అంధ్రక్షితి, అంధ్ర జగతి, అంధ్రదేశం, అంధ్ర ధరణీ మండలి, అంధ్ర భూమండలం, అంధ్రభూమి, అంధ్ర మండలం, ఆంధ్ర, ఆంధ్రదేశం, ఆంధ్రభూతలం, ఆంధ్ర భూభువనం, ఆంధ్రా, తెలుంగు, తెలుగు భూమి, తెన్గు, త్రిలింగక్షోణి, త్రిలింగదేశము, త్రిలింగ, భూమండలం, వేంగి తెల్గు

2 అహోబలం (11) అహోబలం, అహోబల తీర్థం, అహోబల పర్వతం, అహోబల పుణ్యక్షేత్రం, అహోబలపురి, అహోబలాఖ్యతీర్థం, అహో బిల్గ్రామం, తిరుపతి, ద్వితీయ వైకుంఠం, శ్రీయహోబలం, శ్రీ అహోబల

3 ఆదోని (5) ఆదవని, ఆదవని దుర్గం, ఆదవానీ దుర్గం, ఆదవాని, ఉదవాని దుర్గం

4 అరవీడు (7) అరవీటి, అరవీటిపురం, అరవీటి, అరిపీటి, అరుపీటి, అరవీటి, అర్విటి

5 ఉదయగిరి (9) ఉదగిరి, ఉదయగిరి, ఉదయశైలం, ఉదయాచలేంద్రం, ఉదయాద్రి, ఉదయోర్వీధరం ఉద్దగిరి, పూర్వాద్రి, పూర్వావనీభృత్

6 ఉమాధరణీధరం (2) ఉమ ధరణీధరం, ఉమామహేశ్వరం

7 ఎనుములపల్లి (4) ఎనుమలపలి, ఎనుములపల్లి, ఎన్ములపలి, ఎన్ముల పల్లి

8 ఏలేరు (5) ఏల, ఏలేటి, ఏలేఱు, హేలా, హేలాతరంగిణి,

9 ఓంకారు (4) ఓంకారం, ఓంకారపుర పుణ్యక్షేత్రం, ఓంకారపురి, ఓంక్రియా నగరం

10 ఓరుగల్లు (14) అంధ్రనగరం, ఏకశిలానగరం, ఏకశిలాపురం, ఏక శిలాభిధానం, ఓరుగంటి, ఓరుగంటిపురం, ఓరుగల్లు, ఓరంటి, ఓర్గంటి పట్టణం, వోర గంటి, వోరగంట్టి, వోరగంటి, వోరగంట్టి, వోరుగంటి

11 కందుకూరు (7) కందపురం, కందసంశ్రితా చలేంద్రం, కందుకూరి నగరు, కందుకూరి పట్టణం, కందుకూరు, కందూరు, కంధూరు

12 కంబం (3) కంబము, కంబంబుమెట్టు, కంభంబు మెట్టు,

13 కణ్వనది (4) కణ్వ, కణ్వనది, కణ్వవాహిని, కణ్వాపగా

14 కదిరి (3) కదిరి, కదిరె, ఖాద్రి

15 కర్నూలు (7) కందనవోలి, కందనవోలి, కందనవోలు, కందనోలు, కందనోలి మహాపురి, కందనోలు, కందనొలుపురం

16 కర్పూరపురం (5) కర్పూర, కర్పూరపురం, కర్పూరాచలం, కర్పూరాద్రి, ప్రకర్పూరాచలం

17 కర్మారి (4) కర్మనాశేశ్వర తీర్థం, కర్మనాశేశ్వరం, కర్మారి, కర్మారేశ్వరం

18 కళింగ (7) కళింగ, కళింగం, కళింగదేశం, కళింగధరాంగణం, కళింగభూమి, కళింగరాజ్యం, కళింగరాష్ట్రం

19 కాలెమపూడి (5) కాలెమపూడి, కాలెమ శ్రీపురి, కార్యమపురి, కార్యమ పురభూమి, కార్యమపూడి

20. కాళహస్తి (11) కాళహస్తి, కాళహస్తినగరి, కాళహస్తిపురం, కాళహస్తి మహాస్థానం, కాళహాస్తిపురం, తిరుకాళత్తి, తిరుకాళహస్తి, దక్షిణకైలాసం, శ్రీకాళ ద్వీపం, శ్రీకాళహస్తి, శ్రీకాళహాస్తి

21 కాళహస్తిగిరి (18) అంతనదీహారరజత పర్వతం, అమానసస్నాననగం, కలధౌత శైలం, కాలదిగ్భాగ కైలాసశైలం, కాళహస్తి భూధరం జమునిదిక్కు వెండికొండ, జమునిదిక్కు వెండిమల, నిలమహాద్రి, నిరాచలం యమాశ వెండిమల, యామ్యభంగ కైలాసగిరి, దక్షిణాహారరజతాద్రి హేమముఖీకూలస్థకైలాసం

దక్షిణధౌతధరాధరం దక్షిణశ్వేతశైలం దక్షిణరజతక్షితిధరం దక్షిణరజత గిరి దక్షిణరజత శిఖరి దక్షిణ కైలాసగోత్రం దక్షిణ కైలాసధరం దక్షిణ కైలాస ధరణీధరం దక్షిణదిశాకైలాసం

22 కాళేశ్వరం (4) కాళ, కాళేశ్వరం, మహాకాల, మహాకాలేశం

23 కుమారగిరి (8) అరుణాచలం, కుమారగిరి, కుమారగిరి పర్వతం, కుమారగిరీంద్రం, కుమారపర్వతం, కుమారశైలం, కుమారాచలం, కుమారాద్రి

24 కృష్ణానది (24) అసికినీయం, అసికినీ, కృష్ణ, కృష్ణవేణా, కృష్ణవేణి, కృష్ణవేణి మహానది, కృష్ణవేణీ, కృష్ణవేణీమణి, కృష్ణా, కృష్ణాతటినీ, కృష్ణాతటిని, కృష్ణాతరంగిణి, కృష్ణానది, కృష్ణాసము, కృష్ణాభిధాన తటిని, కృష్ణాసరిత్, శ్రీ కృష్ణా కల్లోలవతి, సహ్యగిరి కన్యకా, సహ్యాగిరి నానది, సహ్యజ, సహ్యజా, సహ్యజాతటిని, సహ్యవాహిని, సహ్యవాసంతి

25 కొండపల్లి (5) కొండపలి, కొండపల్, కొండపల్లి, ధరణీ భృద్దుర్గం

26 కోనేరు (6) గరుడవాహనధ్వజ పుష్కరిణి, కోనేరి, కోనేరు, గుహాపుష్కరిణి స్వామిపుష్కరిణి, స్వామిపుష్కరిణి

27 కౌంతేయనది (4 కౌంతెయ, కౌంతేయం, కౌంతెయి, కౌంతేయా

28 గంగధారమడుగు, (4) గంగ తా వచ్చికలసిన మడుగు, గంగాధర గంగధారా, జాహ్నవి మడుగు

29 గరుడాద్రి (4) ఖగాధిప శైలం, గరుడాచలం, గరుడాద్రి, ఫణిద్విషదద్రి

30 గౌదావరి (17) గంగ, గంగమ్మ గౌదారి, గోదావరమ్మ, గౌదావరి గోదావరి, గౌదావరీనది, గౌతమకన్యా, గౌతమకన్యాతటిని, గౌతమగంగ, గౌతమి గౌతమీ, గౌతమీగంగ, గౌతమిగంగా, గౌతమితటిని, గౌతమితటిని, గౌతమిమహానది గౌతమిసింధు, త్ర్యంబకతనూజ, త్ర్యంబకాచలకన్యక, దక్షిణగంగ, మహాగౌదావరి మహాగౌదావరీ వాహిని

31 తిరుమల (31) కలిగ్నవైకుంఠం, కొండ, తిరుమల, తిరుమలకొండ, తిరు వేంగడం, తిరువేంకటాద్రి, పన్నగసార్వభౌమాచలం, వెంకటాచలం, వెంకటా చలం, వెంకట, వెంకటగిరి, వేంకటగిరి, వెంకటగిరిగ్రామం, వేంకటగ్రామం, వెంకటనగం వెంకటపతిశరణం, వేంకట ధర్త వసించు కొండ, వెంకట భూమి, వెంకటమహీధరం, వృషాచలం, వెంకటాద్రి, శేషగిరి, శేషనగం, శేషభూధరం, శేషభూమిభృత్, శేషశైలం, శేషాచలం, శేషాద్రి, శ్రీ వేంకటగిరి, శ్రీ వెంకటాచలం శ్రీ వెంకటాద్రి

32 దక్షారామం (33) దక్షనగరం, దక్షపురం, దక్షపురి, దక్షవాటం, దక్షవాటపట్టణం, దక్షవాటి, దక్షవాటిక, దక్షవాటికాకటకం, దక్షవాటిపురం, దక్షవాటి పురి, దక్షవాటీ మహాస్థానం, దక్షారామం, దక్షిణకాశి, దక్షిణకాశీక్షేత్రం, దక్షిణ వారణాసి, దక్షిణవారాణసి, దక్షిణానంద వనం, దక్షిణానంద వనవాటి, దక్షిణాపథకాశి,

దక్షిణాపథకాశికా, దక్షిణాపథకాశికా నగరి, దక్షిణాపథకాశీ, దక్షిణాపథకాశీనగరం, దక్షిణోద్యాన వనవాటి, దక్షునిపట్టణం, దాక్షారామం, దాక్షారామసు భాగసీమ, దాక్షారామపురం, ద్రాక్షామహారామం, ద్రాక్షారామం, ద్రాక్షారామపురం, భీమపురం, భీమారామం, భీమేశ్వరం, శ్రీ దక్షవాటి, శ్రీ దక్షవాటీపురం, శ్రీ దక్షవాటీపురం, శ్రీ మద్దక్షిణ కాశికాపురం

33 దుర్గాద్రి (4) దుర్గాంబకొండ, దుర్గాద్రి, దుర్గాధరణీధరం, దుర్గాధరాధరం

34 ధరణికోట (5) ధరణాలకోట, ధరణికోటపురి, ధరణివరణనగరం, శ్రీ ధాన్యకటకం, శ్రీ ధాన్యవాటీపురీ

35 ధర్మపురి (6) ధర్మపురం, ధర్మపురక్షేత్రం, ధర్మపురి, ధర్మపురీ, ధర్మపురిస్థలి, శ్రీ ధర్మపుర

36 నంద్యాల (4) నందేల, నందెలపురం, నంద్యాల, నంద్యాలపురం

37 నర్మాలపాడు (3 నర్మాల, నర్మాలపాటి నగరవరం, నర్మాలపాటీపురి

38 నల్గొండ (3) నల్లకొండ, నల్గొండ, నల్లంగొండ

39 నాగులేటి (4) నాగులేటి, నాగులేరు, నాగులేఱు, నర్మ్యాంతజిని

40 నెల్లూరు (7) నల్లూరు, నెల్లూరు, విక్రమపురీనగరం, విక్రమసింహాఖ్యనగరం, విక్రమసింహాఖ్యనగరం సింహపురం, సింహాపురి, సింహవిక్రమనగరం.

41 పట్టెస (4) పట్టిస, పట్టిసస్థానం పట్టెస, పట్టెసం

42 పల్నాడు (11) పలనాటసు, పలనాటిసీమల, పలినాటి, పలునాటి, పల్నాటి, పల్నాటిగడ్డ, పల్నాటిసీమ, పల్లెనాడు, పల్లెదేశములు, పల్లెనాటి, పల్లెవిషయం

43 పలివెల (3) పల్వెలపురం, పల్వెలపురి, పల్వెలస్థానం

44 పాకనాడు (3) పాకనాటి, పాకనాటిదేశం, పాకనాడు

45 పానుగల్లు (3) పానుగంటిదుర్గం, పానుగంటిదుర్గం, పానుగల్లు

46 పాల్కురికి (6) పాలకురికి, పాలకుఱికి, పాలుకురికి, పాల్కురికి పాల్కుఱికి, పాల్కుఱికి

47 పాలమూరు (7) పాలమురి, పాలమూరి, పాలమూరి, పాలమూరీ, పాల్మూరి, పాల్మూరి, పాల్మూరి

48 పాలేరు (2) క్షీరతరంగిణీ, పాలేటి

49 పిఠాపురం (10) పిఠాపురి, పీఠ, పీఠపురి, పీఠాపట్టణం, పీఠాపురం, పీఠాపురి, పీఠికాపురం పీఠికాపురపట్టణం, పీఠికాపురం, పీఠికాపురవరం

50 పుష్పగిరి (3) పుష్పగిరి, పుష్పగిరీంద్రం, పుష్పనగం

51 పెన్నానది (4) పెన్న, పెన్ననది, పెన్నానది, సుప్రయోగ

52 ప్రాకటూరు (3) ప్రాకటురీ, ప్రాకటూరిపురి, ప్రాకటూరు నగరీ

53 బెజవాడ (5) జయవాడ, బెజవాడ, విజయవాటి, విజయవాటిక, విజయవాడ

54 భద్రాచలం (4) భద్రగిరి, భద్రనగం, భద్రశైలశిఖరాగ్రం, భద్రాచలం

55 భవనాశని (6) భవనాశని, భవనాశనీ, భవనాశనీనది, భవనాశి, భవనాశిని భవనాశినీ

56 భీమరథి (5) భీమనది, భీమనది, భీమరథి, భీమరథీ, భైమ

57 మలాపహారిణీనది (3) మలాపహ, మలాపహారి, మలాపహారిణి

58 ములికినాడు (4) ములికినాటి, ములికినాడనుసీమ, ములికినాడు, ముల్కినాట

59 మువ్వ (2) మువ్వ, శ్రీమువ్వపురి

60. మొటవాడ (2) మొటవాడ, మోటాటి

61. యాదగిరి (3) యాదగిరిదుర్గం, యాదగిరినగరం, యాదవపర్వతం

62 రాజమహేంద్రవరం (5) రాజమహేంద్రం, రాజమహేంద్రదుర్గం, రాజమహేంద్రపురం, రాజమహేంద్రవరం, రాజమహేంద్రవరాధిపురీ

63 రామగిరి (4) రామగిరి, రామగిరిదుర్గం, రామగిరిపట్టణం, శ్రీరామాచలం

64 వీరభద్రాచలం (3) వీరభద్రగిరి, వీరభద్రశిఖరి, వీరభద్రాచలం

65 వృద్ధగౌతమి (3) వృద్ధగంగ, వృద్ధగంగా, వృద్ధగౌతమి

66 వెలుగోడు (5) వెలిగొటి, వెలిగొడు, వెలుకొంటి, వెలుగోటి, వెల్గోటి

67 వేంగి (9) వెంగి, వేంగి, వేంగిదేశం, వెంగిమహోర్వీస్థలం, వేంగీవిషయం, వేఁగి, వేఁగినాట, వేఁగినాడు, వెగి

68 వేదాద్రి (8) ఆగమశైలం, నిగమగిరి, నిగమశిఖరి, వేదగిరి, వేదనగం, వేదశైలం, వేదాచలం, వేదాద్రి

69 వేములవాడ (2) లేములవాడ, వేములవాడ

70 శిరతని (3) చిరతని, తిరతని, శిరతని

71 శ్రీకూర్మం (4) కూర్మం, దివ్యాదికూర్మం, శ్రీకూర్మం, శ్రీకూర్మ నగరం, శ్రీకూర్మస్థలి

72 శ్రీశైలం (29) వలిమికొండ, కుధర, గిరి, చిరిగిరి, నయనాద్రి, పర్వత, ప్రఖ్యాత, ముక్తిక్షేత్రం, రమాక్షమాధరం, శ్రీకుధరం, శ్రీక్షేత్రం, శ్రీగిరి, శ్రీగిరీంద్రం, శ్రీనగం, శ్రీనగకల్పతరువు, శ్రీనగ కామధేనువు, శ్రీనగవ్రతివర్తి, శ్రీనగసార్వభౌమం, శ్రీనగాంభోధి, శ్రీనగోత్తుంగమణి, శ్రీనగేంద్రం, శ్రీపర్వతం, శ్రీపర్వతక్షేత్రం, శ్రీపర్వతేంద్రం, శ్రీపర్వత స్వర్ణవేది, శ్రీభూధరం, శ్రీమహానగరం, శ్రీశైలం, సిరిగిరి

73 సర్పవరం (3) శ్రీసర్పపురం, సర్పపురాభిధానం, సర్పవరం

74 సప్తగోదావరం (13) సప్తగోదావరం, సప్తగోదావరసింధు, సప్తగోదావరసింధువు, సప్తగొదావరి, సప్తగొదావరిసింధు, సప్తగొదావరి, సప్తతాపసవాహిని, సప్తమునితీర్థంబు, సప్తమునిసింధు, సప్తమునిసింధువు, సప్తర్షి గోదావరి, సప్తసింధు, సప్తసింధువు

75 సంపర (3) సాంపరాయగ్రామం, సాంపరాయణగ్రామం, సాంపరాయ పురం

76 సింహాద్రి (6) సింహగిరి, సింహభూధరం, సింహశైలం, సింహాచలం, సింహాద్రి, సింహ్వాద్రి

77 సిద్ధవటం (3) సిద్ధపట్టణస్థానం, సిద్ధవటం, సిద్ధాచలం

78 స్వర్ణముఖినది (23) అవిముక్తం, అష్టాపదముఖరీ, కనకముఖరీ, కలశీసుతగిరికన్యాశైవలినీ, కాంచనముఖి, కుంభజక్షితిధరకన్యక, కుంభజగ్రావసుతా, కుంభసంభవ ధరాధర కన్యక, కేతకినది, కేతకీతటిని, కేతకిద్వీపవతి, కేతకీద్వీపవతీ, కేతక్యాపగ, పొన్నుఖరి, పొన్ముఖరినది, మొగలేరు, సువర్ణముఖరి, సువర్ణముఖరి గంగా నదీరత్నం, స్వర్ణముఖరి, స్వర్ణముఖరినది, హేమముఖరీ, హేమముఖరీ ద్వీపవతి, హేమముఖరీ సింధు

79 హృద్భంగశైలం (3) క్షతగిరి, హృదయ భంగాఖ్యన్ జగత్ఖ్యాతంబైన నగంబు, హృద్భంగశైలం

# III. స్థల సూచి

---

# IV. ఆధార గ్రంథాలు


| | | |
|---|---|---|
| 1 | అనంతరాజు మట్ల | కకుత్స్థ విజయము (1980) |
| 2 | అనంతామాత్యుడు | భోజరాజీయము (1924) |
| 3 | అన్నమయ, యథావాక్కుల | సర్వేశ్వర శతకము (1926) |
| 4 | అన్నయ్య, తెనాలి | సుదక్షిణా పరిణయము (1941) |
| 5 | అప్పప్పకవి, రత్నాకరము | శశిరేఖా పరిణయము (1954) |
| 6 | ఎఱ్ఱాప్రెగ్గడ | 1. నృసింహపురాణము (1960)<br>2 ఆంధ్రమహాభారతము (అరణ్య-1971)<br>3 హరివంశము |
| 7 | కదిరీపతి, పాలంకరి | శుక సప్తతి (1979) |
| 8 | కూర్మనాథకవి, గోగులపాటి | సింహాద్రి నారసింహ శతకము (1926) |
| 9 | కృష్ణమాచార్యులు | సింహగిరి వచనములు (1980) |
| 10 | కృష్ణయామాత్యుడు, వెలగపూడి | భాషామద్విజయము |
| 11 | కేతన, మూలఘటిక | దశకుమార చరిత్ర (1967) |
| 12 | కోదండరామ కవి, భట్ల పెయుమర్తి | వల్లభాభ్యుదయము (1940) |
| 13 | కోనేరు నాథుడు, దోసూరి | బాల భాగవతము |
| 14 | గంగాధరకవి, అద్దంకి | తపతీ సంవరణోపాఖ్యానము (1972) |
| 15 | గట్టు ప్రభువు | కుచేలోపాఖ్యానము (19[illegible]0) |
| 16 | గోపన్న, కంచెర్ల | దాశరథి శతకము (1926) |
| 17 | గోపరాజు, కొఱవి | సింహాసన ద్వాత్రింశిక (1960) |
| 18 | గోపాలరాజు, రత్నాకరము | సౌగంధిక ప్రసవాపహరణము (1949) |
| 19 | గౌరన | 1 నవనాథ చరిత్ర (1937)<br>2 హరిశ్చంద్రోపాఖ్యానము (1937) |
| 20 | చినతిమ్మయ, బొడ్డుచెర్ల | ప్రసన్న రాఘవనాట్య ప్రబంధము (1968) |
| 21 | చౌడప్ప, కుందవరపు-కవి | చౌడప్ప శతకము |
| 22 | జక్కన | విక్రమార్క చరిత్ర (198) |
| 23. | తిక్కన | 1 నిర్వచనోత్తర రామాయణము (1968)<br>2 మహాభారతం విరాటపర్వంనుండి చివరిదాకా |

| | | |
|---|---|---|
| 24 | తిమ్మకవి, కూచిమంచి | 1 అచ్చ తెనుగు రామాయణము (1954) |
| | | 2 కుక్కుటేశ్వర శతకము (1926) |
| | | 3 సీలాసుందరీ పరిణయము (1971) |
| 25 | తిమ్మక్క, తాళ్ళపాక | సుభద్రా కళ్యాణము (1956) |
| 26 | తిమ్మన, పుష్పగిరి | ఆంధ్రచంద్రా లోకము (1929) |
| 27 | తిరువేంగళ నాధుడు, తాళ్ళపాక | ఉషాకల్యాణము (1938) |
| 28 | తిరువెంగళ నాధుడు | 1. అష్టమహిషీ కళ్యాణము (1937) |
| | | 2 ఉషాకల్యాణము (1938) |
| 29 | తెలగన, పొన్నికంటి | యయాతి చరిత్రము (1970) |
| 30 | త్రిపురాంతకకవి, అయ్యలరాజు | ఒంటిమిట్ట రఘువీర శతకము (1926) |
| 31 | దగ్గన, దగ్గుపల్లి | నాసికేతోపాఖ్యానము (1977) |
| 32 | ధర్మన్న, చరిగొండ | చిత్రభారతము (1934) |
| 33 | ధూర్జటి | 1 శ్రీకాళహాస్తి మాహాత్మ్యము |
| | | 2 కాళహస్తీశ్వర శతకము (1928) |
| 34, | ధూర్జటి, కుమార | కృష్ణరాయ విజయము (1981) |
| 35. | నన్నయభట్టు | ఆంధ్రమహాభారతము (1970, |
| 36 | నన్నెచోడుడు | కుమార సంభవము (1978) |
| 37 | నారాయణకవి, దూబగుంట | పంచతంత్రము (1930) |
| 38 | నారాయణామాత్యుడు, అయ్యలరాజు | హంసవింశతి (1977) |
| 39 | నృసింహకవి, సంకుసాల | కవికర్ణరసాయనము (2967) |
| 40 | పండితారాధ్యులు, మల్లికార్జున | 1 శివతత్త్వసారము (1968) |
| 41 | పాపరాజు కంకటి | 1 ఉత్తర రామాయణము (1969) |
| | | 2. విష్ణుమాయా విలాసము (1970) |
| 42 | పినవీరభద్రుడు, పిల్లలమర్రి | జైమినీ భారతము |
| 43 | పెద్దన, అల్లసాని | మను చరిత్రము (1978) |
| 44 | పెద్దయ, పిన్నకోట | కావ్యాలంకార చూడామణి (1964) |

# ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు

45 పోతన, బమ్మెర — 1 నారాయణ శతకము (1926)
2 భాగవతము (1968)
3 భోగినీ దండకము
4 వీరభద్ర విజయము (1952)

46 బద్దెన — సుమతి శతకము

47 బాపకవి, పంతులవారి — మూర్తిత్రయోపాఖ్యానము (1981)

48 భట్టుమూర్తి — 1 వసుచరిత్ర (1933)
2 హరిశ్చంద్రనలోపాఖ్యానము (1953)

49 బాలకవి — పంచతంత్రి (1951)

50 భీమకవి, వేములవాడ — కవిజనాశ్రయము (1932)

51 బుద్ధారెడ్డి, గోన — రంగనాథరామాయణము

52 మంచన — కేయూర బాహు చరిత్ర (1966)

53 మల్లన, తరిగొప్పుల — చంద్రభాను చరిత్రము (1922)

54 మల్లన, పావులూరి — సారసంగ్రహగణితము

55 మల్లన, ప్రౌఢకవి — రుక్మాంగద చరిత్రము (1938)

56 మల్లన, మాదయగారి — రాజశేఖర చరిత్రము (1967)

57 మల్లయ నంది

58 సింగయ, ఘంట — ప్రబోధచంద్రోదయము (1976)

59 మారన — మార్కండేయ పురాణము (1903)

60 మోహనాంగి — మరీచీపరిణయము (1973)

61 రంగప్పరాజుకవి, రామప్పరాజు — సాంబోపాఖ్యానము (1932)

62 రఘునాథనాయకుడు — వాల్మీకిచరిత్రము (1968)

63 రఘువాచార్య, చక్రపురి — నలచరిత్రము ద్విపద (1921)

64 రామకృష్ణకవి, తెనాలి — 1 ఉద్భటారాధ్య చరిత్రము
2 ఘటికాచల మాహాత్మ్యము
3 పాండురంగ మాహాత్మ్యము (1970)

65 రామభద్రకవి, తెనాలి — ఇందుమతీ పరిణయము (1972)

66 రామభద్రుడు, అయ్యలరాజు — రామాభ్యుదయము (1967)

| | | |
|---|---|---|
| 67 | రుద్రకవి, కందుకూరి | నిరంకుశోపాఖ్యానము (1954)<br>సుగ్రీవ విజయము (1981) |
| 68 | లింగకవి, పోసెట్టి | నవనాథచరిత్రము |
| 69 | వెంకయ్య, అందుగుల | రామరాజీయము |
| 70 | వెంకయ్య, మారన | భాస్కరశతకము |
| 71 | వేంకటకవి, చేమకూర | : 1 విజయవిలాసము<br>2. సారంగధర చరిత్రము 1959 |
| 72 | వెంకటకృష్ణప్పనాయకుడు,సముఖ | అహల్యాసంక్రందనము (1971)<br>జైమినీభారతము (1980) |
| 73. | వేంకటపతి, వెలిదిండ్ల | . రాధామాధవ సంవాదము (1940) |
| 74. | వేంకటనాథుడు, బైచిరాజు | పంచతంత్రము (19[illegible]4) |
| 75, | వెంకటపతి, శేషము | శశాంక విజయము (1893) |
| 76 | వేంకట సీతాపతి, గిడుగు (సం) | క్షేత్రయ పదములు (1952 |
| 77 | వేంగళనాయకుడు, దామర | బహుళాశ్వచరిత్రము |
| 78. | శ్రీకృష్ణదేవరాయలు | ఆముక్త మాల్యద |
| 79. | శ్రీనాథుడు | · 1 కాశీఖండము (19[illegible]3<br>2. భీమేశ్వర పురాణము (1967<br>3 పలనాటి వీరచరిత్ర (1961<br>4. శివరాత్రి మాహాత్మ్యము (1968)<br>5 శృంగార నైషధము (196[illegible])<br>6 హరవిలాసము |
| 80. | సారంగపాణి | సారంగపాణి పదములు |
| 81, | స్థానాపతి, కాశీవిశ్వనాథనాయ నయ్యంవారి | రాయవాచకము ( 982 |
| 82 | సింగన్న, మడికి | 1. పద్మపురాణోత్తర ఖండము (1898)<br>2. సకలనీతి సమ్మతము (1970) |
| 83 | సింగరాచార్య, మరింగంటి | 1. దశరథరాజనందన చరిత<br>2. శుద్ధాంధ్ర నిరోష్ఠ్యసీతాకల్యాణం<br>(పై గ్రంథంలో సెలెక్టు పీఠిక భాగము మాత్రం |
| 84. | సుబ్బారాయకవి, మున్నిపాటి | . ప్రద్యుమ్న చరిత్రము (19[illegible]4) |
| 85 | సూరకవి, అడిదము | 1 ఆంధ్ర నామ సంగ్రహము (1972)<br>2. కవిజనరంజనము (195[illegible])<br>3 రామలింగేశ్వర శతకము |

